# ఆంధ్రపత్రిక

(నలువది ఐదవ)
ఉగాది సంచిక

## జయ సంవత్సరాది సంచిక

(1954-55)

*

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

[వెల రూ. 2]

45
సంచిక

సంవత్సరము
1954-55

# ఆంధ్రపత్రిక

## జయ ఉగాది సంచిక

### విషయానుక్రమణిక

## ముఖచిత్రం—గాయత్రీ మాత
దశిక రామలింగేశ్వరరావుగారు

త్రివర్ణ చిత్రములు : అలంకరణము-శ్రీ కె. శ్రీనివాసులుగారు ;
మార్గవిహీన-శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తిగారు.

లినోకట్ చిత్రాలు : (1) బెత్తపడుచు, (2) జాలరి కుటుంబం-శ్రీ కె. భాగేశ్వర శర్మగారు.

కాగితం కత్తిరింపులు : (1) హరిణవిహారము (2) బావినీరు-శ్రీ ఎ. వి. ఎస్. ఆర్. జోస్యులుగారు.

ఛాయాచిత్రాలు : (1) సాయంత్రం మజిలీ (2) తొలిప్రొద్దులో నిత్యయాత్ర (3) నురుగులు. నీడలు—యస్. యస్. శర్మగారు ; తొలినాళ్ళ తలపులు—బి. రంగనాథన్, (1) అమరజీవి పొట్టి శ్రీరాములు (2) ఆంధ్రరాష్ట్రావతరణము (3) ప్రథమాంధ్ర మంత్రివర్గము. ఆంధ్ర గవర్నరు శ్రీ మాధవలాల్ చందూలాల్ త్రివేదీ : శ్రీమతి కుసుమ త్రివేదీ.



# ADVERTISERS' INDEX



అలంకరణము

చిత్రకారుడు : శ్రీ కె. శ్రీనివాసులు.

ॐ

# ప్రస్తావన

సంవత్సరాది ఆంధ్రజాతి జీవిత వసంతోదయంలో మొట్టమొదటగా స్వాగతమిచ్చే పండుగ. ఈ నాడు తెలుగువారందరు నూతనోత్తేజంతోను, నూతనాశావేశాలతోను కలకలలాడుతూంటారు.

ఆంధ్రదేశ చరిత్రలో ఈ జయ సంవత్సరాది మరింత విశిష్టమైనది. ఈనాడు ఆ బాలగోపాలము చిరకాల వాంఛితమైన స్వరాష్ట్రం సంపాదికచుకొన్నా మనే విజయగర్వోత్సాహాలతో ఉవ్విళ్లూరుతూంటారు.

మన రాష్ట్రోదయంతో తెలుగు మాటాడేవారందరికీ రాజకీయైక్యం సిద్ధించి ఉండకపోవచ్చును. కాని అది అచిరకాలంలోనే సిద్ధించగలదనీ, తెలుగువారందరు ఒకే కుటుంబంలో మనగల సుదివసం రానున్నదనీ ఒక దృఢవిశ్వాసం ఏర్పడుతున్నది.

రాష్ట్రోదయంతో ఆర్థికాభివృద్ధి ప్రణాళికలకేగాక సారస్వతము, కళలు, మొదలైన సంస్కృతి కార్యకలాపాలకు గూడా అత్యంత ప్రాముఖ్యం ఏర్పడింది. అటు భారతప్రభుత్వంకూడా వివిధమైన కళాపరిషత్తులద్వారా వీటి ప్రోత్సాహానికి గట్టి పునాదులు వేస్తున్నది.

ఈ సమయంలో ఆంధ్రప్రభుత్వంకూడా ఒక సాహిత్యపరిషత్తు ప్రారంభింపవలెనని ప్రయత్నిస్తున్నది.

మనదేశంలో సాహిత్య పరిషత్తులకు కొరత లేదు. అయితే ప్రముఖమైన సాహిత్యపరిషత్తు లీనాడు సజీవంగా నడవడంలేదు. ఇటీవల కొంతకాలంనించి బయలుదేరుతున్న సారస్వత పరిషత్తులైనా, ఆయా వర్గాలకు, కొన్నికొన్ని సంకుచిత సాహిత్యమార్గాలకు ప్రతినిధులుగా ఉన్నాయిగాని, దేశంలోగల యావత్సారస్వత ప్రపంచానికీ ప్రాతినిధ్యం వహించడం లేదు. వర్గతత్త్వం రాజకీయాల్లోనైనా, సాహిత్యాలోనైనా హానికరమైనదే. సాహిత్యంలో ఇది మరింత విషపరిణామాలకు దారితీసి, సాహిత్యసార్థక్యానికే విఘాతంగా పరిణమించగలదు. గత ఏభైఏళ్ల నించీ నడిచిన సాహిత్యపరిషత్తుల చరిత్ర జాగ్రత్తగా పరిశీలించినవారి కిది విస్పష్టమే. ప్రభుత్వం తలపెట్టినా, ప్రజ తలపెట్టినా సాహిత్యపరిషన్నిర్మాణంలో ఇది ముఖ్యంగా గమనింపవలసిన విషయం. ఆంధ్ర ప్రభుత్వం ఈ విషయంలో సరియైన విశాలదృక్పథంతో వ్యవహరించి సాహిత్య, పరిషన్నిర్మాణానికి పూనుకోగలదని ఆశిస్తున్నాము.

దేశంలో సారస్వతం పెంపొందాలంటే తెనుగు బోధించే విధానంలోను, విద్యార్థులకు వాఙ్మయాభిరుచి పెంపొందించడంలోను కూడా కొన్ని మార్గాలవలంబించాలి. విద్యార్థులకు పసితనంలోనే మాతృభాషాభిమానము, వాఙ్మయాభిమానము పెంపొందించాలి. ముక్కుపచ్చలారని బాల్యప్రాయంలో విదేశభాషద్వారా విద్య అభ్యసింపచెయ్యడంవల్ల కలిగే దుష్ఫలితాలు ఆ జన్మాంతము నిలిచిపోతాయి. అందుచేత ప్రాథమికోన్నత పాఠశాలలలోనే మాతృభాషాభ్యాసానికి, అభివృద్ధికి తగినంత ప్రోత్సాహం కల్పించాలి. తెలుగులో సరియైన శిష్టపదజ్ఞానం సంస్కృత భాషాభ్యాసం లేనిదే సాధ్యపడదు. మన వాఙ్మయము, భాష సంస్కృత భాషా సంప్రదాయాను సారంగా పెంపొందినవే. అందుచేత వంగదేశంలో

లాగే మన దేశంలోకూడా ఉన్నత పాఠశాలలో విద్యార్థులకు సంస్కృతం నిర్బంధ పఠనీయ విషయంగా నియమించాలి. ఇది జరగనంతకాలము, మన విద్యార్థులలో శిష్టమైన తెలుగు భాషావిజ్ఞానం కలిగించడం సాధ్యంకాదు. మరిన్నీ మన నవీన రాష్ట్రోదయ పరిస్థితుల కనుగుణంగా వారిలో ఆంధ్రచరిత్ర, సంస్కృతి సంప్రదాయాలు మొదలైన విషయాలను గురించి ఎక్కువగా శ్రద్ధ, అభిమానము కలిగించాలి.

ప్రభుత్వమేకాక, ప్రజ, విశ్వవిద్యాలయాలు' సాహితీపరులు, వాఙ్మయాభిమానులుకూడా ముఖ్యంగా గమనించవలసిన విషయాలు మరికొన్ని ఉన్నాయి.

మన మీనాడు ఏకైక ప్రపంచ సారస్వత సంప్రదాయ మార్గంలో నిలబడి సారస్వత రచన సాగిస్తున్న విషయం సత్యమే కావచ్చును. అంత మాత్రంచేత అటు భారతీయ ప్రత్యేకతగాని, ఆంధ్ర సంస్కృతి ప్రత్యేకతగాని గమనించకుండా రచనలు సాగించిననా అవి తాత్కాలికంగా కొంత అలజడి, కలిగిస్తే కలిగించవచ్చునుగాని ఉత్తమ సాహిత్య గౌరవం అందుకోజాలవు. నేటికాలపు అత్యధునాతన రచనలు పరిశీలించినపు డెవరికైనా ఈ విషయం స్ఫురించి తీరుతుంది.

ఇంతేగాదు. నేటికాలంలో కొంత ఉత్తమరచన అన్నది ఏది పరిశీలించినా దానిలో నగరవాసులు, వారి కష్టసుఖాలు మొదలైన విషయాలే ఎక్కువగా సమస్యారూపంలో ప్రత్యక్షమౌతున్నాయిగాని గ్రామసీమల పరిస్థితులుగాని, అక్కడి ప్రజ నిత్యజీవితాలుగాని కనిపించడంలేదు. రచయితలలో చాలామంది పట్టణాల నంటిపెట్టుకుని ఉండి, ఆ పరిసరాల కృతక జీవితాని కలవాటుపడడమే దీనికి కారణం కావచ్చును. గ్రామసీమల జనంలోఉండే జీవచైతన్యము మహత్తరమైనది. వారి జీవితంలోని వైవిధ్యంముందు, నాగరిక జీవితవైవిధ్యం అత్యల్పంగా భాసిస్తుంది. అదిన్నీగాక సరియైన జాతి జీవిత చైతన్య స్రవంతి జానపదులలో ప్రవహించినంత స్వచ్ఛంగా నాగరికులలో ప్రవహించడం లేదనికూడా అనవచ్చును. పాశ్చాత్య దేశాలలో ఆ యా ప్రత్యేక గ్రామ ప్రాంతాలలోని జానపదుల జీవితం అతి సన్నిహితంగా చిత్రించి ప్రపంచ విఖ్యాతిగన్న రచయిత లెందరో కనిపిస్తున్నారు. ఇంకా ఆయా ప్రత్యేకవృత్తు లవలంబించి జీవించే జానపదుల గాథలు చిత్రించి విఖ్యాతులైన రచయితలుకూడా విశేషంగా కనిపిస్తున్నారు. ఆధునిక రచయిత లీనా డీవిషయం ముఖ్యంగా గమనించగలరని ఆశిస్తున్నాము.

ఇక విశ్వవిద్యాలయాల మాట. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇన్నాళ్లనించీ మన భాషయెడల చూపించిన గౌరవం అంతంతగానే ఉన్నదిగాని అంతగా ప్రోత్సాహకారంగా లేదు. ఇటీవలనే సంస్కృతభాషకొక గౌరవపీఠం ఏర్పరచాలని ప్రయత్నం జరిగినప్పు డిన్నాళ్లనించీ ఈ విషయంలో ఎటువంటి ఉపేక్షాభావం ఏర్పడిఉన్నదో గ్రహించుకోవచ్చును.

పోనీ ఇటీవల స్థాపించాలని సంకల్పించిన శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో కూడా ఈ విషయం అంతగా గుర్తిస్తున్నట్టు కనబడదు.

ఈ విశ్వవిద్యాలయ నిర్మాతల ధోరణిచూస్తే వీరు కేవలం ప్రాంతీయాభిమానాలకు లోనై మొత్తం ఆంధ్రజాతి సంస్కృతి సక్రమాభివృద్ధికే అడ్డుతగులుతున్నారా అనిపిస్తున్నది. ఉన్న ఒక విశ్వవిద్యాలయమైనా ఇంకా సర్వాంగ సంపూర్ణంగా రూపొందలేదు. ఈ పరిస్థితుల్లో బోధించే విషయమే తిరిగి బోధించే మరి ఒక అనుబంధ విశ్వవిద్యాలయం స్థాపించడం వల్ల రాబోయే ఫలితమేమో అవగాహన కావడం లేదు.

అవసరమైతే రాయలసీమ వాసులకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించడం న్యాయ్యమే. ఆ ప్రత్యేక సౌకర్యాలతో ఆ కళాశాలలన్నీ ఆంధ్ర విశ్వవిద్యాలయాని కనుబంధించి, ఆ విశ్వవిద్యా

లయంలో శాస్త్రీయ విషయాలకు, పరిశోధనకు ఇంకా ఎక్కువ అవకాశాలు కలిగించవచ్చును. తద్వారా ఆంధ్రజాతిలో ఇతోధికమైన ఐకమత్యం పెంపొందడమేగాక ఆంధ్ర విశ్వవిద్యాలయంకూడా పరిపుష్టం కాగలదు.

ఇక వెంకటేశ్వర విద్యాలయంలో సంస్కృతాంధ్ర వాఙ్మయ పరిశోధనకు, ఇంకా మిగిలిన లలిత కళల ప్రోత్సాహానికి, ఆంధ్ర చరిత్రాది విషయాల విస్తరణకు తగిన ప్రోద్బలం కలిగించి, దీనిని స్థానిక (Residential) విశ్వవిద్యాలయంగా పెంపొందించవచ్చును. ఈవిధంగా ఈ రెండు విశ్వవిద్యాలయాలు ప్రత్యేకించడంవలన ఇవి ప్రత్యేక విషయాలలో యావదాంధ్ర జాతికీ ఎన్నో విధాలుగా ఉపకరించగలవు.

ఇంతేగాక శ్రీ వెంకటేశ్వర విద్యాలయం క్రమంగా ఒక ప్రాచ్యవిద్యా (Oriental Learning) కేంద్రంగా రూపొందించి భారత దేశంలోను, ప్రపంచ విశ్వవిద్యాలయాలలోను జరిగే ప్రాచ్య విద్యాపరిశోధకుల కిది ముఖ్యకేంద్రంగా అభివృద్ధి పొందించవచ్చును. ఈవిధంగా ఈ విశ్వవిద్యాలయం నిర్మించడంవల్ల ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఇంతకాలంనించీ ఉపేక్షింపబడిన ప్రాచ్యవిజ్ఞాన విషయా లనేకం ఇతోధికంగా అభివృద్ధి పొందగలవు. అటు ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రత్యేకంగా శాస్త్రీయవిషయాలలో ప్రాముఖ్యం వహించి యావదాంధ్ర విద్యార్థి లోకానికీ సహాయకారిగా వర్ధిల్లగలదు.

మరి ఒక విషయం. వెంకటేశ్వరునికి సమర్పించిన ద్రవ్యం ఎక్కువగా ప్రాచ్య విద్యాభివృద్ధికే వినియోగించడం కూడా న్యాయ్యము.

ఆంధ్రప్రభుత్వము, ప్రజలు ఈ విషయాలన్నీ జాగ్రత్తగా గమనించగలరనీ, అల్పాల్పమైన మన ధనసంపత్తి అనవసరంగా వ్యయమైపోకుండా జాతి సమగ్రాభివృద్ధికి వినియోగించేటట్లు చూడగలరనీ ఆశిస్తున్నాము.

విజయలో తెనుగువారు స్వరాష్ట్రం సాధించుకొన్నారు. జయలో మనరాష్ట్రంలో రాజకీయ నాయకులలోను, ప్రజలలోను, సాహితీపరులలోను పూర్వం కంటె ఎక్కువ ఐకమత్యం పెంపొందగలదనీ, జయవత్సరంలో రాష్ట్ర పరిస్థితు లింతకంటె జయప్రదంగా వర్ధిల్లగలవనీ అభిలషిస్తున్నాము.

జయ సంవత్సరాది శుభాగమనంతో ఆంధ్ర ప్రజానీకం శుభపరంపరతో విలసిల్లవలెనని ఆకాంక్షిస్తూ సహృదయ పాఠకులకు హృదయపూర్ణాభినందనా లందిస్తున్నాము.

సర్వేజనాః సుఖినోభవంతు.



# జయలక్ష్మి

శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

జలరాసుల్ ఫలరాసు లవ్యయకళా సౌజన్య రాసుల్ మహో
జ్జ్వల తేజః ప్రభలన్ విరాజిలి సుభిక్షస్తోమముంజూప సం
చలనంబున్ మలినంబులేని హృదయోత్సాహంబుతోఁ బూవుటూ
యెలలో నూపు మహాయుగాది "జయ" లక్ష్మి! విశ్వ విశ్వంభరన్.

చెలువుం గుల్కుచు చెట్లు చేమలుఁ జిగిర్చెన్ క్షోణి మాణిక్య కాం
తులతో వింతలుజూపెఁ బువ్వుల వలంతుల్ రంగు పొంగారు న
వ్వులతో హారకులీయఁ గమ్మకమతావుల్ చిమ్ముచున్నారు చె
న్నలరన్ గొల్వ నమర్చికొమ్మ జయబింబా! అంబ! జోహారువుల్.

కలుగున్ గావుత సర్వసౌఖ్యములు నీ కళ్యాణ కళ్యాణ రే
ఖలతో శ్రీ కలిత ప్రభావములతో కారుణ్యగీతంబుతో
తొలగుంగావుత భావభేదములు నీతుల్ కొల్ప నీ పల్కుతో
తెలుఁగమ్మన్ వెలుగమ్మఁ జేయఁగల నీ దివ్యప్రకాశమ్ముతో.

నెలకొల్పంగదవమ్మ! శాంతిగల కాంతిన్ నాడు మాబోసి న
వ్వుల తాతయ్య చరించుపద్ధతులఁ గొల్వొందిర్చి ముత్యాల పం
టలఁ జేకూర్చి బలంబుఁ జేర్చి చెలగాటల్ మార్చి బంగారు కో
టలపై నీటుగ దీటుగాఁ దెలుఁగు జెండా - నో "జయో" ల్లాసినీ!



# గాయత్రీ మంత్రతత్త్వము

ప్రొఫెసరు డి. యస్. శర్మ

గాయత్రీ మంత్రము వేదసారమనియు హైందవ ధర్మమునకది పునాది యనియు విజ్ఞులందురు. ఇది ఋగ్వేద తృతీయ మండలమున ప్రప్రథమముగ నీ విధముగ నుదాహరింపబడినది. "ఓం భూర్భువః సువః (ఓం) తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్.

ఈ మంత్రార్థమును గురించిన వాఙ్మయ మపారముగనున్నది. ఆయా ప్రత్యేకార్థము లటుండనిచ్చి దీని సామాన్యార్థము మాత్రమే ఇచ్చట పేర్కొనుచున్నాను:— "నిత్యమగు నయ్యాత్మశక్తి ద్యావా పృథివీ లోకములందును, తదంతర్గత లోకములందును వ్యాపించియున్నది. సర్వ వంద్యమగు నా దివ్యజ్యోతిని గూర్చి ధ్యానింతుము. ఆ దివ్యజ్యోతి మా ధీశక్తి సముజ్జ్వలింప జేయుగాక!"

ఈ ధ్యానమంత్రమున హైందవ వేదాంత తత్త్వమంతయు సూక్ష్మముగ నిమిడియున్నది. ఓం భూర్భువః సువః అను వ్యాహృతులలో మొట్టమొదటి ఓంకారము, పరతత్త్వ వాచకము. ఈ పరతత్త్వము, సమస్త ప్రపంచములందును వ్యాప్తమై యున్నదని ఈ మంత్ర ముద్ఘోషించుచున్నది. ఈ యర్థమే ఈశావాస్యోపనిషత్తు నందలి "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" అను మంత్రమునందును నభివ్యక్తమైనది. ప్రపంచమున, సమస్తమును, ప్రకృతి నియమము లనుసరించుచున్నదని మన మెరుగుదుము. అనగా సమస్తమును సర్వేశ్వరేచ్ఛ ననుసరించి జరుగుచున్న దన్నమాట. నక్షత్ర గ్రహ సంచలనములును, ఋతుపరివర్తనమును, వృక్షజాతి యభివృద్ధి వినాశనములును, పాడిపంటలును, పశుపక్ష్యాదుల ప్రవృత్తులును, సమస్తమును సర్వాంతర్యామియగు నీశ్వరుని యిచ్ఛాప్రకారమే సాగిపోవుచున్నవి. కాని యీ సూత్రము వర్తింపని దొక్కటే. అది మానవమానసము. పై దివ్యసూత్ర మిచ్చట ప్రవర్తించుటలేదు. మానవులలో ప్రత్యేకముగ నున్న స్వతంత్రేచ్ఛయే దీనికి కారణము. పరిదృశ్యమాన ప్రపంచమున—ఈశ్వరేచ్ఛ ననుసరించుటకుగాని, వ్యతిరేకించుటకుగాని, మానవుని కొక్కనికే అధికారమున్నది. ప్రపంచమున మతములన్నియు, స్వేచ్ఛ పరమేశ్వరేచ్ఛలో సమన్వయించినప్పుడే మానవునికి పరమానందానుసంధానము గలుగుననియు, నీ విషయమున మానవుడీ విశ్వమార్గ మనుసరింటయే శ్రేయస్కరమనియు ప్రవచించుచున్నవి. విశ్వమున మానవ భిన్నమగు ప్రాణికోటి యంతయు నప్రయత్నముగ ననుసరించు నీ దివ్య ధర్మము మానవుడపుడు కేవలము స్వేచ్ఛాపూర్వకముగనే యనుసరించుచున్నాడు. కాని మానవకోటి సామాన్యముగ దివ్యధర్మ మతిక్రమించినను, ప్రత్యవాయము లేదనియు స్వేచ్ఛా మార్గానుసరణమే యానందప్రాప్తికి సాధనమనియు విశ్వసించుచున్నది. ఇది మానవునిలో జీర్ణించిన యజ్ఞానము. దీని మూలముననే మానవుని నిరంతరాధ్యాత్మికయాత్ర కంతరాయము గలిగించు పాపపంకిలమును, దుఃఖములును, నుదయించుచున్నవి.

కావుననే యాతడు స్వీయమగు నిచ్ఛాశక్తి స్వీయ కాంక్షితములచే ప్రేరేపింప బడకుండునట్లును, సర్వాంతర్యామియగు పరమేశ్వర ప్రేరణానుసారముగనే ప్రవర్తించునట్లును ప్రతిదినమును ప్రార్థించుచుండవలయును. ఇంతియేకాదు; కేవలమును నా సర్వాంతర్యామి యిచ్ఛాసాధనముగ తన యిచ్ఛాశక్తి ప్రవర్తింప జేయవలయును. గాయత్రీ మంత్ర ప్రధానోద్దేశ్య మిదియే. ఈ మంత్రోచ్చారణ సమయమున మనము విధాతృని జాజ్జ్వల్యమాన స్వరూపము ధ్యానించుచు, నాతని దివ్యసృజన శక్తి స్వేచ్ఛానుసారముగ మన హృదంతరాళముల నుద్బోధించుగాత యని ప్రార్థించుచున్నాము. కావున నీ గాయత్రీమంత్రమున జ్ఞాన భక్తి కర్మయోగములసార మంతర్భూతమై యున్నదని నిశ్చయింప వచ్చును. పరతత్త్వము సమస్తమును నంతర్భూతమై నియమితమై యున్నదని మన మెరుగుదుము. కావుననే దివ్యేచ్ఛానుసారముగనే ప్రవర్తింపవలయునేగాని మనస్వీయాజ్ఞానప్రేరణ ప్రకారము సంచరింపకూడదనియు నిశ్చయించుకొన్నాము. ఈ విధముగ నీ మంత్రమున జ్ఞానయోగసార మిమిడియున్నది. దివ్యేచ్ఛకు స్వయముగ శరణాగతులమై యా దివ్యజ్యోతియే మనకు శరణ్యమని ధ్యాన మొనరించుచుండుట వలన దీనియందు భక్తియోగ మిమిడియున్న దనవచ్చును.

మన సమస్త కర్మానుష్ఠానములందును, నీశ్వరేచ్ఛానుసారముగనే ప్రవర్తింపవలయుననియు, మన సంకుచితమగు నిచ్ఛామార్గమున ప్రవర్తింప కూడదనియు సంకల్పించితిమి. ఇది కర్మయోగసారము. ఈ విధముగ నీ గాయత్రీ మంత్రమున సత్యోత్తమమగు హైందవ వేదాంతసార మంతయును సూక్ష్మముగ నంతర్గర్భితమైయున్నది.

ప్రప్రథమమున గాయత్రి యొక ఛందస్సునకు నామధేయము, క్రమముగ నయ్యది యా ఛందోబద్ధమగు మంత్రమునకు పేరైనది. కాలక్రమమున నది యా మంత్రాధిష్ఠాన దేవతకే పర్యాయపదమైనది. ఈ క్రింది శ్లోకమున నా దేవత భావరూప చిత్రణ మభివర్ణితమైనది—ముక్తావిద్రుమ హేమనీల ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై । ర్యుక్తామిందు నిబద్ధరత్న మకుటాం తత్త్వార్థ వర్ణాత్మికాం । గాయత్రీం వరదా భయాంకుశ కశాః శుభ్రం కపాలం గదాం । శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే.

# మీరాదేవి గేయము

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

మోసంబు నీ కెంత
    ముచ్చటో యీ స్వామి!
మూలముట్టము నన్ను
    ముంచావు వంచనగా
కప్పితివి నీ కరుణ
    కపటహింస నటించి
ప్రేమ ప్రసూనముగా
    పీడింప వనుకొంటి
మోసంబు నీ కెంత
    ముచ్చటోయీసామి.

నా వంశ మెడబాపి
    నా పక్షములు నరికి.
కాలుసూదులతోడ
    కాల్చితివి నా కాండ,
అసహాదుర్భరమైన
    ఆ తీవ్రవేదనగా
వెసమాలి ఉస్సురని
    కసికాటులాడాను.
మోసంబు నీ కెంత
    ముచ్చటోయీసామి.

నీ దివ్య చుంబనా
    సీతమై పూతమై
నాముఖ ద్వారాల
    నవరాగములు మ్రోసె
నీ చారు ముఖగంధ
    నిభృతమై, నిగమమై
ధారగిలె నీగీత
    నారిక్త తనునాడి.
మోసంబు నీ కెంత
    ముచ్చటోయీసామి.

తొలిజాము బాధలో
    దుఃఖించి క్రుంగితిని!
మలిసందె వేడ్కలో
    పులకించి పొంగితిని!
ఏడురంధ్రాలకే
    యేడ్చితిని ఆనాడు
ఏనూరులే వంచు
    ఏడ్చు 'మీరా' నేడు!

# రాష్ట్రావతరణ

'ఒక ఆంధ్రుడు'

'విజయ' ఆంధ్రులకు ఘనవిజయాన్ని ప్రసాదించి వెళ్లిపోయింది. సరిగ్గా నలభైసంవత్సరాల క్రితం ఆంధ్రనాయకులు కోరిన ప్రత్యేకాంధ్ర రాష్ట్రం 1953 అక్టోబరు 1 వ తేదీన సిద్ధించింది. ప్రధాన మంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ స్వయంగా రాష్ట్ర తాత్కాలిక రాజధాని కర్నూలులో నూత్న రాష్ట్రానికి ప్రారంభోత్సవం జరిపారు. నేటికి ఆంధ్రరాష్ట్రం అవతరించి ఆరుమాసాలైంది. ఈ ఆరుమాసాల్లోనూ మనం పరిష్కరించుకున్న సమస్యలకంటే మనం సృష్టించిన సమస్యలే ఎక్కువగా వున్నవి. ప్రత్యేక రాష్ట్రం పాతసమస్యల పరిష్కారానికి గాక, కొత్తసమస్యలు ఉత్పన్నం కావడానికే దోహదం చేసింది. ఆంధ్రులను ఏకం చేయడానికిగాక, వారిలోని విభిన్నత్వాల విజృంభణకే దోహదం చేసింది.

ఆంధ్రనాయకులు ఏకాభిప్రాయానికి రాగలిగి వుంటే, మనస్సులో ఒకటి పెట్టుకొని, అందుకు విరుద్ధంగా బయటికి మరొకటి చెప్తూ వచ్చివుండకపోతే, భారతదేశానికి నూత్న రాజ్యాంగం లభించడంతో బాటు ఆంధ్రకు ప్రత్యేక రాష్ట్రం లభించివుండేది. భారత రిపబ్లిక్‌తో బాటు 1950 జనవరి 26 న ఆంధ్రరాష్ట్రం కూడా అవతరించి యుండవలసినది. అలా జరిగివున్నట్లయితే ఆంధ్రరాష్ట్రం అప్పులరాష్ట్రంగా తయారయ్యేదిగాదు. తాత్కాలిక రాజధాని నిర్మాణానికి కేంద్రంనుంచి నలభైలక్షల రూపాయిల అప్పును తీసుకోవలసిన దుస్థితిలో మన రాష్ట్రం వుండేదిగాదు. విజయవాడలో స్టేడియం నిర్మాణానికి పదివేల రూపాయిలు కావాలని, ఆ మొత్తాన్ని మంజూరు చేయమని ప్లానింగ్ కమిషన్‌కు అభ్యర్థనలను పంపుకోవలసిన అసహాయస్థితిలో ఆంధ్ర ప్రభుత్వం వుండేదిగాదు. వీటన్నింటిన్నీ మించి రాష్ట్ర సంపాదనార్థం అమరజీవి పొట్టి శ్రీరాములుగారు యాభై ఎనిమిదిరోజులు ప్రాయోపవేశం చేసి, పూర్ణాహుతి కావలసిన విషాదస్థితి ఏర్పడేందుకు అవకాశం వుండేదిగాదు. అమరజీవి ఆత్మబలి దానానంతరం దేశంలో ప్రజ్వరిల్లిన అల్లరులలో కొందరు ప్రాణాలు కోల్పోవడం, లక్షలు విలువ చేసే ఆస్తి నష్టం కావటం జరిగేదికాదు. ఏమైనా విధి బలీయమైంది. జరుగకూడనివి, జరుగరానివి జరిగిపోయినవి. ఇన్ని జరిగినా ఆంధ్రులకు అత్యంతసంతోషకరమైన సంఘటన ఒకటి 'విజయ' నామ సంవత్సరంలోనే జరిగింది. ఏనాడో జరుగవలసిన ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం ఆ సంవత్సరంలో జరిగింది!

* * * *

ఆంధ్రులకు ప్రత్యేకంగా ఒక రాష్ట్రం కావాలా అన్న విషయమై 1913 వ సంవత్సరం బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభ ఒక నిర్ణయానికి రాలేకపోయింది. ఈ విషయమై ఆంధ్ర ప్రజల అభిమతాన్ని తెలుసుకోవాలని ఆ మహాసభ తీర్మానించింది. ప్రజాభిప్రాయసేకరణకు ఆ మహాసభ ఒక కమిటీని నియమించింది. 1914 లో జరిగిన ఆంధ్రమహాసభ ద్వితీయ సమావేశంలో మొదటిసారిగా మద్రాసు రాజధానిలోని తెనుగు భాషా ప్రాంతాలను ఒక ప్రత్యేకరాష్ట్రంగా ఏర్పాటు చేయాలని ఆంధ్ర నాయకులు బ్రిటిష్‌ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. కాని అప్పటికి మూడుసంవత్సరాలక్రితమే "ఆంధ్రరాష్ట్ర"ం అనే పదం ప్రచారంలోకి వచ్చింది. కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు "ఆంధ్రరాష్ట్రం" అని ఉగాది సంచికలో ఒక ప్రత్యేక వ్యాసాన్ని వ్రాశారు. 1908 వ సంవత్సరంలో పంతులుగారు బొంబయిలో "ఆంధ్ర"పత్రికను స్థాపించడంతోనే దేశంలో ఆ పదానికి కొంత ప్రచారం జరిగింది. దాక్షిణాత్యులందరూ మద్రాసీలేననే భావం క్రమంగాపోయి, మద్రాసు రాజధానిలో 'ఆంధ్రులు' ప్రత్యేక వ్యక్తిత్వం గలవారని ఔత్తరాహికులు గ్రహింపకలిగారు. మద్రాసురాజధానిలో 'ఆంధ్ర భాషా ప్రాంతం వేరుగా వున్నదని వారు గుర్తించారు. క్రమంగా భారత రాజకీయ రంగంలో ఆంధ్రులకు గౌరవస్థానం లభించింది. ఆంధ్రోద్యమానికి బలం చేకూరింది. ఉద్యమం స్థిరపడింది.

ప్రత్యేకరాష్ట్ర ఉద్యమానికి ఆంధ్ర వారపత్రిక, దినపత్రికలతో బాటు, ఉగాది సంచికలు, భారతి మాసపత్రికకూడా విశేషంగా దోహదం చేసినవి. పంతులుగారు ఉగాది సంచికలలో స్వయంగా వ్రాస్తూవచ్చిన ప్రస్తావనలలో ఆంధ్రరాష్ట్ర ప్రసక్తిలేని ప్రస్తావన ఒక్కటికూడా లేదు. ఆంధ్రోద్యమం కేవలం రాష్ట్ర ఉద్యమం కాదని, ఆంధ్రుల ప్రాచీన ప్రాభవాన్ని పునరుద్ధరించి, వైజ్ఞానికంగా, సాంస్కృతికంగా, సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా ఆంధ్రజాతిని ఇతర భాషలవారితో సరిసమానస్థితికి తీసుకురావడానికి వుద్దేశింపబడిన వుద్యమమని పంతులుగారు పదే పదే హెచ్చరించుతూ వచ్చారు. అంతేగాదు. ఆంధ్రవుద్యమంలో రాజకీయాలకుగాక, వైజ్ఞానిక, సాంస్కృతిక, భాషావిషయకమైన విషయాలకు ప్రాధాన్యం వుండాలని వారు పలుమార్లు ఉద్బోధించారు. ప్రత్యేకరాష్ట్రసంపాదన ఎంత ముఖ్యమో, ఎంత అవసరమో ఆంధ్రజాతి సముద్ధరణ, ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి సాధన అంతముఖ్యము, అవసరము అని కళాప్రపూర్ణులు ఉద్ఘాటిస్తూ వచ్చారు.

దేశోద్ధారకుడు చూపినమార్గాన ఆంధ్రోద్యమం సాగివుంటే అక్టోబరు 1 న అవతరించిన ఆంధ్రరాష్ట్రస్వరూప, స్వభావాలే వేరువిధంగా వుండేవి. ఆంధ్రరాజకీయాలు ఇంత అధ్వాన్నస్థితికి వచ్చి వుండేవి గాదు. ఇప్పటికైనా మనము, మన నాయకులు రాజకీయాలకుగాక, మన సంస్కృతి, భాష, సాహిత్యము, సంప్రదాయములకు ప్రాధాన్యమిచ్చి మన సామాజిక జీవితానికి రాజకీయాలతోగాక, సంస్కృతి, సంప్రదాయాలతో ప్రాతిపదికను వేయ కలిగితే ఆంధ్రరాష్ట్రం అనతికాలంలోనే అన్నిరాష్ట్రాలకు ఆదర్శప్రాయంగా వుండగలదు. గతాన్ని విస్మరించి, భవిష్యత్తును విచారింపక, వర్తమానంలోనే పడిపోయిన జాతి అభ్యుదయాన్ని అభివృద్ధిని సాధింపలేదు.

* * * *

ప్రత్యేకాంధ్రరాష్ట్రసంపాదనకు ఎందరో మహానుభావులు ఎన్నోవిధాల కృషిచేశారు. మోచర్ల రామచంద్రరావుగారు న్యాయపతిసుబ్బారావు పంతులుగారు, కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు, దేశపాండె సుబ్బారావుగారు, సి. వి. యస్. నరసింహరాజుగారు. సర్. కె. వి. రెడ్డినాయుడుగారు, భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, ముత్తా వెంకటసుబ్బారావుగారు, సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు, బులుసు సాంబమూర్తిగారు, ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు, స్వామి సీతారాం, సర్ విజయ, గాడిచర్ల హరిసర్వోత్తమరావు ప్రభృతులు యథాశక్తి కృషిచేశారు. వీరి కృషి రాష్ట్రనిర్మాణానికి అనుకూలమైన పరిస్థితులను కల్పించింది. పొట్టిశ్రీరాములుగారి ఆత్మబలిదానము రాష్ట్రనిర్మాణాన్ని సాధించింది. ఈ విషయంలో కొన్ని అభిప్రాయభేదాలకు అవకాశం లేకపోలేదు. స్వామి సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశం సాగించిన సందర్భంలోనే ప్రధానమంత్రి నెహ్రూ కేంద్రప్రభుత్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి నిశ్చయించినట్లు విస్పష్టంగా ప్రకటించారు. భాషనుబట్టి భారతీయ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణను, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఏమీ సంబంధంలేదని, భారతీయ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగినా జరగకపోయినా, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరిగితీరుతుందనికూడా పండిట్ నెహ్రూ అసందిగ్ధంగా ప్రకటించి వున్నారు. ఈ ప్రకటనలు ఆధారంగా తీసుకొని కొందరు పొట్టిశ్రీరాములుగారు ప్రాయోపవేశం ప్రారంభించి పూర్ణాహుతి కాకపోయినా ప్రధాన మంత్రి నెహ్రూ ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేసివుండేవారేనని వాదింపవచ్చును. కాని పొట్టిశ్రీరాములుగారు అంతటి త్యాగాన్ని చేసివుండకపోతే 1953 అక్టోబరు 1 న మాత్రం ఆంధ్రరాష్ట్రం ఏర్పడివుండేదిగాదు. రాష్ట్రనిర్మాణం రెండు మూడు సంవత్సరాలు వాయిదా పడివుండేది. ఎవరైనా ఈ విషయాన్ని అంగీకరింపక తప్పదు.

మద్రాసునగర భవిష్యత్తు విషయమై ఆంధ్ర నాయకులూ, తమిళనాయకులూ, ఒక సమాధానానికి రాకలిగి, ఆ సమాధానానికి ఆంధ్రులు, తమిళులు కట్టుబడివుంటే, అప్పుడు కేంద్రప్రభుత్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి చర్యలు తీసుకుంటుందని, అయితే అట్టి సమాధానాన్ని కుదర్చడానికి తాను చేయకల్గింది మాత్రం ఏమీ లేదని పండిట్ నెహ్రూ ప్రకటిస్తూ వచ్చారు. ఆ ప్రకటనలే పొట్టి శ్రీరాములుగార్ని 1952 అక్టోబరు 19 వ తేదీ వుదయంనుంచీ ఆమరణ ప్రాయోపవేశదీక్షను ప్రారంభించడానికి ప్రోత్సహించినవి. మద్రాసు నగర భవిష్యత్తుపై నాయకులమధ్య సమాధానాన్ని సాధించి తద్వారా ఆంధ్రరాష్ట్రాన్ని సంపాదించడమే వారి ప్రాయోపవేశ లక్ష్యం. ఆంధ్రనాయకులు ఎవ్వరూ శ్రీరాములుగారి ప్రాయోపవేశ కారణాలను తెలుసుకొని, వారా కఠోర దీక్షను విరమించడానికి అనుకూలమైన పరిస్థితులను కల్పించడానికి ఏవిధమైన కృషీ చేయలేదు. కాగా ప్రకాశం పంతులుగారి అధ్యక్షతను మద్రాసు నగరంలో జరిగిన అఖిలపక్ష ఆంధ్ర ప్రజాపరిషత్తు ప్రదర్శనలతో ముగిసింది. పంతులుగారు అధ్యక్షపీఠంనుంచి మాట్లాడుతూ "పొట్టి శ్రీరాములు చనిపోయేలోగా ఏమైనా చేయగలమేమో చూదామని ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశాం" అన్నారు. ఆ సమావేశాన్ని జరపడంమించి యేమీ చేయలేదు. డిసెంబరు 15 వ తేదీన పొట్టి శ్రీరాములుగారు మరణించారు. రాష్ట్రంలో అనేకచోట్ల ప్రదర్శనలు జరిగినవి. ప్రజల ఉద్రేక ప్రదర్శనలను అపుచేయడానికి కొన్నిచోట్ల కాల్పులు కూడా జరిగినవి.

1952 డిసెంబరు 15 నుంచీ ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి సంబంధించిన వ్యవహారం చాలా త్వరితంగా సాగింది. కేంద్ర ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రాన్ని, మద్రాసురాష్ట్రంలోని ఆంధ్ర భాషా ప్రాంతంతో, ఏర్పాటుచేయడానికి నిశ్చయించినట్లు ప్రధాన మంత్రి నెహ్రూ డిసెంబరు 19 వ తేదీన ప్రజాసభలో ఒకప్రకటన చేశారు. మద్రాసురాష్ట్రాన్ని విభజించి,ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయడంవల్ల ఏర్పడే ఆర్థికాదిసమస్యల పరిశీలించడానికి రాజస్థాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీకైలాసనాథ్ వాంఛూను కేంద్రప్రభుత్వం ప్రత్యేక ఉద్యోగిగా నియమించింది. జనవరి మాసాంతంలోగా న్యాయమూర్తి వాంఛూగారు తమ నివేదికను సమర్పించాలని కూడా కేంద్రప్రభుత్వం ఆదేశించింది.

న్యాయమూర్తి వాంఛూగారు 1953 జనవరి 7 వ తేదీన మద్రాసు వచ్చారు. రెండు వారాలు అధికారులతోను, అనధికార ప్రముఖులతోనూ చర్చించారు. పదిరోజులు ఆంధ్రదేశంలో పర్యటించి ప్రధాన పట్నాలన్నింటిని, అక్కడ రాష్ట్ర తాత్కాలిక రాజధాని ఏర్పాటుకుగల సౌకర్యాల దృష్ట్యా పరిశీలించారు. 1953 ఫిబ్రవరి 7 వ తేదీన వీరు కేంద్రప్రభుత్వానికి తమ నివేదికను సమర్పించారు. ఆంధ్రరాష్ట్ర స్థాపనకు సంబంధించిన అన్ని సమస్యలనూ చర్చించి, అందరికీ సౌకర్యంగా వుండగల ఏర్పాట్లను సూచించిన వీరి నివేదికను ఇటు ఆంధ్రనాయకులుగాని, మద్రాసు ప్రభుత్వం గాని, అటు కేంద్రప్రభుత్వంగాని అంగీకరించలేదు. వారి ప్రతిపాదనలకు పూర్తిగా విరుద్ధమైననిర్ణయాలనే వీరందరూ చేశారు.

ఆంధ్రదేశంలో ఎక్కడా కూడా రాష్ట్ర రాజధానిని తాత్కాలికంగా ఏర్పాటు చేసుకోనడానికి తగిన పట్నంలేదనీ, కనుక అయిదు సంవత్సరాలపాటు ఆంధ్ర రాజధానిని మద్రాసు

లోనే వుండనివ్వడం అవసరమని న్యాయమూర్తి వాంఛూగారు సూచించారు. న్యాయమూర్తి వాంఛూగారీసూచన చేయడానికి ముందునుంచే 'ఆంధ్ర పత్రిక' ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని మద్రాసులోనే వుండాలని, ఆంధ్రప్రజలు ఇదేవిధంగా విచారణాధికారికి విజ్ఞాపనలను సమర్పించాలని కోరింది. ప్రజలు అదేవిధంగా కోరారు. న్యాయమూర్తి వాంఛూగారా విధంగానే సిఫార్సు చేశారు. కాని మద్రాసు ప్రభుత్వమూ, కేంద్ర ప్రభుత్వమూ ఈ సూచనను తిరస్కరించినవి. ఆంధ్ర రాజకీయాలు ఇంత అధ్వాన్న స్థితికి రావడానికి, మద్రాసులో ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని ఏర్పాటుకు కేంద్ర, మద్రాసు ప్రభుత్వాలు సమ్మతింపకపోవడమే. ఇందువల్ల రాష్ట్ర రాజధాని రాజకీయ సమస్యగా మారిపోయింది. రాష్ట్ర రాజకీయపక్షాలు తమ ప్రాబల్యాన్ని, పలుకుబడిని వృద్ధిచేసుకోవడానికి ఈ రాజధాని సమస్యను వుపయోగించుకొన్నవి. ఈ సమస్యపై కొందరి నాయకత్వం దెబ్బతిన్నది. కొన్ని పార్టీలు పతనమందినవి. అయినా, ఈనాటికీ ఏ రాజకీయ పక్షమూ రాజధానివిషయంలో సరియైన విధానాన్ని అనుసరించడంలేదు. రాజధాని ఏర్పడలేదు; రాజధానిసమస్య మాత్రం ఏర్పడింది.

ప్రధాన మంత్రి నెహ్రూ మార్చి 25 వ తేదీన ప్రజాసభలో న్యాయమూర్తి వాంఛూ నివేదికపై కేంద్రప్రభుత్వ నిర్ణయాలను వెల్లడిస్తూ ఒక ప్రకటన చేశారు. రాష్ట్రం ఏర్పడిన క్షణంనుంచీ రాష్ట్రంలోనే వుండడం రాష్ట్ర అభివృద్ధికి అవసరం గనుక మద్రాసు అసెంబ్లీలోని ఆంధ్ర సభ్యులు ఒక తాత్కాలిక రాజధానిని నిర్ణయించుకోవాలని ప్రధానమంత్రి ఆ ప్రకటనలో సూచించారు. ప్రజాస్వామిక సూత్రాలదృష్ట్యా రాజధాని నిర్ణయాధికారాన్ని ఆంధ్ర ప్రజాప్రతినిధులకు ఇవ్వడం బాగానే వున్నది. కాని ప్రజాస్వామిక పక్షాలు అధికారాన్ని దుర్వినియోగ పరచడంవల్ల పరిస్థితులు పూర్తిగా విషమించినవి.

మద్రాసులో ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని ఏర్పాటు సాధ్యంగాని పక్షంలో విశాఖపట్నంలో అట్టి తాత్కాలిక రాజధానిని ఏర్పాటు చేసుకోవచ్చునని న్యాయమూర్తి వాంఛూగారు సూచించారు. అలాగే రాష్ట్ర శాశ్వతరాజధానిని రాష్ట్రానికి మధ్యగా ఉన్న గుంటూరు—విజయవాడ ప్రాంతంలో కృష్ణానది దక్షిణ తీరాన ఏర్పాటు చేసుకొనవచ్చునని, ఇది రాయలసీమవారికి సమ్మతంగానిపక్షంలో తిరుపతిలో ఏర్పాటు చేసుకోవచ్చునని వాంఛూగారు సూచించారు. కృషికార్‌లోక్ పార్టీవారు తిరుపతిని వరించారు. కమ్యూనిస్టుపార్టీవారు గుంటూరు–విజయవాడ ప్రాంతాన్ని వరించారు. మద్రాసులో తాత్కాలిక రాజధాని ఏర్పాటుకు అవకాశం లేనప్పుడు ఒకేసారి విజయవాడ–గుంటూరు ప్రాంతంలో శాశ్వత రాజధానిని ఏర్పాటు చేసుకోవడం వాంఛనీయమని రాష్ట్ర అభివృద్ధిని కాంక్షించినవారందరూ సూచించారు. రాష్ట్రకాంగ్రెస్ సంఘం మాత్రం ఈ ప్రధాన సమస్యను విచారింపనైనాలేదు. శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం అధ్యక్షుడుగా వుండి రాజధానిపై రాష్ట్రకాంగ్రెస్ సంఘం ఒక నిర్ణయానికి రాకుండా వుండేందుకు చేయకల్గిందంతా చేశారు. తరువాత 1953 మార్చి 17 వ తేదీన వారు మద్రాసు అసెంబ్లీలోని ఆంధ్రకాంగ్రెస్ పక్షనాయకుడుగా ఎన్నికైనప్పట్నుంచీ, జూన్ 1 వ తేదీవరకూ ఏ ప్రకటనచేసినా రాజధాని వివాదం తీవ్రం గావడానికే ఉపయోగపడింది.

ప్రజాసోషలిస్టుపార్టీ నాయకుడు ప్రకాశం పంతులుగారు ఈ రాజధానివివాదాలు తమకు ఎంతవరకు ఉపయోగపడతవో చూస్తూ, ఆలోచించుకుంటూ కూర్చున్నారు. ఈ పార్టీవారూ, కాంగ్రెస్ పార్టీవారివలెనే రాజధానివిషయంలో ముందుగా ఒక అభిప్రాయానికి రాలేదు. కాంగ్రెస్‌పక్ష నాయకత్వం కృషికార్ లోక్‌పార్టీ ప్రతిపాదనను ప్రతిఘటించడంతోనే తృప్తిపడినందువల్ల ప్రజాసోషలిస్టు పార్టీవారికి ఈ రెండు పార్టీల మధ్యా మధ్యవర్తిత్వం వహించే అవకాశం లభించింది. రాజధానిని నిర్ణయించే అధికారాన్ని ఈ పక్షాలు ప్రకాశం పంతులుగారికి దఖలుపరచినవి. వారు విశాఖపట్నాన్ని, విజయవాడ – గుంటూరు ప్రాంతాన్ని, తిరుపతిని కాదని, న్యాయమూర్తి వాంఛూగారు ఎందుకూ పనికి రాదన్న కర్నూలును రాజధానిగా నిర్ణయించారు. కృషికార్ లోక్‌పార్టీపై విజయాన్ని సాధించామని కాంగ్రెస్ పార్టీవారు తృప్తిపడ్డారు. తిరుపతి కాకపోయినా రాజధాని కోస్తా జిల్లాలలో గాక రాయలసీమలోనే ఏర్పడాలని తాము మొదట్నుంచీ చేస్తూవచ్చిన వాదం నెగ్గిందని కృషికార్‌లోక్‌పార్టీవారు సంతోషించారు. 1953 జూన్ 1 వ తేదీన, ప్రధానమంత్రి మార్చి 25 వ తేది ప్రకటనను అనుసరించి, రాష్ట్ర తాత్కాలిక రాజధానిని నిర్ణయించే నిమిత్తం మద్రాసు అసెంబ్లీలోని ఆంధ్ర సభ్యులు ప్రకాశం పంతులుగారి అధ్యక్షతను సమావేశమైనారు. అధ్యక్షత వహించినవారు పక్షపాత రహితంగా ప్రవర్తించడం సంప్రదాయం. ప్రకాశం పంతులుగారు అన్నింటికీ అతీతులవడంవల్ల తమ కర్నూలు నిర్ణయాన్ని సమర్థించుకుంటూ, అందరూ ఆ నిర్ణయాన్ని ఆమోదించాలని కోరుతూ అధ్యక్ష పీఠంనుంచి ఉపన్యాసం చేశారు. అంతేగాక అన్ని తీర్మానాలకంటే ఆఖరున అందిన కర్నూలు తీర్మానాన్ని ప్రధాన తీర్మానంగా తీసుకొని ఇతర తీర్మానాలను ఆ తీర్మానానికి సవరణలుగా ప్రతిపాదించాలని రూలింగ్ ఇచ్చారు. ఇది శాసనసభా నియమావళి, నిబంధనలకే విరుద్ధమని 1953 నవంబరు 30 వ తేదీన ఆంధ్ర అసెంబ్లి స్పీకరు రాజధానిపై వచ్చిన అనధికార తీర్మానాల వరుస క్రమాన్ని నిర్ణయించేందుకు అనుసరించిన విధానం స్పష్టంచేస్తున్నది.

ప్రకాశం పంతులుగారు ఆంధ్రులందర్నీ ఒక్క తాడుమీద నడిపించడానికి ప్రయత్నిస్తున్నానని చెప్తూనే వారు ప్రతివిషయంలోనూ ఆంధ్రుల మధ్యనున్న విభేదాలను ప్రోత్సహించి ఎక్కువ చేయడానికే తోడ్పడుతూ వచ్చారు. రాష్ట్ర రాజకీయాలలో ప్రకాశం పంతులుగారి భూమిక రాష్ట్రాభ్యున్నతికి దోహదం చేసిందో, రాష్ట్రాన్ని అధోగతిపాలు చేయడానికి ఉపయోగపడిందో చరిత్రకారులే నిర్ణయించాలి. వారికి న్యాయవాది దృక్పథం తప్ప, రాజకీయవేత్త దృక్పథం ఏర్పడకపోవడంవల్ల ఈనాటికీ రాష్ట్ర రాజకీయాలు స్థిమితపడలేదు.

పారి సమావేశమైంది. అప్పటికే రాష్ట్రప్రభుత్వం కర్నూలులో సెక్రెటేరియట్‌కు, అసెంబ్లీ సమావేశాలకూ ప్రత్యేకంగా భవనాలు కట్టడానికి నిర్ణయించింది. రాష్ట్రప్రభుత్వం అసెంబ్లీ భవన నిర్మాణానికి నిశ్చయించడంతో కర్నూలునే శాశ్వతరాజధానిగా స్థిరపరచడానికి ప్రయత్నిస్తున్నదనే అనుమానాలు ప్రబలినవి. దానికి తోడు కృషికార్ లోక్ పార్టీవారు నవంబరు 30 వ తేదీన తప్పటడుగులు వేయడంతో కోల్పోయిన ప్రతిష్ఠను తిరిగి సంపాదించుకోవాలనే తాపత్రయంతో కర్నూలులో భవన నిర్మాణ పద్దును అసెంబ్లీచేత నిరాకరింప చేయడానికి ప్రయత్నించారు. రాజధాని సమస్యను శాశ్వతంగా పరిష్కరించి వేయడానికి ఒక అనధికార తీర్మానాన్ని చర్చించేందుకు అవకాశ మివ్వమని ఈ పార్టీవారు మంత్రివర్గాన్ని కోరారు. అందుకు మంత్రివర్గం. సమ్మతించనందున కృషికార్ లోక్ పార్టీనాయకుడు గౌతు లచ్చన్నగారు తమ మంత్రిపదవికి రాజీనామా ఇచ్చారు. కర్నూలులో భవన నిర్మాణ పద్దును రద్దుచేయించడానికి వీరు ఇతర పార్టీలతో కలిసిచేసిన ప్రయత్నాలు విఫలమైనవి. అసెంబ్లీ అయిదు వోట్ల మెజారిటీతో కర్నూలులో సెక్రెటేరియట్, అసెంబ్లీ భవనాల నిర్మాణ ఖర్చును ఆమోదించింది.

ప్రకాశం పంతులుగారు కర్నూలు నిర్ణయంచేసి రాష్ట్రరాజకీయ పరిస్థితిని అధ్వాన్నంచేసినట్లైతే కృషికార్ లోక్ పార్టీవారు తిరుపతి, గుంటూరులమధ్య ఊగులాడి రాష్ట్ర రాజకీయాలను మరింత అధ్వాన్నస్థితికి తీసుకువచ్చారు. రాష్ట్రంలో ప్రజాస్వామికపక్షాల ఐకమత్యానికి గల అపూర్వావకాశాన్ని వమ్ముచేశారు. వారు ప్రజాసామాన్యంలో తమ పలుకుబడిని పెంచుకోవడానికంటూ చేసిన ప్రతిప్రయత్నమూ వారిప్రతిష్ఠను తగ్గిస్తూనే వచ్చింది. రాజధాని కర్నూలులో స్థిరపడుతున్నది. రాజధాని

సమస్యమాత్రం అపరిష్కృతంగానే వున్నది. విశాలాంధ్రసమస్య తేలేవరకూ ఈ సమస్య పరిష్కారం కాదనే చెప్పవచ్చును.

అయితే రాష్ట్ర అసెంబ్లి సమావేశాలను వేసవిలో వాల్తేరులో జరపాలని ప్రభుత్వంనిశ్చయించింది. ఈవిధంగా రాజధాని కర్నూలే అయినా రాజధానిలోని కార్యాలయాలను తాత్కాలికంగానే అయినాఇతరప్రాంతాలకుమార్చడానికి అవకాశమున్నదని ప్రభుత్వం అంగీకరించింది. కనుక మనకు రెండు విశ్వకళాపరిషత్తులతో బాటు రెండు రాజధానులుకూడా ఏర్పడవచ్చును. సమగ్రమైన, భారత విశ్వవిద్యాలయాల్లో ప్రముఖస్థానాన్ని సంపాదించిన ఆంధ్రవిశ్వ కళాపరిషత్తు వుండగా తిరుపతిలో రాయలసీమ, నెలూరుజిల్లాలకు వేరే విశ్వకళాపరిషత్తును స్థాపిస్తున్నట్లే, రాయలసీమ, నెల్లూరు జిల్లాలకు కర్నూలులోనూ, ఇతర జిల్లాలకు విశాఖపట్నంలోనూ రాజధానులను ఏర్పాటు చేయడానికి ఆంధ్రప్రభుత్వం ప్రయత్ని స్తున్నట్లు కన్పిస్తున్నది. ఇదేవిధంగా గుంటూరులో ఆంధ్ర హైకో ర్టును స్థాపించాలని అసెంబ్లీ నిర్ణయించినా, కర్నూలులోనో, అనంతపురంలోనో హైకోర్టు రెండవ బెంచిఏర్పాటు చేయడా నికి ప్రభుత్వం ప్రయత్నింపవచ్చును. వీటన్నింటివల్లా రాష్ట్ర ప్రభుత్వ వ్యయం పెరిగిపోతున్నదేగాని రాష్ట్ర అభివృద్ధి సిద్ధిం చడం లేదు. రాష్ట్రానికి ఒక సమగ్రస్వరూపం ఏర్పడ్డంలేదు. అందుకు ప్రభుత్వం కృషిచేయడంలేను కూడా. నివారించడానికి తగ్గించడానికి వీలున్న ఖర్చులను పెంచుకుపోతూ, అందుకుగాను మద్య నిషేధాన్ని రద్దుచేయడానికీ, కొత్తగా సాగులోకి వచ్చిన భూములపై అభివృద్ధిపన్ను వేయడానికీ, వాణిజ్యపంటలపై ప్రత్యేక పన్ను విధించడానికీ నిర్ణయించింది.

ఈ ఆరుమాసాల ఆంధ్రప్రభుత్వ కార్యవిధానాలను, చర్య లను, వివిధసమస్యలపై చేసిన నిర్ణయాలనూ చూస్తే ఏ విషయం లోనూ ఒక ఖచ్చితమైన, నిర్దిష్టమైన విధానం వున్నట్లు కన్పిం చదు. వ్యయకర్తన విధానం పూర్తిగా లోపభూయిష్టంగావున్నది.

రాజకీయార్థిక పరిస్థితులు ఇంత నిరుత్సాహకరంగా వున్నా మరి రెండేండ్లలో విశాలాంధ్ర ఏర్పడితే ఈ పరిస్థితులు సర్దుబాటై సమగ్ర, సంపూర్ణ ఆంధ్రరాష్ట్రం ఏర్పడగలదనే ఆశమాత్రం ఆంధ్రు లందరికీ వున్నది. భారతప్రభుత్వం భారతీయరాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు ఫజల్ అలీ అధ్యక్షులుగా, సర్దార్ పణిక్కర్, పండిట్ కుంజ్రూ సభ్యులుగా ఒక కమిషన్‌ను నియమించింది. మద్రాసు, మైసూరు, ఒరిస్సా రాష్ట్రాల్లోనూ, మధ్య ప్రదేశ్ లోనూ వున్న తెనుగు ప్రాంతాలకు సంబంధించిన వివరాలను సేక రించడానికి ఆంధ్ర ప్రభుత్వం ఒక ప్రత్యేక ఉద్యోగిని నియ మించింది. ప్రదేశ కాంగ్రెస్ సంఘం మూడు ఉపసంఘాలను నియమించింది. భారతప్రభుత్వం న్యాయమూర్తి వాంఛూగారి ప్రతిపాదనలకు విరుద్ధంగా బళ్ళారి జిల్లాను రాష్ట్రావతరణకు ముందుగానే విభజించింది. బళ్ళారి పట్నం, తాలూకాల భవి ష్యత్తుపై విచారణ జరిపి ఆ ప్రాంతాలు ఏ రాష్ట్రంలో చేరాలో నిర్ణయించడానికి న్యాయమూర్తి మిశ్రాను ప్రత్యేక అధికారిగా నియమించింది. వారు భారత ప్రభుత్వ నిర్ణయాన్నే స్థిరపరచి, అదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలుతప్ప బళ్లారి జిల్లానుంచి ఆంధ్రలో చేరవలసినప్రాంతంలేదని న్యాయ మూర్తి మిశ్రా తీర్పు యిచ్చారు. ఈ తీర్పును సరిచేయడానికి కామిరెడ్డిగారు ప్రాయోపవేశం చేశారు. కాని ప్రయోజనం లేకపోయింది. బళ్లారిపట్నంలో ఆంధ్రులే అధికసంఖ్యాకులుగావున్నా ఆపట్నం ఆంధ్రులకు దక్కలేదు.

అయితే జనాభాలెక్కల కమిషనరు ప్రకటించిన వివరాలను బట్టి మైసూరులోని కోలారుజిల్లా విషయంలోనూ, హైద్రాబాద్ పట్నం, జిల్లా విషయంలోనూ ఆంధ్రులకు అన్యాయం జరుగదనే విశ్వాసం కలుగుతున్నది. తెలంగాణతో చేరి హైద్రాబాద్ జిల్లా కూడా తెనుగుప్రాంతమేనని, కోలారుజిల్లాలో ఆంధ్రులే అధిక సంఖ్యాకులనీ వీరు స్పష్టంగా ప్రకటించారు.

ఆంధ్రరాజకీయాలు కుదుటబడి ఆంధ్రరాష్ట్రం అభ్యుదయ పథాన పురోగమించాలంటే విశాలాంధ్ర ఏర్పడిననాడే సాధ్యమని ఆంధ్రరాష్ట్రం ఆరుమాసాల చరిత్ర హెచ్చరిస్తున్నది. విశాలాంధ్ర సత్వరస్థాపనకు ఫజల్ అలీ కమిషన్‌వారి వాదను అంగీకరించు నట్లు చెయుటకు తీవ్రకృషి జరగాలి.



# ఉగాది ప్రార్థన

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

"ఈ యఖిలాండమెల్ల జగదీశ్వర నిత్య నివాస దివ్య దే
వాయతనమ్ము - మంగళమయమ్మును - సర్వ జనీన సేవ్య ని
శ్రేయసతా పద-మ్మిదియె లెండికనో యమృత ప్రసూతులా
రా! యరుదెంచుడో సుజనులార! మహోదయమయ్యె ప్రాగ్దిశన్.

బారులు దీర్చి కానుకల పళ్లెరముల్ గొనిరండు సుప్రభా
తారుణ భాసితాయత సహస్ర కరమ్ములతోడ మంగళ
ద్వారము లెల్లనుఁ దెఱువబడ్డవి-గంట లనాహతంబులై
ఖోరున మాఱుమ్రోసినవి - పూర్వదిశాలయ మండపంబులన్

నిమ్నదేశాలవైపుకు నీరు పాఱు
వత్సరమ్ముల ప్రాపుకే వచ్చు నెలలు—
సర్వ భూతాంతరాత్ముని సవిధమునకు
పోవుటే జీవకోటి స్వాభావికమ్ము."

అమ్మెయి వజ్రగర్జిత మహాధ్వని గుండెల మాఱు మ్రోసినఁ
ఝుమ్మరమైన నా కనుల ముందటి యంధతమిస్రమెల్ల దూ
రమ్మయి పోయి నా పరిసరమ్ముల మంగళవాద్యఘోష లొ
క్కుమ్మడి రేఁగి యీ భువనగోళము దేవళమై కనంబడెన్

గణ గణ మ్రోఁగు దేవళపు గంటల మ్రోఁత లయించి పాదముల్
వణకదొడంగ- బాహువుల పట్టు తొలంగ- కలంగె గుండె నా
యణు వణువందు నీదు మహిమాన్వితశక్తి నొసంగి నీ శుభాం
గణమును చేరుదాఁక కడకంట ననుఁ గనిపెట్టి యుండుమా!



# వసంతాగమము

శ్రీ బళ్లా పిచ్చయ్యశాస్త్రి

పందిళ్ళమాటునఁ బఱపైలతాంగనల్, సాచి కంఠము తల లూచుచుండఁ
తమభాష చాలించి తన్మయత్వముతోడ, శుకముఖద్విజకోటి చొక్కుసూప
మలయానిలుని చెల్మి మఱఁగి సరోలక్ష్మి, కమ్మపుప్పొడి సౌరభమ్ముగుప్ప
ఆకుఁ బళ్ళెరములయందు మర్యాదగా, నగరాజులును ఫలహారమొసఁగ,
పద్మరాగమణి ప్రభాభరితనూత్న, పల్లవరసాల వనసభాభవనమందు
గండుకోయిల పేరిటి గాయకుండు, పాడుచున్నాఁడు మోదులు పల్లవింప.

పెండ్లికూఁతురువోలెఁ బేరాస రేకెత్తఁ గ్రొత్త పందిటఁ దళ్కుఁ గొలిపెనొర్తు
మగనాలివలె సిగ్గు మొగమున దోసుకాడఁ గదలియు సందంద యొదిగెనొర్తు
విద్యావతియుఁబోలె విమల యశఃపుష్పములు గుబుల్కొన దెస లలమెనొర్తు
పరమయోగినివోలెఁ బ్రక్కకై యొఱఁగ కత్యూర్ధ్వదృష్టిని మింటనుండెనొర్తు
పలుకనేరని లతలె యిబ్భంగిగాఁగఁ, బలుకుఁ దీవియ లెటువంటి భావసరణి
నడచునో చెప్ప నెవఁడోపు నవవిలాస, చూళికా మాధవాగమ వేళయందు.

తొలిఁ దామరలతావి దొంగిలించినవాఁడు దొంగిలింపండె చేతోధనంబు?
వలిప మీఁదెద కొంగు పాయఁ దట్టినవాఁడు పాయఁదట్టండె లజ్జాయవనిక?
ననిచి యేనుఁగువలె నడువనేర్చినవాడు నడువనేరండె యానందనమున?
వేడ్కఁ గేళీసరోవీచు లూపినవాఁడు నూపఁడే త్రిజగంబు లుబ్బుహోయి;
కన దఖిలలోక సంస్కార కారణుండు, మలయభూధర శృంగ సమాగతుండు
సకలవల్లీ నటీనట చక్రవర్తి, దక్షిణానిలుఁడొప్పె మాధవుని వజ్జ.

ఎంతయుఁ బంచమశ్రుతిని నింతగఁ గోయని కూయు నంతనా
వంతయునున్నదే ఫల? మహో! వినుచెప్పెద నొక్కమాట పూ
బంతుల దొండపండులనుఁ బార్వణచంద్రునిఁ బూజచేసి జ
న్మాంతరమందు నేని జవరాలయి పుట్టుము గండుకోయిలా!



# ఆంధ్రదేశంలో ఔషధముల ఉత్పత్తి

## నిరంతరాభివృద్ధి నందుచున్న ఒక ఆధునిక సంస్థ



సౌత్ ఇండియా రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, విజయవాడ.

"భారతదేశంలో పరిశ్రమలు విశేషంగా పెరుగుతున్నవి. అభివృద్ధి చెందుతున్నవి. అయినా మన పరిశ్రమలస్థితి అంతా సవ్యంగా లేద"న్న ప్రసంగం శాసనసభలలోను ప్రజాబాహుళ్యమందునా తరచు వినవస్తున్నది.

పారిశ్రామిక పరిస్థితుల లోటుపాట్లు నెరిగి, అనుభవజ్ఞులైన వారిచే ఉన్నతాశయములతోను, వాస్తవిక దృక్పథంతోను నెలకొల్పబడి విజయవంతంగా పనిచేస్తున్న కొద్ది జాతీయ పారిశ్రామిక సంస్థలలో ఒకటి సౌత్ ఇండియా రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ లిమిటెడ్.



'సిరిస్' అను సంగ్రహ నామంతో తెలియబడే ఈ సంస్థ 1950 లో విజయవాడయందు స్థాపింపబడింది. ప్రజారోగ్యపోషణకు అత్యవసరమైన వైద్యులకు సామాన్యంగా కావలసి వచ్చుచుండే ఔషధాలనుమాత్రమే ఉత్పత్తిచెయ్యటానికి ఈ సంస్థ ప్లాను చెయ్యబడింది. ముడిసరుకులను ఎన్నుకొనటంనుంచి, తయారైన వస్తువులను డెలివరీచెయ్యటం వరకు ప్రతి పనీ సక్రమంగా, సాఫీగా సాగిపోయేట్లు ఇందు కట్టుదిట్టమైన ఏర్పాట్లు జరుపబడినవి. 'సిరిస్' యొక్క అచిరాభివృద్ధికి ఇదే కీలకం.

'సిరిస్' లేబరెటరీలలో మిక్కిలి ఆధునికమైన యంత్ర సామగ్రి నెలకొల్పబడి యున్నది. ఈ యంత్రసహాయంతో సరికొత్త ఔషధాలు ఉత్తమ ప్రమాణలతో తయారు చెయ్యబడుచున్నవి. ఈ సంస్థ మానేజింగ్ డైరెక్టరే దీని టెక్నికల్ డైరెక్టరు కూడాను. మానేజింగ్ డైరెక్టరునుంచి సామాన్య కార్మికునివరకు ప్రతివారూ సాయంత్రం అయేసరికి ఆ దినం తాము



చేసిన పనిని తమ వర్కు షీటులో నమోదు చెయ్యవలసి యుంటుంది. వస్తు సామగ్రి ఎక్కడి వక్కడ నిర్దుష్టంగా అమర్చి పెట్టబడి ఈ లేబరెటరీలు మిక్కిలి పరిశుభ్రంగా కనుపించుతవి.



లేబరెటరీలలోకి వచ్చే ముడిసరుకు ప్రతిదీ, వస్తుగుణానికీ, నాణ్యతకీ ఆ్యమెట్రానిక్ ఫోటో మీటరు, పోలరి మీటర్, ఇంకా అనేకమైన యంత్రసాధనాలతో కర్కశంగా పరీక్షింపబడుతుంది. తయారైన వస్తువులు కూడ ఇదేవిధంగా పరీక్షచేయబడి మరీ విడుదల చెయ్యబడుతవి. ఈ లేబరెటరీలు ఇటీవల ఎయిర్ కండిషను చేయబడినవి. ఈ ప్రారంభోత్సవం శ్రీ సి. యం. త్రివేది గారిచే చెయ్యబడింది. దక్షిణభారతంలో ఎయిర్ కండిషను చేయబడిన లేబరెటరీ బహుశ ఇదే మొట్టమొదటిదై యుంటుంది. ఔషధోత్పత్తి కర్మాగారాలకు టెంపరేచర్ కంట్రోలు అత్యావశ్యకం.



ఇక్కడ అనేకరకాల ఔషధాలు ఉత్పత్తి అగుచున్నవి. ఉత్తమమైన నాణ్యత కలిగి ఇవి ప్రతివారికీ అందుబాటైన ధరలకు అందజెయ్యబడుచున్నవి. ధర్మ సంస్థలకూ, ఆసుపత్రులకూ దాదాపు లాభరహిత పద్ధతిని ప్రత్యేకధరల కివ్వబడుచున్నవి. ఇచ్చట తయారైన ఔషధాలు దిగుమతి అయినవాటిని మించిన ప్రజాదరణ గడించుకొనుచున్నవంటే ఆశ్చర్యంలేదు.

ఆంధ్రదేశంలో వెలసి పాదపరితనం, నాణ్యత పొందుపరచి సౌష్ఠవమైన వ్యాపారసూత్రాలతో కట్టుదిట్టంగా నడుపబడుచు నిరంతరాభివృద్ధి నందుచున్న ఉత్తమఔషధోత్పత్తిసంస్థ ఈ సౌత్ఇండియన్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్. క్రొత్తవారు విజయవాడలో ముఖ్యంగా దర్శించదగిన చోట్లలో ఇది ఒకటి.

# ఆంధ్ర ప్రభుత్వార్థిక విధానము

శ్రీ వి. కె. నరసింహం

ప్రత్యేకించి ఆర్థికదృష్ట్యా చూస్తే, ఆంధ్రరాష్ట్రం—నూతనంగా ఏర్పడింది కాబట్టి—ప్రారంభదశలో కొన్ని లోటుపాట్లు ఉంటాయి. సుమారు 2 కోట్ల 10 లక్షల జనాభా 63,600 చ. మై. వైశాల్యంతో—తల 1-కి స్థలవైశాల్య దృష్ట్యా ఆంధ్రరాష్ట్రం అవశిష్ట మద్రాసు రాష్ట్రంకన్న ఎంతో మెరుగు. మద్రాసురాష్ట్ర వైశాల్యంకూడ యించుమించు యింతే అయినా, అదనంగా మరో 150 లక్షల జనాభాను పోషించాల్సి వస్తున్నది. అయితే తల 1 కి యీ స్థలవైశాల్యం ఎక్కువైనంత మాత్రాన ఆంధ్రలో తల 1 కి మద్రాసు రాష్ట్రంకన్న ఎక్కువ ఆదాయం రాగలదేమో అంతగా తెలియదు. మద్రాసు ప్రభుత్వ అభివృద్ధి శాఖా కార్యదర్శి శ్రీ లోబో ప్రభూగారు వివరించినదాని ప్రకారం ఆంధ్రలో తల 1 కి ఆదాయం రు 290/- లైతే, పరిశిష్ట మద్రాసులో రు 254-8-0 లు మాత్రమే. కనుక మద్రాసుతో పోల్చి చూస్తే, ఆంధ్రప్రజల ఆదాయ ప్రమాణం ఎక్కువ; దాన్నిబట్టి పన్ను చెల్లించే శక్తికూడ ఎక్కువే. కాని యథార్థ మేమిటంటే ఆంధ్రకన్నా పరిశిష్ట మద్రాసురాష్ట్రంలోనే తల 1 కి పన్ను చెల్లించు శక్తి, చెల్లింపు కూడా ఎక్కువ. దీనికి కారణాలు: భారీఎత్తున పారిశ్రామికాభివృద్ధి, వాణిజ్యం, బ్యాంకింగు, యిన్సూరెన్సు పథకాలు అభివృద్ధి చెందడం, రోడ్డు రవాణా సౌకర్యాలు చక్కగా ఉండటం. దీని ఫలంగా మద్రాసు ప్రభుత్వం అమ్మకం పన్ను, మోటారువాహన పన్నుల(ఆంధ్రకన్న ఎక్కువగ)ద్వారా ఎక్కువ ఆదాయం పొందుతోంది. ఆంధ్రప్రాంతం వాణిజ్యంలోను, పారిశ్రామికరంగంలోనుకూడ ఎంతో వెనుకబడివున్న సంగతి తెలిసినదే. ఆంధ్రలో ప్రధానపరిశ్రమ వ్యవసాయం. అందుచేత మద్రాసులోకన్న, ఆంధ్రలో భూమినుంచి వచ్చే ఆదాయమే ఎక్కువ. అందుచేత నీటితీరువ హెచ్చింపు, వాణిజ్యపంటలపై హెచ్చు పన్నుల, విధింపుద్వారా వచ్చే సంవత్సరమునకు రు 3 కోట్ల లోటును కొంతవరకు భర్తీ చేయవచ్చని ఆంధ్ర బడ్జెటు ప్రతిపాదిస్తూ ఆర్థికమంత్రి శ్రీ విశ్వనాథగారంటే, అంత ఆశ్చర్యం కలిగించదు.

రాజ్యాంగం ప్రకారం, రాష్ట్రాల కివ్వబడినవాటిల్లో, (రాబడి మార్గాలలో) ఆర్థికసౌష్ఠవం పెంపొందడంతోపాటు ధారాళంగా ధనం సమకూర్చగలిగేది అమ్మకం పన్ను. అయితే ఆర్థికాభివృద్ధి ఆంధ్రలో నెమ్మదిగా జరగడంవలన యీ ఆధారం (అమ్మకంపన్ను) అంత బలంగా లేదు. మామూలుగా జరిగే ఆర్థికాభివృద్ధికీ అమ్మకం పన్నుకూ గల సంబంధం,—భూమి రెవిన్యూ, అమ్మకంపన్నుద్వారా వచ్చే ఆదాయం—యీ రెంటికీ మధ్య గల నిష్పత్తి ననుసరించి సూచింపబడింది. కాని ఆ వివరణ అంత స్పష్టంగాలేదు. 1954 55 అంచెనాలు చూస్తే, ఆంధ్రలో, భూమి రెవిన్యూద్వారా వచ్చే ఆదాయం (బడ్జెటు అనంతరం పెంచినవాటిని మినహాయిస్తే) రు 3.35 కోట్లు; అమ్మకంపన్నుద్వారా వచ్చేది రు 3.15 కోట్లు. మద్రాసు రాష్ట్రం లెక్కలు యివి; భూమి రెవిన్యూ 4.71 కోట్లు. అమ్మకం పన్ను రు. 9.5 కోట్లు. మద్రాసు రాష్ట్ర వార్షిక రాబడిలో 1/5 వ వంతు అమ్మకంపన్నుద్వారాను, 1/10 వ వంతు భూమి రెవిన్యూ ద్వారాను వస్తూండగా, ఆంధ్రలో వార్షికరాబడిలో $\frac{1}{8}$ వ వంతుకు భూమి రెవిన్యూపైనను, అంతకు కొంచెం తక్కువగా అమ్మకంపన్నుపైనను ఆధారపడవలసి వస్తోంది. మోటారు వాహనాలపై పన్నులద్వారా ఆంధ్రలో రు 1.42 కోట్లు రాగలదని అంచెనా వేయబడింది. అవశిష్ట మద్రాసులో యిదే పన్నువిధింపుద్వారా రు 3.40 కోట్లు వస్తోంది. ఈ భేదానికి కారణం, యీ దక్షిణాదిరాష్ట్రంలో మోటారు రవాణా చాలా అభివృద్ధిచెందడమే నని స్పష్టంగా కనిపిస్తోంది. ఇంకా విద్యుచ్ఛక్తి స్కీములద్వారా వచ్చే మొత్తంకూడ పారిశ్రామికాభ్యుదయానికీ రాష్ట్ర ఆర్థికవిషయాలకు మధ్య గల సంబంధాన్ని సూచిస్తున్నది. ఆంధ్ర బడ్జెటులో యీ పద్దుకింద చేర్చిన మొత్తం 23 లక్షలు—మద్రాసు బడ్జెటులో రు 2 కోట్లు. అంటే యించుమించు పదిరెట్లు ఎక్కువన్నమాట.

ఈ రెండురాష్ట్రాల ఆర్థికస్థితినీ పోల్చిచూస్తే రెండు విషయాలు కన్పిస్తున్నవి.

మొదటిది; ప్రస్తుత స్థాయినిమించి కొంతవరకైనా వాణిజ్యం, పరిశ్రమలు, అభివృద్ధి చెందకపోయినట్లయితే, ఆంధ్రరాష్ట్రం రాబడిలో చెప్పుకోతగ్గ అభివృద్ధియేమీ వుండదు. మద్యనిషేధం రద్దు ద్వారా ఖచ్చితంగా మరో 3 కోట్లు లేదా 4 కోట్ల రూ. లు. రాగలదు. అయితే, యీ నిర్ణయం కేవలం ఆర్థిక దృష్ట్యా చేయ వీలులేదు. అమ్మకం పన్ను ఖచ్చితంగాను తీవ్రంగాను వసూలు చేయడంద్వారా ఉమ్మడి మద్రాసు రాష్ట్రం తన ఆదాయంలో వచ్చే లోటును భర్తీచేయగలిగింది.

రెండవది; మామూలుగా యీ ఆర్థికాభివృద్ధి జరిగేవరకు భూమిపన్ను, వ్యవసాయ ఉత్పత్తులమీద పన్నులద్వారా ఎక్కువ రెవిన్యూ రాబట్టుకోవలసి వుంటుంది. ఇక బయటనుంచి, అనగా కేంద్రంనుంచి సహాయం ఉదారంగా జరగాలి.

ఈ రెండు నిర్ణయాల ననుసరించిచూస్తే, ఆంధ్రరాష్ట్రం అనుసరించదగు ఆర్థికవిధానం స్పష్టమవుతూంది. వాణిజ్యం, పరిశ్రమలు, త్వరితంగా అభివృద్ధిచేయటానికి ఆంధ్రప్రభుత్వం అవి

రామ కృషిచేయాలి. వీలైన మార్గాలన్నీ వినియోగించుకోవాలి. అభివృద్ధి స్కీములలో యే అంశాలైతే రాష్ట్రసంపదను వృద్ధిచేయడానికి తోడ్పడతాయో, ప్రస్తుత పారిశ్రామిక నిర్మాణస్థితిని మార్చి ముందుకు తీసుకుపోతాయో ఆ అంశాలమీదే ఎక్కువ శ్రద్ధవహించాలి. ప్రస్తుతం వ్యవసాయం మీద, ఒకటో, రెండో, కుటీర పరిశ్రమలమీద మాత్రం చాలాభాగం కేంద్రీకృతమైంది.

పెద్దపెద్ద నదీలోయ ప్రాజెక్టులు ప్రారంభించాలనే కుతూహలం వుంటుంది. దాన్ని త్రోసిపుచ్చలేం. ఆంధ్రలో గొప్ప నదులైన కృష్ణా, గోదావరీ, నదీజలాల వినియోగానికి బ్రహ్మాండమైన ప్రణాళికలు సిద్ధమవుతున్నాయి. ఆంధ్రదేశ సౌభాగ్యానికి యీ రెండునదులు మూలాధారాలు. అయితే ఏది ముందు, యే ప్రణాళిక ఎప్పుడు ప్రారంభించాలి అన్నదే సమస్య. పెట్టుబడి అవసరాలకు ఆంధ్రరాష్ట్రంలోగల వీలునుబట్టి సాలుకు రు 5 కోట్ల నుంచి 10 కోట్లవరకు తప్పితే – దాన్నిమించి ధనం సమకూర్చగలగటం సంభవం కాదేమో! 1954–55 సం॥నకు రు 3 కోట్లు అప్పు తీసుకోవాలనీ, మరో 7 కోట్లవరకు కేంద్రసహాయం రాగలదనీ ఆర్థికమంత్రి భావిస్తున్నారు. సాలీనా రు 10 కోట్ల పెట్టుబడితో సుమారు 7 నుంచి 10 సంవత్సరములవరకు పట్టగల స్కీములు ప్రారంభిస్తే, వాటి ఫలితాలెలావుంటాయో జాగ్రత్తగా పరిశీలించాల్సివుంది. పెట్టుబడికిగల ఆధారాలన్నీ ఒకటో, రెండో, దీర్ఘకాల ప్రాజెక్టులకు వినియోగిస్తే, కాలం గడిచినకొద్దీ, అనగా ఆ పిదప వచ్చే సంవత్సరములలో యీ ప్రాజెక్టులపై పని మందగిస్తుంది, తగిన నిధులు లభ్యం కాకపోతే. ఇంతేకాదు, యిలా చేయడమంటే, కొద్దికాలంలో పూర్తిఅయి ఏడాది, రెండేళ్ళలో వుత్పత్తిని పెంచగల చిన్న స్కీములనుంచి, పెద్దవాటికి డబ్బు ఖర్చుచేయడమన్నమాట. ఒచ్చే ఏడాది లేక, రెండేళ్ళలో యే బహుళ ప్రయోజనాలుగల ప్రాజెక్టునైనా ఆంధ్రప్రభుత్వం ప్రారంభిస్తే దామోదర్, హిరాకుడ్ ప్రాజెక్టులమాదిరిగ యించుమించు కేంద్రప్రభుత్వపు గ్రాంట్లు, ఋణాలు, మూలంగానే పూర్తిగ ధనం లభించవలసివుంటుంది. అయితే కేంద్రం ఎంత యివ్వ సిద్ధపడుతుంది, రాష్ట్రం ఎంత భరించాలి అన్నది జాగ్రత్తగా తెలుసుకోవాలి. కృష్ణ లేక గోదావరిమీద యేదైనా పెద్ద ప్రాజెక్టుకోసం కేంద్రం విరివిగా ధనం ఖర్చుపెడితే, దీని ఫలితం పరిశీలించాలి. కేంద్రమిచ్చే సహాయాన్ని ఒక్క ప్రాజెక్టుకే వెచ్చించి స్వల్పకాలిక స్కీములు నిలిపివేసి వుంచడం సరియైన ఆర్థికవిధానం కాదు.

పైన వివరించినదాన్నిబట్టి, విశ్వనాథంగారు ప్రతిపాదించిన బడ్జెటునుచూస్తే సరిగా ఆలోచించిన ఒక సూత్రంగాని ఉద్దేశ్యంగాని లేనట్లు కన్పడుతోంది. ఉదాహరణకు వారి బడ్జెటుప్రసంగం చూడండి; రాష్ట్ర ఆర్థికస్థితి అభివృద్ధికి పరిశ్రమల నభివృద్ధిచేయడం ప్రధాన అవసరమైనా దానికి సంబంధించిన విషయమే వారి ప్రసంగంలో లేదు. దీనిని వెంటనే సరిదిద్దుకోవాలి. శీఘ్రపారిశ్రామికాభివృద్ధికి తోడ్పడగలస్కీములకు పెట్టుబడిలో అధికభాగం కలదన్న విషయం మనకు తృప్తినిస్తుంది. 1954–55 లో పెట్టుబడి ఖర్చు రు 10.18 కోట్లలో రు 5 కోట్లకుపైన (సరిగా 5.24 కోట్లు) తుంగభద్ర, మాచ్‌ఖండుహైడో విద్యుచ్ఛక్తిస్కీములకు ఖర్చు చేయవలసి వుంది. ఇర్రిగేషన్ పనులకు రు 3.36 కోట్లు అవుతుంది. రోడ్ల అభివృద్ధికి ఒక కోటి రు. లు. కేటాయించబడ్డాయి. ఇది చాలా అవసరం. చౌకగా విద్యుచ్ఛక్తి, లభించక రోడ్ల అభివృద్ధి జరుగక, గతంలో ఆంధ్రలో పారిశ్రామికాభివృద్ధి చాలావరకు కుంటుపడింది. తుంగభద్రహైడ్రో విద్యుచ్ఛక్తి పథకం 1957 లో పూర్తి అయితే, మాచ్‌ఖండునుంచి వచ్చేసంవత్సరం మధ్యభాగంనుంచి విద్యుచ్ఛక్తి, లభిస్తుంది. మాచ్‌ఖండునుంచి సుమారు 24 వేల కిలోవాట్లు, తుంగభద్రనుండి 27 వేల కిలోవాట్లు ఆంధ్రకు లభిస్తుంది. ఇప్పుడు లభ్యమయ్యే విద్యుచ్ఛక్తి యికనుండి లభ్యంకాగలదీ కలుపుకుంటే, అనేక కొత్త పరిశ్రమలు నెలకొల్పుటకు వీలుకలుగుతుంది. కనుక పారిశ్రామికాభివృద్ధికి తగు కార్యక్రమం తయారుచేసుకోవడానికి సరియైన సమయం వచ్చింది. పారిశ్రామికాభివృద్ధికి కావలసిన పెట్టుబడి అవసరాలకుగాను 1954–55 బడ్జెటులో రూ 5,129 లక్షలు మాత్రం కేటాయించడమైంది. ఇదెందుకు పనికిరాదు. తగు ప్రణాళికలు సిద్ధంచేయడానికి వ్యవధి లేకపోయిందని అనుకున్నా కొత్తగా లభించు విద్యుచ్ఛక్తి వినియోగానికి కొత్త పరిశ్రమలకు తగు పథకాలు రచించుకోవాల్సివుంది. పరిశ్రమలకు సంబంధించిన కార్యక్రమం తయారుచేస్తున్నామంటే అవి స్వయం సమృద్ధంగానేవుండాలనీ, లేక యితర రాష్ట్రాలలో బాగా పాతుకుపోయిన పరిశ్రమలతో పోటీచేయాలనీగాదు. భారతదేశపు ఆర్థిక వ్యవస్థలో ఆంధ్రదేశపు ఆర్థికవ్యవస్థ ఒకభాగం. ఆంధ్రదేశం ఆర్థికంగా అభివృద్ధి చెందుతున్నదంటే జాతిమొత్తం ముందుకు పోతున్నదని గుర్తించాలి. ఆంధ్రకు యే చిక్కు లేకుండ అందుబాటులో వుండే పరిశ్రమలపై యీ రచించబోయే కార్యక్రమం కేంద్రీకరింపబడి వుండాలి. అంటే, సిమెంటు, పంచదార, వనస్పతి, వుప్పు, పొగాకు సబ్బులు, పింగాణీ పరిశ్రమలు. అత్యవసరంగా కావలసింది, చాలినంత పెట్టుబడితో ఒక పారిశ్రామిక ఆర్థికసహాయసంస్థ. అధికారులు, అనధికారులు, ప్రముఖవర్తకులతో కూడిన ఒక పారిశ్రామికాభివృద్ధి సంస్థను వెంటనే ప్రభుత్వం యేర్పాటుచేయాలి. పారిశ్రామికంగా యేవేవి అభివృద్ధిచెందాలో, పరిశీలించి, వున్నవాటిని ప్రోత్సహించడం, కొత్తవాటిని స్థాపించే విషయమై ప్రభుత్వానికి అవసరమైన చర్యలు తీసుకునేందుకుగాను, కొన్ని సూచనలు యీ సంస్థ చేయవచ్చు. ప్రస్తుతం వున్నటువంటి ప్రముఖమైనటువంటి పరిశ్రమల అవసరాలదృష్ట్యా రోడ్ల అభివృద్ధి కార్యక్రమం ప్రారంభించాలి. ఆర్థిక కార్యక్రమంలో ఒక భాగంగా మోటారురవాణా శీఘ్రంగా అభివృద్ధిగావాలి. వెంటనే దీన్ని ప్రారంభించాలి.

ఆంధ్ర ఆర్థికస్థితి స్తిమితంగా వుండేందుకేగాక, ఆంధ్రప్రభుత్వ ఆర్థికస్థితి బాగుచేయాలంటేగూడ ఒక అభ్యుదయకరమైనటువంటి చురుకుగా జరుగగలటువంటి పారిశ్రామికాభివృద్ధి విధానం చాలా అవసరము.

# ప్రాచీన యోధస్మృతి

శ్రీ పురిపండా అప్పలస్వామి

స్వర్ణకాంత్యుజ్జ్వలమ్ము లాశా పథాల
నిత్య కల్యాణమును పచ్చతోరణమ్ము
లల్లుకొన్నవి, మధుర మంగళరవమ్ము
లంబరము నంటి పుల్కరించినవి నేడు.
దిగ్దిగంతాలు ముఖరితమ్ములుగ జేసి
మ్రోయుచున్నవి విజయ శంఖారవములు,
పల్లెపల్లెల పట్టణ ప్రాంగణాల
కురియుచున్నది స్వర్గీయ కుసుమవృష్టి.
అదె హిమాచల కాంచనగంగశిఖరి
శాంతి సత్యాన్వితమును, ధర్మ్యపదమ్ము
ఆసియా విశ్వమునకు నవోదయమ్ము
మెరయుచున్నది భరత నికేతనమ్ము.
దైన్యమెడలిన దీర్ఘ నేత్రాంచలాల
ఆశలానంద విజయ దీప్తులయి సాగ
అరుగుదెంచిరి నైవేద్య హస్తులగుచు
భరతపుత్రులు నిత్య స్వతంత్రు లిపుడు.
ఏ పురాతన శాపమో, ఏ యుగాల
పాపమో, ఇంత కాలమ్ము కట్టగుడ్డ
కుడువ కూడును లేకుండ గడిపినారు
భారతీయులు జగదేక వంద్యులయ్యు.
బ్రతికిచెడ్డ ఈ భారతజాతి మరల
తీర్చుకొనునార రత్ననీరాజనమ్ము
విరిగి తరిగిన కల్యాణ మంటపాల
మాతృపూజా పవిత్ర సంకల్పదీక్ష!
మా చిరంతన బహుళ భాగ్యములుపండి
శ్రీ వెలార్చు నీ మంగళ వేళలందు
గడచిన మహాస్వతంత్ర సంగ్రామ చరిత
మొక్కటొక్కటె సజీవమై కానుపించు
స్మృతిపథమ్మున చలనచిత్రమ్ము భాతి!
ఇతడు నౌరోజి, ఇతడు గోపాలకృష్ణు
డితడు గంగాధరుండు - నిద్రావిముద్రి
తమ్ము భారతమ్మునకు చైతన్యమొసగి
మేలుకొల్పిన వైతాళికులు తమంత!

ఇతడు లాలాజి, మోతిలా లితడు, ఇతడు
చిత్తరంజను, డీతండు దేశభక్తు
డితడు నేతాజి స్వేచ్ఛారణాంగణాన
మడమత్రిప్పని అగ్రసైనికులు వీరు!
ఇది చెరపలేని దేనాడు చెరగబోని
దీ మహావమానమ్ము, పాంచాల భూమి
డయరొనర్చిన ఘోరకృత్యమ్ము - దీని
తలచినంతనె గుండెలు జలదరించు.
ఈ రథఘోష ఎక్కడిదో
        మా హృదయమ్ములలో రణోత్సాహో
న్మాదము మోసులెత్త నినదించెడు,
        నీ హయహేష సుప్తకం
కాళ పరంపరల్ నిలిచి
        తాండవమాడెడు, నే యపూర్వ తూ
ణీరము అక్షయంబయిన
        శస్త్రతతుల్ సమకూర్చు నియ్యెడన్.
ఇద్ది సత్యాగ్రహరథమ్ము, ఇది అజేయ
మిద్ది పరిపంథిజనవశీకరణ దక్ష
మే అహంకృతులేని వారింప నిందు
ఇది వెనుక చూడబోని అభ్యుదయగామి.
ఇద సహాయనిరాకరణ రణగీతమ్ము,
        ఇది బహిష్కరణ హుంకార రవము.
ఇది విదేశదుకూల దహనయాగక్రీడ,
        ఇది రాట్నచక్ర సంక్రమణ క్రాంతి.
ఇది సూత్రయజ్ఞ విజ్ఞాన సందీపన,
        మిద్ది విశ్రాణనోన్మీలనమ్ము.
ఇది సాత్వికనిరోధ, మిది అహింసావ్రత,
        మిది అనాసక్తయోగ ప్రదీక్ష.
ఇద్ది భారతజాతి సంధించుకొన్న
గౌరవపతాక. దిగ్విజయమ్ముకొరకు
ఎగురుచున్నది తారాపథాంతరాల
పతన మెరుగని మూడు వన్నెల ధ్వజమ్ము.
మాసి చెరగిన భరతజాతి ప్రతిష్ఠ

తీర్చి దిద్దితి ఖండ ఖండాంతరాల
దర్శనీయమ్ము నీ దర్శనము సతమ్ము
వందనశతమ్ము తల్లీ, పతాకలక్ష్మి!
మాతృదాస్య విశృంఖలాచ్ఛేదమునకు
నిండు ప్రాణమ్ములను బలివెట్టినారు
నీ సుశీతల చేలాంచలముల నీడ
లక్షలాదిగ శాంతి సైనికులు, తల్లి!
దేశదేశాల నిఖిల సాగరతటాల
దర్శనీయమ్ము నేడు నీ దర్శనమ్ము.
సకలదేశ రాజ్ఞీత్వ లాంఛనమునీవి
వందనశతమ్ము తల్లీ, పతాకలక్ష్మి!
వీరు సత్యాగ్రహులు, అసహాయశూరు,
లే నిరంకుశులేని బంధింపనిందు
నిగళములు త్రెంచుకొనెడు సైనికులు వీరు
చిరపరాధీన శృంఖలా చ్ఛేదమునకు
జీవితసుమాలె ధారవోసిరిదె వీరు.
వీరి శిరములబడు శతఘ్నులు సుమాలు.
వీరి గళముల నురిత్రాళ్లు పూలసరులు
బాధలే భాగ్యముగ నొడిబట్టజాలు
భారతాశ్రమ తరుణతాపసులు వీరు.
కురియదో నేడు మాంగళ్య ప్రసవరాజి
శ్రీవిరాజిల్లు నీ యోధ శిరములందు!
ఇతడు బాపూజి, బోసినవ్వుల తపస్వి
భారత మహాస్వతంత్ర రణాంగణమున
సర్వసేనాని, సత్యాగ్రహ ప్రణేత
సర్వసర్వం సహా పరిత్రాణకీర్తి.
ఈ అవతారమూర్తి నొగి
    లింపదు శాత్రవమానసమ్ము, ద్వే
షింపదు ఆతతాయినయి
    నన్, పరపీడన సైపలేదు, ప్రే
మాస్త్ర మదొక్కటే ఇతని
    పాశుపతాస్త్రము గెల్చెకాక ఎ
న్నండును ఓటమిన్ గురు
    తెరుంగడు ఈతనికిన్ నమస్కృతుల్.
ఇద్ది దండీపవిత్ర వేలాస్థలమ్ము
"విజయహారమ్ము గళము సంధించుటొండె
మృత శరీరమ్ము జలధి తేలాడుటొండె"
అని మహాత్ముండు విక్రమించిన తలమ్ము.
దేశదేశాల మృష్టాన్న వితరణమున
మీదు చేయిగ బ్రతికిన భరతజాతి
నలుపుకొననయ్యె ఉప్పు సత్యాగ్రహమ్ము
తన మహోదధి తీర కేదారములను!
ఇద్ది శ్రీకృష్ణ జన్మస్థలమ్ము, ఇచట
ఎండ కన్నెరుంగని సుకుమార జనము
కఠిన వరకమ్ములను సయిరించుకొనును
చిరునగవు లాననమ్మున చెరగనీక.
విప్లవ దవాగ్ని వేయి నాల్కలను చాచి
భూనభోంతరాళమ్ముల బుగులుకొనగ
"ఇండియా విడిపొండు శ్వేతాంగు" లనుచు
నినదభీషణ దేవదత్తంబు మ్రోగు.
ఇది విజయపర్వ మేనాటి దీప్రతీక!
సంస్కరణ శూన్యమమ్మ వేణీభరమ్ము
పుష్పగుంఫిత మీ వేళ, ఉభయసాంధ్య
లరుణిమను పూయు నేడామె చరణాలక్త.
తీర్చి దిద్దిన మాయమ్మ తిలకరేఖ
దుర్నిరీక్ష్యమ్ము నేడు, కోటీర దివ్య
మణిమయూఖమ్ము కోటిభానూదయమ్ము
ఏలుకొనునేమొ మూడులోకాలు తల్లి!

నాణ్యము, ధర జంటగా కలసియుండును

కొనేవారు సరసమైన ధర యొక్క ఆకర్షణను ప్రతిఘటించవలయును. విలయన అందులోనే
కష్టము యున్నది. ఒకటి లేక రెండు పైసాల లాభముకొరకు, తక్కువ ధర గల సరుకును కొన్నచో

## నాణ్యము యొక్క విలువలో

ఒకటి లేక రెండు అణాలు నష్టము కలుగుచున్నది.

అందుచే
ఇంగువలో ఉత్తమమైన దానిని
జ్ఞప్తిలో ఉంచుకొనండి

నాణ్యమునకు, సరసమైన
ధరకు ప్రఖ్యాతి చెందినది.

ప్రతిచోటా దొరుకును, లేక




ఎల్.జీ.

# లాల్జీ గోధు అండు కో.,

షావుకారు పేట, మద్రాసు - 1.

హెడ్ ఆఫీసు:
బొంబాయి.

---

సువాసనకు
పేరుగాంచినది

# శ్రీ పా
# హేర్ ఆయిల్

★

గంగావర్క్స్, అడయార్,
మద్రాసు - 20

---

ఐ.సి.ఏ.తో కూడిన
పెట్రోలుతో
**నింపి**





**వ్యత్యాసమును**

**కనుగొనుడు**



# ఐ సి ఏ

"షెల్ పేటెంట్ల క్రిందలైసెన్సు పొందియున్నది"

(ఇగ్నిషన్ కంట్రోల్ అడ్డిటివ్)

# శబ్దార్థతత్త్వము

శ్రీ సూరి సుబ్బరామశాస్త్రి

శ్లో॥ వాగర్థా వివసంపృక్తౌ - వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే - పార్వతీ పరమేశ్వరౌ॥

...............

"అ ఇ ఉణ్; ఋ ఌ క్; ఏ ఓ ఙ్; ఐ ఔ చ్; హ య వ ర ట్; లణ్; ఞ మ ఙ ణ న మ్; ఝ భ ఞ్; ఘ ఢ ధ ష్; జ బ గ డ ద శ్; ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్; క ప య్; శ ష స ర్, హల్."—

—ఇతి మాహేశ్వరాణి సూత్రాణ్యణాది సంజ్ఞార్థాని—"

అకారాది వర్ణములు 'అణాది'గ సంజ్ఞార్థములుగల మాహేశ్వర సూత్రములని శ్రీమత్పాణినీయ వ్యాకరణమునఁ దెలుపఁబడినది. అందున అకారాదికములు తొమ్మిది 'అచ్చు'లనియుఁ దదితరములు 'హల్లు' లనియు సంజ్ఞల నొప్పుచున్నవి. అచ్చులందున 'అ, ఇ, ఉ, ఋ, ఌ,'ల హ్రస్వ దీర్ఘ భేదములతోఁడను ననుస్వార విసర్గములతోఁడను గలిసి పదునారగుచున్నవి. తదితరములు ముప్పది మూడు హల్లులు. మోక్షార్థము కకార, షకార, సంయోగముచే నేర్పఁడిన 'క్ష' కారముతోఁ గలిసి మొత్తము పంచాశద్వర్ణము లగుచున్నవి.

"అకారాది క్షకారాంతా—వర్ణాస్సృష్ట్యా మాతృకాభిదాః" అకారాది క్షకారాంతము పంచాశద్వర్ణములు 'మాతృక'లను సంజ్ఞ నొప్పుచున్నవి. ఇవి జగన్మాతయగు నప్పరిమేశ్వరియొక్క తేజో విభాగంబులఁ దెల్పునని యర్థము. సప్తఛందస్సు లనఁబడు సవితృదేవుని సప్తవిధ తేజంబుల సప్త సప్త విభాగంబులచే నలువది తొమ్మిది వర్ణము లేర్పడినవి. సప్తవిధ తేజంబుల వర్ణంబులే యంతర్విభాగములచే నిట్లు నలువది తొమ్మిది యక్షరము లయ్యెనని తెలియఁదగియున్నది. ఇదియే సావిత్రీదేవియొక్క వివిధావయవ తేజంబులైయొప్పు కారణమున నాయా యవయవస్థానములందున అకారాద్యక్షరములతోడ శ్రీదేవియొక్క పూజావిధానము "మాతృకాన్యాస" మనబడుచున్నది. అట్టి మాతృకాస్థాన వివేకము, అప్పకవీయమునందు:—

"అస్వర మవుదల ఆఘాల మిద్వయి
  శ్రవణ యుగ్మంబు కారములు రెండు
గన్నులు ఋత్వయుగంబు చెక్కులు లివ
  ర్ణ ద్వంద్వ ముభయ దంతచ్ఛదములు
వక్రముల్ భుజములు వక్రతమాక్షరం
  బులు కక్షములు సున్న లలిత గళము
పటు విసర్గము లురోభవసూచకంబులు
  కచవర్గములు పాదకర రుహములు
టాదులైదునుగూడఁ బృష్ఠము, చతుర్థ
వర్గ ముదరంబు పంచమవర్గజములు
జఘన మంతస్థలిపులు సూక్ష్మములు సంభ్రమ
లేవధూమణి కట్టి వాగ్దేవిఁ గొలుతు."

"అం - శిరసి, ఆం - ఫాలే......ఇత్యాదిన్యాసవిధిః"

ఇంతియకాక,

"కవులు మొదల మాతృకాపూజ నలుపక
కావ్య మొండెఁ జాటు కావ్య మొండెఁ
జెప్పిరేనిఁ దమకు దప్పగుఁ బతికిని
హాని వచ్చుఁ గృతియు నడఁగిపోవు."

అని యిట్లు మాతృకాపూజ ప్రాధాన్యముసహితము వివరింపఁబడినది.

ఇట్లు నలువది తొమ్మిది యక్షరములును సప్తవర్ణాత్మకమగు సవితృదేవుని తేజంబుయొక్క సప్తసప్త విభాగంబులచే నేర్పడినవై సమస్త ప్రాణికోటుల శరీరములందును వివిధావయవములందు సముద్భూతమగుచుఁ దత్తదవతావ కార్యకారణసమర్థ మగునట్టి తేజంబనియు నర్థము. ఇందు ముఖ్యముగా నచ్చులు తొమ్మిదియును గుణత్రయంబు లనఁబడు సత్త్వ రజ స్తమస్సులయొక్క మూడేసి యంతర్విభాగంబులచే నేర్పడినవి. అందు హ్రస్వ దీర్ఘంబులు సామాన్యముగా పుం స్త్రీ భేదములఁ దెలుపును. ఇవి శక్త్యాత్మకములు. తదితరములగు ముప్పదిమూడు హల్లులును జాగ్రత్స్వప్న సుషుప్తి భేదములచే నేకాదశేంద్రియముల కార్యస్వరూపంబుఁ దెలుపును.

పంచతన్మాత్ర లనఁబడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములొకదానికంటె నొకటి యుత్తరోత్తరము బలవత్తరములు. అందు శబ్దమేకతన్మాత్రాత్మకము. స్పర్శము శబ్దస్పర్శ తన్మాత్రాత్మకము. రూపము శబ్దస్పర్శ రూపాత్మకము. రసమన శబ్దస్పర్శ రూప రసములు. గంధమన శబ్ద స్పర్శరూప రసగంధములని యర్థము. ఇట్లు మాత్రాబలం బూహ్యంబు. ఈ తన్మాత్రలు సూక్ష్మభూతములనియు చెప్పఁబడును.

ఈ తన్మాత్రలు గుణములుగాఁ గల్గిన 'ఆకాశాది స్థూలభూతములును నట్లే యుత్తరోత్తరము బలవత్తరములు. శబ్ద గుణకమగు నాకాశముకంటె స్పర్శగుణకమగు వాయువు బలవత్తరము, సాంద్రతరంబనియు నర్థము. అంతకంటె రూపగుణకమగు నగ్నియు నంతకంటె రసగుణకమగు జలంబును నంతకంటె

గంధగుణకంబగు పృధివియును బలవత్తరములు. 'గంధవతీ పృథివీ' అనఁగా పృథివి శబ్దస్పర్శరూప రసగంధాత్మకమని యర్థము. ఈ పృథివ్యాది భూతములను వాని యంశల యంతర్విభేదములచే నైదైదు లిరువదైదు భేదములుగా వ్యవహారమున నెంచబడుచున్నవి. అకారాది వర్ణములయొక్క పృథివ్యాది విభేదంబులు స్థూలముగా అప్పకవీయమునందున్నవి—

వందలి దహరాకాశములోని వాయు వతిసూక్ష్మమాత్రమున 'అ' కార స్వరూపమునుండి బహిరాకాశమునుఁజేరి సాంద్రతనొంది 'అః' యనుచు, 'హ' కార రూపమును జెందును. దీనిని మరల లోనికిఁ గొంపోవునపుడు నిశ్వాసమున బహిరాకాశమున 'హ' కారాత్మతనున్న తేజము హృదయములోనికిఁ బోవుచు 'అ' కారాత్మతను జెందుచున్నట్లు విస్పష్టముగాఁ దెలిసికొనఁగలము. ఇది

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ, ఆ, | ఏ | — క. | చ, | ట, | త, | ప, | — య, ష; | వాయుబీజములు |
| ఇ, ఈ, | ఐ | — ఖ, | ఛ, | ఠ, | థ, | ఫ, | —ర, స; | అగ్నిబీజములు |
| ఉ, ఊ, | ఓ | — గ, | జ, | డ, | ద, | బ, | —వ, హ; | జలబీజములు |
| ఋ, ౠ, | ఔ | — ఘ, | ఝ, | ఢ, | ధ, | భ, | —ల, శ; | భూమిబీజములు |
| ఌ, ౡ. | అం | — ఙ, | ఞ, | ణ, | న, | మ. | —ళ అః; | గగనబీజములు |
| | | గగన, | వాయు, | అగ్ని, | జల, | భూమి. | | |

"హం" అనఁగా హకారము ఆకాశతత్త్వము. "యం" వాయుతత్త్వము. "రం" వహ్నితత్త్వము. "వం" అమృత (జల) తత్త్వము. "లం" పృథివీ తత్త్వము. "సం" సర్వతత్త్వము. ఇది పంచపూజా తత్త్వవిధానము. ఈ యక్షరముల బీజాత్మకతనుఁ గొంత వివరించెదను:—

మన ప్రయత్నముతోడఁ బ్రత్యేకముగా నెట్టి నిమిత్తములేక ప్రత్యహంబు నుచ్ఛ్వాస నిశ్వాసాత్మకముగ నిరువదొక్క వేయి ఆరు వందలు (౨౧,౬౦౦) హంసలు ప్రతిజీవుని హృదయాంతరాళమునందును చరించుచున్నవి. ఇది "అజపా గాయత్రీ" మంత్ర తేజ మనఁబడును. అనఁగా నీ గాయత్రీ తేజమును మన మన్య మంత్రాక్షరములవలెఁ బ్రత్యేకముగా జపియింపఁ బనిలేకయే సర్వదా సిద్ధించుచున్న కారణమున నా తేజంబుచే శరీరము మనుచున్నదని యర్థము. ఈ తేజఁబు హృదయకోశ చాలనమునకుఁ గారణమైయున్న పరమేశ్వరీ తేజంబు. ఇదియే చిత్తవృత్తికిఁ గారణంబగు చిత్ శక్తి యనియు జెప్పఁబడుచున్నది. అంతియే కాని, యీ తేజము కేవలము వాయుమాత్ర చాలన మనఁదగదు. అట్లయిన మృత కళేబరమున హృదయమునందున నీ హంసచారము లేదనుట ప్రత్యక్షము.

ఒక్క క్షణకాలము నోటిని దెఱచియుంచి యందుండి శ్వాసక్రియను బరిశీలించి చూచినయెడల నది 'హ' కార శబ్దస్వరూపముగా మనము గుర్తెఱుఁగగలము. అందున నుచ్ఛ్వాసము హృదయమునుండి 'అ' కారముతో నారంభమై బైటికి రాగా 'హ' కారాత్మతను పరిణామము నొందునట్లు తెలియును. నిశ్వాసము తద్వ్యతిరిక్తముగా 'హ' కారాత్మకత నారంభమై హృదయములోనికిఁ బోవుచు 'అ' కారాత్మకతను బరిణామమునొందును. కొంచెము సేపు పరిశీలించిన నీ యంశము విశదము కాఁగలదు. హృదయము

యుచ్ఛ్వాస నిశ్వాసముల స్వరూపము. ఈ కారణమున "అః", "హ", యను నక్షరములు రెండును నీషద్భేదముతో 'అః' కార 'హ' కారములయొక్క పౌర్వాపర్య వ్యత్యయములతోఁ గల్గు శబ్దస్వరూపములైనను, 'అః' అచ్చుగాను, 'హ' హల్లుగాను నెంచఁదగినవి. "హరే + ఏ = హరయ్ + ఏ = హరయే; విష్ణో + ఏ = విష్ణవే; నై + అకః = నాయకః; పౌ + అకః = పావకః" ఇత్యాదులు. ఇందును కంఠతాలవ్యములగు 'ఏ ఐ' లకుఁ గంఠ్యమగు అకారపూర్వకమగు తాలవ్య యకారమును, కంఠోష్ఠ్యములగు 'ఓ, ఔ' లకుఁ గంఠ్యమగు అకారపూర్వకముగ దంతోష్ఠ్య 'వ' కారమును నాదేశములగును. ఇచ్చట యకారము తత్స్వస్థానీయమగు ఇకారమునకును వకారము తత్స్వస్థానీయమగు ఉకారమునకును దుల్యములై యున్నవి.

"వాంతో యి ప్రత్యయే" యకారాది ప్రత్యయములు పరమగునపుడు క్రమముగా 'వ' కారమునకు 'అవ్, ఆవ్' లను నవి యాదేశములగును. ఉదా. గో + య = గవ్ + య = గవ్యం" నౌ + య = నావ్ + య = నావ్యం ఇత్యాదులందును గానఁబడును. "అధ్వ పరిమాణేచ" మార్గముయొక్క పరిమితిని బోధించునట్టి 'గో' శబ్దమునకు 'యూతి' శబ్దము పరంబగునపుడు గవ్ + యూతిః = గవ్యూతిః అను రూప ముపపన్నమగుచున్నది. దీనిఁబట్టి ఓ ఔ లకు అవ్ ఆవ్ లాదేశములగుటయును గాన్పించుచున్నది. ఈ యాదేశములన్నియు నుచ్చారణసౌలభ్యమును బోధించుచున్నవి.

కాని ఆంధ్రమున సంధివిధాన మీషద్భేదముగా నైయున్నది.

శ్లో॥ ఆద్యంత వర్ణయోరైక్యం - సంధి రిత్యభిధీయతే బుధైః
పూర్వస్య పరరూపత్వం - అత్రైవ నియతం భవేత్ ॥

పూర్వ పరస్వరంబులకుఁ బరస్వరం బాదేశంబగుట యాంధ్రంబున సంధి యనబడుచున్నది. ఇందున బరరూపత్వమే సంధి యగును.

అట్లు సంధిలేనిచో స్వరమునకంటె బరంబయిన స్వరంబునకు యడాగమం బగునని చెప్పబడినది. ఉదా. మా + అమ్మ = మాయమ్మ. మీ + ఇల్లు = మీయిల్లు; ఏ + ఒడ్డు = ఏయొడ్డు; ఇత్యాదులు. ఇట్టి యడాగమమునకు బ్రయోజనము ఉచ్చారణసౌలభ్యమే కదా! అచ్చునకు బరమున నచ్చు నుచ్చరించుట క్లిష్టమగుటచే సంధిలేనియపుడు పరమగునచ్చును యకారముతో గలిపి పలుకుట బహిరాకాశమున నతిసులభమగుటచే నిట్లు విధింపబడినది. ఇట్టి యాగమ యకారము లఘు యకారమనియును, 'కాయ' 'చాయ' మొదలగు శబ్దములందలి నైసర్గిక యకార మలఘుయకారమనియు విభజింపబడినది.

శ్లో॥ లఘువోఽలఘువశ్చేతి ద్వేధాఽంతస్థా న్వదంతి శాస్త్రారః" అనియును శ్లో॥ యశ్శ్రుతిమార్యాలఘుయం ప్రవదంతి ప్రాణతః పరంప్రాణం" అనియును వాగనుశాసనునిచే జెప్పబడినది. "వ్యోర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య" అనియును, "లోశః" అనియును సంస్కృత ప్రాకృతములందు 'యవల' ల లఘ్వలఘు విభాగంబు కాన్పించుచున్నది. ఆంధ్రమునందు శకటరేఫముచే రేఫమునందును నీ విభాగమేర్పడినది. మెఱుఁగు, ఎఱుఁగు మొదలగు పదములలోని శకటరేఫం బలఘువనియును, పెరుఁగు, కరుఁగు మొదలగు పదము లందలి సాధురేఫము లఘువనియును నెంచఁబడుచున్నది. బహుత్వమున 'రలడ'ల కాదేశంబగు ళకార మలఘువనియును, 'తల, నెల,' మొదలగు పదములందలి లకారము లఘువనియును, పాదేశవకారము లఘువనియును, దక్కిన వకార మలఘువనియును విభజన చేయబడుచున్నవి.

సంస్కృతభాషయందు యణాదేశము "స్థానేఽంతరతమః" అను న్యాయము ననుసరించి కలుఁగుచుండఁగాఁ దెలుఁగున సంధిలేని యపుడెల్ల పరస్వరస్థానవివక్షతలేక సర్వదా యకార మేల విధింపఁబడవలసి యున్నవి? ఓష్ఠ్యంబగు ఉకారమునకు దంతోష్ఠ్యంబగు వకారముతో సన్నిహితత్వముండుటకై సంస్కృత సంధిసూత్రములవలన బోధ్యమగుచున్నది. కావున, బరస్వరము అకారము గాని ఇకారము గాని యైనపుడు యడాగమము కలుఁగుచున్నను, బరస్వరము ఉకారము గాని ఒకారము గాని యైనపుడు తత్సన్నిహితస్థానీయమగు వకార మాగమము కావలసియున్నది. అట్లు మా + ఊరు = మావూరు, మీ + ఓపిక = మీ వోపిక అను రూపములు సాధువులు కాఁదగియున్నవి. ఈరూపమే యుచ్చారణమున సౌకర్యమగుటచే గ్రామ్యభాషయందును దరుచుగా వుత్తరము, వూరు, వొడ్డు, వోర మొదలగు పదములను బల్కుటకును గారణమైయున్నది. అట్లే ఐన అ + ఇ + న = అయిన; ఔను = అ + ఉ + ను = అవును; అని యకారమువలె వకారముసహిత మాగమమై గాన్పించుచున్నది. ఇట్టిస్థానములందున నాగమ యకారమువలె నాగమ వకారమును సాధువుగా లఘువకారమని యెంచవలసి యున్నది. యతిప్రాసల నియమములందు లఘ్వలఘు యకారములవలె నీ లఘ్వలఘు వకారముల సహితము సమత్వము బాటింపవలసి యున్నది. ఆంధ్రమున బదాదియందున వువూ, వొవో లుండ వనెడు నియమ మీ సందర్భంబున నిరర్థకంబగు నని యెంచ బనిలేదు. పూర్వపు వ్యాకృతికి విరుద్ధముగానున్న గ్రామ్యపదముల నన్నింటితో నిపుడు గ్రంథరచనము జరుగుచుండగా 'వుత్తరము, వూగు' అను నీపదములు గ్రామ్యప్రవాహములో నున్నవాని సుష్ఠుతకై యింత వివరణంబేల యని తలపక, పూర్వపు గ్రాంధికభాషయందు సహిత మీపదములె సుష్ఠువులుగా గ్రహింపవలసియున్న దని విద్వాంసులు నిర్ణయింతురుగాక యని వేడుచున్నాను. ఇట్టి వకారాగమ ముచ్చారణమున నాంగ్లభాషయందును గానబడియెడు. ఉదా:—*Ideal* = ఐడియల్; *Aswage* = ఆస్వేజ్; *Boudoir* = బూడ్వార్; ఇత్యాదులు.

ఊష్మము లనఁబడు శ, ష, స, హ ల సంబంధ స్వరూపములఁ గొంత విచారింతము. "ఉష దాహే" ఊష్మాగమ స్తపః" ఊష్మాగమమే ఉష్ణము, తపము వనఁబడుచున్నది. హృదయమునందలి పరమేశ్వర తేజమే వైశ్వానరం బనఁబడుచున్నది. తత్తేజస్స్వరూపమై శబ్దము బహిర్గతమగుచుండుటచేత "వాక్తేజోమయీ" వాక్కు తేజస్స్వరూపమని యుపనిషత్ప్రమాణము కల్గినది. అట్టి యగ్ని అతి సూక్ష్మమగు తన్మాత్రాత్మకముగా స్వరరూపమున నుండి క్రమముగాఁ బరిణతిచే (*Vibrations*) ః, స, శ, ష, హ, అను భేదములఁ బొందుచున్నది. ఈ కారణమున శ, ష, స లకుఁ బూర్వమున నుండు విసర్గంబులు శ, ష, సలుగా మారుచు, మనస్ + శాంతి = మనః + శాంతి = మనశ్శాంతి, ఇత్యాదిపదములందును గాన్పించుచున్నవి. సుబంతముల ప్రత్యయంబులందు "స్, ఔ, జస్" అనునవియు నీ యర్థముఁ దెల్పుచున్నవి.

"స" కారము సర్వబీజాత్మకము. ఇది యగ్న్యాత్మక రేఫతుల్యము. ఇది యంతస్థోష్మములతోఁ దుల్యతేజముగా బరిణమింప సమర్థమైయున్నది. కార్యభారాదికముచే నలసియున్నపుడు విడచు నుచ్ఛ్వాసము 'అస్స' లేక 'ఉస్స' అని వినుచున్నాము. అకారముతో నారంభించి, స్ కారముతో నొక్కి యూదునప్పటికి హృదయమునుండి సర్వాక్షరముల నుచ్చరించునట్టి తేజస్సుయొక్క హరణమును దెల్పుచున్నది. 'అసురుసురు' లయ్యెనను వాడుక పదములందును, అస్స, ఉస్స, అను నక్షరములలో సకారముయొక్క ద్విత్వము రేఫాత్మకముగా గ్రహియింపఁబడి 'అసురులు + ఉసురులు' అని యర్థమగుచున్నది. 'అసురు'తో నారంభమై 'ఉసురు' లనఁగాఁ బ్రాణములన్నియు నలసినవని భావము. ఈ పదములలో 'ఇసురు'లను వాడుక లేదు. అచ్చులందున ఇకార మగ్నితత్త్వము. రజః ప్రధానమైనది. ప్రతిబంధ నివారణార్థము సామాన్యముగా 'ఇస్స' ఊరకుండుమని యాజ్ఞాపించుచున్నాము. అట్టి యధికారముగల యవసరమున 'ఇస్స' యొక్క ప్రయోగము సమంజసము. ఇకారము హ్రస్వత సాంద్రతనొంది ? వర్గతుల్యము (పృథివీతత్త్వము) నొందును. ఈకారము దైర్ఘ్యమున బలవత్తరమై అగ్న్యాత్మకమగు రేఫ (ర) తుల్యత నొందుచున్నది. అట్టి తేజంబు దైర్ఘ్యకాలముగా గ్రహియింపఁబడుచుండుటచే 'ర' అను నక్షరమునకుఁ బొట్టలో దీర్ఘమునీయగా 'ఈ'కార మేర్పడుచున్నది. శూన్యార్థమునన్న యనుస్వారము 'ం' సున్న యను పూర్ణాకృతిని

వగియున్నది. "అకుహ విసర్జనీయానాం కంఠః" అను పాణినీయ సూత్ర మీయర్థమును బోధించుచున్నది. సాధారణముగా మనకు 'ఆవలింత' కలుఁగునపుడెల్ల 'ఆవల' బహిరాకాశములోనున్న 'ఇంత' తేజంబును 'హ'కారాత్మకముగ హృదయములోనికిఁ గొని, యంతకుఁబూర్వము కొంచెము నిద్దురమత్తునకుఁ గారణమైయున్న తమస్సును హరియించుట యని యర్థము. మన మెప్పు డుద్దేశించిన నపుడే ఈ యావలింతను దెచ్చుకొని బహిస్తేజంబు నింతలోనికిఁగొని పుష్టింజెంది, లోనుండునట్టి దుర్వాయువును నిశ్శ్వాసాత్మకముగఁ బైటికి విడచివేయుట మంచి యభ్యాసము. ఈ కార్యమునందున నుచ్ఛ్వాస నిశ్శ్వాసముల దీర్ఘములుగా 'అః'కార 'హ'కారాత్మకముల దెలిసికొనుచున్నాము.

బహిరాకాశమున ననవరతము సూర్యనారాయణుని తేజః పుంజముచే వాయువు సముద్భూతమగుచున్నది. భూగోళమునం దర్ధభాగ మెల్లపుడును జీకటియందుండి, సూర్యుని సంచారకారణమున నెల్లపుడును నేదో యొక్క యర్ధభాగము సూర్యుని వెలుఁగులో నుండును. అట్లెల్లపుడు నొకచోట సూర్యోదయంబును మఱొకచోట సూర్యాస్తమయంబును నగుచుండును. సూర్యరశ్మియందుండు కాంత్యుష్ణములకు విపరీతధర్మములగు నంధకారశైత్యంబులు జలముయొక్క స్వభావములు. అట్టి స్వభావంబులుకల యంధకారము జలతత్త్వము. ఆ జలాత్మకమగు నంధకారమును స్వప్రభచే దపించుచున్న సమయమున, జలమును గాచునపు డావిరి కల్గునట్లు, వాయువు సర్వదా సముద్భూత మగుచుండును. తద్విపరీతముగాఁ బ్రతిక్షణమును సూర్యాస్తమయ మగుచుండు దేశమునందున నుష్ణహరణముచే నంధకారాత్మక జలము సముద్భూతమగుచుండును. ఇట్లు సర్వదా జలమునుండి యగ్నియు, యగ్నినుండి జలంబును సూర్యకాంతిచే గల్గుచు ప్రపంచమునందున నాకాశము వాయుపూరిత మగుచుండును. ఇట్టి కార్యమే ఆకాశముయొక్క శబ్దీకరణమనియు నర్థము. ఈ కారణమున "ఆపోమయః ప్రాణః" ప్రాణవాయువు జలాత్మకమని యుపనిషదర్థంబైయున్నది. హృదయమున జలాత్మకమగు ప్రాణవాయువు బహిరాకాశాత్మకమున 'హ'కారంబు. హృదయాకాశమునఁ జేరి 'అ'కారాత్మకమై యచ్చట పునస్తప్తమై 'అః' అను రూపమున బహిరాకాశము జేరుచున్నది. ఇట్లు 'అః' అను నచ్చునకు 'హ' యను హల్లునకునుగల భేదము తెలియఁదగియున్నది. దహరాకాశమున వాయ్వాత్మకమగు 'అః' కారము బహిరాకాశమునందు వాయ్వాత్మక జలంబగు 'హ'కారమగుచున్నది. లేదా, హృదయమున జలబీజ తుల్యంబగు 'హ'కారము బహిరాకాశమున 'అ'కారతుల్యంబైయుండును. ఇట్లు దహరాకాశ బహిరాకాశములచే వ్యష్టి సమిష్టి తేజః ప్రమాణంబులు తెలియుచున్నవి. అట్టి కారణమున "దైవభాష నదంతసాంతముల మీద నత్తు మొదలగు శబ్దము—లతుకువేళ నమరునోత్వమునకుఁ జెల్లు 'స, య, హ' "లిపు"లని అప్పకవీయమునందును విసర్గాత్మకమగు 'ఓ'కారమునకు 'అ'కారము పరంబగునపు డా 'ఓ'కారము సహితము "అయహా" లిపులతో యతిని జెల్లునని చెప్పఁబడినది. ఈ విసర్గములును 'అ, య, హా'త్మకములనియుఁ దీనివలనఁ దెలియఁదగియున్నది.

అకార మగ్నియుక్తంబై (తప్తంబై) "హ"కార మగుచున్నది. అది పునస్తప్తమైన నందుండి వాయుబీజంబగు 'య'కార ముపపన్నమైనది. వాయుబీజంబు 'య'కారము పునస్తప్తమై సాంద్రతనొంది రేఫంబైనది. అందు మరల నగ్నితేజంబు గలియ జలతత్త్వంబగు "వ"కారమయ్యె. "వ"కారము సాంద్రపరంబు కాఁగ బృథివీ బీజంబగు "ల"కారంబయ్యె. ఇట్లు పంచబీజోత్పత్తి కలిగె. అందునను అంతస్థము లనఁబడు "య, ర, ల, వ"లకు 'హ'కారమాది కారణమనియు దెలియఁదగియున్నది. ఇట్లు భిన్నప్రమాణంబగు తేజంబు హృదయమునుండి బహిర్గతముకాఁగా నా యంతస్థములగు నక్షరముల సముత్పత్తి కలిఁగినది. సృష్టి క్రమమునందున నాయుకాశమందలి వావునందున నగ్నిప్రయోగముచేఁ జల ముత్పన్నముకాఁగా దానిని గ్రహించుటకై పృథివియు నవసరంబయ్యె. అట్టి సమయమున నా జలం బెప్పటికప్పు డవసరమగునంత భాగమును భూగోళముయొక్క దక్షిణోత్తర కూర్మంబులుగా సృజియించి యందున జలమును నిర్మింపవలసివచ్చిన కారణమున నీ కార్యమునందున నగ్నిప్రయోగము (*Radiation*) ప్రధానమగుట చేతను భూబీజంబైన పిమ్మట జలబీజంబను క్రమమున నక్షరముల "య, ర, ల, వ" లని యక్షర సమామ్నాయమున నున్నను, వ్యవహారమున 'యరవాల'నియే భూతముల క్రమంబునఁ బల్కుచున్నాము. కాని వాని క్రమ సాదృశ్యాది విభాగముచేఁ 'హయవరట్, లణ్' అని పాణినీయ సూత్రములందున 'హ య వ ర ల'లను క్రమమున గ్రహింపబడినవి. ఇందును 'య వ' లకును 'ర ల'లకును వర్ణోత్పత్తి స్థానములందు సన్నిహితత్వము కాన్పించుచున్నది.

సంస్కృతమున "ఇకోయణచి" అను యణాదేశ సంధిసూత్రమును విచారింపఁగా ఇ, ఉ, ఋ, ఌ లను నచ్చులు క్రమముగా 'య వ ర ల' లను నంతస్థములుగాఁ బరిణామము నొందుచున్నది. దహరాకాశమున 'అ' కారము బహిరాకాశమున 'అః' లేక 'హ' కారముగాఁ బరిణమించుచున్నదని తెలిసికొంటిమి. కనుక నిందు 'అ, ఇ, ఉ, ఋ, ఌ' లు పరిణామమునఁ గ్రమముగా 'హ య వ ర ల' లుగాఁ గానఁబడును. గుణత్రయాత్మకములగు నచ్చులు సాంద్రత నొందుటవలన శబ్దాది తన్మాత్రాత్మకములు పృథివ్యాది భూతాత్మకములగు 'హ య వ ర ల' లుగా నగుచున్నవి. ఇందును 'అ, ఇ, ఉ, ఋ, ఌ' లు క్రమముగా నుత్తరోత్తరము బలవత్తరము లైనట్లుగా 'హ, య, వ, ర, ల' లును బలవత్తరము లగుచున్నవి. ఇందు 'య వ ర ల'లు హృదయాంతరస్థములగు హల్మాత్రలలో నతిసూక్ష్మములైనవనియు నర్థము. ఇవి తరుచుగా నన్యవ్యంజనములతోఁ గలిసిపోవుటయు దెలియఁగలదు. అందుచే "వ్యాళము, వక్రము, శ్లేష, స్వీయము" ఇత్యాదిపదములందున నీ యంతస్థములు ప్రత్యేక సంజ్ఞాంతరములుగ బూర్వాక్షరములతోఁ గలిపి వ్రాయ నేర్పడియున్నది.

ఈ 'హ య వ ర ల' లే క్రమముగా సాంద్రత నొంది 'క చ ట త ప' వర్గపంచకముల వర్ణములు నగుచున్నది. హల్లుల మాత్రాబలములకు గొల్చుటకు 'హ' కారము ప్రమాణముగా నెంచదగియున్నది. 'కచటతప' వర్గపంచకములు నుత్త

# వర్తక మహాశయులకు మా విజ్ఞప్తి

'Uma' Buttons - Button Chains. Collar Pins




"UMA" trade mark means Guaranteed 22ct. gold sheet covered jewels, which are durable and remain bright for several years.

Available from all fancy goods shops or direct from Uma Gold Covering Works.

Uma
FINE QUALITY JEWELLERY.
Since 1941

CATALOGUE FREE ON REQUEST
**UMA GOLD COVERING WORKS.**
MASULIPATAM INDIA.
Phone No. 120 Tel 'UMA'

మహాశయులారా!

మా ఉమా గోల్డు కవరింగు కర్మాగారములో తయారగు ప్రతి వస్తువు మన భారత పౌరుల కళా వైభవముతో తయారగుచున్న విషయము తమకందరకు తెలిసిన విషయమే. మా క్యాటలాగులో ప్రచురించిన వస్తువులు అన్నియు చేతిపనులవల్ల తయారు చేయబడినవి.

ఈ ఆధునిక కాలములో చేతి వృత్తులను ప్రోత్సహించవలసిన బాధ్యత ప్రభుత్వమునందును, వర్తకులైన మీయందును, ప్రజలయందును ఉన్నదని మనవిచేయుచున్నాను.

తమ విధేయుడు,
టి. వి. సుబ్బయ్య,
ప్రొప్రయిటర్.

# ఉమా గోల్డు కవరింగు వర్క్సు,

## ఉమా మహల్, మచిలీపట్టణం.

తంతి విలాసం "ఉమా" : : టెలిఫోన్ నెం. 120.

ఉమాగోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.

రో త్తరము బలవత్తరములు. ప్రతివర్గమునందును వర్ణపంచకము లొకొ దానికంటె నొకటి బలవత్తరములు. *Aspirate is the effect of hard-breathing upon a key sound* ఏ యక్షరమునైన నాది పలుకగా 'హ' కార మేర్పడునని ప్రాస్వలిపికర్తలలో ప్రసిద్ధుడగు Sir Issac Pitman వ్రాసెను. అట్లే ప్రతివర్గముయొక్క ప్రథమ తృతీయవర్ణములు హకార ప్రయుక్తములు కాగా ద్వితీయ చతుర్థవర్ణము లేర్పడుచున్నవి. ఇందు నచ్చునకంటె బరమైన యంతిమ 'హ' కారము విసర్గములేక అచ్చగుననియును, నచ్చునకు బూర్వమైన 'హ' కారము హల్లనియు దెలియఁనగి యున్నది. ఉదా:— సః; హంసః. ప్రతివర్గముయొక్క ప్రథమాక్షరము నందును హకారప్రమాణమగు బలంబు చేరిన క్రమక్రమముగా బలవత్తరములగుచు వర్గమునందలి వర్ణపంచకము నేర్పడుచున్నది. ఇట్లు "వర్ణస్స్వరః మాత్రా బలం" అను నిత్యాది శ్రుత్యర్థమును వివృతమగుచున్నది.

యణాదేశ సంధిసూత్రము ననుసరించి, 'ఇ, ఉ, ఋ ఌ' ల కచ్చు పరమగునపుడు క్రమక్రమముగా 'య, వ, ర, ల' లాదేశము లగును. ఉదా:- సుధీ + ఉపాస్యః = సుధ్యుపాస్యః; మధు + అరిః = మధ్వరిః; ధాతృ + అంశః = ధాత్రంశః; ఌ + ఆకృతిః = లాకృతిః. ఇత్యాదులు. ఇచ్చట స్థాన కృతాంతర్యము బలీయమగుటచే తాలవ్యమగు ఇకారస్థానమునఁ దాలవ్యమగు యకారమును, ఓష్ఠ్యమగు ఉకారస్థానమున దంతోష్ఠ్యంబగు వకారంబును, మూర్ధన్యమగు ఋకార స్థానంబున మూర్ధన్యంబగు రేఫంబును దంత్యమగు ఌకార స్థానమున దంత్యమగు లకారము నాదేశములగుచు దుల్యములగ వాడఁబడుచున్నవి.

“ఏ చోయవాయావః” అను సూత్రమున, ఏ ఓ ఐ ఔ లకు క్రమముగా అయ్, అవ్, ఆయ్, ఆవ్, లాదేశములగును. ఉదా. ఓం సర్వభాషాలిపులంగును గ్రహియింపబడుచున్నది. హృదయాంతరాళమున బూర్ణాకృతిని నిష్పంద్రితమై యుండు నప్పరమేశ్వర తేజంబుయొక్క స్వరూపమిది. ఇట్టి యాకృతిచే నంగు సంపూర్ణ తేజంబు నిబిడీకృతంబై యున్నదను పూర్ణోపనిషదర్థంబును బ్రతిపాదించుచున్నది. అంకములు సహితి మిందుండియారంభమైన కారణమున నంకెలందువలె నక్షరములందును సర్వత్ర శూన్యార్థమున ననుస్వారము వినియోగమున గానబడుచున్నది. బాహ్యావస్తు శూన్యతను మనము తెలంచుచోటులం దెల్ల పరమేశ్వర తేజంబు సంపూర్ణమై యున్నదనియె భావము. ఈ సున్నకు దలకట్టును గలుపగా ననగా నగ్నిజ్వాలసంధానముజేయగా నందున్న తేజముయొక్క కార్యకరణార్థము రజఃప్రధానంబగు రేఫంబును దెల్పును. ఈ రేఫం బగ్నిబీజంబు దీని దీర్ఘకాలప్రయోగమున ఈ కారస్వరూప తుల్యంబగును. ఇట్లక్షరముల యాకృతులు సహితము తత్తేజంబులతో దుల్యములుగా నేర్పరచబడియున్నది. అందు నచ్చులకంటె సూక్ష్మంబులును నంతకంటె నంతస్థములును నంతకంటె స్పర్శములును తేజంబున సాంద్రతరంబులై యున్నవి.

అచ్చులలో నాది యగు అకారము స్వరస్వరూపమున వ్యంజనములతో సముచ్ఛయమగునపుడు '✓' తలకట్టనబడుచున్నది. నాభిస్థానము కేంద్రముగా గల కుండలిన్యాఖ్యమగు వైశ్వానర తేజంబు చిత్తవృత్తి కారణంబున మూలాధారమునుండి షట్చక్రములందును బ్రసరించి శిరమునందలి సహస్రారమున బుంజీభవించుచుండును. అచ్చటనుండి శరీరముయొక్క వేర్వేరు స్థానముల నాడులందును బ్రసక్తమగుచుండును. ఆ తేజంబు శిరస్సునుండి శిరోజముల ద్వారమున విశేషముగా బహిర్గతమై వ్యయమగుచుండును. అట్టి యర్థంబకారముయొక్క స్వరరూపంబగు 'తలకట్టు' '✓'ను తెలుపును. అట్లు ప్రవృత్తమైన తేజంబును బహిర్గంతము కానీక శిఖను బంధించి ముడివేయఁగా ఇకారముయొక్క గుడి 'ి' యేర్పడుచున్నది. ఇట్లు శిఖను ముడివేయఁగా శిరంబునుండి శుక్లతేజంబు (*Human magnetism*) బహిర్గతమ్ముగాక పునరంతర్ముఖముగ గృహీతంబై శరీరముయొక్క సర్వావయవములకు నుద్దీపనంబును గలుఁగ జేయును. శిఖను బంధింపక విడిచివేసినయెడల త్రుప్పుడువలె రోమంబు బిరుసెక్కి మెదడులోని శక్తిని దినివేయుచుండును. అగ్నిదేవుని వాహనంబగు గొఱ్ఱెకు బొచ్చుపెంపు గట్టియై రోమంబు బిరుసెక్కుట కిదియే కారణము "స్యాత్రిక్కత్వం కేశలోమాస్థ్న్యః" కేశలోమములు శరీరమున నస్థిధాతుపరిణామ సమయమున వెలువడు మలము. ఆ యస్థిధాతువే విశేషప్రమాణమున శరీర తేజంబుచే బరిణామమును బొందుచుండిన బొచ్చుపెంపునందు లోమంబును బిరుసెక్కును. తలబిరుసువాని పొగరుబోతుతనము జుట్టు కొనలనుండి బైటకు విశదమగునను మాటల కిదియే యర్థము. అట్టి కారణమున శిరోజములు వ్రేలాడుచు శిఖను బంధింపకున్నను ఈ యస్థిధాతు పరిణామము విశేషమగును. తత్కారణమునఁ దదనంతర ధాతువగు శుక్రధాతువు సంపూర్ణ ప్రమాణంబున గలుఁగ నేరదు. ఈ శుక్రధాతు పరిణామమే మనస్సగుటచే, బుద్ధిమాంద్యము నకుఁ గారణమై, రజః ప్రధానంబుగా (*Calcium*) గల్గియుండుట సహజము. అందుచేతనే గొఱ్ఱెకు బొచ్చుపెంపు గట్టిదై బుద్ధిహీనతను బ్రకటించుచుండును. గొఱ్ఱె మాంసమును దినినను రజోధిక్యతచే దత్తుల్యమగు నహంకారాదులు గల్గుననుట శాస్త్రనిహితమై యున్నది.

ఆంధ్ర లిప్యక్షరము లిట్లు స్వరూపమునను దదుక్తములగు శబ్దఫలసిద్ధి ప్రదాయకములు. ఇట్టి యక్షరములతో మంత్రశాస్త్రప్రోక్తమగు యంత్రాది రచనములును పూర్ణఫలప్రదంబులగుచున్నవి. ఇది లిపియొక్క ముఖ్యప్రయోజనము. ఈ యర్థంబున దేవనాగరి లిప్యక్షరములు బిందు త్రికోణ షట్కోణాది స్వరూప విభాగములచే సంపూర్ణ ఫలప్రదంబులగును. తదనంతరమునఁ దెలుఁగు లిపియే ప్రయోజనకారియని చెప్పవలసియున్నది. అటుపిమ్మట నన్యములగు లౌకిక వ్యవహారములకై లిపికి నుండవలసిన సులక్షణను లెట్లు తెలుఁగు లిపియందు నైసర్గికములై కాన్పించుచున్నవియు మద్విరచిత 'సంక్షిప్త లేఖన' విధానమునందున విశదీకరించితిని.

స్వరములన్నిటిలో 'అ' కార మతిసూక్ష్మమైనది. అది శబ్దతన్మాత్రాత్మక మనదగును. తత్కారణమున వ్యంజనముల సామాన్యమున దెలుపవలసి వచ్చినపుడెల్ల వానిని అకార ప్రయుక్తములుగా క, ఖ, గ, ఘ అని పలుకుచున్నాము. ఇట్లుచ్చారణము

వందును నతిలాఘవంబు కలుగ నల్పతమంబైన తేజంబు వ్యయ మగుచున్నది. "ఏకమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః" శబ్దోచ్చారణవిధానమున నొక్క మాత్రప్రమాణము లాఘవమైనను పుత్రోత్సవముగా వైయాకరణులు తలంచుచున్నారు. ఇట్లకార స్వరప్రయుక్తమైనపుడును హల్లు తేజంబును బైటికి నుచ్చరించుచున్నాము. అకారస్వరము నొక్క దానిని ప్రత్యేకముగా నుచ్చరించినను తత్తేజంబు బహిర్గత మగుచున్నది. కాని బహిరాకాశమున దానిపరిణామము 'అః' అనువరకు నగునని తెలిసికొంటిమి. తత్కారణమున సంస్కృతభాషయందును బ్రథమైక వచనాంతశబ్దము విసర్గాంతమున గాన్పించును. దేవనాగరిలిపియందు సహితము అకారము अ అను స్వరూపమున విసర్గరూపము నపేక్షించునట్లుగా బోధించుచున్నది. అంతియగాక తెలుగునందును అకారస్వరూపముజూడ గుడియెడమల నాళముల నెటులైన నీస్వర ముచ్చరింపదగినదనునట్లుగా దలకట్టుయొక్క గిన్నెవంటి వక్రాకృతిని రెండువైపుల ననుస్వారముల ప్రయుక్తమైనట్లుగా నేర్పరచబడినది. ఇట్టి యనుస్వార స్వరూపమును వివరించుచున్నాను. అకార స్వరప్రయుక్తమై బహిరుచ్చరితమగు నక్షరముయొక్క శబ్దాత్మక తేజమును మరల హృదయాంతరాళమునకుఁ గొంపోవలయునన్న దానికి ననుస్వారము ననుసంధానము చేయవలసియున్నది. ఇట్లు ప్రథమైక వచనాంతమున విసర్గాత్మకముగా దేజంబు బహిర్గతముకాఁగా ద్వితీయైక వచనాంతముగ ననుస్వారముతో మరల తేజంబు హృదయాంతరాళమునకుఁ గొంపోబడుచున్నది. మకారాత్మకమగు ననుస్వారము నుచ్చరించునపుడెల్ల, పెదవులు మూసి వాయువును లోనికిఁ గొంపోవుట తెలిసికొనఁగలము. మంత్రానుష్ఠాన విధానముల న్యాసములందే గాక అం, ఆం, ఇం, ఈం, అని స్వరములను, కం, ఖం, గం, ఘం, అని వ్యంజనములను ననుస్వార ప్రయుక్తముల జేసి యీ వర్ణమాలతో మంత్ర జప సంఖ్యాగణనమునందును బ్రవృత్తి విశదమైయున్నది. అంతియగాక, ఏ వర్ణమైన ననుస్వారపూర్వకమైనపుడు దద్వర్ణతేజంబు నర్ధభాగంబు హృదయములోనికిఁ గొంపోవుచు దద్వగ్గోక్తమగు ననునాసికా వర్ణశబ్దము నొసంగుచున్నది. ఇట్లే వర్ణంబైన విసర్గాంతమైన బహిరుచ్చరితంబనియు ననుస్వారాంతమైనపుడు తద్గృహీత మగుచున్నదనియును దెలియఁదగియున్నది.

'అః' అను నక్షరము బహిర్గతంబును, 'అం' అను నక్షర మంతర్గృహీతంబును నగుచున్నది. ఇట్లు బహిర్గతంబైన 'అః'కార తేజంబును 'అం'కారముచే లోనికి గొంపోవఁగా "అః+అం= అహ్+అం=అహం" అను శబ్ద ముపపన్నమైనది. ఇట్లాత్మార్థంబున నేర్పడిన 'అహం' అను శబ్దము 'మమ'కారమును దెల్పునదగుటచే 'నేను' అను నర్థముకలదై యొప్పుచున్నది. అస్మచ్ఛబ్దమిట్లు మకారాంతమై ప్రథమైక వచనంబునఁ గానంబడుటకుఁ గారణ మిదియేగాని వేరుకాదు. ఈ యనుస్వారము 'మ'కారముయొక్క రూపాంతరమగుటచేత దాని ద్విరుక్తిచే "మమ"కారంబు కల్గుచున్నదనియు చెప్పవచ్చును. ఇట్లహంకారమెల్ల మమకార స్వరూపమై సర్వాత్మకార్థమును దెల్పుచు సర్వార్థమును స్వార్థముగ బ్రతిభాసింపఁజేయుచున్నది.

సర్వాత్మకత నొందించు సూక్ష్మంబైన 'స'కారము ఉచ్ఛ్వాసమున సర్వతేజస్సముచ్చయార్థముఁ దెలుపుటచేత నీ 'స'కారము పరమేశ్వరార్థముఁ దెలుపును. ఇట్లు పరమేశ్వరుని హృదయసంస్థితి దెలుపుచు 'అకార విసర్గంబులఁ' గూడిన సకారము "సః" యను రూపముఁ బొందఁగా సర్వవ్యాపియైయుండి తచ్ఛబ్దార్థ వాచ్యుఁడగు పరమేశ్వరుఁడని యర్థమగుచున్నది. "అహం" అను శబ్దముతో "సః" అను తచ్ఛబ్దముఁ గలిపి పలుకఁగా నిందలి విసర్గాంతమైన యంతస్తేజమే,యంతస్తేజంబగు దత్పరమేశ్వరైక్యార్థంబున సర్వాత్మకతను దెల్పుచున్నది. అట్లు సర్వవ్యాపియైయున్న తత్పరమేశ్వరైక్యార్థమున నేను భాసించుచున్నాఁడనని యర్థము. "అహంసః" అను నుచ్చారణమునందున అకార మారంభమున నుండి శరీరమునందలి సర్వతేజంబులకు నాదియై యతి సూక్ష్మమైయున్నది. "సయ ఏషోఽంతర్హృదయ ఆకాశః - తస్మిన్నయం పురుషో మనోమయః" అంతర్హృదయాకాశమునందునున్న అమృతుఁడును, హిరణ్మయుండునునగు మనోమయ పురుషుని స్వరూపముఁ దెల్పుచున్నది. "అకారశ్శంకరః ప్రోక్తః" అకారము శంకరస్వరూపమని చెప్పఁబడుచున్నది. ఇట్టి అకారము విసర్గాంతముగా పరిణామము నొంది అచ్చులు పరంబగునపుడు లుప్తమయి కాన్పించుచుండును. అట్లే బహిరాకాశగతంబగు 'హ' కార తేజంబునఁ బరఁగుచున్న పరమేశ్వరాంశము తత్పదార్థ బోధ్యుఁడగు పరమేశ్వరుఁడని తెల్పుచు, "హంసః" అను శబ్ద ముపపన్నమైనది. బహిరాకాశమున సూర్యమండల మధ్యవర్తియైయున్న తత్పరమేశ్వరుఁడు "హంస" యనఁబడుచున్నాఁడు. అట్టి పరమేశ్వరుని యంశంబై హృదమునందలి దహరాకాశమున నున్న పరమేశ్వరుఁడు సహితము "హంస" యను నామంబున నొప్పుచున్నాడు. "హగ్ంస శ్శుచిషత్" ఇత్యాది శ్రుతివచనములు నీ యర్థమును వివరించుచున్నవి.

నాభిస్థానము కేంద్రముగా గల్గి కుండలిన్యాఖ్యమగు నగ్నితేజము శరీరమున సర్వావయవములందును వ్యాపించుచుండును. అందున శ్వాసోచ్ఛ్వాసములు ఇడా పింగళలనబడు నాళముల ద్వారమున జరుగుచుండును. ఇవి కుడి యెడమలయందుండి సూర్యచంద్రనాడులన నొప్పుచున్నవి. ప్రతిజీవుని యదృష్టమునను సరించి యీ వాయుసంచారము దినమునందున నొకప్పుడు ఇడాద్వారమున బూరకమును, పింగళాద్వారమున రేచకంబును జరుగుచుండును. మఱొక్కపుడు పింగళద్వారమున బూరకంబును, ఇడద్వారమున రేచకంబును జరుగుచుండును. మనము పరిశీలించిన నే సమయమున నే నాళమున నేది జరుగుచున్నదియు దెలిసికొనగలము. యోగియీ యుభయనాళముల బంధించి నాసాగ్రమున దృష్టినిలిపి నీ యుభయనాళముల నేకీభవింపజేసి మధ్యయందున సుషుమ్నానాళమున దేజంబును సర్వేంద్రియముల వ్యాపింపజేయ గల్గుచున్నాడు. ఇట్టి యోగసిద్ధిసామాన్యజనమునకు సులభముగా లభింపకున్నను కొలది యభ్యాసముచే నేసమయమున నేనాళమున నెట్లు శ్వాసోచ్ఛ్వాసముల జరుపదలంచిన నాసయమున నట్లు చేయ

గలము. ఇందులకై అజపా గాయత్రీ మంత్రసంధాన ముపదేశింప బడుచున్నది.

శ్లో॥ శశాంకం చాలయేద్రాత్రౌ -
దివాసూర్యం ప్రచాలయేత్ ॥

రాత్రియందున సామాన్యముగాఁ జంద్రనాడితో నుచ్ఛ్వాసమును సూర్యనాడితో శ్వాసమును జరుపవలయును. తద్వ్యతిరిక్తముగా దివాకాలమునందున సూర్యనాడిచే నుచ్ఛ్వాసమును, జంద్రనాడితో నిశ్శ్వాసమును జేయవలయును. రాత్రిందివములకుఁ జంద్రసూర్యు లధిపతులగుటచే నిట్లు చంద్రసూర్యనాళముల చారంబులు సమర్థంబులగునని యర్థము. ఇంతియకాక, యేకార్యాచరణ సమయమునందున నే నాళమున సంచార మెట్టి ఫలదాయకమో తెలిసికొని సర్వదా సత్ఫలప్రదంబగు విధమున నీ నాడీసంచారమును సమర్థింపవలసియున్నది. ఈ విషయమై రుద్రయామళము, గర్గ ప్రశ్న, పంచపక్షి, కేరళీయ ప్రశ్న, వరాహ బృహత్సంహిత మొదలగు గ్రంథములందున వివరింపఁబడియున్నది.

హంసచారమును స్వేష్టఫలాభిసంధికై యనురూపమున గల్గుఁజేయుటకై యజపా గాయత్రీ మంత్రమనుసంధానము చేయవలసియున్నది. ఇట్టి 'హంస' మంత్ర జపంబుచే శరీరమునందలి సర్వపాపంబులు హరియించి, మనంబు సర్వదా పరమేశ్వర తేజస్సంస్మరణమున నుండుటచే మోక్షప్రాప్తికి సులభమార్గంబగుచున్నది. "హంసః"యనుశబ్దమును వ్యుత్క్రమముగా "సోఽహం" అనియును గలిపి పలుకగా "హంసస్సోహం" అనియగును. ఈపదముల మరల వ్యుత్క్రమమున జేర్పగా "సోహం - హంసః" అని యగును. ఈ యుభయార్థములను జేర్చి "హంస స్సోహం - సోహం హంసః" అని పలుకగా నష్టాక్షరముల మంత్ర ముపపన్నమైనది. ఈ యష్టాక్షరముల మంత్రమును గలిపి యొక్కసారి యుచ్చరింపగా మధ్యాంత్య సంధికాలముల విరామములతో గలిసి దశ గుర్వక్షరముల నుచ్చరించు కాల మగుచున్నది. ఇది స్వస్థసుఖాసీనుని శ్వాసోచ్ఛ్వాసాంతరితకాలమగుచు "ప్రాణం" బని వ్యవహరింపబడుచున్నది. ఈ మంత్రోచ్చారణమును సరిగా నభ్యసించి పరిశీలించినయెడల నేసమయమున నిడనుండి పింగళకుగాని, యేసమయమున పింగళినుండి ఇడకుగాని తేజస్సంచారము మారుచున్నదో తెలిసికొని బహుసులభముగా నాడీసంచారమును స్వేష్టఫలాభిసంధికై కూర్చుకొనగల్గుచున్నాము.

శ్లో॥ దశగుర్వక్షరః ప్రాణః షడ్భిః ప్రాణైర్వినాడికా ।
తత్ షష్ట్యా నాడికాః ప్రోక్తా నాడీ షష్ట్యాఽహోరాత్రకం దినం॥

దశగుర్వక్షరోచ్చారణ కాలము ప్రాణ మనబడును. అట్టి ప్రాణము లారైన అనగా నరువది గుర్వక్షరములకాలమైన వినాడిక యగును. అరువది వినాడిక లొక నాడిక యనగా నిరువదినాల్గునిమిషములు. అరువదినాడిక లొక నాక్షత్రదినము లేక ఇరువదినాల్గుగంటల కాలమగును. ఇట్లు సిద్ధాంతములందున గాలమానము వివరింపబడినది. కావున, ...దినమునకిట్టి ప్రాణాత్మకమగు హంసలు ౨౧,౬౦౦ (౬ × ౬౦ × ౬౦) చరించుచుండును. దినప్రమాణమగు ౨౪ ఘంటలు ౬౦ ఘటికలగుటచే ఘంటకు ౨½ ఘటికలు. నిమిషమునకు ౨½ విఘటికలు. సెకనునకు ౨½ గుర్వక్షరముల కాలమునగును. నాల్గుసెకనులొక్క ప్రాణము లేక హంసచారకాల మగుటచే "హంస-స్సోహం -సోహం-హంసః" అనుటలో నొక్కొక్క పాదకాల మొక్కొక్క సెకనుగా స్థూలమున గ్రహియింపవచ్చును. ప్రాణవాయువు జలస్వరూపమని వెనుకఁ దెలిసికొంటిమి. కావునఁ కాలాప్సు నివిశంతే-ఆపస్సూర్యే ప్రతిష్ఠితాః॥ కాలము లుదకములందుండును. ఉదకములు సూర్యునందునఁ బ్రతిష్ఠితములైయున్నవను శ్రుత్యర్థ ముపపన్నమైనది. ఇట్లు సమస్తకాల స్వరూపంబగు ప్రాణవాయువు కాలాత్మకుఁడును కాల కారణుఁడునగు సూర్యనారాయణుని యధీనమైయున్నది. అట్టి కాలస్వరూపమైన శ్రీ పరమేశ్వర తేజంబును సర్వదా హంసమంత్ర జపంబుచే శుద్ధ సత్త్వాకృతిఁ జేసికొని బ్రహ్మైక్యానుసంధానము నొందుటయే ముక్తి యనంబడును




SRI AMBAL & CO
No1
POST BOX No3 MADRAS
SRI AMBAL SNUFF
REGISTERED
TRADE MARK
ஸ்ரீ அம்பாள் மூக்குத்தூள்

ఏకాంక నాటిక :

# జూదం కాని జూదం

శ్రీ పుట్రేవు సత్యనారాయణమూర్తి

[స్థలం:— రంగారావు ఇల్లు. వీధి గదిలో రంగారావు చేతులువున్న పడకకుర్చీలో కూర్చుని ఎదుట ఒక బల్ల వేసుకుని, దానిమీద ఒక పజిలు కాగితం పెట్టుకుని చేతితో కలం పట్టుకుని పజిలు కాగితంవైపు చూస్తూ ఆలోచిస్తూ వుంటాడు. వాని వయస్సు 30 సంవత్సరాలు. ప్రక్కను నేలమీద రెండు పెద్ద డిక్షనరీలు పడివుంటాయి. వీధి గదిలోనుండి లోపలి గదిలోనికి దారి ఉంటుంది. ఆ గుమ్మందగ్గర రంగారావు భార్య కాంతమ్మ నిలబడి వుంటుంది. వయస్సు 24 సంవత్సరాలు.]

కాలం:— ఉదయం 8 గంటలు.

కాంతమ్మ: ఏమండీ! కుర్రాడికి రెండు లాగుగుడ్డలుకుట్టించి పడెయ్యండీ అని ఎన్నిమార్లు చెప్పినా వినిపించుకోరేమండీ.

రంగారావు: (వినిపించుకోకుండా పజిలు కాగితం వంక తలకాయి వంచుకుని చూస్తూవుంటాడు.)

కాం : సంసారం అంటే యింత నిర్లక్ష్యం అయిపోతే యింకెలాగ చావడం! రామిగాడు బరికి వెళ్ళనుగాక వెళ్లనని భీష్మించుకు కూర్చున్నాడు.

రం: (బుర్రవంచుకునే ఆలోచిస్తూ వుంటాడు.)

కాం : మిమ్మల్నేనండి! (చికాకుగా) మాట్లాడేవాళ్లు మనుషులనుకున్నారో, మానులనుకున్నారో! అడిగిందానికి అతీ లేదు గతీలేదు. కుర్రవెధవలు చూస్తే మధ్య నన్ను కాల్చుకు తింటారు. ఆ యేడిచే ఏడుపేదో యిక్కడికొచ్చి ఏడవరాదూ!

రం: (తలకాయ మీదికెత్తి) అబ్బ! ఎప్పుడు చూసినా యిదే న్యూసెన్సు! నీ యేడుపు చాలక, వాళ్ళనికూడా వచ్చి ఏడవమంటున్నావూ? 'శ్రేయాంసి బహు విఘ్నాని' అన్నట్టు, నేను ఏ మంచికార్యం తలపెట్టినా, సమయానికల్లా నువ్వు శకున పక్షిలాగ వచ్చి సోది వెళ్లబుచ్చుతుంటావు. వేరే ఏ అడవిలోకేనాపోతే బాగుండుననిపిస్తోంది.

కాం: నిజమే. అనిపించదామరి! నేను ఈ నోరు విప్పితేనే మీకంతా గోలగా వుంటుంది. ఏంజేద్దాం మరి! హోటల్లో భోంచేసి మఠంలో నిద్రిస్తూవుంటే హాయిగా వుంటుంది మీకు. పెళ్ళాం పిల్లలూ అంటే మీకు పెద్ద నరకంలాగ వుంది. అయితే మటుకు యిప్పుడు యీ పెళ్ళాం, పిల్లలూ ఎక్కడికి పోతారు? కాళ్ళకు సంకెళ్ళయి తగులుకు కూర్చున్నారు. పాపం మీకు స్వేచ్ఛలేకుండా పోతోంది!

రం: అనవసరపు పురాణాలన్నీ యిప్పుడిక్కడ ఏకరు పెట్టక, అసలు విషయం ఏమిటో ముక్తసరిగా మూడుమాటల్లో చెప్పు బ్రతుకుతాను.

కాం: అబ్బ! నానోటి మాట అంటే ఎంత చేదయిపోయింది!

రం: అదేనా, నువ్వు చెప్పదల్చుకున్నది? ఇంకా ఏమైనా వుందా?

కాం: ఇంతసేపాయీ చెబుతున్నదేమిటి? కుర్రవెధకి రెండు లాగులు కుట్టించమని మొర పెడుతూంటేను. వాడికి బొత్తిగా లాగు గుడ్డలు చిరిగిపోయేయి. ఉన్న రెండు లాగులూ వెనక ప్రక్క పూర్తిగా పీకిపోయేయి. (వెనకకు తిరిగి) రామిగా, యిలా రా!

[రామంగాడు పరుగెత్తుకుని వస్తాడు 8 ఏళ్లు వయస్సు].

కాం: ఏదీ, నీలాగు నాన్నగారికి చూపించు. వెధవ్వి! నన్ను కాల్చుకు తినకపోతే నాన్నగారితో చెప్పకూడదూ లాగులు కుట్టించాలనీ.

రామం: కొత్తలాగులు కుట్టిస్తేనేగాని, నేను అసలు బరికే వెళ్ళను. బళ్లో కుర్రాళ్ళంతా నా చింకిలాగు చూసి 'పోస్టాఫీసు' పోస్టాఫీసు; ఉత్తరాలు పడెయ్యండి' అంటూ కాగితం ముక్కలూ, గులకరాళ్లూ తెచ్చి వెనకనుంచి లాగులో పడవేస్తున్నారు. అంతా, నన్నూ, నాలాగునీ చూసి వేళాకోళం చేస్తున్నారు నాన్నా! ఈవాళ ఎలాగైనా కొత్తలాగు కుట్టించకపోతే, నేను బరికి వెళ్ళేది లేదునాన్నా.

రం: (కొంచం నవ్వుకుని) ఓహో! అయితే పోస్టాఫీసు మన యింట్లోనే వుందన్నమాట. అయితే వుండు నావికూడా రెండు ఉత్తరాలు ఉన్నాయి పడేస్తాను.

రామం: ఏమిటి నాన్నా! నీ వేళాకోళాలూ నువ్వున్నూ! లాగులు కుట్టించమని ఎన్నిమార్లు చెప్పినా కుట్టించవుగాని, పరాకాలు ఆడుతావు. నేనసలు బరికే వెళ్ళను చూసుకో.

కాం: బాగుందండీ! మీ సంగతి! బళ్లో గుంటలు ఉడికిస్తున్నారనే ఆ వెధవ ఏడుస్తుంటే మీరు వాడిని మరింత ఏడిపించడానికి చూస్తున్నారు.

రం: కాకపోతే మరేమిటే నీ వేషం! లాగు చిరుగు పట్టీ సరికల్లా కొత్తలాగులు ఎక్కడినుండి ఊడిపడతాయనుకున్నావు? ఇంతసేపు కొడుకు తరపున వకాల్తా చెయ్యకపోతే, సూదీ దారం

పట్టుకుని ఆ చిరుగు కాస్తా కుట్టేసి పెట్టలేకపోయినావ్? అందుకు వొళ్లువొంగదు మళ్ళీని, పంతులుగారికి. అయిందానికీ కానిదానికీ కొల్చుకు తింటూవుంటే ఎంతకని చస్తాను. అనీ సరికల్లా డబ్బు ఎక్కడినుండి ఊడిపడితుంది? పెరట్లో చెట్టుగాని ఉందను కున్నారా? కావలసినప్పుడల్లా దులుపుతూ వుండడానికి?

కాం: ఇప్పటి కప్పుడే అరడజను మార్లు కుట్టడం, పీకి పోవడం జరిగింది. ఎప్పుడు కుట్టించిన గుడ్డలు? ఎన్నాళ్ళని ఉంటాయి? ఈ లాగులు కుట్టించి రెండేళ్ళు కావస్తోంది. మరీ ఈ మధ్య అదేమిటోగాని, మరీ పిసండం పడుతున్నారు. జీతం హెచ్చైన కొద్దీ మీకు పిసినారి గొట్టుతనం మరీ లావైపోతోంది. ఇంట్లోకి ఏది కొనమన్నా, డబ్బు లేదంటూ వుంటారు. లేకపోతే, తెచ్చిన జీతమంతా ఏమైపోతూన్నట్టు? కూతురు పెళ్ళికిగాని కూడబెడుతున్నా రేమిటి?

రం: ఔనౌను. ఇంట్లోకి ఏం కొంటున్నాను గనక? ఏమీ కొనకుండానే కాలక్షేపం చేసుకొస్తున్నావు పాపం! యిల్లాలువి ఎలాగైతే నేం. కాఫీగింజలు—నువ్వు పెరట్లో చెట్లునాటి, రోజూ నీళ్లుపోసి పండిస్తున్నావాయను. పంచదార గాలికి కొట్టు కొచ్చి పడుతున్నాదాయను. రైతులు ధాన్యాలు బళ్ళతో తెచ్చి అంబారాలు కొలుస్తున్నారాయను. ఇంక ఎంతొచ్చీ నా నెల జీతం అంతా కిళ్లీలకూ, సిగరెట్లకూ, సినీమాలకీ అయిపోతోంది. ఇలాంటి దుబారా మనిషి దొరికేడు నీకు పాపం! ఏం చేద్దాం? నువ్వుగనక యిన్ని బాధలు భరించుకుంటూ వస్తున్నావు.

కాం: ఇందాకా, నేను పురాణం విప్పుతున్నానన్నారు గాని, యిప్పుడు మీరు భారతం అంతా ఏకరు పెడుతున్నారు. పిల్లడికి ఒక లాగుగుడ్డ కుట్టించమని అడిగితే అక్కరమాలిన కబుర్లన్నీ ఎందుకు చెప్పండీ ఆలాపించటం?

రం: మాట్లాడకపోతే మా చికాకు! అడిగిందానికి సమాధానం చెబితే ఆగ్రహం. ఇక నీతో ఎలాగ వేగడమో తెలీకుండావుంది.

కాం: ఏంజేస్తారు పాపం! నాలాంటి తెలివితక్కువ మొద్దుని కట్టుకున్నాక అనుభవించక తప్పుతుందా ఏమిటి?

రం: సరేలే, యీ రోకళ్ళపాట కట్టిపెట్టుగానీ, ఈవాళ కాఫీ ఎందుచేతా, అదోలాగ వుంది? చల్లగా చల్లారిపోవడంచేత కబోసు. అసలు ఈవాళ కాఫీ త్రాగినట్లే లేదు. కొంచం వేడి కాఫీ ఒక అరకప్పు కలుపుకు రద్దూ.

కాం: పంచదార లేందే ఎలాగ కలపడం?

రం: అదిగో! ఏదైనా అడగభయం. అదిలేదు, ఇదిలేదు, ఆఖరికి యింట్లో ఏమీలేదని ప్రారంభిస్తావు. పంచదార మొన్ననే కదూ, వీశడు తెచ్చిపడేసేను? అప్పుడే ఎలాగ అయిపోయిందీ?

కాం: ఎలాగైపోయిందా! నేను బొక్కేసేను. నాకు మరి ఆత్మే కోపం తెప్పించకండి, నాకు అసలే మాటలు తిన్నగారావు.

రం: నీకు నిజంగా మనిషికుండవలసిన కోపం అంతా వుందే.

కాం: లేకపోతే ఏమిటి మీ మాటలూ మీరూనూ? క్రిందటి పున్నానికి వీసెడు పంచదార తెచ్చేరు ఎలాగైతే నేం. నిన్న అమావాస్యవెళ్ళి యీవాళ పాడ్యమి వచ్చింది. ఎన్నాళ్లయిందో లెక్కకట్టండి. మీకు మొన్న తెచ్చినట్టుగా అనిపిస్తోంది. మూడు రోజులబట్టి యింట్లో పంచదార లేదు.

రం: అంటే తైగబారెడు కోపంగానీ, మూడురోజులబట్టి పంచదార అయిపోతే యింతవరకూ ఎందుకు చెప్పేవుకావే?

కాం: చెప్పకపోవడమేమిటి? ఈ మూడు రోజుల్లోనూ ముప్పై ఫుంజీల మార్లైనా చెప్పివుంటాను. మీరు వినిపించుకోక పోతే నేనేం చస్తానేమిటి?

రం: అంత పనిమాత్రం చెయ్యకు వారం వర్జం, మంచీ చెడ్డా చూసుకోకుండా. నేనేదో పరధ్యాన్నంగా వుండి వినకపోతే మరో మారు చెప్పకూడదూ? ఇంతట్లోకే నీ ఘరానాకి లోటు వచ్చే స్తుంది కాబోసు. అయితే మరి ఈవాళ కాఫీ ఎలాగ పెట్టేవు?

కాం: ఎలాగ పెట్టేను? బెల్లంవేసి పెట్టేను.

రం: అలాగ చెప్పు! ఏమిట్రా, కాఫీ యిలాగ వికారంగా వుందీ అని అనుకుంటూనే వున్నాను. అయితే, నా ఖర్మంగాలి, ఇంత బతుకూ బతికి యింటి వెనకాల చచ్చేడన్నట్టు యింత డబ్బూ తెస్తూ, యింత ఉద్యోగంచేస్తూ, బెల్లపునీళ్ళు తాగవలసి వచ్చిం దన్నమాట!

కాం: మీ కాఫీలో ఏం బెల్లం వెయ్యలేదు.

రం: మరి?

కాం: కొంచం పంచదార వేరే, అట్టేపెట్టి, మీ మట్టుకు కాఫీలో వేసి, నేనూ పిల్లలూ బెల్లంవేసుకు తాగుతున్నాం.

రంగా: మీరుమాత్రం బెల్లం ఎందుకు వేసుకోవాలీ అంటాను? పంచదార దొరకనిరోజులు గనకనా? ఏదో తప్పనిసరి అనుకోడానికి?

కాం: దొరికే రోజులైతే నేం, దొరకని రోజులైతే నేం, మీరు తెచ్చి పడెయ్యక పోయేక?

రంగా: నిజం చెప్పాలంటే అది నా లోటుకాదు. మగ వాళ్లకి ఏవో అనేక పనితొందర్లు ఉంటూవుంటాయి. అస్తమానూ పంచదార సంగతే జ్ఞాపకం ఉంటుందా? ఏదో నేను పర ధ్యాన్నంగా వున్నప్పుడు ఏ మూలనుంచో నువ్వు 'పంచదార అయిపోయిందని' నోట్లోనోట్లో గుసగుసలాడుకుని, మనపని అయి పోయిందని ఊరుకోవడమున్నూ, పదిమార్లు చెప్పినా తెచ్చేరు కారని పై వాళ్లమీద అక్షింతలు జల్లడమున్నూ. ఇదే ఆడవాళ్ళ చమత్కారం అంటే. అయితే రాగా బోగా ప్రస్తుతం కాఫీ నీళ్ల మాట ఏమిటంటావు? ఇప్పుడు ఘాటుగా ఆలోచించవలసిన మేటరు ఎంతైనా వుంది. నాటుగా కాఫీనీళ్ళు కడుపులో పడితే నే గాని ఆలోచనలు తట్టవు. పంచదార అంత బొత్తిగా అయిపో యిందిటే?

కాం: ఏదో, డబ్బా దులిపి చూస్తానుండండి. ఇప్పటిమట్టుకు సరిపోతుందేమో.

రం: మెనీ మెనీ థ్యాంక్సు. ఇల్లాలంటే అలాగ వుండాలి. నిజంగా, నీ చేతిమహాత్యం ఏమిటోగాని, నువ్వు ముట్టుకునీ పరి

కల్లా కాళీ డబ్బాలుకూడా అక్షయం ఔతూవుంటాయి. ఇప్పటికి కూడా పరిపోయినంత వుండగానే, నాలుగు రోజులబట్టి అయిపోయింది అయిపోయిందని గోల పెడుతున్నావన్నమాట. దీనినిబట్టి చూస్తే, ఇంకా నాలుగైదు రోజులవరకూ కథ నడిచిపోవచ్చునన్న మాట. ఇప్పుడే బజారుకుపోవాలో ఏమిటో అని బెంగపెట్టుకున్నాను. ఐనా నువ్వు ముందుగుండా చెప్పడం మంచిదేలే. ఇంగ్లీషులో 'ఫోర్ వారన్డ్ ఈజ్ ఫోర్ ఆరమ్డు. (*Fore-warned is forearmed*) అని సామెత వుందిలే. దేనికేనా మూడురోజులు ముందుగానే మేలుకోవడం చాలా మంచిది.

కాం: మీ రెంతసేపూ ఎగొస్తే ఎగువుమాట, దిగొస్తే దిగువమాటా ఆడుతూ వుంటారు. మీకు నచ్చచెప్పి మిమ్మల్ని నమ్మించడం బ్రహ్మతరంగాదు. ఆ డబ్బా ఏదో తెచ్చి మీ ముందే దులిపేస్తా నుండండి. ఆ అనుమానం కాస్తా తీరిపోతుంది.

రంగా: ఓస్సి! ఏదో సరదాకి అలాగ అన్నానుగాని, నీమాటేమిటి, నేను నమ్మకపోవడమేమిటి? సరేగాని, ఇదిగో చూడు, రెండునిముషాల్లో ఒక్క అరకప్పు వేడి కాఫీ తాగిస్తివా, నీ కెంతైనా పుణ్యం వుంటుంది. ఇక్కడున్నట్టుగా రావాలి సుమీ.

కాం: మరి రామిగాడికి యీవాళైనా రెండు లాగులు కుట్టిస్తేగాని వీల్లేదు సుమండీ!

రామా: నాకు యిప్పుడే లాగులు కుట్టించు నాన్నా. రా, బజారుకి రా. (చెయ్యిపట్టుకు లాగుతాడు.)

[కాంతమ్మ యింట్లోకి వెళుతుంది]

రం: తల్చినప్పుడే తాతకి పెళ్ళి అన్నట్టుందిరా అబ్బీ, నీ సంగతి. రేపో ఎల్లుండో కుట్టిస్తానులే. ఈవాళకి బళ్లోకి పో.

రామా: (కోపంతో) (తను తొడుకున్న లాగు వెనక ప్రక్కనున్న చిరుగు తండ్రికి చూపిస్తూ) ఈ చింకిలాగుతో బరికి ఎలా వెళ్లమన్నావు నాన్నా? అంతా నవ్వుతుం టేనూ?

రంగా: వెనకప్రక్కని చిరుగువుంటే నీకేం పోయిందిరా? నువ్వు ముందు వెళ్ళిపోతూవుంటే వెనక వాళ్ళుగదా నవ్వుకుంటారు. నువ్వు వెనక్కి తిరిగి చూడేవద్దు. ఇంక వాళ్లు నిన్నేం జేస్తారు?

రామా: బళ్లో కుర్రాళ్ళంతా ఉడికిస్తారు నాన్నా.

రంగా: నువ్వు ఎందుకు ఉడుక్కోవాలీ?

రామా: చింకి లాగు తొడుక్కుంటే సిగ్గెయ్యదుట! నాన్నా! మరీ చెబుతావు!

రంగా: (నవ్వుకుని) సరేలే, సాయంత్రం నిన్ను బజారుకి తీసుకువెళ్లి కుట్టిస్తానులే. ఈపూటకి ఎలాగో వెళ్ళు:

రామా: తప్పకుండా కుట్టించాలిగదా మరి. ఎప్పుడూ, కుట్టిస్తాను కుట్టిస్తాను అంటావుగాని, ఎప్పుడూ కుట్టించవు.

[అనుకుంటూ లోపలికి వెళ్ళిపోతాడు]

[పన్నెండేళ్ల కూతురు సావిత్రి ప్రవేశిస్తుంది]

సావిత్రి: ఈవాళ జీతం కట్టకపోతే పేరుతీసేస్తారుట నాన్నా.

రం: ఈవాళ ఎన్నో తారీకమ్మా!

సా: ముప్ఫయ్యో తారీకు నాన్నా?

రం: అయితే రేపు ముప్పైఒకటన్నమాట. రేపు సాయంత్రం వరకూ పేరు తీసీడానికి వీల్లేదే? ఎవళ్ళా నీతో చెప్పినవాళ్లు.

సా: ఈనెల ముప్ఫైరోజులే నాన్నా. రేపు ఫష్టుతారీకు.

రం: ఓహో! అలాగా! అయితే ఇన్నాళ్ళబట్టి ఏంజేస్తున్నావ్.

సా: పదిహేనో తారీకున అడిగితే, ఇప్పుడు డబ్బులేదు, ఫైన్‌తో కట్టవచ్చునులే అని చెప్పేవు.

రం: అప్పుడు అలాగ చెప్పేననుకో, అందుకని, ఇప్పటిదాకా చల్లగా ఊరుకుని, యిప్పటికిప్పుడు నా నెత్తిమీద కూర్చుని యిస్తావా చస్తావా అంటే ఎక్కడినుంచి తెస్తాను? ఇన్నాళ్ళబట్టీ ఎందుకు జ్ఞాపకంజేసేవుగావు?

సా: అస్తమానమూ అడిగితే మీకుకోపం వస్తుందనిఅడగలేదు

రం: సరేలే. పేరు తీసేస్తే మరేం ఫరవాలేదు. రేపో ఎల్లుండో జీతం అందేక కట్టవచ్చునులే. వచ్చే నెలదగ్గిరనుంచి, నాకు జీతం అందగానే, నీ స్కూలుజీతం ఏదో అడిగి పుచ్చుకుని నీ దగ్గిరే దాచుకో. మధ్యమధ్యను అడిగితే నాదగ్గిర డబ్బుండదు.

సావిత్రి: క్రిందటినెల అలాగ చెప్పే ఐదురూపాయలు యిచ్చేరు. మళ్ళీ పదో తారీకుని ఏదో పజిలుకి కట్టాలి, అని ఆ రూపాయిలు పుచ్చేసుకున్నారు. నెలాఖరుని అమ్మ ఎవళ్లదగ్గిరో అప్పుతెచ్చి యిస్తే కట్టేను.

రం: సరే, అయిపోయిన సంగతంతా యిప్పుడెందుకులే వెళ్లు.

[సావిత్రి మొఖం ముడుచుకుని వెళ్లిపోతుంది.]

(కాంతమ్మ ఓ చేత్తో కాఫీ గళాసూ, ఓ చేత్తో పంచదార డబ్బా పట్టుకుని ప్రవేశిస్తుంది. కాఫీ గ్లాసు భర్తముందు పెట్టి నేలమీద చతికిలబడుతుంది. పంచదార డబ్బా మూతతీసి భర్తకు చూపించి):

కాం: యిదుగో చూసుకోండి మీ అనుమానం తీరిపోతుంది.

రం: (కాఫీ కొంచెం కొంచం త్రాగుతూ) నాకు డబ్బా చూపిస్తేనేగాని, నీమాట నమ్మనని, నామీద నీకు ఎందుకంత అనుమానం చెప్పూ! పంచదార అయిపోయిందని చెబితే చాలదూ! డబ్బా తెచ్చి నా నెత్తిమీద బోర్లించాలా!

కాం: చాల్లెద్దురూ మీ కబుర్లూ, మీరూనూ! చెప్పినమాట కొట్టిపారేస్తే నమ్మినట్టా! నమ్మనట్టా, అనుకోవడం? మీతోటి ఆఁ అంటే అపరాధం, ఊఁ అంటే ఉపరాధం. మధ్యని నేను నలిగి చస్తున్నాను.

రం: సరదాకి అన్నమాట సరదాగా తీసుకోవాలిగాని, దానికి అంత రాద్ధాంత సిద్ధాంతం చెయ్యకూడదు.

కాం: ఆమాట అందరికీ వుండాలి.

రం: లేదని నువ్వెందుకనుకోవాలి? అయితే, రాగా బోగా మధ్యనాళకు పంచదార లేక తప్పదని నిర్ధారణ చేసేవన్నమాట. లేక, మధ్యనాళకుకూడా గట్టెక్కే అవకాశం ఏదైనావుందా? అంటే నా ఉద్దేశం, కోపగించకు, అడుగుతున్నానంతే. దేముడికి నైవేద్యం పెట్టడానికి వేరే డబ్బాతో కొంచెం పంచదార అట్టే బెడతావేమో! మధ్యనాళమట్టుకు దేవుడి దగ్గర ఒక గరిటెడు పంచదార అప్పు తేవడానికి వీలవదా అని. మళ్ళీ రేపు కొనుక్కోగానే అప్పు తీర్చేద్దాం. అవకాశం వుంటేనే సుమీ. మాటవరసకి అన్నాను.

కాం: దేముడికి రెండునెలలబట్టీ బెల్లం ముక్కే నైవేద్యం పెడుతున్నాను.

రం: ఆ! నిజమే? దేముడికే పంచదార లేకుండా జేసేమూ! (లెంపలు వాయించుకుని) పాపోహం, పాపకర్మాహం! పాపాత్మా, పాపసంభవః పాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల" అపరాధం క్షమించు తండ్రీ.

కాంత: మీదొంగ ప్రార్థనలు దేముడికి తెలీకపోవు, దేముడితోటి వేళాకోళావేమిటి? తిన్నగా ఊరుకోండి.

రంగా: మరి నీతో ఏమైనా అంటే నీకు ఊరంత కోపం వస్తుందాయె. ఏమి చెయ్యడం?

కాంత: సరేగాని కాఫీ ఎలాగవుంది చెబుదురూ?

రంగా: సింప్లీ ఎక్సలెంట్. అంటే చాలా బాగుందన్నమాట. అదేమిటోగాని, నువ్వు ఘుమఘుమలాడుతూ చేసిన కాఫీ ఘుమఘుమలాడుతూ వుంటుంది. అది నీకోపం తాలూకు ఫ్లేవరు, అయి వుంటుంది!

కాంతమ్మ: నాకోపం ఫ్లేవరూ కాదు, మీతాపం ఫ్లేవరూ కాదు, బెల్లంపాటి వారిఅమ్మాయి ఫ్లేవరు.

రంగా: (ఆశ్చర్యంగా) అదేమిటి? చాలా హేమీజింగుగా మాట్లాడుతున్నావే?

కాంతమ్మ: హేమేజింగూలేదు, గీమేమేజింగూలేదు, నిజానికి మొన్నటినుంచీ ఇంట్లో పంచదారవాసనే లేదు. అందరికీ బెల్లం వేసే కాఫీ చేస్తున్నాను.

రంగా: ఆ! ఏమిటీ!

కాంతమ్మ: ఏమిటేమిటి? మీకు కోపం ముక్కునివుంటుంది గదా అని తెలిసే, అలాగ అబద్ధమాడేను.

రంగా: అయితే నాతో పరాసికాల్లోకి దిగేవన్నమాట! మంచీచెడ్డా లేకుండా!

కాంతమ్మ: సరదాకి అన్నమాటలుకి అంతరాద్ధాంతసిద్ధాంతం చెయ్యాలా! అని యిప్పుడేగా, మీరు అడిగేరు? ఆమాట మీ విషయంలో వర్తించదుకబోసు?

రం: (సర్దుకుని, స్తిమితపడి) నువ్వు నిజంగా కాఫీలో పంచదారే వేసివుంటావు నాకు తెలుసులే. లేకపోతే యింత రుచి దానికి ఎక్కడినుంచి వస్తుంది? సరే, ఆవిషయం వదిలిపెట్టేగాని, నిన్నో ప్రశ్న వేస్తాను జాగ్రత్తగా ఆలోచించి, నీ కామన్‌సెన్సు అంతా వినియోగించి సమాధానం చెబుతావూ!

కాం: నా మొఖం! నేను మీకు సమాధానం చెప్పడంఏమిటి? ఎవళ్ళైనా నవ్వి పోతారు.

రం: అలాగనకు. ఈ సమస్య ముఖ్యంగా ఆడవాళ్ళకి బాగా తెలుస్తుంది. చదువుతాను జాగ్రత్తగా విను. (పజిలు కాగితంతీసి చదువుతాడు.) డాష్ (—) ఇది గృహోపకరణములలో మిక్కిలి అవసరమైనది. 1. చెంబు, 2. తప్పేలా. ఈ రెండింటిల్లో ఏది ఎక్కువ రీజన్‌బుల్‌గా వుంటుందో బాగా ఆలోచించి చెప్పు.

కాం: రీజనబిల్లి అంటే ఏమిటి?

రం: (చచ్చేం!) అంటే, గృహోపకరణముల్లో చెంబు ఎక్కువ అవసరమైనదా, తప్పేలా ఎక్కువ అవసరమైనదా?

కాం: మంచి ప్రశ్నలాగే వుంది? ఏది ఎక్కువ అవసరం ఏమిటి! రెండూ అవసరమే.

రం: ఓస్సి! ఎంత తేలికగా చెప్పేసేవే! ఈపాటి సంగతి నాకు తెలియకనే, నిన్నడిగేననుకున్నావేమిటి? ఇంత తేలికగా చెప్పగలిగే జవాబైతే దీనికి వేలకు వేలు బహుమతీ ఎవడిస్తాడు?

కాం: ఎవడు అంత, వేలకు వేలు బహుమానాలివ్వడానికి కూర్చున్నవాడు? వాళ్ళకి డబ్బు పులిసిపోయివుంది కబోసును.

రం: నీదంతా వట్టి అమాయికపు మాలోకం. నిజంగా, నీకు పజిలు సంగతి బోధపరిచినా బోధపడదు.

కాం: అయితే ఆపాటి దానికి నన్నెందుకు అడగడం? ఊరుకున్నదాన్ని ఊరుకోనివ్వక రెచ్చకొడతారు. ఏమైనా అంటే వేళాకోళం చేస్తారు.

రం: ఛాఛా, అదికాదు. నిన్ను వేళాకోళం చెయ్యడానికి అడగలేదు. నాకు అనుమానం కలిగే అడిగేను. చూసేవా? ఇదో పజిలు. దీనిని పూర్తిగా రైటురాసి పంపిస్తే ఎనభైవేల రూపాయిలు ప్రైజు వచ్చిపడుతుంది.

కాం: అమ్మయ్యో! ఎనభైవేలే? చెంబు, తప్పేలా అని రాసినందుకు ఎనభైవేలు రూపాయిలు బహుమానమా? అలాగైతే అందరికీ వచ్చేస్తుంది బహుమానం.

రం: అదే పొరపాటు. ఇది నువ్వు అనుకున్నంత తేలికకాదు కాని, అట్టే అంత కష్టంకూడా కాదు. జాగ్రత్తగా ఆలోచించి వేస్తే, అటుపైని అదృష్టం కలిసివస్తే, ఎనభైవేలు బహుమానం తప్పకుండా వస్తుంది. అయితే, పురుషప్రయత్నం లేందే అదృష్టం ఎలాగకలిసిస్తుంది? ధైర్యే, సాహసే, లక్ష్మీః అన్నారు పెద్దలు. ముందు మనం మన డబ్బు కాదనుకుని కొంత పెట్టుబడి పెడుతూ వుండాలి. కానీ ఖర్చుపెట్టకుండా, వేలకువేలు డబ్బు రావాలంటే ఎలా గొస్తుందనుకున్నావే?

కాం: ఇప్పుడు నేను వేలకువేలు డబ్బురాలేదని బెంగ పెట్టుకు కూర్చున్నానా ఏమిటి?

**ఎగుమతిదార్లు:** **దిగుమతిదార్లు:**

షిప్పింగ్, క్లియరింగ్, ఫర్వార్డింగ్ పనులు
శీఘ్రముగను, సమర్ధముగను జరుపుటకు
మమ్ము సంప్రదించండి:

# డి. యస్. నారాయణ & కంపెనీ

(స్థాపితము: 1923)

స్టీమర్ ఏజంట్లు & బోట్ల యజమాన్లు

## హెడ్డాఫీసు: కాకినాడ

ఫోన్: 45 ★ తంతి: "Shipping"

## బ్రాంచీలు:

| బెజవాడ | గుంటూరు | మద్రాసు | విశాఖపట్నం |
|---|---|---|---|
| ఫోన్: 46 | ఫోన్ 235 | ఫోన్: 3191 | ఫోన్: 171 |
| తంతి. "*Suraj*" | తంతి: "*Shipping*" | తంతి: "*Shippingco*" | తంతి: "*Shipping*" |

**దిగువ కంపెనీలకు స్టీమర్ ఏజంట్లు:**

1. ది భారత్ లైన్ లిమిటెడ్
2. శ్రీ అంబికా స్టీం నావిగేషన్ కంపెనీ లిమిటెడ్
3. ఈస్టు అండ్ వెస్టు స్టీం షిప్ కంపెనీ లిమిటెడ్
4. ది సోవియట్ స్టీం షిప్పు
5. ది ఛాంద్ బాలీ స్టీమర్ సర్వీస్ కంపెనీ లిమిటెడ్
6. ది నేషనల్ స్టీం షిప్ కంపెనీ లిమిటెడ్
7. ఆంధ్ర స్టీం షిప్ కంపెనీ
8. ది అశోకా లైన్సు లిమిటెడ్

**దిగువ కంపెనీలకు ఏజంట్లు:**

1. శ్రీ భజరంగ్ జ్యూట్ మిల్సు లిమిటెడ్
2. శ్రీ హనుమాన్ సుగర్ మిల్సు లిమిటెడ్
3. ది ఇండియన్ గ్లోబ్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్

రం: అదికాదు. డబ్బు వచ్చి అవకాశాలు ఉన్నప్పుడు ఎందుకు పోగొట్టుకోవాలి మనం?

కాం: అయితే మీరేమైనా డబ్బు ఖర్చు పెడుతున్నారా దీనికి?

రం: అదోకబురా? ఖర్చు పెట్టడమే కాదు. వేలసంఖ్యమీద బహుమానం పొంది తీరుతాను ఎప్పటికైనా. మనకి బహుమానం రాగానే, ఏది ఎలాగఉన్నా, ముందు మనం ఒక రేడియో కొనుక్కోవాలి. ఇద్దరం కూర్చుని కమ్మని పాటలు, తాజా వార్తలూ వింటూవుండాలి. ఒకవేళ నేను రేడియో కొంటే, యీ గదిలో వీమూల పెడితే బాగుంటుందంటావు? దానికోసం ఒక చక్కని కొత్తటేబిలు చేయిస్తాను. నేను రేడియో కొనేలోపుని అది ఎక్కడవుంచితే బాగుంటుందో ఆలోచించి సిద్ధంగావుండు. మరొక్క సంగతి. మనం రేడియో యిన్‌స్టాల్ చేసినప్పుడు మా స్నేహితులకు చిన్న టీపార్టీ ఏర్పాటు చెయ్యవలిసి వుంటుందేమో కూడాను. వాళ్లు డిన్నరుపార్టీ యిమ్మని కూర్చుంటారో ఏమిటో? సరేలే, అప్పటికొద్దీ ఎలా వీలైతే అలాగ చేసుకోవచ్చు.

కాం: బహుమానాలు యిచ్చేవాడికి అంత డబ్బు ఎక్కడిది?

రం: ఎక్కడి దేమిటి? నాలాంటివాళ్లు లక్షలుకొద్దీమంది పజిల్సుకి డబ్బు కడతారు. ఆ డబ్బంతా కూడబెట్టి బహుమతి వచ్చినవాళ్లకి యిస్తాడు.

కాం: అంతమంది కట్టినప్పుడు ఆ బహుమానం మీకే వస్తుందన్న మాటేమిటి? అందరూ మీలాగే అనుకుంటూ వుంటారు.

రం: అయితేమట్టుకు? అందరికీ పజిలుని నింపే తెలివితేటలూ, కామన్‌సెన్సూ ఉండవద్దా, అపైని అదృష్టం కలిసిరావొద్దా!

కాం: అంతా మీలాగే, తెలివైనవాళ్లం అనీ, మనకి అదృష్టం బాగుంటుందనీ, ఆ డబ్బు మనకే తప్పకుండా వస్తుందనీ అనుకుంటూ వుంటారు.

రం: అనుకున్నంత మాత్రానికి ఐపోతాలేమిటి? కష్టపడి ఆలోచించి, కడుతూవుండాలి. కట్టింది పోతోందని అధైర్యపడకూడదు. నేను చూడూ, సంవత్సరంబట్టి కట్టుకొస్తున్నాను. ప్రతీమాటూ, వీసం అంతలో వీగిపోవడంచేత బహుమానం తప్పిపోతోంది. ఎలాగైనా కొద్దికాలంలో వేల బహుమానం రాక తప్పదనుకో.

కాం: ఆ బహుమానం అందరికీ అలాగే కనబడుతూ, ఆశపెడుతూ వుంటుంది. కాని, రావడం మాత్రం ఉండదు.

రం: ఓసి వెర్రిమొఘమూ, యిటు చూడే. (పజిలు కాగితం మీదనున్న ఫోటోలూ, పేర్లూ చూపిస్తూ) చూసేవా, ఈ ఆసామీకి నాలాగ రెండు చెవులూ, రెండు కళ్ళూ ఉన్నవాడేనా, యితగాడికి ఏమైనా కొమ్ములు వచ్చేయా! చూడు ఇతనికి యాభైవేలు బహుమానం వచ్చింది. వీడికి వచ్చినప్పుడు నాకుమాత్రం ఎందుకు రాదూ? అని అడుగుతున్నాను.

కాం: బహుమానం పొందిన యీ ఒక్కడినీ చూడకపోతే, పోయినవాళ్లు లక్షల కొద్దీ వుంటారుగదా, వాళ్లని ఎందుకు తల్చుకోరు?

రం: పోయినవాళ్లు మళ్ళీ కట్టుకుంటారు? నేనేం జేస్తున్నాను? అలాగే వాళ్ళూను.

కాం: ఇలాగ ఎన్నిమార్లు కట్టాలి?

రం: ఎన్నిమార్లేనా కట్టవచ్చు. ఎంత డబ్బేనా కట్టవచ్చు.

కాం: బహుమానం రాకపోతే మీరు కట్టిండబ్బు మళ్లీ మీకు యిచ్చేస్తాడా?

రం: ఏం గసుడుసుదానివి బయలుదేరేవే? ఎవళ్ళ డబ్బు వాళ్లకి తిరిగి యిచ్చేస్తే, బహుమానం వచ్చినవాడికి వేలకు వేలు ఎక్కడినుంచి తెచ్చియిస్తాడనుకున్నావ్.

కాం: మీరు యిప్పటికి ఏపాటి డబ్బు కట్టివుంటారు?

రం: ఎంతో ఎక్కడికట్టేను మూడు వందలో నాలుగు వందలో కట్టివుంటాను. అయితేనేంగాక, ఒక్క బహుమానం వచ్చిందిరా అంటే యింతకాలం పెట్టుబడి పెట్టినడబ్బు అంతా ఒక్కమాటే కొట్టుకొస్తుంది,

కాం: మీరు యిలాగ ఖర్చుపెట్టేడబ్బు నాదగ్గిర దాచుకుని వుంటే యీపాటికి మూడు నాలుగువందలు నిలవ వుండేదిగదా?

రం: మనదగ్గిరుంటే ఖర్చే అయిపోయేది. ఒకవేళ అడబ్బే నీదగ్గిర దాచేననుకో. ఆ మూడు నాలుగువందలూ అలాగే వుండిపోతాయికాని, అవి వుండి లాభమేమిటి? ఈ పజిల్సుకి కట్టేనా? మనకు బహుమతిరాలేక పోబట్టికాని, ఒకవేళ వచ్చేవుంటే యీపాటికి మనవద్ద వేలసంఖ్యలో డబ్బు ఉండిఉండేదేనా?

(చాకలి ప్రవేశం. వీధిలో నిలబడి అరుస్తాడు)

చా: అయ్యగారండీ!

రం: (కాంతమ్మతో చేత్తో సంజ్ఞ చేస్తాడు ఎవరు అన్నట్టుగా)

కాం: చాకలివాడులాగుంది. వాడికి మూడురేవులు నిండిపోగా, పైని మళ్ళీ రెండురేవులైంది. జీతంకోసం రాజావచ్చి నన్ను పీకేస్తున్నాడు.

రం: మెల్లిగా మాట్లాడమంటే! కిటికీ దగ్గిర నిలబడి, నేను యింట్లోలేనని చెప్పి.

కాం: అది నావల్లగాదు సుమండీ. ఆమాట ఏదో మీరే చెప్పరాదూ.

రం: ఆ మాట నే నెలాగ చెబుతాను?

కాం: నేనుమాత్రం ఎలాగ చెబుతాను?

చాకలి: (బయటనుండి) బాబుగారండీ.

రం: (భార్యావైపు చూస్తూ) మెల్లిగా. ఏం చేతగాదు శుద్ధ బుద్ధావతారం. (వీధి తలుపుతీసి) ఏంరా?

చా: జీతం కోసం బాబూ, రోజూ తిరగలేక చస్తున్నాను.

రం: రేపు యింకా ఫస్టుతారీకు గదా, యీవాళ అప్పుడే డబ్బు ఎక్కడినుండి వస్తుందనుకున్నావురా? రేపో ఎల్లుండో కనబడు.

చా: కిందటినెల జీతంకూడా యివ్వనేదు బాబు.

రం: మరి యిప్పుడు నీకు యివ్వవలిసింది అదేగా? తరవాత మళ్ళీ యింకా మూడో రేవు అవందే జీతం ఎలాగొస్తుంది? మూడో రేవు కూడా అవనీ, రెండు నెలల జీతం ఒక్కమారే పట్టుకుపో వచ్చును.

చా: బొగ్గులు కొనుక్కోవాలి. అందాకా ఒక రూపాయేనా వుంటే దయిచేయించండి బాబూ.

రం: వుంటే దాచుకుంటానురా, నీ వెర్రిగాని. నెలాఖరు సమయం. చేతిలో కానీకూడా వుండదు తెలుసా. మరి యింక నువ్వువెళ్లు.

[చాకలి గొణుకుంటూ వెళ్ళిపోతాడు.]

కాం: మీదగ్గిర ఏం మాటాడకుండా వెళ్లిపోయేడా? ఆనక మళ్లీ వచ్చి ఊరంత అల్లరిచేస్తాడు.

రం: సమాధానం చెప్పిపంపించే తెలివితేటలు ఆడవాళ్లకి లేక పోతే మరేం జేస్తారు? వాళ్లమీద చెర్రు బుస్సుమంటే వూరుకుంటారనుకున్నావేమిటి?

కాం: నెల అవగానే వాడి డబ్బు వాడికి పారేస్తే, వాడి దగ్గిర అంత బాబూ నాయినా అని బతిమాలడం ఎందుకొస్తుంది?

రం: ఓహో! ఏం దర్జా! నువ్వు నిజంగా ఏ జమీందారు గారో పెళ్ళాడి ఉండవలిసింది.

కాం: మీరూ జమీందారుగారు కావడానికి సిద్ధంగానే వున్నారుగా! ఇంక నాకు లోటేమిటి?

రం: సరేగాని, చూడూ, నువ్వు యీవాళ నాకో చిన్న సాయం చేసిపెట్టాలి.

కాం: నేనంటే మీకు మరీ వేళాకోళం ఎక్కువైపోన్నాదండీ.

రం: నీమీద కాకపోతే, మరెవరిమీద వేళాకోళం ఎక్కువౌతుంది? సరేగాని, యిలా చూడు, నీకు ఎల్లుండి జీతం అందగానే యిచ్చేస్తాను. ఒక్క ఐదురూపాయిలువుంటే సర్దుబాటు చేద్దూ.

కాం: బాగానేవుంది వరస. నాదగ్గిర ఐదురూపాయిలు వుంటే యింక కావలిసిందేమిటి? చేతులో అణాడబ్బులు పెట్టిన పాపాన్ని పోరుగాని, మీకు ఐదు రూపాయిలు నేను బదులివ్వాలి. చాలా బాగుంది లెండి.

రం: పోనీ ఐతే పొరుగింటి మీస్నేహితురాలిని అడిగి చూద్దూ, ఎంతైనా పుణ్యం వుంటుండి. ఎల్లుండి మళ్ళీ యిచ్చేదాం.

కాం: ఇంక అదొక్కటే తక్కువొచ్చింది నాబ్రతుక్కి. వూళ్ళోకి ముష్టికికూడా బయలుదేరమంటున్నారు. చాలు చాలు ఊరుకోండి యీపాటికి. ఎవరైనా వింటే నవ్విపోతారు.

రం: ఓస్సి! ఇంతలోకే, నవ్విపోవడం? ఏం అంత తప్పు పనిచేసేమని? ఆపాటి అవసరానికి పనికిరాకపోతే మని యిరుగూ పొరుగూ అనుకోవడం ఎందుకూ?

కాం: ఇందుకే నేమిటి? ఇరుగూపొరుగూ వాళ్ళకి మీరు ఏపాటి సాయం చేస్తున్నారు చెబుదురూ?

రం: పోనీలేగాని, నీకు పుణ్యం వుంటుంది. గట్టిగా కేకలు వెయ్యకు ఊరుకో, నేరక పోయి అడిగేను.

కాం:ఎందుకంత? అప్పుడేమైనా పజిలుకి కట్టకపోతే నేముండి?

రం: నీ ఫాటి బుద్ధిలేక. నాదగ్గిర పాతికరూపాయలు వున్నాయి. పరధ్యాన్నంగా పజిలు నింపితే ఎక్కువగళ్ళు నిండిపోయేయి. మరో ఐదు రూపాయిలు వుంటేనేగాని యీపజిలు పంపించటానికి వీల్లేదు:

కాం: మీదగ్గిర పాతిక రూపాయిలు పెట్టుకునే యిన్ని వేషాలు పడుతున్నారూ?

రం: ఈపజిలు కట్టడానికి యీవాళే అఖరు రోజు.

కాం: ఈవాళ యీపజిలు కట్టకపోతే యిప్పుడేం కొంప మునిగిపోయిందండీ. ఇదివరకెన్నో మార్లు కడితేరానిది, యీమారు ఆబహుమానంవచ్చి వొళ్ళోపడిపోతుందని ఏమిటి నిశ్చయం!

రం: నువ్వు శకునపక్షివని మొదటే చెప్పేనుగా! నేను అసలు యీసంగతి నీతో చెప్పడమే పొరపాటు. సాగదీసి సాగదీసి అడుగుతున్నావు. రేపు ప్రొద్దుట ఏదైనా బహుమానంవస్తే, యీ కబుర్లన్నీ మాయమైపోతాయి. నాకు వడ్డాణం చేయించండీ అంటే, చంద్రహారాలు చేయించండీ అంటూ కౌగలించుకుంటావు. ఆడవాళ్ళ స్వభావం అంతల్లో వుందన్న మాట. అందుకే - షేక్స్పియర్, 'ఫ్రెయిల్టి! దై నేం ఈజ్ వుమన్. (*Fraility! thy mame is womau!*) అన్నాడు. ఎంత అనుభవంమీద చెప్పేడో మహానుభావుడు!

కాం: ఎప్పుడో రాబోతుందన్న డబ్బుతో నాకు వడ్డాణాలూ చంద్రహారాలూ చేయించడంకోసం ప్రస్తుతం కుర్రవెధవకి లాగుగుడ్డ ఐనా కుట్టించకుండా, పిల్లకి బడికి జీతమైనా కట్టకుండా, పైపెచ్చు నన్ను ఊళ్ళోకి అప్పుకి బయలుదేరమంటున్నారు. మీలాంటి ఆయనే, ఒకాయన, ఊళ్ళో పెళ్ళి వారు భోజనానికి పిలవకపోతారా అని, సాయంత్రందాకా, పొయిలో నిప్పువెయ్యనిచ్చేడు కాడుట. పిల్లలు ఆకలితో ఏడుస్తూవుంటే, పెళ్ళివారింటికి వెళ్ళి బూరెలు తిందాంరా అని ఓదార్చేడుట. అలావుంది మీసంగతి.

(టెలెగ్రాం మెసెంజరు ప్రవేశం)

మెసెంజరు (వీధులోంచి) రంగారావు పంతులుగారికి టెలిగ్రాం అండీ!

(రంగారావు వీధి గుమ్మంలోకి వెళ్ళి, సంతకంచేసి టెలెగ్రాం పుచ్చుకుంటాడు. టెలెగ్రాం మాట వినగానే, కాం తమ్మ గుండెల్లో రాయిపడినట్టుగా, ఆవిడ మొఘంలో ఆందోళన వ్యక్తమౌతూవుంటుంది. ఆవిడ కూడా రంగారావు వెనుక నిలబడి)

కాం : ఎక్కడినుంచండీ టెలిగ్రాం ?

(రంగారావు మొఘంలో ఎక్కడా విచారం కలిపించదు. సంతోషంగా వికసించివుంటుంది. టెలిగ్రాం కవరుచింపకుండా లోపలికి పట్టుకువచ్చి కుర్చీలో కూర్చొంటారు. కాంతమ్మకూడా అతనితోటే లోపలికివచ్చి, ఆతని ప్రక్క నిలబడి గాభరాగా చూస్తూవుంటుంది.)

కాం : ఎక్కడినుంచండీ ! టెలిగ్రాం ! వేగం చదివి చూడండీ !

రం : మరేం కంగారుపడకు. టెలిగ్రాం అనీ సరికల్లాకంగారు పడే కాలంపోయింది. ఇందులో మరేమీ విచారకరమైన వార్త వుండదు. భియపడకు.

కాం : ఏమో ! నాకు భయంగా వుంది. వేగిరం చదివి చూడండి.

రం : నేను ఒక్క విషయం చెబుతానువిను. మంచి కబురేనా సరే, చెడ్డకబురైరా సరే, అకస్మాత్తుగా వింటే ఒక్కొక్కప్పుడు ప్రమాదిస్తుంది. అందుచేత గాభరాపడకు. నేను అసలు మూడు రోజులబట్టి యీటెలిగ్రాం కోసమే ఎదురుచూస్తున్నాను. ఇప్పుడింకా పోస్టాఫీసుకు వెళ్ళి కనుక్కుందామా అనుకుంటున్నాను.

కాం : మీమాటలు నాకేం అర్థంకావటంలేదు. వేగం చదివి చూద్దురూ !

రం : గాభర్హాపడవద్దని చెప్పేనా ? ఇందులో సంతోషకరమైనవార్తనే నువ్వు వినబోతున్నావు. నేను క్రిందటి మాటు కట్టిన పజిలు తాలూకు ఫలితాలు ప్రకటించే సమయం యిది. పజిలులో ఫష్టుప్రైజ్ వచ్చినవాళ్ళకి టెలిగ్రాంద్వారా తెలియపరుస్తారు. నువ్వు ఎక్కువ సంతోషం మాత్రం పడిపోకు. మనకు ప్రైజ్ వచ్చివుంటుంది. మొదటి బహుమానం. అంటే వేలసంఖ్యలో వుంటుంది. అంటే—మెల్లిగా వినుసుమీ—గుండెలు చేత్తో పట్టుకుని ధైర్యంగా విను—ఎనభైవేలు బహుమానం వచ్చివుంటుంది.

కాం : ముందు చదివి చూద్దురూ, పిచ్చి మాటలాడక.

రం : నావా, నీవా, పిచ్చిమాటలు ? ఈపర్యాయం యీ బహుమానం నాకు రాక తప్పదని నేను అనుకుంటూనే వున్నాను. (అంటూ కవరు చింపి టెలెగ్రాం కాగితం పైకితీస్తాడు. కాంతమ్మ భయంగాచూస్తూవుంటుంది. రంగారావు చదువుతాడు. చేతులు వొణుకుతాయి. కాగితం క్రిందపడిపోతుంది. రంగారావు మొఘం వెలవెలపోతుంది. అతడు కుర్చీలో వెనక్కి కూలబడిపోతాడు !)

కాం : (గాభరాగా, ఆతని మొఘం దగ్గిర మొఘం పెట్టి) ఏమిటండీ ! ఏమిటండీ ! చెప్పండీ ! చెప్పండీ !!

రం : (ఏడుపు మొఘంపెట్టి) మానాన్నకి జబ్బుగావుందిట! వెంటనే బయలుదేరి రమ్మని మాఅన్నయ్య వైరిచ్చేడు !!



లినోకట్ చిత్రము: చేపలవేటకు పోయే జాలరికుటుంబం శ్రీ. క. భాగేశ్వరశర్మ

సంస్కృత వాఙ్మయంలో ఏకాంకరూపకం :

# శ్యామిలకుని పాదతాడితకము

శ్రీ పి. గణపతి శాస్త్రి

పాదతాడితకం అంటే పాద ప్రహారాన్ని గురించి వ్రాసిన రూపకమని అర్థము. పాదప్రహారం అంటే 'కాలితాపు' అని సామాన్యంగా అందరికీ తెలిసిన విషయమే. కాలితాపును గురించిన ఈ ప్రాచీన సంస్కృత రూపకంలో విషయం ఏమై ఉంటుందా అని ఇది చదివే వారెవరికైనా తహతహ బయలుదేరుతుంది. ప్రాచీన సంస్కృత రూపకకర్తలు తమ రచనల కిలాంటి చిత్రవిచిత్రమైన పేరులు పెట్టడంలో అత్యంత నిపుణులు. శూద్రకుని 'మృచ్ఛకటికం' 'మట్టిబండిని' గురించిన ప్రకరణము. ఇతనిదే మరి ఒక కృతి 'పద్మప్రాభృతకము'. 'పద్మప్రాభృతకం' అంటే పద్మమనే కానుకను గురించిన రూపకమని అర్థము. ప్రాచీన సంస్కృత రూపకవాఙ్మయంలో ఇట్లాంటి చిత్రవిచిత్రమైన నామధేయాలింకెన్నైనా ఉదాహరించవచ్చును.

ఈ రూపక స్వభావాదుల గురించీ, శిల్పనైపుణిని గురించీ చర్చించేముందీ రూపక కవిని గురించీ, ఈ రూపక సంప్రదాయాన్ని గురించీ కొంచెం పరిశీలించడం అవసరము.

## శ్యామిలక కవి

శ్యామిలకుని పాదతాడితకము, శూద్రకుని పద్మప్రాభృతకము, వరరుచి ఉభయాభిసారిక, ఈశ్వరదత్తుని ధూర్తవిట సంవాదము అనే ఈ నాలుగు ప్రాచీన భాణాలు చేర్చి శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు 'చతుర్భాణీ' అనే పేరుతో ఒక 'రూపక సముచ్చయం' ప్రకటించారు. ఇది ప్రకటించి అప్పుడే సుమారు ముప్ఫయి సంవత్సరాలయింది. ఈ అమూల్య రూపక సముచ్చయం పీఠికలో వారు శ్యామిలకుని గూర్చి కొన్ని విషయాలు వ్రాశారు. ప్రస్తుతం మన కంతకంటె ఎక్కువ విశేషాలేమీ లభించడంలేదు. పాదతాడితకం చివర 'ఇతి కవేరుదీచ్యస్య విశ్వేశ్వర దత్తపుత్ర స్యార్య శ్యామిలకస్య కృతిః పాదతాడితకం నామ భాణః సమాప్తః' అని మాత్రమే ఉన్నది. దీనినిబట్టి ఇతడు విశ్వేశ్వరదత్తుని పుత్రుడనీ ఉత్తరాది వాడనీ మాత్రమే తెలుస్తున్నది. వ్యక్తివివేకకారుడైన మహిమభట్టు ఆచార్యుని పేరుశ్యామిలకుడు. ఈశ్యామిలకుడు మహాకవి అని మహిమభట్టు పేర్కొన్నాడు. శ్యామిలకుని పాదతాడితకంలోని శ్లోకాలు కొన్ని సుభాషితావళి, కావ్యోల్లాసము, హృదయహారిణి, అభినవ భారతి, ఔచిత్య విచారచర్చ మొదలయిన సంస్కృత గ్రంథాలలో ఉదాహరణరూపంలో కనిపిస్తున్నాయి. అభినవగుప్త పాదాచార్యుడుకూడా ఇతణ్ణి పేర్కొన్నాడు. ఈ కారణాలన్నింటివల్ల ఇతడు కాశ్మీర దేశీయుడై ఉండవచ్చుననీ, బహుశః క్రీస్తుశకం 9 వ శతాబ్దంలో జీవించి ఉండవచ్చుననీ శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారూహిస్తున్నారు.

## భాణము

శ్యామిలకుడు రచించిన మిగిలిన కృతు లింకా ఏమున్నా ఉన్నాయేమోగాని మనకవి లభించలేదు. అతడు రచించిన ఈఒక్క కృతీ సంస్కృత వాఙ్మయంలో బాగా ప్రసిద్ధికెక్కింది. మానవల్లి రామకృష్ణకవిగారు 'చతుర్భాణీ'లో ప్రచురించిన ఈ రూపకాలు నాలుగు భాణాలు. ఈ భాణకర్తలు నలుగురిని గురించి పద్మప్రాభృతకం చివర ఈ ప్రశస్తి శ్లోకం కనిపిస్తున్నది.

"వరరుచి రీశ్వరదత్తః
శ్యామిలకః శూద్రకశ్చ చత్వారః
ఏతే బభణుః భాణాన్
కాశక్తిః కాళిదాసస్య"

వరరుచి, ఈశ్వరదత్తుడు, శ్యామిలకుడు, శూద్రకుడు ఈ నలుగురు భాణాలు రచించారు. కాళిదాసునికి వీరితో పోలగల శక్తి ఎక్కడిది?" అని ఈ శ్లోకతాత్పర్యం. ఇది కొంచెం అతిశయోక్తి కావచ్చునుగాని, దీన్నిబట్టి శ్యామిలకుని భాణం సంస్కృత వాఙ్మయంలో సహృదయుల మన్నన లందుకొన్నదనీ, ఇతడు కాళిదాస మహాకవితో తులతూగగల గౌరవం సంపాదించుకొన్నాడనీ స్పష్టపడుతున్నది.

భాణం సంస్కృతవాఙ్మయంలోని దశవిధరూపకాల్లోను విశిష్టస్వరూపం గల ఒక జాతిరూపకం. ఈ రూపకలక్షణం 'దశరూపకంలో' ఈవిధంగా ఉన్నది.

"భాణస్తు ధూర్తచరితం స్వానుభూతం పరేణవా
యత్రోపవర్ణయే దేకో నిపుణః పండితో విటః
సంబోధనోక్తి ప్రత్యుక్తీ కుర్యాదాకాశభాషితైః
సూచయేద్వీరశృంగారౌ శౌర్యసౌభాగ్య సంస్తవైః
భూయసా భారతీ వృత్తి రేకాంకం వస్తుకల్పితమ్
ముఖనిర్వహణే సాంగే లాస్యాంగాని దశాపిచ"

భాణంలో ధూర్తుల చరితం కథావస్తువు. ఇది స్వానుభవం గాని ఇతరుల అనుభవంగాని అయిఉండవచ్చును. ఇందులో విటుడొక్కడే ఉక్తిప్రత్యుక్తిరూపమయిన ఆకాశభాషితాలతో ఆయా

విషయా లభివర్ణిస్తుంటాడు. వీరశృంగారాలు సూచించాలి. ఒకటే అంకము. కథ కల్పితమైనదై ఉండాలి. ఇందులో ముఖనిర్వహణ సంధులు రెండూ సాంగోపాంగంగా సమకూర్చాలి. ఇంకా పది లాస్యాంగాలుకూడా ఉండాలి."

పై శ్లోకాల తాత్పర్యం ఇది.

## ఏకాంక రూపకాలు

సంస్కృతంలో భాణము, అంకము, ప్రహసనము మొదలైన రూపకభేదాలన్నీ ఏకాంకరూపకాలే. భాణంలో విటుడు ఒక్కడే ప్రవేశించి, చివరదాకా సంభాషణ అంతా స్వయంగానే నడిపిస్తున్నాడు. ఇందుచేత దీనిని ఒకవిధంగా నేటికాలపు శ్రవ్యరూపకాలతో సరిపోల్చవచ్చును.

శ్యామిలకుని పాదతాడితకం ఇలాంటి భాణమే. దీనిలో పై భాణలక్షణాలన్నీ చాలావరకు కనిపిస్తున్నాయి. కాని వరరుచి శూద్రకులు రచించిన ఉభయాభిసారికా పద్మప్రాభృతకాల్లో రెండిటిలోను, ఈ లక్షణాలంతగా సమన్వయం కావడంలేదు. ఈ రెండు భాణాలు సంస్కృత వాఙ్మయంలో అత్యంతప్రాచీనమైనవి. బహుశః ఇవి రెండు ఇంచుమించు క్రీస్తుశకం మొదటి శతాబ్దంలో రచించి ఉండవచ్చునని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారభిప్రాయపడుతున్నారు. వాటిలో భరతుని భాణలక్షణాలంతగా కనిపించకపోవడానికిదే కారణం కావచ్చును.

## హాస్యరసము

సంస్కృత రూపకవాఙ్మయంలో ప్రహసనాల్లోను, భాణాల్లోను, మిగిలిన రూపకాల్లోను హాస్యం అక్కడక్కడ కనిపిస్తున్నది. ఇటీవల రచించిన సంస్కృత భాణాల్లోను, ప్రహసనాల్లోను హాస్యం చాలా మోటుగా వినిపిస్తుంది. ప్రాచీన కాలంలోగాని, నేటికాలంలోగాని పాశ్చాత్య వాఙ్మయాలతో సరిపోల్చి చూసినపుడు—మన వాఙ్మయంలో హాస్యరసం చాలా తక్కువే అని చెప్పాలి. భారతీయుల గభీరమైన (*Sirious*) ఆధ్యాత్మిక విశ్వాసమే దీనికి కారణమై ఉండవచ్చును. పాశ్చాత్యులలో మన కున్నంత గభీరమైన ఆధ్యాత్మిక విశ్వాసం కనిపించదు. కొద్దో గొప్పో ఉన్నా భారతీయ జీవితరంగా లన్నిటిలోను, సంశ్లిష్టమైనంత దృఢంగా అక్కడ కనిపించడం లేదు. మనకు దృఢమైన ఆధ్యాత్మిక విశ్వాసం జీవితాని కంతటికీ ఆలంబనమైన జీవగర్రగా ఉండడంవల్ల, జీవితానికంతటికీ శరచ్చంద్రికలా వెలిగే హాస్యరసాలంబనం వంటిది—అంతగా అత్యంతావసరంగా కనిపించి ఉండకపోవచ్చును. పాశ్చాత్యజీవిత దృక్పథంలో ఇటువంటి విశ్వాసాలంబనం ఉండి ఉండక పోవడంవల్ల, వారికి అనేక విధములయిన కళాస్వాదనాలు, అందులోను అత్యంతము ఆత్మోత్తేజకమయిన హాస్యరసానుభూతి ఆవశ్యకమైనవిగా గోచరించి ఉండవచ్చును. ప్రాచీనాధునాతన పాశ్చాత్యవాఙ్మయాల్లో ఉదాత్తమైన హాస్యరసం వెల్లివిరిసి వెలుగులు విరజిమ్మడానికిది ఒక కారణమై ఉండవచ్చును.

ఇంతమాత్రంచేత సంస్కృత వాఙ్మయంలో హాస్యరసమే బొత్తిగా లోపించినదని భావించకూడదు. మృచ్ఛకటికాది సంస్కృత రూపకాల్లో సుకుమార హాస్యలాస్యం హృదయాహ్లాదకరంగా రూపొందిన ఘట్టాలెన్నో ఉన్నాయి. సంస్కృత రూపకాల్లో కొన్నికొన్ని విదూషక పాత్రలు సజీవమూర్తులై అజరామరంగా నిలిచిపోయాయి. అయితే ఇటీవల వచ్చిన కొన్ని ప్రహసనాల్లోను, భాణాల్లోను హాస్యరసం—ఆనాటి కాలపరిస్థితులనుబట్టి చూసినా—చాలా మోటుగా కనిపిస్తుంది. కాని, ఈసూత్రం వర్తించని కొన్ని ఉత్తమ ప్రహసనాలు, భాణాలు ఉన్నాయి. శ్యామిలకుని పాదతాడితకం ఈవర్గంలో చేరిన ఉత్తమభాణము.

## భాణంలో హాస్యప్రసక్తి

సాహిత్యదర్పణము, దశరూపకము, ప్రతాపరుద్రీయము మొదలయిన అలంకార గ్రంథాలన్నీ, భాణాలలో శృంగార వీర రసాల సూచన మాత్రమే ఉండాలని ప్రతిపాదిస్తున్నాయి అయితే భాణాలలో ధూర్తుల చరితమే ఇతివృత్తం కాబట్టి హాస్యప్రసక్తి తప్పకుండా వచ్చి తీరుతుంది. అదిన్నీ గాక ఏ రూపకమైనా అలంకార శాస్త్రలక్షణం సూత్రప్రాయంగా అనుసరించినప్పుడే సజీవంగా ఉండగలదు గాని, కేవలం మక్కికి మక్కీగా అనుసరిస్తే అది నిర్జీవ ప్రతిమలా తయారవుతుంది. అదిన్నీ గాక ధూర్తుల శృంగార ప్రసక్తి భాణంలో కథావస్తువుగా వచ్చినపుడది హాస్యస్ఫోరకం కాకుండా ఎలాగ ఉంటుంది?

అలంకారశాస్త్రం అంతగా మక్కికి మక్కీగా అనుసరించక పోవడంవల్లనైతే నేమి, ధూర్తచరితం కథావస్తువుగా తీసుకోవడం వల్లనయితే నేమి పాదతాడితంలో హాస్యరసం పరిపుష్టమై చాలా సున్నితమైన ధోరణిలో నడిచింది. పేరు పెట్టడంలోను, కథ ప్రారంభించి చివరిదాకా నడిపించుకుపోవడంలోను, ముగించడంలోను, ఆయా సన్నివేశాల వర్ణనలలోను కవి చూపించిన హాస్యపోషణ చాతుర్యం అనన్య సాధారణమైనది. ఈ నాటక ప్రస్తావనలో కవి హాస్యాన్ని గురించి చెప్పిన శ్లోకం సర్వులకు ప్రాతఃస్మరణీయమైనది.

"న ప్రాప్నువంతి యతయో
  రుదితేన మోక్షం
స్వర్గాయతిం న పరిహాస
  కథా రుణద్ధి
తస్మాత్ప్రతీత మనసా
  హసితవ్య మేవ
వృత్తిం బుధేన ఖలు
  కౌరుకుచీం విహాయ"

దీని తాత్పర్యం ఇది: యతీశ్వరులందరికీ అనుక్షణము రోదించడంవల్లనే మోక్షము లభించడంలేదు! పరిహాసం చేసినంత మాత్రాన వచ్చేస్వర్గమేదీ రాకుండా నిలిచి పోవడంలేదు! ఆ కారణంవల్ల విజ్ఞులైనవారు కురుచి (*Bad taste*) పరిహరిస్తూ ఎప్పుడు నవ్వుకుంటూనే ఉండాలి." హాస్యానికిది నిర్వచనం కాకపోవచ్చును గాని, దీని కింతకంటె ఉదాత్తమైన దృక్పథం వేరే ఉండబోదు.

ఈ సందర్భంలో ప్రస్తావనలో, కవివర్గం ఆశించే ప్రతిఫలాన్ని గురించి వ్రాసిన శ్లోకంకూడా ఇక్కడ పేర్కొనదగినదే!

ఇద మిహ పదం మాభూదేవం భవత్విద మన్యథా
కృతమిద మయం గ్రంథే నార్థో మహానుపపాదితః
ఇతి మనసియః కావ్యారంభే కవేర్భవతి శ్రమః
సనయనజలో రోమోద్భేదః సతాం త మపోహతి"

"ఈపదం ఇక్కడ ప్రయోగించకూడదు. ఇది మరిఒకవిధంగా ఉంటే బాగుండేది. ఇక్కడ ఈస్థలంలో మహత్తరమైన అర్థం ఇమిడి ఉన్నది." అని ఈవిధంగా కావ్యారంభంలో కవిపడే శ్రమ అంతా సహృదయుల రోమాంచము, నేత్రజలము అపహరించి వేస్తున్నవి"

ఇది వట్టి ఆదరోక్తిగా కనిపించవచ్చునుగాని, కవులకింతకంటే అపేక్షించదగినదీ, ఆహ్లాదకరమైనదీ మరిఒకటి ఉండబోదని ఇంతో అంతో రచన అలవాటున్న వారికందరికీ అనుభవంలో ఉన్న విషయమే. అయితే అలాంటి కవులు, సహృదయులు ఏకాలంలోనైనా చాలా తక్కువగానే కనిపిస్తూంటారు.

## రూపకంలో కథ

సంగ్రహంగా ఈ రూపకంలోని కథ ఇది. సార్వభౌమ నగరంలో నివసించే మదనసేనిక అనే వారకాంతకు, విష్ణునాగు డనే ఒక అమాయికరసికునికీ బాగా జోస్తీ ఏర్పడుతుంది. ఏదో ప్రణయ కలహం సందర్భంలో ఆ వారకాంత ఇతగాడి నెత్తిమీద కాలికొద్దీ ఒక్కతాపు తన్నుతుంది! ఆ రోజుల్లో వారకాంత లావిధంగా ప్రణయకలహంలో పాదప్రహారం ప్రసాదించడం రసికవతంసు లందరూ ఒక మహాభాగ్యంగా పరిగణించేవారు! కాని ఈ విష్ణునాగు డనే ఆసామీ వట్టిఅమాయికుడయి ఉండడంవల్ల ఇతనికది గొప్ప అపచారంగా కనిపిస్తుంది. అంతేకాదు! తానా పాదప్రహారంవల్ల కులభ్రష్టుడనయిపోయానని భావిస్తాడు. అంతటితో ఊరుకోక శ్రోత్రియమండలిదగ్గిరికివెళ్లి తనకి ప్రాయశ్చిత్తం ఆదేశించవలసిందని అభ్యర్థిస్తాడు. వారంతా ముసిముసి నవ్వులు నవ్వుకొంటారు. వారిలో భవస్వామి అనే అతడు ఇక్కడ ధర్మనిర్ణయంచేసి ప్రాయశ్చిత్తం ఆదేశించవలసింది తాము కాదనీ విటవర్గాన్ని ఈ విషయం అభ్యర్థిస్తే వారీవిషయంలో తగిన ప్రాయశ్చిత్తం నిర్ణయించగలరనీ సెలవిస్తాడు. ఆపైన విష్ణునాగుడు విటపరిషత్తును అభ్యర్థించవలెనని అనుకొంటూ ఉండగా శ్యామిలకుడనే విటుడు ఆయా విటుల నందరినీ కలుసుకుంటూ, మధ్యమధ్య కొన్నికొన్ని హాస్య సన్నివేశా లభివర్ణిస్తూ, దారిలో కనబడే ఆయా నగర పరిసరాల సౌందర్యాని కానందిస్తూ విటులంతా సమావేశమైన స్థలానికి చేరుకుంటాడు. ఆపైన విష్ణునాగునికి ప్రాయశ్చిత్తం ఆదేశించవలసిందని అభ్యర్థిస్తాడు. వారిలో అనంతకథుడనేవాడు లేచి "ఆ గణికపాదం అసమయంలో అశోకానికి దోహదం కల్పిస్తుంది. అదిన్నీగాక స్వయంగా మన్మథుడే విల్లెక్కుపెట్టి ఆమె పాదంలో నివసిస్తున్నాడు. అలాంటి పాదంతో ఈపశువు శిరస్సుమీద ప్రహరించడంవల్ల ఆమెకే ప్రాయశ్చిత్తం విధించాలని అంటాడు! ఆ అభిప్రాయం వ్యక్తీకరించే శ్లోకం ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

అశోకం స్పర్శేన ద్రుమ
మసమయే పుష్పయతియః
స్వయం యస్మిన్కామో
వితత శరచాపో నివసతి
సపాదో విన్యస్తః పశుశిరసి
మోహాదివ యయా
సనుప్రాయశ్చిత్తం చరతు
సుచిరం సైవ చపలా"

ఆ తరవాత ఇంకా నలుగైదుగురిలాగే వేళాకోళం ధోరణిలో తమకు తోచిన ప్రాయశ్చిత్తా లుపదేశిస్తారు. చివరికి భట్టిజీమూతుడనే విట మహత్తరుడు లేచి, "ఇవేవీ తగిన ప్రాయశ్చిత్తాలు కానేకావు. ఆ వారాంగన లాక్షారంజితమైన తన పాదప్రహారం నా శిరస్సుమీద అనుగ్రహిస్తూంటే ఈ విష్ణునాగుడు కళ్లారా సందర్శించడమే ఇతనికి తగిన ప్రాయశ్చిత్తమని అంటాడు! వెంటనే అక్కడ చేరిన విటులు, విష్ణునాగుకు ఈ నిర్ణయం అంగీకరించడంతోనే ఈ రూపకం ముగిసిపోతుంది! సంగ్రహంగా ఇదే ఈ రూపకంలోని ఇతివృత్తం.

## రూపక నిర్మాణం

రూపకంలోని ఇతి వృత్తమేకాక రచనాశిల్పంకూడా ప్రత్యేకంగా పేర్కొనదగినదే. ఈ నాటకంలో రంగంమీద కనిపించే నటుడే శ్యామిలకుడనే విటుడు. బహుశః రూపకరచయిత అయిన కవి శ్యామిలకుడే భాణంలో శ్యామిలకుడై స్వీయానుభవమే ఈ విధంగా పాత్రాంతర యవనికలో మనకు వినిపిస్తున్నాడా అనిపిస్తుంది. అయితే భాణంలో శ్యామిలకుడు ఖలతి శ్యామిలకుడు. ఖలతి అంటే బట్టతలవాడు! ఇదే గ్రంథకర్తకు, రూపకంలో వచ్చే శ్యామిలకునికి గల భేదము!

ఈ భాణం మొట్టమొదటగా నేపథ్యలోంచి వినిపించే వారకాంతా పాదవర్ణనంతో ప్రారంభిస్తుంది. ఆ శ్లోకం ఇది.

"జయతి మదనస్య కేతుః
కాంతం ప్రత్యుద్గతో విలాసిన్యాః
శిరసా ప్రార్థయితవ్యః
సాలక్తకనూపురఃపాదః"

"ఈ పాదం మన్మథుని కేతువు. మనోహరుని శిరఃప్రహారం కోసం ఉన్ముఖమై ఉన్నది. లాక్షానూపురాంచితమైనది. మరిన్నీ శిరసా నమస్కరించి ప్రార్థిస్తే నేగాని లభించనట్టిది!"

ఈ విధంగా ప్రహారోద్యతమైన పాదవర్ణనతో ప్రారంభమైన ఈ రూపకం చిట్టచివర, పై నుదహరించిన ప్రాయశ్చిత్తోపదేశంతో ముగిసిపోతుంది! ఇలాగ ఈ రూపకంలోని ఉపక్రమణికోపసంహారాలు పరిశీలిస్తే ఇది ఈనాటి అధునాతను లెవరో రచించారా అన్నంత ఆశ్చర్యం కలిగిస్తుంది!

ఈ రూపకరచనలో మరి ఒకవిధమైన శిల్పవైచిత్రి కనిపిస్తుంది. దీనిలో విటుడొక్కడే "ఏమంటున్నావు?" ఓహో! అలాగా!" అని ఈవిధమైన ఆకాశభాషితాలతోనే రూపకం అంతా నడిపించుకుపోతాడు. విటుడు గాక మరి ఇతరపాత్ర లేవీ రంగంలో ప్రవేశించవు. కాని రూపకం ముగించేసరికి అసంఖ్యాకంగా పాత్రలెన్నో ప్రవేశించినట్టు, నిష్క్రమిస్తున్నట్టు భాసిస్తుంది. ఈ విధమైన ఏకపాత్ర ప్రవేశంతో ఆకాశ భాషితాలద్వారా ఇతివృత్తం అంతా నడిపించడము సర్వసాధారణంగా సంస్కృత భాణాలన్నిటిలోను కనిపించేదే. కాని ఈ భాణంలోమాత్రం కవి నైపుణివల్ల దీనిలో ఎన్నో పాత్రలు ప్రవేశించి నిష్క్రమిస్తున్నట్టే స్ఫురిస్తుంది.

## సాంఘిక పరిస్థితులు

ఈ రూపకంలో పైకి కేవలం వేశ్యాశృంగార ప్రసక్తి ఒక్కటే ఉన్నట్టు స్ఫురించవచ్చును. కాని దీనిలో ఆకాలంనాటి సాంఘిక పరిస్థితులనుగురించిన అవహేళన ఘట్టాలెన్నెన్నో కనిపిస్తాయి. ఈసందర్భంలో ఆకాలంలో ఒక ప్రధాన న్యాయాధికారిని గురించిన అవహేళనశ్లోకం ప్రత్యేకంగా పరిశీలింపదగినది. దీనిలో న్యాయాధికారి సుఖంగా సింహాసనంమీద కూర్చుని ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూ అప్పుడప్పుడు కునికిపాట్లు పడుతూంటాడు. కొంద రతని కాళ్లు పడుతూంటారు! కొంద రాతని కాళ్లు పట్టుకుని మెల్లిగా చాపుతూంటారు. ఒకప్రక్కనించి అక్కడి ఉద్యోగస్థు లేదో మొర పెట్టుకుంటూనే ఉంటారు. అయినా అతడు బజారులో నెమరువేస్తూ కూర్చున్న వృషభరాజంలాగ అలాగే కునికిపాట్లు పడుతూంటాడు! ఈ శ్లోకం ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"కరవిచలిత జానుః
    కైశ్చిదర్ధాసనస్థైః
సమవనత శిరోభిః
    కైశ్చిదాకృష్ట పాదః
అధికరణ గతోపి
    క్రోశతాం కార్యకాణాం
విపణివృష ఇవైష
    ధ్యాతి నిద్రాం చ యాతి."

ఇలాగే ఆనాటి కవులనుగురించిన హాస్యోక్తులు మరికొన్ని కనిపిస్తున్నాయి.

ఇవిగాక ఆకాలపు పౌరుల ఆచార వ్యవహారాలు, విలాస వినోదగోష్ఠీ ప్రసంగాలు, మొదలైన నాగరకుల సాంఘికాచారాలెన్నో ఈ చిన్ని భాణంలో కనిపిస్తున్నాయి.

## రసనిర్వహణము.

లక్షణ గ్రంథాలలో ఉన్నట్టుగానే దీనిలో శృంగారమే సూచితమౌతున్నది. కాని సున్నితహాస్యం సర్వత్రా సమ్మిళితమై ఈ శృంగారానికొక చక్కని శోభ చేకూరుస్తున్నది.

అయితే ఈ శృంగారవర్ణనంలో ఈకాలంవారి అభిరుచులకు కొంచెం ఎబ్బెట్టుగా తోచే సన్నివేశాలుకూడా లేకపోలేదు. అయితే ఈ ఎబ్బెట్టుతనం ఎక్కడా అసభ్యస్థాయికిమాత్రం వెళ్లదు. ఆ ఉన్న ఎబ్బెట్టుతనమైనా కొంత చారిత్రిక దృక్పథంతో పరిశీలిస్తే—అదేమీ లేదనే అనిపిస్తుంది.

ఈ రూపకప్రస్తావనలోనే కవి, కొంగజపం చేసే పెద్దమనుషులెవరూ ఈ రూపకాస్వాదనకు అర్హులు కారనీ; ధూర్తగోష్ఠి నిర్మాత్సికమైన మధుపానగోష్ఠికి ఉపక్రమిస్తున్నదనీ ముక్తకంఠంతో ఉద్ఘోషిస్తున్నాడు.

ఈ దృష్టితో పరిశీలించినపుడిది ప్రాచీన సంస్కృతరూపక వాఙ్మయాభిమానులకే గాక నేటికాలపు ఏకాంక రూపకాభిమానులకు కూడా అత్యుత్తమరూపకంగా స్ఫురించగలదు.

పై అభిప్రాయంగల శ్లోకం ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"నిర్గమ్యతాం బకవిలాస
    సమప్రచారైః
రాజైశ్చ రాజసచివైః
    శమవృత్తిభిశ్చ
తిష్ఠన్తు డిండికవి
    దర్మకలావిదగ్ధాః
నిర్మాత్సికం మధుపిపాసతి
    ధూర్తగోష్ఠీ."



# ప్రతిఅణువు అతీతమైన శక్తితో తయారుచేయబడినది



## దుర్గ బ్రాండు

పోర్టులేండ్ సిమెంటు



తయారుచేయువారు

## ఆంధ్రా సిమెంటు కంపెనీ లిమిటెడ్

విజయవాడ



సాయంత్రపు మజిలీ

—ఫొటో: యస్. యస్. శర్మ.



తొలిప్రొద్దులో నిత్యయాత్ర

—ఫొటో: యస్. యస్. శర్మ.



నురుగులు, నీడలు

—ఫొటో: యస్. యస్. శర్మ.

* కథానిక*

# కల

## శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

ఒక మహారణ్యం తగులబడిపోతున్నది.

జంతువులు చెల్లాచెదరుగా పరుగులు పెడ్తున్నాయి. బండరాళ్ళు సైతం ఫెటేలు ఫెటేలుమని విచ్చిపోతూ ఎగిరెగిరి పడ్తున్నాయి. చిన్న చిన్న చెట్లు—చిట్టి పొదలు, నిప్పు చుట్టేసుకోగా గాలికి గిర్రున తిరుగుతూ, ఒక చోటునుంచి మరోకచోటుకి పరుగులెత్తినట్లుగా అనిపిస్తోంది.

పొగ పెద్దరాక్షసుడిలా లేచింది.

తప్పించుకు పారిపోలేని పక్షులన్నీ, ఆ పొగలో రెక్కలార్చుకుంటూ—ఎగరగలిగినంతగా పైకిపైకి లేచి, గిలగిలా కొట్టుకుంటున్నాయి. నేలమీది పుట్టల్లోని కలుగుల్లోని రకరకాల పాములు, దొర్లుకుంటూ, ఎగురుతూ, దూకుతూ, మంటల్ని తప్పుకుందుకు పరుగులెడుతున్నాయి. మొదళ్లు కాలిపోగా పెద్ద పెద్ద వృక్షాలు మండుతూ మండుతూ నేల కొరుగుతున్నాయి. భూమి మంటలతో చిటపటలాడుతున్నది. రామచిలుకలు పిచ్చుకలదగ్గర్నుంచీ, పావురాలు డేగలు రాబందులవరకూ ఎగరలేక రాలి పడి పోతున్నాయి. కట్టలు కట్టలుగా వెలికివచ్చి పరుగులు పెడ్తున్న పాములు తుట్టలుతుట్టలుగా కాలి రాళ్ళక్రిందకు—లోయల్లోకి పడి పోతున్నాయి.

ఇంతింతలేసి మంటలు!!! రాక్షసి పొగ!! ఈ అందమైన సృష్టియొక్క వినాశమంతా ఎక్కడో నా హృదయంలో జరుగుతున్నట్లే వుంది.

ఆ పొగలు మంటలు రకరకాల ప్రాణుల హాహాకారాల వెనక, మీదనుంచి కాలిపోతూ రాలిపోయే పక్షుల రెక్కల గిజగిజల వెనుక ఒక మానవకంఠం కొద్దిగా వినవస్తున్నది.

ఈ తగులబడిపోయే ప్రకృతివెనుక ఒక మానవస్వరాన్ని విన్న నా అవస్థ యేమని చెప్పకోను?

గులాబీరంగు లేతపాదాలమీద. జీరాడే పాలమీగడ వన్నె కుచ్చెళ్లు—పరిగెత్తుకుంటూ, ఆ మంటలలో భగ్గుమండే తాళ్ళను యెక్కి దూకుతున్నప్పుడు....గప్పున ఆ చిన్న నడుమును రెంతు చేతులా దొరకపుచ్చుగుని ఆమెతో ఆకాశంలోనికి పరువెత్తగలిగితే...వారెవ్వా?

—రాక్షసి పొగ నన్నుచూసి నవ్వింది.

మళ్ళీ ఒక రాబందులతుట్ట కొల్తారాల్తోంది. ఒక మహావృక్షం మంటల్తో వొరుగుతున్నాది.

అయ్యో!!! అయ్యో! ఆ లేత గులాబీ వన్నె పాదాలు! చెదరి చెదరి వేస్తున్నది అడుగులు. బెదరి బెదరి చూస్తున్నది మంటలు.

తెల్లటి కుచ్చెళ్ల ప్రక్కనుంచి పాములు తుట్టగా దొర్లుకుంటూ పోతున్నాయి. పూల పొట్లాల్లాటి అరచేతులు రెంటితో తామరమొగ్గల్లా, చెమర్చి కందినట్లున్న వక్షఃప్రదేశాల్ని కప్పుకొంటూ ఆ పిల్ల పరుగులెత్తుతున్నది. పాలరాతి శిల్పంలా చేయివేస్తే జారిపోయేట్లున్న ఆ మెడనిండా ముత్యాలు ముత్యాలుగా చెమట పొటమరిస్తోంది. తల అటూ యిటూ త్రిప్పుతున్నది. చెక్కిళ్ళు ఎరుపెక్కాయి. ఆమె కళ్ళకేసి చూశాను. అయ్యో—ఏడుస్తోంది గావల్ను? ఇంక లాభంలేదు. పాపం పరుగెత్తి పరుగెత్తి అలసినట్లుంది. ఏ తాయో త్రేలిపోయి మీదబడి తల్లబద్దలవుతుంది. ఆ పాలమీగడ వన్నె కుచ్చెళ్లు, ఈ రోజారంగుపిల్లయొక్క ఆ అందమైన చిన్న నోరు, పట్టు తివాసీలమీద పరుగెత్తవలసిన పాదాలు, ఇంకా వొణుకుతున్నట్లున్న ఆ పెదవులు అంతా—యిందాకటి చెమర్చి కందినట్లున్న తామరమొగ్గల జంట, సర్వమూ నుగ్గునుగ్గయి బొగ్గు బొగ్గయి కాలిపోవలసిందేనా?

నిలువు నిలువునా నేను దహనమైపోతున్నాను.

ఆ వొణికే పెదాలను పంటితో అణచటానికి యత్నిస్తున్నదినొక్క. కళ్ళ వెంబడి వొకొక్క చుక్క రాలి చెంపలమీదుగా పరుగెత్తి టప్పమని దిగువకు చిందుతున్నాది. పరుగెత్తి అకస్మాత్తుగా నిలచిపోయిన ఆమె కాళ్లు కంపిస్తున్నాయి. ఆ తెల్లటి పావడా బరువుగా క్రిందకు లాగేస్తున్నది.

నేను నెత్తి మొత్తుకుంటున్నాను. జుట్టు పీక్కొంటున్నాను. కళ్ళు పొడుచుగుంటున్నాను.

ఆమె రెండు చేతుల్నీ వూపుగుంటూ నిలబడింది. వెనుక తగులబడిపోయే అరణ్యం తరుముకొస్తున్నది. నా మట్టుకు నేను ఆ మనోహరమూర్తిని ఎత్తుకుని పారిపోగలిగితే......రక్షించుకోలేనా అని వాపోతున్నాను. ఆ పిల్ల అంత ఎత్తునుంచీ నేను చూస్తూండగా వురికింది. వురికి—నా గుండెలమీద వచ్చిపడింది.

నేను నిద్రనుండి మేల్కొన్నాను. కన్న భీభత్సంతో నా మెదళ్లోని నరాలన్నీ సడలిచ్చేశాయి. నేను చూసిన సౌందర్యంతో నా హృదయం నిండుగా పూరించింది.

రోజా వన్నె పిల్ల నా కళ్ళలో మెసుల్తున్నాది.

---

* ఈ సంవత్సరం ప్రపంచ కథానికల పోటీకి పంపిన తెనుగు కథ.

గదికి తాళంవేసి క్రిందకుదిగి హోటల్లో బల్లముందు వచ్చి కూర్చున్నాను. దీపాలు మసగమసగ్గా వెలుగుతున్నాయి. నేను కూర్చున్న చోటునుండి చూస్తే ఖణఖణ మండే పెద్దపొయ్యి, దాని ముందుగా ఒక ముసలావిడ అవుపించారు. చుట్టూ గోడలు నల నల్లగా మసిబారివున్నాయి.

చప్పట్లు, గోలగా నవ్వు వినిపించి, భరించలేక తలెత్తి ప్రక్కకు చూశాను. డబ్బుల బల్లదగ్గర కుర్చీలో మిలమిలా మెరుస్తున్న రెండు కళ్లు. బాగా ఎదిగినా నడుం వంగిపోయింది. పిడతలా తల, అతికినట్లున్న ముక్కు, బొకెలాటి నోరు, దొప్ప చెవులు. వుండి వుండి లేచి ఒక చేత్తో ముందుకువంగి 'సర్వరు' గుడ్డల్ని పీకుతున్నాడు. బొత్తాములు పెట్టని బాగా వొదులుగా వ్రేలాడే చొక్కా, అలివురంగునిక్కరు—ఆ నిక్కరు జారిపోయి మోకాళ్ళమీదకు వచ్చి నిలబడింది.

కమ్మటి కాఫీని ఆప్యాయంగా చప్పరిస్తూండగా గ్రద్ద ముక్కు, చీకట్లో మెరిసే ఆ అమోఘమయ దృక్కులు, నా వైపు తిరగటంతో సగం కాఫీ అట్టే విడిచి లేచిపోయాను.

పొయ్యిమంట ముఖానకొట్టగా చెంగుతో వొత్తుగుంటూ ముసలమ్మ 'రాత్రి భోజనం గదిలో పెట్టమంటావా? నాయనా—' అంటూ వచ్చింది.

'అక్కర్లేదమ్మా—రాత్రి మరికరాను. నాకు డ్యూటీ...' అనేసి వెళ్లిపోతూండగా వెనుకనుంచి వచ్చాయి మాటలు.

'పెద్దాన్ని. కూర్చునే వో కునుకు తీస్తుంటాను. బద్ధకిం చేవు నాయనా లేపడానికి...'

'అయ్యో పాపం మంచిమనిషి అనుకుంటూ అడుగులు ముందుకు వేస్తున్నాను. కాని ఆ వెర్రిపిల్లాడు చూపుడు వ్రేలు ఆడిస్తూ నామీద మీద కురుకుతున్నట్లే అనిపించసాగింది.

గుండెలలో నిండుగా దూకి నన్ను మధుర స్రవంతిలో వోల లాడిస్తున్న నా రోజారంగుపిల్ల యింకా అక్కడే వున్నట్టు తోచి అరచేత్తో ఛాతీరాసుగుంటూ తాతిమెట్లు దిగపోతున్నాను. దిగితే యిక సన్నటి సిమెంటురోడ్డే...మనుష్యుల ఆకారాలు వివిధ వాహనాలు అన్నివైపులనుంచీ కదుల్తున్నాయి.

నేను ఎక్కదిగుతున్న రాతిమెట్ల క్రిందుగా మురికి కాలువ నెమ్మదిగా పారుతోంది. కొంచెం సమీపంగానే లాంతరు స్తంభం యొక్క వెల్తురులో ఒక సన్నటినీడ కదుల్తూ యిటువైపే రావటం గమనించాను. చాలా నెమ్మదిగా కదుల్తున్న ఆ నీడతోబాటు టక్కుటక్కుమనే కటువైన శబ్దంకూడా విన్నాను.

ఎవరో కుంటిపిల్ల నావైపే చూస్తూ ఆగింది. వూతకర్రమీద ఆనకపోయినట్లయితే నేను అకస్మాత్తుగా ఎవరో ముష్టిపిల్ల అనే నిర్ణయానికి చప్పున వచ్చివుండకపోదును. చంకలో కూజా పొందికగా యిమిడివుంది. బహుశా నీరు తెస్తూండవచ్చు. నడినెత్తిన కొస్తంత పల్చగా జుట్టు, కోలముఖం, పాపటనుంచి కనుబొమల మధ్యకు ఎంతదూరమో సరిగా యించుమించు అంతేదూరాన చిబుకమూ, లోనికి దిగిపోయిన గుంటకళ్ళు—ఆ చీకట్లో రెండు మిణుగురు పురుగులా అనిపించక మానదు. ఒకకాలు మెలిదిరిగిపోయి వ్రేలాడుతోంది. ఇకముందు యెప్పుడైనా ఆడదానిపట్ల యేవిధమైనటువంటి మమకారంగాని పెట్టుకోదల్చుకున్నట్లయితే యీ మనిషిముఖం ఒక్కమారుకూడా మగవాడు చూడకూడదు.

అసహ్యంతో నిండిన మనస్సుతో జేబులోనుంచి రెండణాల కాసుసుతీసి 'ఎందుకట్లా నిలబడి చూస్తావు? ఫో...ఫో...' అని ఆ మెలి దిరిగిపోయిన పాదాలవద్ద పడేట్లు విసిరేసి గబగబా రోడ్డు మీదకు నడవబోయాను.

నా వెనుక పెద్ద చప్పుడయింది.

ఆ అవిటిపిల్ల మెట్లదగ్గర కూజాను ఎత్తేసింది. ఆనీళ్లు, మన్ను అంతా చింది నా బట్టలమీదకూడా వెనుక కొంత పడ్డొచ్చు. నేను విసిరేసిన బేడ కాసు మాత్రం నేలమీద నీళ్ళమధ్య బురదలో మెరుస్తోంది. అందులోనే ఆ అవిటిపిల్ల చంకనుండి రాలిన ఊత కర్రకూడా పొర్లాడుతోంది.

'నేనేమీ ముష్టిపిల్లనుకానండీ...' అన్న గొంతు వినిపించి నన్ను కమిచీతో బాదినట్లు కాగా అదేపనిగా పరుగెత్తినట్లు నడిచాను. వీధి మలుపు తిరిగి మరోలాంతరు స్తంభంవరకూ వచ్చాక గుండె తడిమి చూసుగున్నాను. రోజారంగుపిల్ల—లేదు. శూన్యతే మిగిలింది.

ఎంత ప్రయత్నించినా మీదమీదకు వస్తూ చూపుడువ్రేలాడించే వెర్రిపిల్లాడూ, మెలిదిరిగిపోయిన కాలుతో వూతకర్ర టక్కుటక్కుమనిపిస్తూ నా హృదయంలోనుంచి రోజారంగు పిల్లను తరిమేసిన ఆ కుంటిపిల్ల—వీళ్ళే మిగిలారు.

లేత గులాబీవన్నె పాదాలు పాలమీగడరంగు కుచ్చిళ్లు, వొణికే పెదాలు చిన్ననోరు పిట్టలాటి నడుమూ అన్నీ మాయమయినై. వీటిస్థానే నడినెత్తినుంచి పాపట, కోలముఖమూ, మిణుగురు పురుగుల్లాటి కళ్ళు పదేపదే జ్ఞాపకానికి రాసాగాయి. మనస్సులో యేడ్చి నంతసేపు యేడ్చాను అంతుచిక్కని రోజారంగు పిల్లకోసం. నాకు చేతయినన్ని రకాలుగా తిట్టుగున్నాను ఆ రెండు ముఖాల్ని.

చివరికి రెంటిని నిత్యమూ చూడ్డంనుంచి తప్పుకోవటం కోసమైనా ఆ హోటల్నుంచి మకాం ఎత్తటం వరకూ ఖరారు పాడు చేసుగుని ఆలోచించాను. ఆరాత్రి రాత్రల్లా నిజంగా ఒక మహారణ్యం తగలబడిపోతున్నట్లే వుంది, నా మెదడులో!

ఏమైనా పదిగంటలవరకూ లేవకూడదనే తలపుతో ముసుగు తన్ని పరున్న నేను యెవరో తలుపుమీద దబదబా బాదటంతో విసుక్కుంటూ లేచాను. 'గది తుడవమంటారా?' అంటూ వచ్చిన హోటలు కుర్రాణ్ని 'ఫీ పొమ్మ'ని గసిరేశాను. ఆ వుదయం వరండాలో పచార్లు చేస్తుండగా ముసలమ్మగారు వచ్చింది. ఆవిడకు కొంచెం కోపం వచ్చివుండాలి రాత్రి భోజనానికి రానందుకు.

'కూజాలో నీళ్లు పట్టమని గది శుభ్రం చెయ్యమని కుర్రాణ్ని పంపిస్తే కొట్టవచ్చావుటగా నాయనా' నేనే తీసుకుపోదామని వచ్చాను. నీకు ఎల్లాటిపిల్లలు పుట్టుగొస్తారనీ...యింకా బలమైన ఆహారంతింటే—!

నేను చప్పున సిగ్గుపడి పోయానల్లే వుంది.

విశృంఖలతరబడి శాశ్వతంగా హోటళ్ళకు అంకితమయే నా జీవితం జ్ఞప్తికొచ్చి నవ్వొస్తున్నాను. బహు బద్ధకస్తుడిగా జీవించటంలో నాకు నేనే తీరని అన్యాయం చేసుకుంటున్నానేమో అనిపిస్తోంది. ఇక యీ వయస్సులో యేర్పడ్డ అలవాట్లు జీవితం పొడుగునా మారవు. ఇల్లు కాపురం, పెళ్ళాం పేరు చెప్పుకొని యెప్పుడో తొంగిచూడబోయే వొక క్రొత్త అమ్మాయి - యీ వూహాలు ఎంతో దూరాన వర్షించని మేఘాల్లా పరుగులు పెడ్తూంటే, నిన్న సాయంత్రం వరకూ కనిపించిన రోజారంగుపిల్ల తలపులు తిరిగి నాలో చిందులు త్రొక్కసాగాయి.

వయస్సులో అమ్మాయిలు చాలామంది బావుంటారనే అభిప్రాయం నాకుంది. అందుచేత పెట్టెబండ్లలో స్కూళ్ళకు పోయే అమ్మాయిలు, సాయంత్రం బీచిలో వరసాగ్గా కూర్చొని యిసుకలో కేరింతాలుకొట్టే ఆసుపత్రి నర్సులు, సినిమాహాళ్లోని జంటలను విడదీస్తే వచ్చే ఆడముఖాలు యిన్ని చూస్తూంటే యిన్ని సంవత్సరాలుగాను వీట్లలోని యేముఖాన్ని గాని నాకుగాను కావాలని అనుకోలేదు. కాని వానలో యెండలో గొడుగులు వుచ్చుకొని చేతిలో చిన్న సంచీ అరికాళ్ళకు తొడిగిన చవకరకం చెప్పులతో స్కూళ్ళకు పరుగెత్తే మిస్సమ్మల్ని చూసి వప్పుడల్లా జాలిపడేవాణ్ణి. డబ్బు పాడుచేసుకుని జీవితాన్ని లక్ష్యం చెయ్యక బహు బద్ధకస్తుడిగా నేను గడించిన దాన్లో కల్లా యీ అనుభవాన్నే పదిలంగా జీవితాంతంవరకూ గుర్తు పెట్టుకోవలసి వుంటుంది.

తువ్వాలు బుజాన్నేసుకుని హోటలు నుయ్యి ప్రక్కకు చేరాను. బాగా ప్రొద్దెక్కడం చేత అప్పుడే చాలామంది అక్కడ పోగయ్యారు. మాట్లాడేవాళ్ళు మాట్లాడుతున్నారు. ఎండ పొడుచుకొస్తోంది. ఒక ప్రక్కనుంచి నీరు తోడుకొని స్నానం చేస్తున్న నాకు నూతిగట్టుకు ఆన్చిన కుంటివాళ్ళ చంకను పెట్టుకునే వూతకర్ర హఠాత్తుగా అగుపించింది. ఆ ప్రక్కనే ఎర్రటి కెంపురంగు పరికిణీ పువ్వుల పువ్వుల వోణీపిల్ల కూర్చుని చాలా కూజాలను ముందేసుకుని ఒక్కటొక్కటే శుభ్రం చేస్తున్నది. అట్లా తోలిచిన కూజాల్లోకి ఒక కుర్రాడు నీళ్లుతోడి నింపుతున్నాడు. ఆ ముఖం చూడవలసి వస్తుందేమోనని ఆతృతగా రావటంలో వాళ్ళు కూడా సరిగా రుద్దుకోలేదు. బహుశా నా కూజా కూడా అందులో వుండ వచ్చుగదా అని తోచింది. గుర్తుకోసం నా కూజామీద చాకుతో 'S' అని చెక్కాను కూడా.

మరోగంట గడిచాక కాబోలు వసారాలో 'టక్కు టక్కు' మనే కర్కశమైన ధ్వని వినవచ్చింది. ఆ కుంటిపిల్ల యీ హోటల్లోనే పనిచేస్తూండాలి: పొట్టకోసం కష్టపడ్డానికి మగవారిలా ఆడవాళ్ళు పనికిరారనే అభిప్రాయం నాకుంది.

కుర్రాడు నా కూజా తెచ్చి కిటికీలో వుంచుతుండగా 'ఆ టక్కు మనే దేవిటి'ని అడిగాను.

'అదా—నీలి బాబూ నీలి, గది వూడుస్తుంటాది'

'ఆహా' అని తలవూచాను.

'వోరి వూసే అక్కర్లేదు బాబూ! ఆయమ్మి గోడచేటో... పనేటో...' అనేసి కొంచెంగాను నవ్వి వెళ్ళిపోయాడు.

ఆ కెంపురంగు పావడా టక్కుటక్కుమనే ఆ కర్రతో నా గదిలోకి రాకుండావుంటే చాలు అనుకుని లేచి వెళ్ళి తలుపు గెడేసొచ్చాను.

గది యింకా సర్దలేదు. ఎక్కడ వస్తువులు అక్కడ చెల్లా చెదరుగా పడివున్నాయి. క్యాంపుకాటుమీద పరిచిన హోల్డాలు బెల్టులు నిన్నటి కలలోని కాలిపోయి దొర్లుకుపోతున్న పాముల్లా వ్రేలాడుతున్నాయి. నా పెట్టెమీద పారేసిన దుస్తుల జతలు, కొంకిన వ్రేలాడుతున్న పంట్లాములు గ్రద్దలూ—రాబందుల్లానూ, గదికుమ్మంవద్ద పేర్చిన బూడ్సులు బండవాళ్ళలానూ కనిపించాయి.

తలుపు కాస్త కిర్రుమంది. టక్కు టక్కుమనే చప్పుడు చెవి దగ్గరలోకి వచ్చి ఆగినట్టే వుంది. దాని వెంబడిని తలుపురెక్క మీద ఎవరో నీరసంగా చేయి ఆన్చినట్లు కూడా వేసింది నాకు అనుమానం.

'బాబుగారూ!' అన్న పిలుపు—

తగులబడిపోతున్న ఒక మహావృక్షం నెమ్మదిగా నామీదకు వొరుగుతున్నట్టే ఫీలయ్యాను. నా గుండెలమీద కురికి నిలచిన ఆ ఒక్క మధురస్మృతి కూడా నాకు దక్కదేమోనన్న భయం లోపల విపరీతంగా వేధిస్తోంది. అయిష్టంతోటే, బలవంతాన ఎవరో త్రోసినట్లుగా వెళ్ళి తలుపు గెడ తీశాను. ఏం చెప్పను!

నా గది గడపవద్ద ఎర్రపావడా పూలవోణీ 'నీలి' కుప్పలా చతికిలబడివుంది. డొక్కలో కాళ్లు తన్ని పెట్టుకుని తోకను కొరుక్కుంటూ హోటళ్లలో బల్లక్రింద పడుకునే దిక్కుమాలిన కుక్క జ్ఞాపక మొస్తోంది.

నీలి తన మెలితిరిగిన కాలు మడత వేసి ఆ వూతకర్రను నేల మీద ఒక చేత్తో త్రోసుకుంటూ రెండవ చేత్తో వూడుస్తున్నది. ఆమె ఆవిధంగా జేకుతున్నప్పుడు తన మోకాళ్లను దాటి పరికిణీ పైన కుక్క పోకుండా మధ్యను ఆగి కప్పుకొంటున్నది. చూస్తే మనిషిలో ఎముకలూ ఆ బొమికెలను కప్పేందుకుగాను చర్మమూ తప్ప మరేవిధమైన నటువంటి మృదువైన మెట్టపల్లాలు కనీసం మచ్చుకైనా దొరకని ఆమె 'మానం' వల్ల అంత అభిమానం కనపర్చటం నిజంగా నాకు ఆశ్చర్యాన్నే కలిగించింది.

తలలో వున్న ఆ పది పేరకల జుత్తులోనూ ఒక ఎర్రగన్నేరు పువ్వు తురిమింది. ఆకాలు యీడ్చుకుంటూ వసారా అంతా తాబేలులా తుడుచుకొస్తున్నది. మెడమీదనుంచి కారుతున్న చెమటను పవిటచెరుగుతో వొత్తుకుని, లోతుకు దించుకునిపోయిన కళ్లతో ముఖమెత్తి

'గది వూడుస్తాను బాబూ!' అంది.

చాలా లేతముఖమే—పద్నాలుగు పదిహేనేళ్ళకు మించి వుండకపోవచ్చు.

ఆ అవకరపు మనిషి ముఖం నా మనస్సంతా కలచివేస్తున్నది. నా ఎదురుగా కుప్పలా చతికిలబడింది, నేను పీలుస్తున్న గాలే తనూ పీలుస్తున్నది. ఇక నాకు సంబంధించిన ప్రతివస్తువూ ముట్టుకుని నా దైనిక జీవితంలోనికి అనవసరంగా తొంగి తొంగి చూస్తూ నన్ను మానసిక వ్యథపాలు చేసేలాగుంది. నాకు కోపంలా వచ్చి అనేశాను—'టట్! వీల్లేదు. ఆ చీపు రిల్లాగియ్యి. యిస్తే నేనే తుడుచుకుంటాను రోజూ...'

కసిరినందుకు అభిమానంతో తలకాయ వ్రేలేసుకుని డేకుతూ నీలి మెట్లవైపు కదలటం చూశాను. ఈ రోకలిబండలా ప్రాకే ఎముకల కుప్పను రెండు చేతులా యెత్తి మళ్ళీ యీ చాయలకు రాకుండా విసిరెయ్యగలిగితే—అసహ్యంతో నిండిపోయిన నా మనస్సు ఎంత త్వరలో యిక్కడ్నుంచి బైటపడి మరో హోటలు చూసుకోగలిగితే అంత మంచిదిలా తోచింది. చెప్పానుగా—బహుబద్ధకస్తుడ్నని...ఐతే ప్రపంచంలోని వికారమైన మనుష్యులతో జట్టీలు పెట్టుకుందుకు గాదు నేను—అందమైన వాళ్ళకే యీ భూమిమీద జీవించటానికి హక్కు వున్నట్లుగా చెప్పాలనీ నాకు లేదు. కాని ఒక చిత్రమైన స్థితిలో నన్నెదో మనోవ్యథల్లో/ముంచే యీ ముఖాలనుండి తప్పుకుని బ్రతకాలనే యోచనే బహుశా నా మానుషప్రవృత్తిని అణగద్రొక్కేస్తూ వచ్చి వుండవచ్చు.

ఉంటే డ్యూటీ చూసుగోవటం, లేకపోతే వూరంతా చాంద్రాయణం చేసేవాణ్ని. గదితాళాలు కూడా హోటలు కుర్రాడి ముఖాన పారేశాను. ఎప్పుడన్నా తోస్తే రెండు మెతుకులు కొరికేవాణ్ని. లేని రోజున ఆ పళ్లెం అట్లానే నవుకరు కుర్రాడు పట్టుకెళ్ళిపోయేవాడు. క్లబ్బులో చీట్లాట......రోజూ జేబు ఖాళీకావటం—దాన్తో చిరాకుగా కోపంగా వుండాల్సి వచ్చేది. ఆరోగ్యమంటే యింత లక్ష్యం లేకుండా యెందుకు ప్రవర్తించానో నాకే అర్థంకాలేదు. చాలారోజులకి మళ్ళీ అద్దంముందు కూర్చున్నాను. బుర్ర కుతకుతా వుడికిపోతున్నట్లుంది. తలనిండా దుమ్ము...కళ్లుకూడా గుంటలుపడి లోతుకు దించుకుపోయాయి. గడ్డం తడుముకునేసరికి టెంకాయచిప్పకుమల్లే గరుకుగా తగిలింది.

ఇన్నాళ్లకు ఆరోజు నాకు శలవు. ఎక్కడకూ వెళ్ళటానికి వంట్లో నాకు శక్తిలేదు. సిగరెట్లు తెగకాలుస్తున్నానేమో ఖుల్లు ఖుళ్ళుమని దగ్గుకూడా వస్తోంది. ఈ దగ్గు ఒకప్రక్కనుంచి ప్రాణాలు తోడేస్తూంటే ఆ రాత్రి భయంకరంగా గడిపాను.

కడుపులో యేమీ యిమడ్డంలేదు. రెండుమార్లు తిన్నదీ త్రాగినదీ అంతా నిద్రలో కక్కేసుకున్నాను. నోరంతా అసహ్యంగా మారింది. బట్టలు కుళ్ళువాసన గొడుతున్నాయి. గొడ్డళ్ళతో బాదినట్లు తలనొప్పి—ఏ రాత్రివేళకు జ్వరం చర్రున త్రాచుపాములా లేచింది. రోగానికి లొంగిపోయి బిగ్గరగా యేడ్చేశాను. మళ్ళీ నాకు తెలివివచ్చేసరికి చూస్తే భళ్లున తెల్లవారింది. నాపక్కను ముసలమ్మగారు కూర్చుంది.

'భయంలేదు నాయనా!' ఆవిడ నామీద చేత్తో నిమురుతూంటే, నేను రెండుచేతులా ముఖం కప్పేసుకున్నాను. మళ్ళీ ఆవిడే అందుకున్నది—'చెప్పేవాళ్లు లేకగాని నీవంటి పిల్లవాడ్ని అడుపాజ్ఞల్లో పెట్టుగోదూ?—యింత విచ్చలవిడిగా యిష్టమొచ్చినట్లు ఆరోగ్యం పాడుచేసుకోనిస్తుందీ? చేసుకున్న పెళ్ళామే ఐతే...'

వ్రేళ్లసందుల్నుంచి చూస్తున్నాను. నేను కక్కిపోసిన స్థలమంతా బూడిదచల్లి వోపిగ్గా కడిగి యెత్తిపోస్తున్న ఎర్రపావడా నీలి ప్రత్యక్షమయింది. వెంటనే తలెత్తి—'ఆ చీపు రక్కడ పారెయ్. నీకు ఎన్నిసార్లని చెప్పాను నా గదిలో కాలుపెట్టవద్దని ...పోతావా పోవా ముందు. ఫో...'

తను నామాటల్ని విననట్టే, తలకాయ వాల్చుగుని నీలి తన పని తాను చేసుకుపోతున్నది.

'ఛీ! ఆ మొండితనం చూడండి.'

ముసలమ్మగారు నవ్వి 'అదే రాత్రి మెల్లగా కుంటుకుంటూ వచ్చి నన్ను లేపింది. ఆ క్రొత్తగా వచ్చిన బాబుకి వంట్లో బాగు లేనట్లుంది. వెళ్లి చూడమ్మా అని.

నేను వెలవెలబోతూ అడిగాను. 'నీలి మీ అమ్మాయా?' అని. నాకు తల గిర్రున తిరిగినట్లయింది.

'అవున్నాయనా, ప్రపంచంలో యిన్నిరకాల ముఖాలవాళ్లున్నారుగదా - మా నీలిని చూస్తే యెందుకు నాయనా నీకంత కోపం?'

ఇల్లా అమాంతం నా మంచం యెగిరి మరో ముక్కూ మొగం తెలియనిచోటికెళ్ళి పడకూడదా అనిపించింది. ఆవిడ అనవసరంగా నేవినా ఒకమారు చెరగుతో కళ్లు వొత్తుగుని మరీ చెప్పింది - 'నా దరిద్రం కాలిపోను? డబ్బవుతుందిటకాని కాలుమాత్రం మళ్ళీ వస్తుంది. కోసి సరిచేస్తామన్నారు డాక్టర్లు'

నాకు లోలోపల 'ఆ సహాయం మీకు నేను చేయిస్తాను' మీ నీలికి కాలు తెప్పిస్తాను' అని అనాలనుంది. కాని నోరు పెగల్లేకపోయాను. మళ్ళీ నన్ను నేను తిట్టుగున్నాను. ఏ నిన్నో మొన్నో యీ హోటలునుంచి మకాం యెత్తేసినా బాగుండిపోయేది. కురూపినై ముఖాన్ని లోకానికి చూపించవచ్చుగానీ కృతఘ్నుడై చూపడానికి యిష్టంలేక దుప్పటీ తలంటా లాక్కున్నాను. జ్వరంకన్నా అభిమానం యెక్కువై ఆరోజల్లా మంచం దిగలేదు. రాత్రి పదిగంటలవేళ ఒక అఘాయిత్యం తలబెట్టాను. అంతవరకూ లేని ధైర్యం చొరవ అప్పుడు నా కెక్కడ్నుంచి వచ్చిందో లేచి మెట్లు దిగి బయటవీధిలో కొచ్చేశాను. నాలుగు రిక్షాలను చెప్పి వాళ్లను వచ్చి హోటలు బయట నిలబడమన్నాను. తరువాత గొడవచేయకుండా వొకరివెంటొకర్ని నెమ్మదిగా మెల్లెక్కి మేడమీదకు రమ్మన్నాను. లోపల నాకు నీరసంగానే వుంది. గదిలో సామానంతా వాళ్లచేత సర్దించి చడీ చప్పుడు లేకుండా కాళీ చెయ్యాలనీ, మిగతా లావాదేవీలు బయటనుంచి సర్దచ్చు అనీ అనుకున్నాను. ప్లాను అద్భుతంగా మట్టుకు వుంది. కాని ఆచరణలో అది కాస్తా బట్టబయలై నవ్వులపాలయ్యాను.

అంతవరకూ నా గదిదగ్గర కాపలాకు మనిషి పడుకున్నారనే నాకు తెలియదు. రిక్షావాళ్లు పైకి వచ్చారు. గదిలో సామానులు సర్దిస్తున్నాను.

'ఏవిటి చేస్తున్నారు మీరు?' అంటూ తలుపు త్రోసుకుని కుంటికాలుతో ప్రత్యక్షమయింది నీలి. నాకు ఉక్రోషం వచ్చిన మాటా నిజమే—పళ్లు పటపటా పిండుకున్నాను. నన్నిలా అటకాయించే ధైర్యమా?—ఎట్లా వచ్చింది? నీలి వికారంగా నవ్వుతో అంది—

'ఇంతకీ నాకు మెలకువొచ్చింది గనుక సరిపోయింది. ఈయన్ని యెక్కడకు చేరేద్దామని వచ్చార్రా మీరు నలుగురూ? జబ్బు మనిషని ముఖం చూస్తే తెలవటంలే...పోండి. పోండి. నిన్న రాత్రల్లా ఆయన వోళ్లే ఆయనకు తెలీదు.'

ఆ రిక్షావాళ్లు నలుగురూ కొరకొరా నాకేసి చూశారు. అందులో వొకడు 'వోరి పిచ్చోడు గావల్నురా యీన—మాకు తెల్దు తల్లీ! ఈ బాబు మాటల్ను నమ్మి గాడీలో నాక్కల్లినాము గాం. ప్రొద్దుట్నే పోలీసోరు మక్కలిరగ దన్నేసేవోరు. పదండ్రా మా గొప్ప చేరవే...'

తిరిగి వాళ్ళు నాకు చెప్పనునే అవకాశంకూడా లేకుండా జారుకున్నారు. నేను నిలువు నిలువునా కోపంతో దహించిపోతున్నాను. పిచ్చివాణ్నా నేను? ఎదురుగ్గా అసహ్యమైన ముఖమేసుకొని భయంకూడా లేకుండా నవ్వుతోంది. చెంపలు తకుముకుం లేగరుగ్గా లోతుగా తగిలాయి. వెళ్లి అద్దం చేతిలోకి తీసుకుని దీపం వద్ద వంగి ముఖం చూసుకుంటున్నాను. నల్లగా మసక మసగ్గా అలుముకొనిపోయివుంది.

చెరగుతో నవ్వు నాపుకుంటూ నీలి 'తప్పు. మీరు అద్దంలో ముఖం చూసుకోకూడదు' అంది.

నేనున్న పరిస్థితిలో నామీద అధికారం కూడా చెలాయించేలాగుంది - వారెవ్వా!

'ఇల్లారా...పోనీ నీ ముఖం చూసుకో దీంట్లో...' అని అద్దం ఆమె కెదురుగ్గా త్రోసి వెక్కిరించాను.

'నే నెప్పుడూ అద్దంలో నా ముఖం ఎట్లావుంటుంది అని చూసుగోను. నన్నెవరైనా క్రొత్తగా చూసినప్పుడు వాళ్ల ముఖమే నేనెల్లాగున్నానో అద్దంకన్నా స్పష్టంగా చెబుతుంది' అని వెళ్ళిపోబోతూ—

'మరి మీరువె...ళ్లి...మళ్లీ...బ...ళ్లి...వా...ళ్లి...ను...' వాక్యం మధ్యలో నే నవ్వువచ్చి తలకాయ పక్కకు త్రిప్పుకొంది. వెళ్లి రెండుచేతులా ఆ యెముకలప్రోగును గుంజిగుంజి నీకు మరీ ఖులాసా రొక్కువైనట్టుందేమని అడగాలనిపించింది. నాకు వెంటనే జ్ఞాపకమొచ్చింది—సృష్టికర్త, ప్రకృతికూడా వికలాంగులకు అతి తెలివితేటల్నిచ్చి బ్రతకమంటారని.

మళ్లీ కొడులు కూయకుండానే నా గదిలోకి సిద్ధమై 'లేస్తూనే నా ముఖాన్ని మీకు చూపించకూడదనుకున్నాను. కాని....'అంటూ దబ్బున నేలమీద చతికిలపడి నిన్నరాత్రి చిందరవందరగా గదినిండా పరిచిన సామాన్ను ఎక్కడిదక్కడ సర్దేస్తూ 'రాత్రి మీరు గొడవ చేసినట్లు నే నెవ్వరికీ చెప్పలేదు. మా అమ్మకు కూడా...' అని తాను నాకు గొప్ప ఉపకారం చేసినట్లు 'చెప్పనులెండి.' అంది నావైపు చూస్తూ.

నిజంగా ముసలమ్మగారికి తెలిస్తే గోలవుతుంది. ఆ విషయం నాకు స్ఫురించనేలేదు. నీలికేసి గుచ్ఛప్పగించి చూస్తూ వరున్నాను. ఆ కాలు వాళ్ళ అమ్మ ఆశించినట్లుగా బాగుచెయ్యగలరేమో డాక్టర్లు అని నాకూ అనిపించింది. పాపం నీకు ఆ కెంపురంగు పరికిణీ వొక్కటేనా అని అకుగుదా మనుకున్నాను. మంచి చీరలు కొని పెడ్తే......ఆ బొవికల ప్రోగును మార్చడం ఎట్లా...ఒక ఆరు నెలలు పండ్లు పాలూ వెన్నా పెట్టి పెంచితే, అప్పుడు మరీ లావెక్కి యింతకన్నా అసహ్యంగా వుంటుందేమో? కొస్త వంటికి కండ పట్టాక ఫరవాలేదు. చూడ్డానికి నీలి తమాషాగా వుంటుంది. మరి ఆ మిణుగురుపురుగుల్లాంటి కళ్ళు—వాటికి బంగారు ఫ్రేము కళ్లద్దాలు తొడిగితే ముఖాన్ని కొంతవరకు కమ్ముతుంది. కొద్దిగా లిప్‌స్టిక్కు వాడాక పెదాలు దొండపళ్లే అనిపిస్తాయి. తరువాత వో చిన్న పెట్టె బండీలో కూర్చోబెట్టి కాన్వెంటుస్కూలుకు పంపితే...చాలామట్టుకు మంచి అమ్మాయల్లేనే అవుతుంది.

ఆ వుదయం నేను రైల్వే డాక్టరుదగ్గరకు వెళ్లి 'సిక్ రిపోర్టు' చెయ్యాలి. బిక్క మొగం వేసుకుని గుమ్మంలోని రిక్షాకేసే చూస్తూ ముఖానికి చేయి అడ్డం పెట్టుకొని ఎండలో నిలబడ్డది 'నీలి'—

'హా... నే నెక్కడికీ పారిపోను. వొట్టు! ఇం కెక్కడికెళ్తాను......మరి నా కెవ్వరూ లేరు' అని నవ్వుతూ రిక్షా యెక్కాను.

నేను తిరిగి ఆసుపత్రినుంచి లోనికి అడుగు పెట్టేసరికి హొటలుక్రింద యేదో కొద్దిగా రభస......పై పెదవిని దుబ్బులా క్రమ్ముకొచ్చిన మీసాలను కొరుకుతూ హొటలు యజమాని మల్లయ్య 'అబ్బ! నివ్వుండవే......' అంటూ గసిరాడు భార్యను. ఆవిడ ముఖంలో తుపాను వెలిసే సూచన లెక్కడా కనిపించటం లేదు.

నేను చడీచప్పుడు గాకుండా మేడమెట్లు ఎక్కుతున్నాను.

'కన్నకడుపు యివ్వాళ నాకెంత మండిపోతున్నది? ఏమి తన కూతురేనా అప్సరస? తెలివితక్కువతనానికి పిల్లను నాలుగు కూకలెయ్యాల్సినది పోయి తనూ వెర్రిపిల్లాడని అంటుందా? ఆ ముక్క అభిమానంగల నోట్లోంచి రావలసిందేనా? తెమ్మనండి. యీావిడగారు యే కలకటేరో దిగివచ్చి పెళ్లాడుతా డనుకుంటోంది. కడుపులో యింత లేని కుళ్ళు ఆలోచనలున్నాయని...'

పైన వేసారాలో దొప్పల్లాటి చెవులు గ్రద్ద ముక్కు బాకాలాటి నోరు క్రిందకు వ్రేలాడిపోతున్న లాగుతో ప్రత్యక్షమయాడు వెర్రిపిల్లాడు. నన్ను చూసి కాలెగరేస్తూ మీదమీద కురకబోతుండగా—సర్వరు

'ఇదుగో నీలి మొగుడు బాబూ—' అని లాగి పట్టుకుని 'చెప్పవయ్యా. ఏది? పెళ్లాం వచ్చాక యేం చేస్తావ్?' అన్నాడు.

సరిగా అప్పుడే నీలి తాళంచెవులు యివ్వటంకోసం టక్కు టక్కుమని చప్పుడు చేసుకుంటూ వస్తున్నది పైకి.

వెర్రిపిల్లాడు గెంతుతూ 'ఇహ్హిహీ!!!' అని తప్పట్లు తరుస్తూ నవ్వుతున్నాడు.

సర్వరు 'నీలి పేరు చెబితే మురిసిపోతున్నాడు బాబూ— యిక యెంతోకాలం ఆగేట్టుకూడా లేదు.' అన్నాక నీలి ముఖంలోకి చూశాను. ఎందుకో సుముఖంగా లేదు. అన్నట్టు ఆరోజు వెలిసిపోయిన చిన్నచిన్న పువ్వులచీర కట్టుకుని తాటాకుబొమ్మలా ముస్తాబయింది. తలలో ఎప్పటి ఆ చిన్న ఎర్రగన్నేరు పువ్వే...

'వచ్చినాడా—' అంది సర్వరును.

వాడు ఆపిల్లాడ్ని నీలమ్మమీదకు వుసిగొల్పి వదిలాడు. వచ్చి వాడు వంగి, చేతిని రెండు మార్లు అర్థచంద్రాకారంగా వూపుతూ నీలి కొంగు దొరకపుచ్చుకుని లాగాడు. సాచిన చేతిని కసుక్కుమని గిల్లటం నేను చూశాను. ఆ సాహసుడు వెంటనే మీదబడి రెండు చేతుల్తో చుట్టివేయాలనుకున్నాడు యీ అబలను. నీలి ముఖం కంగారుతో నిండిపోయివుంది. సర్వరు వికవికాఫకాలుమని నవ్వుతున్నాడు. అంతే—విస్సురుగా చంకలోని కర్ర తీసి కాలిమీద వేసింది. 'అమ్మో' అని యేడుస్తూ వాడు కాలు చేత్తో పుచ్చుకుని క్రిందకు దిగిపోయాడు. చూస్తూండగా చేతిలోని కర్రను విసిరేసి గోడమూలను దబ్బున కూలబడిపోయి చేతుల్తో ముఖం కప్పుకొని యేడువసాగింది. ఇంకా నేను వూరడిద్దామనుకునేలోపునే గాలివానలా వచ్చిపడింది మల్లయ్య భార్య.

'యేడుస్తున్నావటే పైగా, చెట్టంత కుర్రాడ్ని మోకాలి ముకుసు విరిగేట్లు కొట్టి. నీ చేతులు విరగ...సిగ్గులేని ముఖమా! మేనమామ కొడుకన్న గౌరవం యేమన్నా వుంది? నా కొడుకు కాస్త అమాయకుడు గనుక కర్ర తిరగేస్తావు అవునా?'

'అది కాదత్తా......నా చెయ్యిపుచ్చుకు లాగాడు.' నీలి గొణుగుతోంది.

ఆవిడ బుగ్గలు నొక్కుకుంటూ 'ఐతే......అందుకు తగట్టే వాడు. నీవేమో రంభ ననుకొని కలుసుకున్నావులే—'

'నలుగురి యెదటా మీదబడి అల్లరిచేస్తే నాకు అభిమానంగా వుంటుం దత్తా.' పరుషంగానే అంది చెరగు ముఖానికి కప్పుకొని కళ్ళు రుద్దుకుంటూ—

'ఐతే నా కొడుకుని నలుగురి యెదుటా కర్రపుచ్చుకు వాయించావు, నాకెంత అభిమాన ముండాలి? చెప్పుడు మాటలు వింటే బుద్ధులిట్లాగే వంకరత్రోవలు పడ్తాయి. మిమ్మల్ని కడుపు కట్టుకొని యింతవరకూ యీడ్చుకొచ్చాక యేకు మేకవుతారని కలగన్నామా?' అని ఆమె చేతు లూపుకుంటూ నిష్క్రమించింది.

ఇలా రమ్మని పిలిచాను. నీలి నెమ్మదిగా ప్రాకుకుంటూ వచ్చి గదిమధ్య భాసింపట్టు వేసుకు కూర్చున్నది. పాపం! చాలా బాగా యేడ్చినదల్లే వుంది ముఖమంతా చారికలు కట్టివుంది.

నవ్వుతూ అన్నా 'పెళ్ళి చేసుకోమన్నారనేనా...అంత దుఃఖమూనూ పోనీ—నాకుమల్లే వుండిపోతావా యేం?'

'కాదండీ...చూశారా యెంతలేసి మాటలన్నదో మా అత్త. మీరు చూస్తూనే వున్నారుగా. మేవేం ఇక్కడ వీళ్ళ నెత్తిమీద కూర్చొని వూరికే తింటున్నామా? మా అమ్మ నేనూ అస్తమానూ గాడిపొయ్యిదగ్గర, దాసీదానిలా వుదయాస్తమానమూ కూరలు తరిగి, గదులన్నీ వూడిచీ, కూజాల్లోకి నీళ్ళు నింపీ చచ్చేచాకిరీ చేస్తూంటామే? ఎంత అనాకారిగా పుట్టినా నాకూ రెండు చేతులంటూ యిచ్చాడుగా భగవంతుడు—'

రెండు నిముషాలు నిశ్శబ్దంగా దొర్లినమీదట, చీర చెరగు నుంచి దారపోగులు వెలికిలాగుతూ—'నాకు చదువు నేర్పుతారూ?' తలకాయ వాల్చి నున్నటి గచ్చుమీద చేత్తో వ్రాస్తూ అంది.

'ఏవిటీ? చదువా...' అని ఆశ్చర్యంతో నేను రెట్టించాను.

కాస్తంత సిగ్గుతో 'నాకు అక్షరాలుకూడా రావండి. చిన్నప్పుడు బళ్ళోకి పంపమంటే, కొట్టినంత పనిచేసి మొగపిల్లాడు వాడికే లేనప్పుడు దీని కెందుకు చదువు? వూళ్ళేలాలా వుద్యోగాలు చెయ్యాలా అంటూ చాకిరీలోకి దింపేసింది మా అత్తే!'

నా యెదురుగ్గా కూర్చున్న తాటాకుబొమ్మ—అందంగా వుండాలనీ, మంచి నగలూ చీరెలూ కోరుతుందనీ, అదృష్టాన్ని డబ్బునుగూర్చి కలలుగంటున్నదనీ అనుకొంటానుగాని చదువు కావాల నుందని అంటుం దనుకోలేదు.

చదువుకున్న వాళ్ళంతా యేం బావుకుంటున్నారు? చెఱదట్నుంచీ యిట్లాటి ఆశల్తో పెరిగినవాళ్ళు జీవితంలో భయంకరమైన కలలు కన్నారనీ, భౌతికమైన దృక్పథం అభిరుచులు ప్రాపంచికపు టలవాట్లలో మెసలి తయారైన మనుష్యులు సుఖంగా బ్రతకగలుగుతున్నారనీ చెప్పాలనుకున్నాను.

చేత్తో ఒక బొగ్గు తీసుకుని 'అ...ఆ...' అని నేలమీద వ్రాసియిచ్చాను. చాలా సంతోషంతో నేను చెప్పినట్లు ఆ అక్షరాల్ని దిద్దుతూ మధ్యమధ్యను అవి బండబారిపోతూండటాన్ని అసంతృప్తితో గమనిస్తూ, మళ్ళీ తలెత్తి నా ముఖంలోకి చూసి—నేను చిరునవ్వు నవ్వగానే తలవాల్చి ఆ పొడుగాటి వ్రేళ్ళను బొగ్గుమసిలో త్రిప్పేది.

మధ్యలో నాకోసం బార్లీనీళ్లు పుచ్చుకునివచ్చిన ముసలమ్మగారు, బొగ్గుమసికేసి అర్థంకాని చూపొకటి విసిరి 'యేవిటే చేస్తున్నావు యిక్కడ—' అని ముఖం చిట్లించగా,

'చదువుకుంటోందండీ నీలి......' అన్నాను ముసిముసిగా నవ్వుతూ. ఆవిడ ముఖం వికృతంగా మారిపోయింది.

'నీ అత్త చూస్తే యింకేమన్నా వుందే...తిట్టిపోస్తుంది.'

నీలికి చాలా పౌరుషం వచ్చినట్లు గమనించాను. శ్రద్ధతో ఆ రెండు అక్షరాలనూ దిద్దటం పూర్తిచేసి 'యిహ వచ్చేసినట్లేనండి.' అంది తృప్తిగా వొక్కమాటు వెన్ను విరుచుకొని.

'మూడవుండా వ్రాయి—' అనటం తడవు గబగబా చేత్తో మసిబొగ్గును తుడిచేసి ఒక అక్షరం కొంతవరకూ వ్రాసి, ఆలోచిస్తున్న ముఖం పెట్టింది.

'నీ మొహం! యీ పద్ధతిని ఎన్నేళ్లు పడ్తుందే నీకు చదువు వచ్చేసరికి...ఆ వేలంతా బొగ్గుమసి చేసేశావు. నీ చదువు పూర్తయే సరికి యీ గదీ గోడలూ యిల్లూ ఆవరణంతా బొగ్గుగీతలూ మసితో కలకల్లాడిపోవలిసిందేం?'

'ని వ్వూరుకోవే అమ్మా!' అంటూ అరిచింది నీలి కోపంగా. ఈ ముసలివాళ్లు ప్రతీదీ ఆక్షేపిస్తారు. అన్నింట్లో కలగచేసుకుంటారు. ఏదీ చెయ్యలేరు; కాని ఒకప్పుడు అన్నీ చేశామంటారు.

నీలిని వూరిస్తూ 'రేపు పలకా బలపమూ తెస్తాను నీ' కన్నాను.

ఆ పిల్ల 'అ......ఆ' వ్రాయటం పూర్తిచేసి నవ్వుతూ నా ముఖంలోనికి చూసింది.

'షేష్...' అని నేనూ నవ్వగానే 'పలకవుంటే యింకా డబ్బునొచ్చేస్తాయిగదండీ—'

'అహ్హా!' అని తల వూచాను.

ముసలావిడ క్రుతిమించుతున్నట్లు గ్రహించినదై—

'నీకేమన్నా పిచ్చా అబ్బాయీ—లేక వాళ్ళ అత్త వేసే అక్షరాలు నువ్వు కూడా నాలుగు పంచుకుంటావా యేం?'

'చూడండి. మీ నీలిని లేడీని చేసేస్తాను' అంటూ వేళాకోళంగా నవ్వాను.

'ఎంత పిచ్చివాళ్లర్రా మీరు!' అని గొణుక్కుంటూ మెట్లు దిగి వెళ్లిపోయింది ఆవిడ.

నీలి వెనకాతలే నాలిక పంటితో నొక్కి వెక్కిరించేసింది. ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకుని ఫక్కుమని నవ్వేశాము.

తిరిగి నాకు స్వస్థత చిక్కడానికి పది పదిహేను రోజులన్నా తీసుకొనివుంటుంది. ఉదయపు యెండలో నా గదిముందు వరండాలో రెండు మెత్తటి దిండ్లు నానుకుని నేనూ, రాసిచ్చిన అక్షరాలు దిద్దుతూ చెరిపివ్రాస్తూ నా శిష్యురాలూ—ఆమెలోని ఆసక్తిని వుత్సాహాన్నీ చూస్తూ యెంతగానో మురిసిపోయేవాణ్ణి. ఎంత త్వరగా యీమెకు అక్షరాలు వస్తాయి, ఎంత త్వరగా చదవటం వస్తుందీ—అప్పుడెంత గబగబా యీమెకు యీ ప్రపంచము యిందులోని వింతలూ విశేషాలు బోధపరుస్తాను అనుకుంటూండేవాణ్ణి.

నా శిష్యురాలిని 'కాలు బాగు చేయించుకుంటావా?' అని వొకమారు అడిగాను. నేను యిచ్చిన వాచకపుస్తకంలోని బొమ్మల్ను చూస్తున్న నీలి ఆత్రంగా 'నిజంగా—నాకు కాలు వస్తుందాండీ' అనేసింది.

'ఓహో!' అని ఆమెకు డాక్టర్లు బుర్రలు విడదీసి అతుకుతారనీ, కడుపులు కోసి రెండు ముక్కలుగ్గా మళ్ళీ కుడతారనీ, ఎముకలు తీసి పారేసి దంతంతో చేసినవి మళ్ళీ చేతులూ కాళ్లూ తెప్పిస్తారనీ, వాళ్లు తల్చుకుంటే యేకీలు కాకీలు వూడదీసిపెట్టి మళ్ళీ మనిషిని చేసేస్తారనీ అద్భుతంగా వర్ణించి చెప్పాను. ఆవిధంగా నీలికి కాలు వచ్చే ఆశ, ఆ అమాయకురాలైన ముసలితల్లికి కూతురి పెళ్లి ఆశా—రగిల్చి పుణ్యం గట్టుకొన్నాను.

నేను మళ్లీ డ్యూటీలో చేరటంతో ఆమె చదువు వెనకబట్టేసింది. ఈమారు పగలు డ్యూటీ. నా భోజనం స్టేషనుకు హోటలు కుర్రాడే తెస్తూండేవాడు.

బాగా పండ్రెండు గంటలయింది. లైనుమీద బండీ ఫారం (*Form*) చేస్తున్నాను. ఈమధ్యలో దూరాన చెట్లకింద పోర్టర్లు గుంపుగా ప్రోగడి గోడవచేస్తున్నారు. ఏ దరిద్రుడైనా షంటింగులో కాలూ చెయ్యీ విరగ్గొట్టుకున్నాడేమోనని అటువైపు పరిగెత్తాను.

ఆ గుంపుమధ్యలో ఎర్ర పరికిణీ, యెండగొట్టిన ముఖమూ, కుంటి కాలు, చేతిలో కారియరుతో నీలి నిల్చొనివుంది. నన్ను చూడగానే వాళ్ల వకిలినవ్వులన్నీ కటడిపోయాయి.

'ఎందుకొచ్చావ్ యిట్లా—' అని కొంచెం కోపంగానే అన్నాను.

'ఇవ్వాళ నవుకరు కుర్రాడు రాలేదు. మీరు అన్నం తినకుండావుంటారనీ...'

'చాలా గొప్పపని చేశావ్—ఇంజన్లూ, బళ్లూ యిట్లా తిరుగుతూంటే యీ పట్టాల్ను బళ్లను తప్పించుకోగల్నే వచ్చావా? ఇంకా నా పుణ్యం బాగుంది. నేను చూశాను కాబట్టి...'

నీలి కళ్లల్లో నీరు తిరుగుతూండగా 'యింకెప్పుడూ యిట్లాటి పని చెయ్యనండీ' అంది జాలిగా.

'సరే—పద.' రెక్క చేత్తో పుచ్చుకుని జాగ్రత్తగా పట్టాలు దాటించి, ఎదురుగా కనుపావుమేరలో పొట్టిమామిడి చెట్టు పచ్చటి గడ్డి—ఆ నీడలో అక్కడా అక్కడా ఎండ తళుక్కుమని మెరుస్తూండగా యిద్దరం అక్కడ చతికిలబడి అన్నపుగిన్నెలు నేలమీద పరిచాను.

పోర్టరు పరుగెత్తుకెళ్లి కూజాతో నీళ్లు తెచ్చాడు.

నేను అన్నం కలుపుకొని తింటూ నీలికోసం చల్లటి షర్బత్తు తెప్పించి యిచ్చాను. మెల్లిగా షర్బత్తు పీలుస్తూ మధ్యమధ్యను మిసమిసలాడిపోతున్న ఎండలోని తెల్లటి మేఘాన్ని ఆశ్చర్యంతో చూస్తున్నది నీలి. రెండు నల్లటి కాకులు వొకదానొకటి పొడుచుకుంటూ క్రిందుగా మా తలలమీద నుంచి పల్టీలు కొడుతున్నాయి. దూరాన యెక్కడో కుక్క మొరుగుతున్న ధ్వని షంటింగు యింజను చప్పుడులో కలిసిపోయింది.

'చూశావా ఆ లైనుమీద నిలబడివుండే రైలు—దాన్ని యిప్పుడే తయారుచేశాను' అన్నాను నవ్వుతూ.

'అహ్హా!' అంది ఆశ్చర్యంగా నా చేతులకేసి చూస్తూ.

నా ప్రజ్ఞకు నీలి చాలా సంతోషించిందల్లేవుంది. తీసుకెళ్లి మళ్లీ వద్దంటున్నా రిక్షాలో కూర్చోబెట్టి హోటలుకు పంపించేశాను. ఆరోజు నాకు కొంచెం గర్వం వేసింది—నేను అన్నం తినకుండాపోతానేమో అన్న ఆందోళనతో నాకోసం ఒక ప్రాణి వెతుక్కుంటూ రావటమనేది.

ఆవిధంగా నీలే వెర్రిపిల్లాడికి నామీద విరోధం కలగటానికి కారణమయింది. ఉన్నట్టుండి ఒకరోజున నా గదిలో కొచ్చి,

త్రోసేస్తున్నా మీదమీదకురికి చేత్తో నా చొక్కా పీకి చించే వాడు. నేను చేయెత్తగానే బల్లమీద బోర్లించిన గ్లాసును రోజూ ముఖం చూసుగునే అద్దాన్ని నామీదకు గిరాటు పెట్టి పారిపో యాడు. తరువాత నేనా పిల్లవాడిబారినుంచి చాలా తప్పించుకు తిరగాల్సివచ్చేది. ఏమాత్రం యేమరివున్నా నామీదబడి కరవటా నికిగాని బట్టలు పీకటానికిగాని సిద్ధమయ్యేవాడు. పులిలా వాడికళ్లు నన్ను చూడగానే జిగేలు జిగేలుమనేవి. నోరంతా తెరిచి పళ్లన్నీ బిగ్గబటేవాడు. కాలును నేలకు రాసి ధనాధనామని దగ్గరున్న బల్లనో గోడనో కుర్చీనో తన్నేవాడు.

క్రమేపీ హోటల్లో అంతా—నీలీ నేనూ ముసలమ్మగారు వొకటే అన్న అభిప్రాయంలో కొచ్చేశారు.

నేను హోటలుకువచ్చి దాదాపు మూడునెలలు పైబడినా యజమాని మల్లయ్యకూ నాకూ సన్నిహితత్వం యేర్పడలేదు. ఇద్దరం ముభావంగానే వుంటూవచ్చాము.

'పంతులుగారూ! చిన్నమాట.' అని ఆరోజు తానే స్వయంగా కాఫీ కలుపుకొచ్చి 'పుచ్చుగోండి' అని నాముందు వుంచాడు.

చీకటి పడబోతోంది. మామూలుగానే మల్లయ్య హోటలు ఖాళీగావుంది. సర్వర్లుకూడా యే వీధి అరుగులమీదో కూర్చుని బాతాఖానీ కొడ్తూంటారు. అతను నెమ్మదిగా వుపక్రమించాడు.

'ఎవరు మర్యాదస్తులో యెవర్ని నమ్మకూడదో నేను యిట్టే పోల్చెయ్యగలను.'

నేను తాపీగా కాఫీగ్లాసు పెదిమలకు తాటించి చెప్పమ న్నట్లు చూశాను.

పాపం యిటీవలే జబ్బుపడి లేచారు. మీవంట్లో యిప్పుడు మామూలుగా వుంటోందా?'

'డ్యూటీ చేసుగుంటున్నాను.' అని నాలుగుపైపులా వొక మారు చూసి సిగరెట్టు ముట్టించాను.

మల్లయ్య మీసాలక్రిందనుంచి నవ్వాడు.

'ముసలమ్మగారు నాకు జబ్బుచేశాక సిగరెట్టు ముట్టుకోవద్దని అంతకుపేసి నీలిని కాపుంచిందిలెండి. అందుకని—

'మీకైతే దాని అంగరక్షులకు ఎల్లా చిరాకు రావటంలేదో నాకుమట్టు కాశ్చర్యంగానే వుంది సుమండీ—'

మా యిద్దరిమధ్యా సిగరెట్టుపొగ చిన్న మేఘంలా లేచి అడ్డు కుంది. మల్లయ్య అందుకున్నాడు. 'మా అక్కయ్య యీ కుటుంబ వ్యవహారాలు సందర్భకూ కొంత మీకూ చెప్పేవుంటుంది లెండి.'

'నేను యిరుకునపడి యేమంటే యేం ప్రమాదమోనని ఆలో చించుగుంటున్నాను.

'దాని డబ్బుకూడా సుమారు మూడువందల చిల్లర నాదగ్గ రుంది లెండి. మా నీలికి మూడేళ్ళప్పుడు, భర్త పోగానే వచ్చే సింది. చెప్పేవుంటుంది మీకు.' అతి కష్టంమీద 'హా!' అన కలిగా

'నీలికి కాలు బాగుచేయించాలని కూడా అని వుంటుంది లెండి.'

తలకాయ వూపాను.

'అస్సలు నేనే ఆ పనికి పూనుకున్నాను. ప్రతిమాటూ యేదో విఘ్నమే. నాభార్య నీలికి కాలు బాగుచేయిస్తే వాళ్ళ అమ్మ మరో సంబంధం చేస్తానంటున్నది అని గొడవ పెడ్తోంది. దాని దుగ్ధయేమంటే, తెలిసిన మేనత్తే తన అనాకారి పిల్లను యివ్వ టాని కిష్టపడకపోతే యిక యెవరిస్తారు గనుక ఆలోచించ మంటుంది.'

పులిలా గ్రుడ్లు పెట్టుకుని అద్దాలు గాజుగ్లాసులుమీదకు విసిరే ఆ వెర్రిపిల్లాడి పెళ్లివ్యవహారం నామెడకు చుట్టుకోబోతున్నది. ప్రపంచంలో యిద్దరు రూపవంతులైనవారికి వివాహం కావటమూ అతి కష్టంమీదనే జరుగుతోంది. ఇద్దరూ అనాకారులు, రూప హీనులైనా వాళ్లకు వివాహం కావటమూ కష్టతరంగానే పరిణ మిస్తోంది. ఏం చిత్రం?

'మీరు చెప్పిచూడండి. ప్రస్తుతం నా భార్యదగ్గర కొంత పైకంవుంది. నీలికి వైద్యం ఆరంభించవచ్చు. ఆడవాళ్ల నోరు నొక్కిపట్టి అణచీ మనం యేం సాధించగలం చెప్పండి. నాభార్య మట్టుకు సవబులేకుండా అడగటంలేదు. అభిప్రాయాలు మనకైతే లక్ష వుండొచ్చు, చూడండి యితరుల వుద్దేశాల్ని కూడా మన్నిం చాల్సి వుంటుంది.'

'అవునులెండి. నేనుకూడా తప్పకుండా చెప్పిచూస్తాను.' అని లేచి నెమ్మదిగా మేడమీదకు జారుకున్నాను. అయ్యో— వాళ్ళ బ్రతుకులు అట్లా గడపనియ్యకూడదా—యీ కలపాలనే తాపత్రయం యెందుకు? నామట్టుకు ఎంత ఆలోచించినా నీలిని కుంటిపిల్ల గదా అని వెర్రిపిల్లాడి కిమ్మనడంలో సవబేమీ కన్పించ లేదు.

మరునాటి వుదయం మెట్లదగ్గర నవ్వుతూ పలకరించింది యెల్లప్పుడూ ధుమధుమలాడ్తున్నట్లుండే ముఖంగల మల్లయ్య భార్యకూడా. ఏవో ఆశలను చిలుకరించుకొని నవ్వే ముఖాలమాటున ఆలోచనల కారుమేఘాల గుబురులో చిక్కడి నేనొక్కడ్నే ఆలోచించుకోసాగాను. ఈ మనుష్యులు యేమేమో అనుకుం టారు. ఏవేవో ఆశలను పెంచుకొంటారు. కాని వాట్ల సాధ నలో యిరుకునపడి నలిగిపోయే చిన్నచిన్న హృదయాలను గుర్తించి కనికరించటము నేది యెప్పటికి అలవర్చుకుంటారు?

రెండు పచ్చకాగితాలను చేత్తో పుచ్చుగొనివచ్చి—'నాయనా మీరీ వుపకారం చెయ్యాలి. ఆడకూతుర్ని నోరుతెరిచి అడుగు తున్నాను. మా నీలికి కాలు బాగయే సదుపాయం మీచేత్తో కానిచ్చినట్లయినా ఎంతన్నా సంతోషిస్తాను.' అంది మల్లయ్య భార్య.

తరువాత నేను డాక్టర్ను కలుస్తానని మాటయిచ్చి, నాకు తెలియకుండానే మధ్యవర్తిత్వం నెత్తిన వేసుగుని, ఆ మర్నాడు ఆసుపత్రిలో నీలిని చూపించాలని నిశ్చయించేశాను.

ఆరోజురాత్రి బాగా ప్రొద్దుపోయాక గదికి చేరుకొని పడు కునే యత్నంలో వుండగా కామోసు—నీలి తలుపు త్రోసుకుని వచ్చి మూగదేవతలా తలకాయ వొంచుకుని నిలబడిపోయింది. తలెత్తి చూశాను. టప్పటప్పుమని కన్నీరుచిందీ నేలమీద పడ్తోంది. లాంతరు వొత్తి పెద్దదిచేసి చేత్తోపుచ్చుకుని లేచాను.

దగ్గరసావెళ్ళి 'ఏం కావాలి? చెప్పవ్—' అని ఆమె చేయి పుచ్చుకుని మృదువుగా అడిగాను. మళ్ళీ ఎర్రపావడా కట్టుకుంది. తల్లో చిన్న గన్నేరుపువ్వు... గాజులు కదుల్తూ సన్నగా ధ్వనిస్తూం డగా 'మేం ఇక్కడ్నుంచి వెళ్లిపోతామండి.'

'ఏం?' వులిక్కిపడి అన్నా.

'మా వూరుపోతే అమ్మ నేనూ యెక్కడైనా పనిచేసుకు నన్నా బ్రతకగలమండీ.'

'వోహ్హో! అవశ్యం వెళ్లొచ్చు. అల్లా తిన్నగా వెళ్లిపోక మళ్లీ యిక్కడకు ఎందుకొచ్చావ్?' నేను నవ్వేశాను.

నీలి చెక్కిళ్లు కాస్త సిగ్గుతో యెరుపెక్కాయ్.

'ఐతే నేను రేపు డాక్టరుగార్ని కలవనక్కర్లేదు. ఇంక ఆసు పత్రి కెందుకు వెళ్లటం...'

'వొద్దండీ. అంత డబ్బు మా కెక్కడ్నుంచి వస్తుంది గనుక''

'పోనీ నాడబ్బు నా కిచ్చేస్తావా? నేను పెట్టుబడి పెడ్తాను నీ కాలికి.'

'వద్దండీ. మమ్మల్ని వెళ్లిపోనివ్వండి. నాకు భగవంతుడే చాలా అన్యాయం చేశాడు. మిగిలినది ఆ పిల్లాడిచేత పసుపుకొమ్ము ముడేయించి మా అత్త పూర్తిచెయ్యాలని చూస్తోంది.'

'ఐతే మరి నాలాగే పెళ్లిచేసుకోకుండా వుంటావా యెప్పుడూ?'

'కాలువస్తే మట్టుకు నేనెందుకు పనికివస్తానండీ.'

'పోనీలే - నువ్విట్లారా.'

నీలిదగ్గరసా వచ్చి నిలబడింది.

'ఆవాళ గది కాళీచేస్తానన్న రోజున రాత్రికిరాత్రి నలుగు రిలో చెట్టంత మనిషిని పిచ్చివాడిక్రింద చెలామణీచేసి యిప్పుడు నాతో నిమిత్తం లేకుండా ఎక్కడికి పారిపోదామని చూస్తు న్నావ్?' అని చేతులు రెండూ పుచ్చుకున్నాను.

విదల్చుకొంటూ 'మీకు కోపం వచ్చిందల్లేవుందే?' అంది.

'అహ్హా! రాదా మరి-' అని నేను లోనికివచ్చి ప్రక్కమీద వొత్తిగిల్లాను. కిటికీతలుపులు బార్లా తెరిచివున్నాయి. దూరాన నక్షత్రాలు స్పష్టాస్పష్టంగా మెరుస్తున్నాయి. హృదయం తేలిగ్గావుంది. ఒకఅల్పజీవికి బ్రతుకుమీద బ్రహ్మాండమైన ఆశను రగుల్కొల్పాను. పైకనలేపోతున్నదిగాని అంద రాడపిల్లలకు మల్లే మనస్సులో మంచి మొగుణ్ని దాచుకుని, ఆ మిణుగురు పురుగుల్లాటి కళ్ళతో తనివితీరా చూస్తూ, పుడకల్లాటి చేతుల్తో చుట్టేసుకుని యీ నలిగి పోయిన హృదయాన్ని నైవేద్యం చేద్దామని నీలికూడా ఆశిస్తూండ వచ్చు. వెర్రిపిల్లాడి అయోమయ దృక్కులు ఆ బాలిక హృదయ కవాటాలను ఫిరంగి గుండ్లతో పేల్చినట్లుకాగా, పాపం ఆ బాధ నుంచి ఎట్లా తప్పుకోగలదు? అయ్యో! అర్భకురాలు... నిస్సహాయ జీవి!—నేనో, నా రోజారంగుపిల్ల యేమైంది? పాలమీగడ కుచ్చెళ్లు చిన్ని గులాబీ వన్నె లేతపాదాలు... కంపించే పెదా లతో మళ్ళీ వొక్కమాటు... ఎట్లాగున్నానో అని నన్ను చూడ్డా నికి రాకూడదూ? నాకు రెక్కలొచ్చాయి. గాలిలో పైకిలేచాను. చెట్లమీదనుంచి పరుగెత్తాను. అల్లా ఎగుర్తూ సంద్రాల్ని దాటాక అడవుల్ని చూశాను. పెద్దపెద్ద పట్టాణాలు భవనాలు వనాలు అన్నీ గాలించేశాను. వృధా—యేడుస్తూ అలసిపోయి హోటల్లోని గది లోకే వచ్చిపడ్డాను. నాహృదయం లోపలంతా శూన్యం... అరణ్యాం భగ్గున మండితే చూడాలనిపించింది. త్రాచుపాములు పట్టుగుని పీకితే హాయిగా వుంటుందేమో... బండరాళ్ళను వేసి తలబ్రద్దలు కొట్టుకున్నా బాగుండుననిపించిందాయె! లాభంలేదు. సుఖమూ సంతోషమూ నువ్వు యితరులకు యివ్వాలిసిందే గాని నీ కెవ్వరూ యివ్వరు. అదృష్టం లేదనుకుని గట్టిగా హృదయ కవాటాలు మూసేసుగుని 'నాకేమీ అక్కర్లేదు. నేనే అందరికీ యివ్వాలి' అని బిగ్గరగా చాటుకున్నాను.

గుండెలు చేత్తో పుచ్చుగుని తడబడుతూన్న కాళ్ళతో నీలిని వెంటేసుగుని పెద్దడాక్టర్ని కలిశాను. నా ప్రాణాలు బిగుకు బిగుకుమంటున్నాయి. డాక్టర్ల ప్రజ్ఞను గురించి చాలా కోతలుకోసి నందుకు నొచ్చుగున్నాను. ఐదు పది కాగితాలు సమర్పించుకుని బ్రతిమాలాను. డాక్టరు ముఖం చిట్లించాడు. నీలికికూడా భయం గానే వుంది. ఆ వికారమైన నీలికేసి అదేపనిగా చూశాక, ఆంగ్లంలో—'లాభంలేదు. ఈపిల్ల తట్టుకోలేదు. చాలా పెద్ద ఆపరేషను చేసి బొంవిక మార్చాలి. అప్పటికీ ఆ కాలు నడవటానికి మాత్రం వుపకరించవచ్చు' అన్నాడు.

వెళ్ళి ముసలమ్మగార్ని తీసుకొచ్చాను. ఆవిడ డాక్టరు కాళ్లా వేళ్లా పడి 'బీదవాళ్ళం... పిల్లకు పెళ్ళికావాలి. కాలులేందే యెవరు చేసుగుంటారు బాబూ!' అని చెప్పుగుంది.

డాక్టరు పక్కుమని నవ్వేశాడు. ముసలమ్మగారు ఆయన బూటుకాళ్ళను రెండుచేతుల్తో పట్టుగోబోయింది. గోడవారను నిలబడివున్న నీలి చెంపమీద చిన్న దెబ్బవేసి 'నీకూ పెళ్ళా... వొహ్హో! ఐతే అవశ్యం నీకు కాలు యివ్వాలిసిందే...' అని నవ్వేసి వెళ్ళిపోయాడు.

నీలి అచ్చం పెళ్ళికూతురిలానే సిగ్గుపడ్డది. ముసలమ్మగారి ముఖం చింకిచేటం తవటంకూడా గమనించాను. అరచేతిలో చేయి వేసి నలుపుకుంటూ 'డాక్టరు బాబు చాలా మంచివారే...' అని వొకమారుగాదు పదిమార్లు వల్లించుగున్న దావిడ. ఆరోజే సర్జికలు వార్డులో నీలిని చేర్పించటం జరిగింది. మేం తిరిగివచ్చేసరికి మల్లయ్యా, భార్య, నవుకర్లు—వెర్రిపిల్లాడు అంతా పరంగుల మెట్ల మీద బొమ్మల్లా చూస్తున్నారు. 'చేర్పించేశారా—' మల్లయ్య మీసాలు కొరుక్కుంటూ అడిగాడు. నీలిని యెత్తుకొనిపోయి ఎక్కడో దాచేశానని వెర్రిపిల్లాడు కోరచూపులు చూస్తున్నాడు.

'హాలే... డాక్టరు యెంత మంచివారనుకున్నావ్? నీలికి తప్పకుండా కాలు తెప్పిస్తానన్నారు.' అంటూ చెప్పింది ముసలమ్మగారు.

ఆ మధ్యాహ్నం-మల్లయ్య భార్య కొడుకును తిడుతోంది.

'వెర్రివెధవా—నీకెందుకురా యింత మమకారం? అది కనబడ్డం లేదని తిండి తినకుండా ఛస్తావా? వొక్కచోట పెరిగామే అన్న అభిమానం దానికి లేకపోయింది.' వాడు అస్తమానూ పాకలంతా కలియదిరిగి అందరి గదుల్లోకి తొంగిచూసి మళ్ళీ వీధిలోకొచ్చి వొకమారు చూశాక లోనికి పోతూండేవాడు. ఆ అమాయక హృదయం ఎంతగా దహిస్తున్నదీ నేను గుర్తించాను. ఆ పిల్లాడు క్రమంగా అనుకోనంత చిత్రంగా మారిపోయాడు. గంతులు, డబ్బాలు—గ్లాసులు, తిరగదొయ్యటం, తన్నటం, లాటిచేష్టలు మానేశాడు. ఏదో మూల బల్లిలా గోడను అంటుకుని మూగగొడ్డులా కుమిలిపోవటం చూశాను. ముసలమ్మగారుగాని, నేనుగాని ఆసుపత్రికి వెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు చూసినట్లయితే, రెండు చేతుల్తో ముఖాన్ని కప్పుకుని యేడ్చేవాడు. 'మీరే వాడి దుఃఖానికి కారణ'మన్నట్లు చూసేది మల్లయ్యభార్య. ఒకమారు వాణ్ని రెక్క చేత్తో పుచ్చుకుని లేవనెత్తి 'రా బాబూ! నీకు నీలిని చూపిస్తాను.' అంటోంది. వాడు వెంటబడుతూండగానే ఎక్కణ్నుంచి చూసివచ్చి పడిందో తల్లి—వొక్క విసురున వాడిని త్రోసేసింది. ఎట్లాగో తల్లిని త్రోసి తప్పించుకుని వాడు వీధిలోకి ఉరకబోతున్నాడు. ఏవిటంటూ మల్లయ్య ప్రక్కతలుపు త్రోసుకుంటూ వచ్చాడు.

'చూడండి. ఈ సిగ్గులేని వెధవ పడిపోతున్నాడు ఆసుపత్రకంటూ—' అతను చూస్తూండగా వొంటికాలుమీద లేచాడు. ఒక ప్రక్కగా నిల్చుండి బిత్తరచూపులు చూస్తున్న ఆ చేట చెవుల గ్రద్దముక్కు కొడుకుమీద. తన్నగా ఫెడీల్మని వాడు లుంగలు చుట్టుకుని నేలమీద పడ్డాకకూడా, మల్లయ్యలోని పశుత్వమంతా విజృంభించగా చేతుల్తో కాళ్ళతో చితక బాదుతున్నాడు. కేరియరు విసిరేసి ముసలమ్మగారు అడ్డుపడబోయి సాధ్యంకాక 'చంపకురా...వాణ్నెందుకు...చంపకురా!' అని అరుస్తోంది యేడుస్తూ. నిష్కారణంగా చచ్చిపోతాడేమో ననిపించి గబగబా మధ్యకు వెళ్ళి మల్లయ్యను బలంగా నెట్టి కుర్రవాణ్ని లేవనెత్తాను.

'వుండవయ్యా...నివ్వు. కనిగొట్టు వెధవ. చచ్చాడన్నా కాదు.' పిల్లాడు పూర్తిగా సొమ్మసిల్లాడు. వీపు డొక్కపోయి నెత్తురు కారుతోంది. రైలుపట్టాలక్రింద పడి నలిగినగొడ్డు, కారు క్రిందపడ్డ కుక్కలా వున్నాడు.

ముసలావిడ తమ్ముణ్ని నోటికి వచ్చినట్లల్లా తిట్టేసింది అవ్వాళ. ఈవాళ చేస్తాను రేపుచేస్తాను అంటూ డాక్టరు నెలరోజులు గడిపాడు నీలికి ఆపరేషను. ఒకరోజు ఆలస్యమైతే ఒకరోజు పెళ్ళి వెనక్కుపోయినట్లుగా ముసలమ్మగారు లెక్కలు కడ్తోంది. ఈ నెల్లాళ్ళలోనూ అద్భుతంగా మారిపోయింది నీలి. చిక్కటిపాలు త్రాగుతూండటంచేత శరీరానికి కొస్త మిసమిసలు వచ్చాయి. డొక్కపోయినట్లుండే చెక్కిళ్ళు కోలముఖం కొస్త గుండ్రంగా తయారయింది. నడుందగ్గర్నుంచి చూస్తే మనిషి బంతిలాగయింది. నవ్వినప్పుడు కొస్తముఖం చూడాలనిపిస్తోంది. పెదాలు ఎరుపెక్కాయి.

నా సంతోషం యేమని చెప్పగోను?

రోజూ చిన్న చిన్న బహుమతులు పట్టుగెళ్ళి యిస్తూవచ్చాను. రిబ్బనులు జడపిన్నులు. పూలు రకరకాల గాజులు వొకటేమిటి, నాకు తోచిందల్లా కొనుక్కెళ్ళి ఆమె ముందు కుప్పగా పోసేవాణ్ని. హృదయందగ్గర్నుంచి ఆఖరికి జడపిన్నువరకూ యేదన్నా యితరులకు యివ్వటంలో యెంత ఆనందం వుందో అప్పటివరకూ నాకు తెలీనే తెలీదు. ఇంకా ఆకళ్లు రెండూ వికారంగానే వున్నట్లు తోచాయి. సాయంత్రాలు ఆసుపత్రివరండాలో బల్లమీద కూర్చుంటే - చల్లటిగాలి, యెదురుగుండా జాగ్రత్తగా పెంచిన చిన్నతోట, దాంట్లోని పచ్చటి రకరకాల మొక్కలు, అస్తమించే సూర్యబింబం, ఆకాశంలోని రంగు రంగుల పిట్టలు కనిపించేవి.

నీలి, సిమెంటుబల్లమీద, ఎదురుగుండా గడ్డిలో నేనూ ముసలమ్మగారూ కూర్చొని కబుర్లు చెప్పుకునేవాళ్లం. అప్పుడప్పుడు ఆ పూతకర్రను గడిలో దాచేసి తమాషాలుచేసి, నీలిముఖంలోని ఆత్రతకూ నిస్సహాయతకూ నాలో నేను నవ్వుకునేవాణ్ని.

'ఏమండీ నీలికి కాలువస్తే తప్పకుండా బాత్ రూంశాండిల్స్ కొనిపెట్టాలండీ' అన్నా.

'ఊఁ నేం...' అని అమాయకంగా అడిగింది నీలి.

మరేసి చూస్తూన్నవాణ్ని చప్పున నా జేబులోని చలవ కళ్ళజోడును తీసి బలవంతాన ఆమెముఖానికి తొడుగుతూ - 'చూడండి. మీ అమ్మాయి లేడీలా లేదూ?'

నీలి చేత్తో అద్దాల్ని తీయబోయింది.

'చెబుతున్నా. — తీశావా మళ్ళీ నీకూ నాకూ పేచీవస్తుంది.' అని గసిరాను.

'అమ్మా మరైతే అద్దం తెచ్చిపెట్టవే. ఎట్లాగుందో చూసుకోవాలి' అంది.

ముసలమ్మగారు నవ్వుతూ లేచింది.

'నాముఖం ఎట్లావుందో యెదురుగుండావున్న వాళ్ళ ముఖమే అద్దంకన్నా స్పష్టంగా చెబుతుందన్నావుగా—మళ్లీ అద్దం ఎందుకంటూ' యెత్తి పొడిచాను.

'నిజమే. నిజమేనే—అమ్మా! అద్దం అక్కర్లేదే...' అని గట్టిగా కేక పెట్టింది ముందు పోతున్న తల్లికి వినపడేలా.

అంతలో హఠాత్తుగా మలుపు తిరిగి వస్తూన్న డాక్టరు చలవ అద్దాలు పెట్టుకున్న నీలిని ఆశ్చర్యంతో చూసి ఆగి 'ఏవమ్మాయ్? చాలా ఖులాసాగా వున్నావే?' అని నవ్వాడు.

నేను నమస్కరించాను. కంగారుగా కళ్ల అద్దాలు పూడదియ్యబోయింది కాని ఒకప్రక్క జుట్టులో చిక్కడ్డంచేత నేనే ఆమెకు సాయం చేయవలసి వచ్చింది.

'మీరిద్దరూ యేమవుతారు?' అని డాక్టరు నీలిని అడగ్గానే నేను తెల్ల తెలబోయాను. నాకేసి చూసి నీలి తలవాల్చేసింది. అద్దం పుచ్చుకుని వస్తున్న ముసలమ్మగారు 'డాక్టరు బాబూ దండం' మంటూ చేతుల్ని జోడించింది. ఆయన ముందుకు అడుగులు వేస్తూ 'పెళ్లికొడుకు దొరికాడా?' అని ప్రశ్నించాడు నవ్వుతూ.

'ఏదిబాబూ తమరు కాలు యిచ్చాకగదా దాని అదృష్టా దృష్టాలు బయటపడేది?' అని ముసలమ్మగారు చెప్పింది.

ఆమెకేసి చూసినంతసేపూ ప్రశ్నించుకున్నాను — యీమె నాకేం కావాలని? నీ...లి...నా...కే...మీ...కా...దు. ఈ మిసమిసలాడే పిల్లా వనుకటి ఆవికారమైన రూపూ, రోజారంగు పిల్లా—యేదీ సత్యం కాదు. ఇహనుంచి యేంచేసినా నిష్కామ కర్మగానే చేయాలనే తీవ్రనిర్ణయాని కొచ్చేశాను. మునుపు చిన్న పిల్లతో ఆటలాడినట్లుగా కేరింతాలు కొట్టినట్లుగా వుండటం మానేశాను. దూరంనుంచే మంచి చెడ్డలు యోగక్షేమాలు కనుక్కొని వెళ్లిపోతూండేవాణ్ని. తగినంత అవసరమైతేగాని చనువుగా నీలి మీద చేయి వెయ్యనని తీర్మానించుకున్నానుకూడా. ఈ మార్పు నాలో పసిగట్టాక నీలికి నాయెడల భయభక్తులు మరీ హెచ్చాయి. చూడగానే చేతులు జోడించి దండం పెట్టడం ప్రారంభించింది. చనువైన స్నేహితుడిగా మెసలిన నేను క్రమంగా గౌరవప్రదమైన స్థానాన్ని ఆమెలో సంపాదించుకోవటంతో మా మధ్య కొంత అంతరం యేర్పడింది. దాన్తో మనిషికూడా దిగాలుపడ్డట్లు కనిపించేది.

ఆపరేషన్ చేసేరోజు దగ్గరకు వచ్చింది. ఆరోజు నా గంభీర ముద్ర యావత్తూ పటాపంచలు కావలసిందే. కాని—అదృష్టవశాత్తూ మల్లయ్యా, భార్యా కూడా వచ్చారు. ఆపరేషను రూంలోకి తీసుకుని పోయేముందు నీలి కళ్ళనీళ్లు బెట్టుకుని అంతసేపూ నా ముఖంలోకే చూస్తోంది. ఏమో చెప్పాలనుంది, కాని ధైర్యం చాలటం లేదు.

'నీకేమీ భయంలేదు నీలీ. తుడుచుకో చెంపలు...' అని సర్ది చెప్పాను. కాని నాకు కాళ్లు ఆడంలేదు. నేనెప్పుడూ యిట్లాటి అవస్థలో చిక్కడలేదు. మల్లయ్యా, భార్యాకూడా దగ్గరకువచ్చి చేతోతట్టి—'భయంలేదే! డాక్టరుబాబు చాలా మంచివారు' అని ధైర్యం చెప్పారు. ముసలమ్మగారు గుండెను రాయిచేసుకుని బల్లమీద కూర్చున్నది.

నీలి యింకా అసంతృప్తిగా చూస్తూండటంచేత నేను స్ట్రెచర్‌తో విధిగాకూడా ఆపరేషన్ థియేటరువరకూ వెళ్ళాను. డాక్టరు 'ఏడవకమ్మా— నేనేంచేస్తానో నీకు చీమ కుట్టినట్లుగా కూడా తెలీదు.' అని నవ్వాడు. అట్టెండరు నన్ను సన్నటిదారిలా వున్నచోట చిన్న బల్లమీద కూర్చోమని నీలిని లోపలికి తీసుకెళ్ళిపోయాడు.

'యీ నరకంలోనికి త్రోయటానికే యీ పిల్లకు కాలు వస్తుందనే ఆశ కల్పించానా' అని బాధపడ్డాను. అరగంట పోయాక బేసినుతో నెత్తురునీళ్లూ తుక్కూ పుచ్చుకుని ఒకనవుకరు యీవలకు రావటం చూశాను. నాకళ్లు చెదిరాయి. నేనేంచేశాను? ఒక అమాయకురాలికి భవిష్యత్తుపై ఆశ కల్పించి యీ కత్తికోతలు పడమని త్రోశాను. మూడుగంటలు యిద్దరు డాక్టర్లు యింకా హౌసు సర్జనులు నర్సులు పరుగులెత్తుతున్నారు. పనిముట్లు 'స్టౌ'లో మరగబెడ్తున్నారు. తరువాత డాక్టర్లు నెత్తురు మరకలతో నిండిన రబ్బరు గౌనుతో 'యీవలకువచ్చి నాకేసిచూసి 'పూర్తయింది.' అని గంభీరంగా అన్నాడు. అయ్యో! ఆ నెత్తురంతా నీలిదేనా? మరో పది నిముషాల్లో స్ట్రెచరుమీద మనిషిని పడేసి యింకా పచ్చిగా కారుతున్న నెత్తురుముద్దను స్పెషలువార్డులోకి తీసికెళ్తూండగా చూశాను. చూసి కెవ్వుమని కేక పెట్టలేక చేరుమాలుతో నోరు నొక్కుకున్నాను. అంతకన్నా శవం నయం. నా అంతర్యంలోని తుఫాను యేమని చెప్పుకోను? ఎవరన్నా చూస్తారన్న అభిమానమన్నా లేకుండా గోడవారను చేరగిలబడి యేడ్చేశాను. కళ్ళు నులుముకుంటూంగా మల్లయ్య భార్యా ముసలావిడ 'యేది? యేది?' అంటూ నావైపు వస్తున్నారు.

'మీ అందరికీ తెలో అబద్ధమూ చెప్పి నమ్మించాను. మీ నీలిని యీ ఆసుపత్రిలోని కత్తులన్నీ ముక్కలు ముక్కలుగా కోస్తూంటే మొద్దులా బల్లమీద కూర్చొని కళ్ళప్పగించాను. మీ అమ్మాయి నెత్తురుచిందిన డాక్టరుగారి కోటునుకూడా చూశాను. ఇంకా నేనేదో ఆ జన్మాంతమూ మరపురానివుపకారం మీకు చేసినట్లుగా నన్నే వెంబడిస్తున్నారే అనిపించింది.

అంతా కలిసి స్పెషలువార్డుదగ్గర కెళ్ళాము. కాని నేను యీ అబద్ధపుముఖం వేసుకుని ధైర్యంగా ఆపిల్ల ముఖాన్ని ఎట్లా చూడగలను? బయటే నిలబడ్డాను. మల్లయ్యా అతడి భార్యా 'తన నెత్తురు ముద్దను' చూసి లబోదిబోమంటున్న ముసలమ్మగార్ని నెమ్మదిగా యీవలకు తీసుగొచ్చి వూరడిస్తున్నారు.

ఉదయం పది పదకొండు గంటలకు పూర్తయిన ఆపరేషను మనిషికి తెలివివచ్చేసరికి నాలుగున్నరఅయింది. చూడ్డానికి వెళ్లి తలాటెదిక్కున నిలబడ్డాను. 'తల్లీ...' అంటూ ముసలమ్మగారు, దీనంగా నిలబడ్డ మల్లయ్యభార్య ముఖాలను—కళ్లు విప్పి చూసింది. చెంపలనుంచి నీరు వెచ్చగా స్రవిస్తున్నది. నేను చేత్తో తుడవబోయాను. సర్జను ముట్టుకోనివ్వలేదు. చేయి వెనక్కు లాక్కుంటున్నాను. తలత్రిప్పబోయి నీలి గట్టిగా మూలిగి మళ్లీ మత్తులోకి జారుకున్నది.

డాక్టరు ఒక యింజక్షను యిచ్చాడు. బాండేజీని పచ్చి నెత్తురు యెండిపోతూవుంది. డాక్టరుమటుకు చాలా గంభీరంగానే వున్నాడు. వెళ్లిపోతూ జాగ్రత్తగా కనిపెట్టుకు చూడవలసిందనీ, గంటగంటకు యింజక్షను యిచ్చి మనిషిని తట్టుకోనేలా చూడమనీ చెప్పాడు.

నిశ్శబ్ద సంపుటాల్లాగా అంతా వరండాలో బెంచీలమీద కూర్చున్నారు. ప్రక్కదగ్గర చిన్న స్టూలుమీద కూర్చుని నేను ఆమెకేసే చూస్తున్నాను. సన్నగా వూపిరి పీలుస్తూ వదులుతున్నది. మెడదాకా తెల్లటి దుప్పటి వున్నది. ఆ తల్లో యింకా నేను కొనిచ్చిన పిన్నులు జుత్తును చెదరనివ్వకుండా అదిమివుంచాయి. ముఖం బాధాదష్టమై అగపడ్తోంది. గంటగంటకు యింజక్షను... బాగా రాత్రి తొమ్మిదికూడా కొట్టాక నీలి కళ్లు విచ్చి చూసింది.

దగ్గరగా వంగాను. కళ్లు నీటిని నింపుకుంటున్నాయి. నేను వణికే గొంతుకతో 'ఎట్లా వుంది నీలీ?' అన్నాను.

'ఏ...ం...చె...ప్ప...ను...?' అని మాత్రం అనగలిగింది.

'అమ్మనూ వాళ్లనూ పిలిచేదా?'

జాలిగా చూస్తోంది 'వూ' అని.

మళ్లీ అంతా చుట్టూ నిలబడ్డాము.

'ఏం కావాలి తల్లీ?' అంది ముసలమ్మగారు.

'నా...కే...ం......కా...వా...ల...మ్మా...' అంది యేడుస్తూ.

'ఏడవకమ్మా...' అంటున్నాడు మల్లయ్య.

మళ్లీ తెలివిపోయింది. ఈమారు ఆఖరి రౌండుకు డాక్టరే వచ్చి చూసి బాండేజీ అదీ పరీక్ష చేసి మరో యింజక్షను యిమ్మని చెప్పి వెళ్లిపోయాడు. అంతా వరండాలో బెంచీలమీదపడి నిద్ర పోయారు. నాకు నిద్ర ఎట్లా పడుతుంది? సిగరెట్లు కాలుస్తూ వరండాలో పచార్లు చేస్తున్నాను. సన్నగా మూలిగినట్లు అనుమానం వేసింది. వెళ్లి ప్రక్క దగ్గర నిలబడ్డాను. గొణుగుకుంటోంది. చెవి దగ్గరగా పెట్టి విందామనుకున్నాను. ఏడుపులో ఆ మాటలు తెలియ లేదు. తర్వాత మళ్లీ అనుకుంటోంది, 'నాకు కాలు వస్తుందా?' అని. అక్కడ్నుంచి లేచాను. తెలివి తెరలకుమల్లే వచ్చి తప్పుకుంటోంది. ఇంక మళ్లీ నిద్రపోవటంకూడా కష్టమే. దగ్గరగా వెళ్లి చేత్తో బుజంమీద తట్టాను. కళ్లు విప్పకుండా నే దుప్పటి అడుగు నుంచి నాకు చేతులు అందివ్వబోయింది. నెమ్మదిగా ఆ చేతులను అందుకుని తలకాయ వంచి వాటిలో నా ముఖం వుంచాను.

నన్ను గుర్తుపట్టిందో లేదో, పలవరిస్తున్నదో కాని—నెమ్మదిగా అంటున్నది 'నాకు పెళ్లవుతుందా? నన్నెవరు చేసుకుంటారు?' అని. స్టూలుమీద కూర్చున్న నేను తలెత్తి నా నిష్కామ కర్మపిచ్చినంతా వెనక్కి నెట్టి అడిగాను—

'అడుగు నీలీ—నీకేం కావాలన్నా అడుగు, చెప్పు. ఏం కావాలి?'

'నాకు కాలు వస్తుందాండీ?'

ఒకప్రక్కనుంచి నా హృదయం బీటలువారుతున్నా అణచుకుంటూ అన్నా—'తప్పకుండా వస్తుంది.'

నాకే తెలియదు భగవంతుడు యేం చేయనున్నాడో...

నా చేతులు తన చేతుల్లోకి తీసుకుని గుండెలవరకూ నీరసంగా లాక్కుంటూ 'నాకు పెళ్ళవుతుందాండీ?' అంది.

'ఆహా...తప్పకుండా—'

ఒకప్రక్క దిండుమీద విసిరేసినట్లున్న తలను చేత్తో నిమురుతూ ఆప్యాయంగా అన్నాను.

కళ్లు తెరిచి నా ముఖంలోనికి చూస్తూ అంది 'నన్నెవరు చేసుకుంటారు చెప్పండి' అని.

ఒక్క క్షణం ఆలస్యం చేశాను.

మళ్ళీ తెలివి తప్పిపోయింది. నేను మరో సిగరెట్టు తీసి యీవలకు వచ్చి ముట్టించాను. ఆముఖ్యన మేం కబుర్లాడుతూ రోజూ కూర్చునే బల్ల, చిన్నతోటా—రకరకాల పచ్చటి చెట్లూ, అన్నీ చీకట్లో నిద్రిస్తున్నాయ్. నక్షత్రాలు అబద్ధాలాడే మనుష్యుల ముఖాలు చూడలేక గావల్ను చిన్నబుచ్చుకున్నట్లు సన్నగా వెలుగుతున్నవి. ఒకప్పుడు ముష్టిపిల్ల అని జేడా మీదకు విసిరేశాను. కంటకనుపిస్తే ఛీ పొమ్మన్నాను. తల్లి యెదురుగ్గా బిడ్డను అసహ్యించుకున్నాను. కాని యేం సంబంధం లేకపోతే యిప్పుడు యీ వరండాలో పడి—నీకు మంచిరోజు లున్నాయని ఆశ పెట్టిన నేను నీలి ముఖం చూడ్డానికి భయపడ్తున్నాను? మళ్ళీ అడుగుతుంది. ఏం చెప్పను?

దూరాన వుండీ వుడిగీ ఏదో లారీ కాని బస్సు కాని పరుగెత్తుతున్న ధ్వని, ఏదో మూలనుంచి పరుగెట్టి వస్తూన్న రైలు చప్పుడు గాలిలో కొట్టుకొస్తున్నాయి. హఠాత్తు సర్జను కంగారుగా ఈవలకు వస్తున్నాడు.

'ఏవిటి' అంటూ యెదురువెళ్ళాను.

'బాండేజీ కదిలి నెత్తురు లీకవుతున్నది. డాక్టరుకు ఫోను చెయ్యాలి. కాని మీరెవళ్ళూ వాళ్లతాలూకు మనుష్యుల్ని లేపకండి. గొడవ చేస్తారు' అంటూ పరుగెత్తాడు.

నేను నెమ్మదిగా ప్రక్కవద్దకు చేరుకుని నల్లటాయిలా స్టూలు మీద చతికిలబడి ఆమె ముఖంలోకి చూస్తున్నాను. నా అంతరాంతరాల్లోంచి నీలి వెళ్లిపోతున్నదని తోచింది. తల ప్రక్కమీద వాల్చి వెక్కి వెక్కి యేడ్చాను. నా తలమీద నీలి చేయి వేసింది.

కళ్లు తుడుచుకుంటూ ఆమెలోకి చూశాను.

'న-న్నె-వ-రు పె ళ్లి-చే-సు-కుం-టా-రు?' అంటోంది జాలిగా.

ఆడేస్తాను. నిష్కామకర్మగా అబద్ధం చెప్పేస్తాను. కొన్ని గంటల నిముషాల్లో వెళ్లిపోయే ప్రాణికి బ్రహ్మాండమైన తృప్తి కలిగిస్తుందంటే ఒక చిన్న అసత్యం ఆడ్డానికి నేనెందుకు జంకాలి?

అయ్యో! చనిపోతున్నదని తెలిసీకూడా అబద్ధం చెప్పనా? అని వెనక్కి లాగుతున్నది మనస్సు.

మానవత్వమనేది యే కోశాన్నైనా వుంటే చెప్పు—ఈ క్షణాలు జారవిడిస్తే మళ్ళీ నిన్ను యెప్పటికీ యేమీ అడగదు ఆ ప్రాణి. ఇప్పుడే ప్రపంచంలో ఆమెకు యేదన్నా సంతృప్తిగాని సుఖంగాని కలిగించే మాట యేదన్నా వుంటే, అది నీ నోటినుంచే రావాలి? వూ—త్వరపడు! ఇందులో నీకేమీ స్వార్థం లేదే?—అంటూ ఎవరో హెచ్చరించినట్లుగా అయింది.

నా నరనరాలు కూడదీసుకుని దీక్షగా ఆమెకేసి చూశాను. నేనున్న పరిస్థితిలో ఎవ్వరూ ఎప్పుడూ వుండివుండరు. ఒకప్పుడు మనసా యేవగించుకున్న మనిషికోసం, యిప్పుడు అబద్ధం చెప్పి—సంతృప్తితో నిండిన ఆ ప్రాణి హృదయాంతరాల్లోని యేకైక పీఠాన్ని అధిష్ఠించబోతున్నాను.

డాక్టరు గబగబా వచ్చాడు. నేను బయటకు నడిచాను.

కాని నామీద అనేక వేల హండ్రడ్వెయిట్ల బరువు వున్నట్లు తోచింది. నిద్రలేక నాముఖం నానా అసహ్యంగానూ వుండొచ్చు,

పంపుదగ్గరకువెళ్లి శుభ్రంగా ముఖం తోముకొచ్చాను. ముసలమ్మ గారు మల్లయ్య లేచికూర్చుని నావంక చూశారు.

డాక్టరు హౌసు సర్జనుకు 'వాతం కమ్మకుండా చూడాలి.' అంటున్నాడు.

నేనేం చెప్పగలను? అయ్యో నీలి బ్రతికే ఆశలేదని తెలిసీ ఆమె ప్రశ్నకు జవాబు చెప్పకుండా ఆలస్యం చేశాను ఈమారు నా సర్వశక్తులనూ కేంద్రీకరించుకోవటానికి ప్రయత్నం చేశాను.

ముగ్గురం వెళ్లి నీలిప్రక్క నిలబడ్డాము.

హౌసు సర్జను పల్సు వ్రాసుకుంటున్నాడు. టెంపరేచర్ నోట్ చేసుకుంటున్నాడు. కత్తికోతలకు పోగా మిగిలిన దేహాన్ని సూదులతో తూట్లు పోగొడ్తున్నాడు. నీలికి తెలివి వస్తున్నది. కాని మాట రావటం చాలా కష్టంగావుంది. కళ్లు తెరిచేవోపిక కూడా వున్నట్లులేదు.

మల్లయ్యభార్య వెర్రిపిల్లాడ్ని వెంటబెట్టుకొని వచ్చింది. నాకు మాత్రం వాడిముఖాన్ని నీలికి చూపించటం యెంతమాత్రం యిష్టంలేదు. కాని అప్పుడు నేనేమన్నా బాగుండదు. వూరుకున్నాను. వాడు మంచందగ్గరసావెళ్లి మీదకు వ్రాలుతున్నాడు. చేత్తోకదుపుతాడేమో, ఎక్కడ బాధపడ్తుందోనని నేను వాడ్ని కొంచెం వెనక్కులాగాను. ముఖంమీద ముఖంపెట్టి పరీక్షు చేస్తున్నాడు. తప్పు అని నేను ముక్కుమీద వ్రేలుబెట్టుకు చూపాను.

ఆలస్యంగా ఆహారానికి బయల్దేరిన పిట్టలుమాత్రం బహుబద్ధకంగా ఆకాశంలో రెక్కలు కొట్టుకొంటూ ముందుకు పోతున్నాయి!

ఉదయం యెనిమిది గంటలప్పుడు కాబోలు నెమ్మదిగా యేడుస్తున్నది. ముఖం మరీ పల్చగావుంది. చెవులకు ఎర్రటి తాళ్లు బాగా మెరుస్తున్నై. చిన్న ఎర్రగన్నేరుపువ్వు యెక్కడన్నా దొరితే బాగుండును......

రాత్రి కొంతసేపు నిద్రపట్టి వుండాలి. లేకపోతే రాత్రల్లా యేడవనిది యిప్పుడే లేచి గోలపెడ్తున్నదేం?

'నిద్రపోయావా?' అన్నా.

మత్తులోవున్నట్లు కళ్లువిప్పి 'పో—తా—ను. ని...ద్ర...పో...వా...ల...ని...వు...ం...ది...' అంది.

వెర్రిపిల్లాడు చొరుచుకొచ్చి వంగివంగి పరీక్షగా చూస్తున్నాడు. నీలి చేతిని నెమ్మదిగా వూయించింది. వాడుదగ్గిరగా వచ్చి వంగున్నాడు. ఆ గుడ్డ ముక్కను చేత్తోపుచ్చుకుని లాగింది. నేను నవ్వాను. నావైపు కొరకొరా చూస్తూ ఛెంగుమని దూకేశాడు అక్కడ్నుంచి.

నీలి అంటోంది జాలిగా 'నేను బ్రతుకుతానా...' అని.

'అయ్యో! నువ్వు బ్రతక్కపోతే యెట్లా...నాకోసమన్నా బ్రతుకుతావు.'

'అంటే......'

'నేనే నిన్ను పెళ్లాడుదామనుకుంటున్నాను.'

'మీరా......'

ఆశ్చర్యంతో నీలి నాముఖంలోకి చూసింది. నేను నవ్వాను. చేత్తో ఆమె చేతిని తీసుకుని 'నేనే పెళ్లాడుతాను నీలీ నిన్ను. లేకపోతే యింతశ్రమా యెందుకు తీసుకుంటాననీ? మరి యిప్పుడు చెప్పు. నాకోసమన్నా బ్రతుకుతావుగదూ?'

నీలి హృదయపూర్వకంగా నవ్వింది.

ఆ శరీరంలో అక్కడా అక్కడా ప్రాణిని నిలబెట్టడానికి యింకా మిగిలివున్న రక్తము ఆమె చెంపల్లోకి చేరుకుంటోంది. నేను ప్రేమతో నా రెండు చేతుల్నీ ఆమె చెంపలకు రాస్తూ—

'రాత్రల్లా నన్నెవరు పెళ్లాడుతారు? అంటూ పలవరించావు తెలుసునా—'

'అల్లాగా...నాకేదీ సరిగ్గా జ్ఞాపక ముండటం లేదు.'

'అప్పుడు చెబితే...ఆ సంతోషానికి తట్టుకోలేవేమోనని—'

చాలు! ఆమె ముఖంనిండుగా వొక్కమారు వెలిగింది.

నేను నాటకంలో నాపాత్రను చాకచక్యంతో నిర్వహించాననుకుంటాను. తరువాత నీలి యేమైందో నాకు తెలియదు. తెలుసుకోవాలనీ లేదు. ఆరోజుమాత్రం ఆదరాబాదరాలో ఆసుపత్రినుంచి యెవ్వరూ చూడకుండా పారిపోబోతూంటే, గేటుదగ్గర పెద్దగ్రుడ్లు చేసుకుని నిలబడ్డ వెర్రిపిల్లాడు, నన్ను పసిబట్టి వెంబడిస్తాడన్న భయంతో మరోమార్గంగుండా వీధిలోకొచ్చి పడ్డాను.

ఉదయం వొకవైపునుంచి జోరుగా యెండకాస్తూంటే వెనుకనుంచి నల్లటిమేఘం సూర్యరశ్మిని తరుముకొస్తోంది. తడబడుతూన్న కాళ్లతో నేను నడుస్తూంటే 'బాబా కుంటివాణ్ణండయ్యా! గ్రుడ్డివాణ్ణండయ్యా! కలిమిగల మారాజులు. ఒక్కకానీ ధర్మం చెయ్యండిబాబూ!' అన్న కేకలు నాకర్ణపుటాల్ని ఛేదించుకొని నన్ను వెనకనుంచి మరీమరీ ముందుకు తరిమాయి.

# అంకసప్తకము

శ్రీ బెళ్లారి శ్రీనివాసమూర్తి

అరదంబెక్కి విదూషకప్రవరుతో నాఖేట కౌతూహలా
తురతన్ కణ్వవనంబులో దిరుగుచుఁ దుష్యంతు డయ్యాశ్రమాం
తర భూజంబులచేరువన్ ప్రియసఖ నర్మోక్తు లాలించు సుం
దరి దర్శించె శకుంతలన్ మదనబాధాసంభృతోన్మాదియై.

విరహోత్కంఠత పూరువంశమణి పృథ్వీనాథు డవ్వాత్తృమున్
పొరి మాధవ్యునితో వచించి యతనిన్ పొమ్మంచు నా హాస్తినా
పురికంపెన్ నిజమాతృవాక్యమున, సమ్మోదంబుతో తాపసో
త్కర సంరక్షణకార్యమూని నిలిచెన్ ధర్మంబు పాలించుచున్.

గ్రావోపాంత ముహుశ్చరన్మృగతతిన్ ఖండించి మౌనీంద్ర స
ద్భావానందకరంబుగా జనుచు పొంతన్ దివ్యకుంజాంతరో
ర్వీవల్లీతతి బవ్వళించి విరహార్తిన్ దూగు నక్కణ్వపు
త్రీ విశ్వాసము ముద్దులాడె ప్రభు వందేకాంతవాసంబునన్.

కరిపురికిన్ ప్రయాణమగు కణ్వునిపుత్రిక జూచి భావనా
పరవశతన్ దపించె వనపాదపముల్, ఝురులేడ్చె, మాతృహృ
ద్వరములు విప్పి పక్షులు వృథాభరభుగ్నములయ్యె, కణ్వుడున్
త్వరితమె సాగనంపెను సుతన్ నిజశిష్యులతోడు వంచుచున్.

అలదుర్వాసుని శాపకారణమునన్ జ్యాభర్తచేతోగతిన్
నిలుపన్ జాలకపోయె నంతయును, తన్వి ప్రేమ సామ్రాజ్యమున్
కలతన్ బొందుచు నంగుళీయకము బో కన్నీరు దాల్చెన్, శకుం
తల గొంపోయె నభోంతరాళమున నంతన్ మేనకాకాంతయున్.

కైవర్తుండపు డంగుళీయకము నీగా శాపమోక్షంబునన్
భావంబెల్ల దపింప రాజవరుడున్ వారించె నయ్యుత్సవ
శ్రీవాసంతదినోదయంబున, వనోర్విన్ జెంది దుఃఖించె శాం
భావీశామృదు తంత్రి చిత్రపటవీణాలీలమై ప్రీలగన్.

ఔరా! యింద్రునికోసమై సురపురీయానంబు గావించుచుఁ
మారీచాశ్రమ వీథులంబడి, సుధామాధుర్య ధుర్యోక్తులన్
గారామొప్పగబల్క, నిల్చె సుతునిన్ కౌగింట, దైవప్రభా
వారంభంబున ప్రేయసి న్గనె విభుం డానంద ముప్పొంగగన్!

# తుంగభద్రా ప్రాజెక్టు



ఎ·సి·సి· సిమెంటు

**2,20,000**

టన్నులకు పైగా

వినియోగింపబడినది·

తుంగభద్రా ప్రాజెక్టు ఆంధ్రరాష్ట్రములో 1,00,000 కిలోవాట్లుల విద్యుచ్ఛక్తిని, 8,00,000 ఎకరముల భూమిని తడుపుటకు నీటిని సరఫరాచేయును.

కాంక్రీటు ఆనకట్టలు మనదేశములోగల బంజరుభూములను ఆహారసమృద్ధితో అభివృద్ధి చెందు ప్రదేశములుగా మార్చుటకు తోడ్పడును.

**ఎసిసి**

సేల్సు మేనేజర్సు

**ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా.లి.**

## కూడు గుడ్డ దొరికినంత మాత్రాన తృప్తిపడుదుమా?

## కూడు గుడ్డసంపాదించుట కొఱకు పాపముచేస్తే ఎట్లా?

పాపము చేయకుండ కూడు గుడ్డ సంపాదించుకొను మనసు ఎట్లా కలుగును?

సిలువ మ్రాను మీద వ్రేలాడుచున్న యేసు క్రీస్తు వైపు చూచుట ద్వారానే కదా?

## ఆయన సిలువతో మనమేమిచూచెదము?

1. మన దోషములను బట్టి ఆయన నలగగొట్టబడెను.
2. మన సమాధానార్థమైన శిక్ష అనుభవించెను.
3. అతని రక్తము ప్రతిపాపము నుండి మనలను పవిత్రులనుగా చేయును.
4. తొట్రిల్లకుండ మనలను కాపాడుటకును, నిర్దోషులుగా నిలువబెట్టుటకును, శక్తిగల రక్షకుడాయెను.
5. పాపముల నిమిత్తమై సదా కాలము నిలుచు ఒక బలిని అర్పించి పరిశుద్ధపరచబడువారిని సదాకాలమునకు సంపూర్ణులనుగా చేసియున్నాడు:

★

యేసుక్రీస్తు జీవిత చరిత్ర ఉత్తర ప్రత్యుత్తరరీతి చదువుకొనుటకు నీ కిప్పుడు గొప్ప తరుణము దొరికి ఉన్నది. చదువుకొన గోరుచున్నావా?

అలాగైన రెండు అణాలు పంపుచు ఈ క్రింది అడ్రసుకు వ్రాయుము:

**జీవిత్ ప్రకాశ్ బడి రామాయ పట్టణము, నెల్లూరు జిల్లా**

# వేదమువారి స్వతంత్ర నాటకములు

శ్రీ దివాకర్ల వేంకటావధాని

ఆంధ్ర నాటకావతరణారంభమునకు నాందీప్రస్తావనలు పఠించిన సూత్రధారవతంసులలో కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రుల వారొక్కరు. ఆంగ్లమున శ్రవ్యకావ్య వాఙ్మయము వలెనే దృశ్యకావ్య వాఙ్మయముకూడ మొదట సంస్కృతానువాదములతోడనే యారంభించినది. అట్టి యనువాదములను ప్రశస్తతరముగా సంతరించిన వారిలో శ్రీ శాస్త్రిగారగ్రగణ్యులు. వారు శ్రీ హర్షదేవుని రత్నావళీ ప్రియదర్శికా నాగానందములను, కాళిదాసుని నాటకత్రయమును, భవభూతి యుత్తరరామ చరిత్రమును జేర్పుమార్పులు లేకుండ యథామూలముగా ననువదించి యుండిరి. మూలమున కన్యూనాధికమును వ్యాఖ్యాన ప్రాయమునైన యీయనువాదపద్ధతి యుభయభాషా పాండిత్యాంబోధి కుంభసంభవులైన వారికిదక్క నన్యులకు సాధ్యమానట్టిది కాదు. అవ్యాప్త్యతివ్యాప్తి దోషములకు గుఱిగాని యచ్ఛమైన యనువాదములు కావలెనన్న శ్రీ శాస్త్రులవారి యాంధ్రీకరణములనే చదువవలయును. మూలమునందలి భావములను బూర్తిగా గ్రహించుటకును గ్రహించిన భావములను మరల భాషాంతరమున సుస్పష్ట సౌష్ఠవముతో సరిదిద్దుటకును వలయు పాండితీప్రతిభా విశేషములు రెండును వారిని వలచివచ్చినవి. వారి యనువాదములు సాంస్కృతికాన్వయాదులతోఁగూడి కొంచెము క్లిష్టతరములుగా నుండుట నిజమేకాని యది వారికి సహజమైన కవితాశైలి లక్షణమేకాని యను వాద ప్రకారమునందలి యవగుణము కాదు.

సంస్కృత నాటకానువాదములతోఁ దృప్తినొందక శాస్త్రిగారు కొన్ని స్వతంత్రనాటకములనుకూడ నిర్మించిరి. సన్నివేశ సంఘటన, సంవాద నిర్వహణ రసపాత్రపోషణముల విషయమున వారందుఁ జూపిన ప్రతిభ యనన్యసామాన్యమై యచ్చెరువు గొల్పుచుండును. ప్రాచ్యనాటక లక్షణసంప్రదాయముల "హీనాణరూపకరసంబుకూడ నుదరంబు నిండార దిగఁద్రావి గ్రుడ్డఁ దేచి" ఛాత్రసాహస్ర ప్రచారంబుగా నాటకములను దన్నిగమంబును గఱపుటయందాఱితేఱి యుండిన వారగుటచే వారు తమ నాటకములను రంగసారస్వత ప్రయోజనముల రెండింటిని సమగ్రముగా నిర్వహించునట్లు సరిదిద్దఁజాలిరి. వారు రచించిన స్వతంత్రనాటకములు మూఁడు, ప్రతాపరుద్రీయము, ఉష, బొబ్బిలి యుద్ధము. మూడు మూఁడే త్రివిక్రముని పాదత్రితయమువలె నాంధ్రలోకమునంత నావరించి తెలుఁగు రసికుల ననంతరసవాహిలను నుఱ్ఱూతలూఁగించినవి.

ప్రతాపరుద్రీయము శాస్త్రులవారు నిర్మించిన స్వతంత్రనాటకములలో మొదటిది. రచనాకాలక్రమమునుబట్టియే కాక గుణపరంపరనుబట్టియు దానికే యగ్రస్థానము. ఇందలి వస్తువాంధ్రదేశచరిత్రమునుండి గ్రహింపఁబడినట్టిది. ఢిల్లీసుల్తాను సర్వసేనాపతియైన వలీఖాను మృగయాశ్రాంతుడై యరణ్యమున నిద్రించుచుండిన ప్రతాపరుద్రదేవుని శృంఖలాబద్ధునిఁ గావించి బందిగా ఢిల్లీకిఁగొనిపోవ మంత్రిపుంగవుఁడును, మతివిజితపురందర గురుఁడునైన యుగంధరుఁ డున్మత్తవేషమున ఢిల్లీకేగి రాజమాతకు వాగ్దానము చేసినట్లుగా నాఱు మాసములలో నాతని విడిపించి మరల నోరుగంటికిఁ గొనివచ్చుట యిందలి యితివృత్తము. ప్రతాపరుద్రుఁడు ఢిల్లీకిఁ గొంపోఁబడుచు మార్గమధ్యముననే మరణించినట్లు చరిత్ర చెప్పుచున్నది. శాస్త్రిగారీ విషయమును మార్చి యుగంధ రామాత్యుని రాజభక్తి ప్రజ్ఞాప్రభావములను బ్రదర్శించి నాటకమును మోదాంతముఁ గావించినారు. భాసమహాకవి విరచితమైన ప్రతిజ్ఞాయౌగంధరాయణమను నాటకమున యౌగంధ రాయణుఁడను మంత్రిశేఖరుఁడు మహాసేనునిచే నుజ్జయినిలో బందీకృతుఁడైన వత్సరాజునుదయను నున్మత్తవేషముతో నేగి కారాగృహవిముక్తుఁ గావించి కొనివచ్చిన కథాసంవిధాన మొండుగలదు. ప్రతాపరుద్రీయ కథావిధానమునకును దానికిని నితర వివరములలో నెంతభేదమున్నను శాస్త్రిగారి నున్మత్తపాత్ర నిర్మాణమునకుఁ బ్రేరేచిన దందలి యపూర్వరామణీయక విశేషమే యనితోఁచును. కథా విస్తరణమునను, సన్నివేశకల్పనమునను, పాత్రపోషణమునను శాస్త్రిగారు క్రొంగ్రొత్తపోకడలు పోయి భాసునుండి తాము గ్రహించిన బీజమును బ్రోదిచేసి పుష్పఫల విరాజమానమగు మహాపాదపముగా నొనరించినారు.

ముద్రారాక్షసమునందువలెఁ బ్రతాపరుద్రీయమునఁ గథావస్తువు రాజకీయతంత్రముతోఁ గూడినట్టిది. వలీఖాను యుగంధర మంత్రి నగరమునలేని తఱి మిత్రుఁడువోలెఁ బురముచొచ్చి నిద్రాపరవశుఁడైన రాజును మోసమున ఢిల్లీకిఁ దరలించుకొనిపోయెను. యుగంధరుఁడు రాజధానికిఁ దిరిగివచ్చిన పిమ్మట విద్యాసాధకవి వలన నేఁడెరిగృహీతుఁడయ్యెనని యెఱింగి, వలీఖానాకార సామ్య భ్రాంతిచేఁ జాకలియైన పేరిగానిని గొనిపోయెననియు రాజు వేఁటలో గాయపడి చికిత్సనొందుచుండెననియుఁ బ్రవాదము పుట్టించి, ఢిల్లీకేగి యున్మత్తవేషమున ఢిల్లి సుల్తాన్ పట్టుకపోతాన్ అని కేకలువేయుచు, వీథులవెంటఁ దిరుగుచు, చెకుముకి శాస్త్రి సాయమున వలీఖానును వంచించి, చంపించి, రాజును గారాగార విముక్తు నొనరించుటయే కాక యాతనితోఁగూడ ఢిల్లీ సుల్తానును దత్పరివారమునుగూడ నోరుగంటికిఁ గొనివచ్చెను. ఈ కార్యమును సాధించుటలో యుగంధరుఁడు ప్రదర్శించిన శేముషీ ధౌరంధర్య

మనస్య సామాన్యమైనది. చెకుముకి శాస్త్రియుఁ బెద్దసెట్టియు నాతని కొనర్చిన సాహాయ్యమప్రతిమానమైనది. ఎత్తుపైయెత్తులతోఁ గూడి యతిక్లిష్టములైన కథాంశసూత్రముల నిబిడ నీరంధ్రమైన చిక్కువోలె నల్లుటలో శాస్త్రిగారు చూపిన నేర్పుపూర్వమైనది. పూసతోఁ బూసనువలె నొక యంశముతో నింకొక యంశమును సరిగ్రుచ్చి వారు కథా సందర్భమున శిథిలబంధమైన యాణిముత్తెముల హారముగా సంతరించినారు. రాజు క్షతగాత్రుఁడై కోడఁదపూడిలో రామావధానుల యింటనుండెనని యుత్తరము తెప్పించుటతో జనార్దన విద్యానాధులు పేరిగాని రాజునందలముపై కోడఁదపూడినుండి కొనితెచ్చుటను, వలీఖాను రూపసామ్య భ్రాంతిచే రాజునకు బదులు పేరిగానిఁ గొనిపోయెనని ప్రవాదము కల్పించుటతో సెల్లి తన మగనిఁ దురకలు గొనిపోయిరని కొలువులో మొఱపెట్టుకొనుటను, చెకుముకి శాస్త్రి ఖుస్రూతో వలీఖాను గొనిపోయినది పేరిగానినే యని నమ్మకము పుట్టఁ బల్కుటతో యుగంధరుఁడాతనికి దుబాసిచేఁ దదనుగుణముగా రాయబారము పంపుటను, యుగంధరుఁడు పిచ్చివేషమున ఢిల్లీ వీధులలోఁ దిరుగుచుండుటతో చెకుముకి శాస్త్రి యాతఁడు మరిడీ జాడ్యముచే మరణించెనని వలీఖానున కెఱింగించుటను జతచేసి చూచినచో శాస్త్రిగారు కథాగ్రథనమున నెంతజాగరూకత వహించిరో తెలియనగును. బహువివర క్లిష్టమయ్యుఁ గథ మొదటినుండి తుదిదాక ప్రసన్న మధురముగా సాగిపోవుటయు వారి కథా నిర్మాణ కౌశలమునకు మూదలయై యలరారుచున్నది.

సప్తమాష్ట మాంకములు రెండును బిచ్చివేషమున నుండిన యుగంధరమంత్రి యద్భుతచర్యల కొలవాలములు. ఇట నున్మత్తపాత్రచిత్రణమున శాస్త్రిగారు చూపిన ప్రజ్ఞ శ్లాఘాలంఘన జాంఘికమైనది. పిచ్చివానిచేష్టలను ధ్వని గర్భితములైన యాటపాటలును, ఇతరులకుఁ గర్తవ్యమార్గము నుపదేశించుచుఁ దత్ఫలితము నెఱుంగుటయుఁ, జివరకు సుల్తాను మున్నగు వారెక్కినయోడనే యెక్కి వింతచేష్ట లొనరించుచునే కార్యసాఫల్యమును గాంచుటయు మిక్కిలి సహజసుందరముగా వర్ణింపఁబడినవి. తురకజవానులు నిరంతరము పిచ్చివాని ననుసరించుచు జాగరూకులై పరిశీలించుచుండియు నాతని పిచ్చితనమునే చూడఁగల్గిరి కాని యచ్చెరువు కలిగించు బుద్ధిపాటవము నవగాహనము చేసికొనలేకపోయిరి. ప్రతివిషయము పదివేలకన్నులతోఁ బరికించుచు, ననుమానమునకు సందీయని యవకతవక లొనరించుచు, నాతఁడు గస్తీవాండ్ర కన్నులలో దుమ్ముకొట్టుచుండెను. ఎప్పటికప్పుడే సుల్తాను నిన్ని నెలలకు పట్టుకపోయెదనని లెక్క చెప్పుచు, యథాతురముగాఁ బ్రతిన నిర్వర్తించి, సుల్తాను పరివారమును గన్నులులేని కబోదుల నొనరించి, అల్లవాఁడిల్లహో, ఇల్లవాఁడల్లహో యని పాడఁగల్గిన పిచ్చివాని ప్రజ్ఞపరబ్రహ్మతత్త్వమువలె నిదమిత్థమని వర్ణింపననువు కాకున్నది. ఆంధ్రనాటక ప్రపంచమునఁ బ్రతాప రుద్రీయమున కొంత యప్రతిమ ప్రశస్తిచేకూర్చిన యీపిచ్చివాని పలుకుపోకడలే.

అష్టమాంకమునందలి యంతర్నాటక మద్భుతమైన సంఘటనము. మంత్రియుగంధరుని మంత్రాంగమంతయుఁ గార్యరూపముఁ దాల్చిన గంభీరఘట్టమిది. వలీఖాను రాజును బరాక్రమముచేఁ గాక ప్రతారణముచేఁ దెచ్చుటయు, సుల్తానును సంహరించి యాతఁడు ఢిల్లీ సింహాసనము నధిష్ఠింపఁదలఁచుటయు నిందు వెల్లడిచేయఁబడినవి. చెకుముకి శాస్త్రి ఖుస్రూ దేహమునఁ జొచ్చి వలీఖాను కావించిన, కావింపనున్న క్రూరకర్మములను సుల్తానున కెఱుకపఱిచెను. సుల్తానును జంప నూహించిన వలీఖాను సుల్తానుచేతనే జంపింపఁబడెను. ఈసందర్భమున సుల్తాను నన్న కుమారుని రోదనము వినిపించుఘట్టమాతఁ డెప్పుడో యాచరించిన యాదారుణకార్యమును బ్రత్యక్షము గావించి పాపభీతిని గలిగించినది. తన్నుఁ బెంచి పెద్దచేసిన యన్న కుమారునిఁ జంపి తానార్జించిన పాపము తాను బెంచి పెద్దచేసిన వలీ తన్నుఁ జంపనూహించుటలో ఫలించినదని సుల్తాను భీతిల్లెను. ఈఘట్టము రంగమునఁ బ్రదర్శింప వీలులేని ఖుస్రూవధాదిక వృత్తాంతమును వివరించి కథాభాగమునకు నడుమఁ గల్గిన యంతరమును జక్కఁగా బూరించుచు నాటక రక్తికెంతో వన్నె చేకూర్చుచున్నది.

ప్రతాపరుద్రీయము వీరరసప్రధానమైన నాటకము. పరిపంథిహస్తంగతుఁడైన తమ యేలిని విముక్తుఁగావించి మరల నోరుగంటికిఁ దెచ్చుటలో యుగంధరామాత్యుఁడు చూపిన యుత్సాహమా రసమునకు స్థాయి. నాటకమున నెడ నెడ హాస్యకరుణాద్భుతరసములు చక్కఁగాఁ బోషింపఁబడినవి. రోగియైన రాజును రాణియు రాజమాతయుఁ జూడనరుదెంచి నిరోధింపఁబడిన సమయమున యుగంధరుఁ డరుదెంచి రాజమాతతో "కొనిపోయె నమ్మ నీపట్టిని యవనుఁడు దైవఘటన ఢిల్లీపురికిన్" అని చెప్పుఘట్టమునఁ గరుణరసము నిర్భరమైయున్నది. అష్టమాంకమంతయు నద్భుతరసమయము. ఇంక హాస్యము నాటకమునందంతట నవకాశము దొరకినచోట్ల నెల్ల వింత వింత రీతుల విస్తరింపఁబడినది.

శాస్త్రిగారీ నాటకమును రెండురాత్రుల కుద్దేశించియుండిరి. ఒకేరేయి నాడఁదలఁచినవారు చేయవలసిన సంగ్రహ విధానమును వారే సూచించియుండిరి. మొదటి రెండంకములను దుది రెండంకములను దగ్గించినను గథావిధానమున కంతరాయము రాదు. శాస్త్రిగారు హాస్యరసమునందలి యాసక్తిచేతనో, సామాజికజనమనోరంజన కౌతూహలముచేతనో మంత్రులు పేరిగాని స్వారస్యగ్రహణపాటవమును బరీక్షించు షష్ఠాంకమున కధికప్రాధాన్యము నొసంగిరి. నాకుంజూడ దాని స్థానమున యుగంధర విద్యానాధసమాగమము తోడను, మంత్రాంగ నిశ్చయముతోడనుగూడిన చతుర్థాంకమునుంచుట యుచితమేమో యని తోఁచుచున్నది. వలీఖాను నిద్రితుఁడైన రాజును జెఱపట్టిన వృత్తాంత మంతర్నాటకమున మాత్రము వివరింపఁబడియుండుచో నాటకరక్తికి మఱింత యుత్కర్ష కలిగించియుండును.

సిద్ధసుధా ప్రవాహమని శాస్త్రిగారే వర్ణించిన యుషానాటకము 'కోమలమతిసుగమంబగు దృశ్య ప్రబంధమొకటి అధ్యర్థయామమాత్ర ప్రయోజననీయము నిర్మించి యిమ్మని' కొన్ని నాటకసమాజములవారు వారిని గోరిన కోరికకుఁ బూరణముగా 1901 వ సంవత్సరమున రచింపఁబడినది. ఉషాపరిణయ బాణాసురగర్వభంగ వృత్తాంతములు భాగవత హరివంశములందున్నవి. శాస్త్రిగారీ

రెండు గ్రంథములనుండియుఁ గొంత కొంత కథాభాగమును గ్రహించి, కొంత కథా భాగమును గల్పించి మిశ్రవస్తుకముగా నీ నాటకమును సంతరించిరి. ఇందుఁ గథావాహిని యిరుపాయలు గాఁ బ్రవహించినది. అందొకటి బాణాసురుఁ డుగ్రమైన తపస్సొనరించి శివుని మెప్పించి పొందిన వరము శ్రీకృష్ణునితోఁ గల్గిన బవరమున ఫలించుట. రెండవది యుష స్వప్నమునఁ గాంచిన యనిరుద్ధసమాగమమును జిత్రలేఖ సార్థకము కావించుట. బాణాసుర పురమున బంధింతుఁడైన యనిరుద్ధుని విడిపించుటకై శ్రీకృష్ణుఁడు దండెత్తివచ్చి, బాణాసురుని బాహుచ్ఛేదము కావించి, యుషానిరుద్ధులకు విముక్తి కల్గించిన ఘట్టము పై రెండు కథా వాహినులకును సంగమస్థానము. ఇట్లే నాటకమున శృంగార వీరరసములు రెండును సమానాంతరముగాఁ బ్రవహించి యంతమున నబ్బురముగా నైక్యము నొందినవి.

పంచమాంకమునఁ జిత్రలేఖ మరణోన్ముఖురాలై యుండిన యుషనోదార్చి యంధకార ప్రాసాదపృష్ఠమునకుఁ గొనిపోవ నామె ప్రియుని విరహాలాపము లాలించి శాంతినొంది చిత్రరేఖయుపదేశము ననుసరించి హారముతో ననిరుద్ధుని మీఁదఁ జిలుకయై వ్రాలినఘట్టమే రమణీయమై యాయువదంపతుల పవిత్రప్రణయమునకుఁ దార్కాణముగా నున్నది. తృతీయాంకమున ననిరుద్ధుఁడు కావించిన చంద్ర మలయానిలాద్యుపాలంభమును, జిత్రలేఖ పలువురు సుందరాంగుల చిత్రములు రచించి యుషకు వివరించిన తద్వర్ణనములును ప్రబంధోచితములుగా నున్నవి. ఇందలి ప్రణయవృత్తాంతము శ్రీహర్షదేవుని నాటికలందలి కథాసంవిధానము ననుసరించుచున్నది. చిత్రలేఖ పాత్రమును శాస్త్రిగారు సుస్పష్టరేఖలతో దిద్ది నాటక రక్తికి వన్నె చేకూర్చినారు. ఇందచ్చటచ్చట వర్ణింపఁబడిన యతిలోక సంఘటనములు నాటకముయొక్క సహజత్వమునకుఁ గొంత కొఱంత కలిగించుచున్నవి. కరేణుకాగంభీర వేదుల ప్రణయవృత్తాంతము హాస్యరసమున కాలవాలమై సామాన్య సామాజిక జనహృదయ రంజనమునకై యుద్దేశింపఁబడినట్లున్నది. సప్తమాంకమునందలి శివజ్వరవిష్ణుజ్వరముల ప్రవేశము భగవంతులకు లేని భేదమున జ్ఞానవశమున భక్తులు కల్పించుకొని పొందుచుండు పరస్పర క్రోధ ద్వేషములను జక్కఁగాఁ బ్రదర్శించుచున్నది.

బొబ్బిలి యుద్ధ నాటకముకూడఁ బ్రతాపరుద్రీయమువలె నాంధ్రదేశచరిత్రకు సంబంధించిన వస్తువుతోఁ గూడినదే. పెద్దాడ మల్లేశము రచించిన పాటయు, రంగరాట్చరిత్రమను పేరుగల పద్యకావ్యమును ఈనాటకమున కాకరములైన గ్రంథములు. వీనియందలి ప్రధానకథను గ్రహించి రసపాత్రపోషణమునకును గథాసంవిధానరామణీయకమునకును అలఁతి యలంతి మార్పులొనరించి శాస్త్రిగారీ నాటకమును సంతరించిరి. విజయరామరాజు బొబ్బిలివారిపై దండెత్తి వారినోడింపఁజాలక యాయవమాన మాత్సర్యముల ప్రేరణచేతను, బొబ్బిలికిఁ దనయన్న కుమారుఁడైన యానందరాజును రాజుగాఁ జేయవలెనను దురాశచేతను, బుస్సిహైదరులకు బొబ్బిలివారిపైఁ గొండెములు చెప్పి, బొబ్బిలికోటను ముట్టడింపఁజేసి దానిని సర్వనాశనము చేయించిన విషాదగాథయిది. ఇందు బొబ్బిలి వీరులును, వీరవనితలును జూపిన శౌర్యసాహసములును, మానాభిమానములును మఱియే కాలమునఁ గాని, యే దేశచరిత్రమునఁ గాని కానరాక నిరుపమానములై విరాజిల్లుచుండును. ఇందలి ప్రథమాంకమంతయు విజయరామరాజు కావించిన కుట్రకు నిలయమైయున్నది. మూఁడవయంకమునందలి రాయబారమున నాతురకరాయదారి యౌదార్యమును వెలమవీరుల యాభిజాత్యాభిమానమును వెల్లడియగుచున్నవి. పంచమ షష్ఠాంకములు యుద్ధప్ర[illegible]నముతోఁ గూడి వెలమవీరుల యపారవిక్రమమున కాదర్శములై యలరారుచున్నవి. ఇందు నివేదకులు కావించిన యుద్ధవర్ణనము సూక్ష్మాంశ వివరణసహితమై విశదముగానున్నను గొంచెము విసుగుకల్పించుచున్నది. ద్వితీయాంకమున వేంకటలక్ష్మి చేసిన యూరేగింపువర్ణనము ప్రబంధధోరణిం బట్టినది. నవమాంకము తాండ్రపాపారాయఁడు కావించిన ప్రళయతాండవమునకు రంగము. ఈనాటకమునందలి కథాసంవిధానము సుఘటిత సంధిబంధమై యాద్యంతము రసనిర్భరమై యొసలారుచున్నది.

ప్రతాపరుద్రీయమున ధర్మవీరమువలె 'బొబ్బిలి నాటకమున యుద్ధవీరము పరాకాష్ఠనందినది. అసలు శాస్త్రిగారికి శృంగార రసమునకంటె వీరరసమున నభిమాన మెక్కువ. తత్పోషణమున వారు చూపు నేర్పనన్యసామాన్యమైయుండును. వీరరస ప్రధానములైన నాటకములలో వారెడనెడఁ బ్రదర్శించుచుండు కరుణనిర్భరములైన ఘట్టములతినిశితములై పాఠకుల మనోనయనముల నార్ద్రముల నొనరించుచుండును. రంగారావు తాండ్రపాపారాయనికి వ్రాయించిన యుత్తరమును రాణిబిడ్డలను దీసికొని రంగారావు చెంత కరుదెంచిన ఘట్టమును, కుమారుని వేంకటలక్ష్మి చే సామర్లకోటకుఁ బంపిన సన్నివేశమును బరిణతిమైన యట్టి కరుణరసమునకుఁ బట్టుకొమ్మలై యున్నవి. అతిశూరులును, అభిమానధనులునైన రంగారాయాదులు పరులచేతులఁ జచ్చుట కంగీకరింపక స్వయముగాఁ బొడుచుకొని మృతినొందుటయు, వెలమవనిత లాసన్న భర్తృవియోగ వ్యసన దుఃఖితలై యతిధైర్యమున కృపాణులకో కృశానులకో యెరయగుటయు విషాదభావ సాంద్రములై ప్రధానమైన వీరరసమున కెంతయో నైశిత్యము చేకూర్చుచున్నవి.

## సామాన్య లక్షణములు.

ప్రాచ్యపాశ్చాత్య నాటకవిధానములు రెండును సమగ్రముగా నెఱింగిన వారగుటచే శాస్త్రిగారా యిరుతెఱఁగులందలి మేలి గుణముల సేకరించి తమ నాటకముల నుత్తమ కళాసంపన్నములుగా సృష్టింపఁజాలిరి. నాటకములను వ్రాయుటయందెంత నైపుణ్యమో తగిననటుల నెన్ని వారిచే నా నాటకములఁ బ్రదర్శింపజేయుటయందుఁగూడ వారికంత యుత్సాహము. ఆ కారణముచేతనే వారి నాటకములు పఠనప్రయోగములు రెంటనుఁ బరిణతములై సర్వజనామోదమును బడయఁజాలినవి. వారి నాటకములన్నింటఁ గేవలప్రయోగ దృష్టితో సామాజిక జనమనోరంజనమునకై కల్పింపఁబడిన ఘట్టము లెన్నియో కలవు. ప్రతాపరుద్రీయమునందలి పేరిగాని స్వారస్య గ్రహణ పరీక్షతోఁగూడిన షష్ఠాంకమును, నవమాంక పంచమస్థలకమునందలి పేరిగాని రాజభోగానుభవ కథనమును, బొబ్బిలియుద్ధమునందలి బ్రాహ్మణులయుఁ బోఁతులయు సంభాషణమును, ఈ సాపరి

ణయమునందలి కరేణుకా వృత్తాంతమును నేతత్ప్రయోజన ప్రధానములే.

సాధారణముగాఁ బండితులు మాటలాడునప్పుడు హాస్యరసాభిమానమును జూపినను వ్రాయునప్పుడు దానిని స్మరింపనైన స్మరింపక గంభీరహృదయులై వ్రాయుచుందురు. శాస్త్రిగారందుకపవాదము. హాస్యరసమున వీరికిఁగల యభిమానమును దత్పోషణమున వీరుచూపు నభినివేశమును నిరుపమానములై యుండును. అవకాశము కలిగిన చోట్ల నెల్ల వీరు తమ నాటకముల నారసము నెంతో సమర్థతతోఁ బ్రకటించియుండిరి. అది ఉషా ప్రతాపరుద్రీయములలో విరివిగను బొబ్బిలియుద్ధమునఁ బరిమితముగను బ్రదర్శితమైయున్నది. గంభీరములైన కరుణ వీరముల కాకరమాటచే బొబ్బిలి యుద్ధమునం దద్రసప్రవేశనమున కంత యవకాశము చిక్కినది కాదు. అయ్యుఁ గోమటివనితలు హైదరు తలపై సంబలిచల్లినప్పుడును, జెనిఁగిన నగారాకుండ హైదరు నెత్తిపైఁబడినప్పుడును, బంచమాంకారంభమునందలి ప్రవేశకములోని పౌరుల సంభాషణమునందును వారిట్లో యారసమున కొక్కింతతావు కల్పించినారు. ఇంక నుషా ప్రతాపరుద్రీయములం దది ప్రతిఘట్టమునందును బ్రత్యక్షమగుచునే యుండును. ఉషాపరిణయమున కరేణుకా గంభీరవేదుల ప్రణయ వృత్తాంతమును, విదూషకుని సంభాషణమును దానికాశ్రయములై యున్నవి. కరేణుకా గంభీరవేదుల వృత్తాంతము నదియించుక మోతాదై సభ్యతాసీమ నతిక్రమించుచున్నది. (అట్లైతేమరిరా. ఇప్పుడే పెళ్ళి శోభనంఅన్నీ కానీ. లంజకూతుళ్ళారా? నే నేమిలాగలేనా? నే నేమి లాగలేనా) ప్రతాపరుద్రీయమునందలి హాస్యము మాత్రము పాత్రానుగుణమై, సభ్యమును స్వచ్ఛమునై కడుపుబ్బ నవ్వుపుట్టించుచున్నది. ఇందిది పదవాక్యపాత్ర సన్నివేశగతమై వివిధరీతుల విస్తరింపఁబడియున్నది. చెకుముకిశాస్త్రి ప్రయోగించిన ఆస్థాన ఈస్థాన, బోడి, కబడ్దార్ శబ్దములును, చెప్పివేస్తాననుటకు చెప్పవేస్తాననియు నిశ్చయమునకు నిక్షేయమనియుఁ గొందఱు పల్కుటయుఁ బదగతమైన హాస్యమునకుఁ దార్కాణములు. చాకలి వేషముననున్న వేఁగువాడు మాపెళ్ళాలు మీపెళ్ళాలే అని జనార్దనమంత్రితోఁ బల్కుటయు, పేరిగాడు నాను నరికేశినా ఖతంపతానుగాని ఎల్లిలేకపోతే బతకలేనని పల్కుటయు వాక్యగత హాస్యమును సూచించుచున్నవి. విద్యార్థుఁడు పేరిగానికి జోస్యము చెప్పునప్పుడును, గుఱ్ఱముచేఁ దన్నులు తిన్నపిమ్మట కన్ను ముక్కుపోయిన తురక సిపాయి లాండొరులతో మాటలాడునప్పుడును సన్నివేశగతమైన హాస్యమున్నది. పాత్రగతమైన హాస్యము నాటకమునఁ బేరిగాని నాశ్రయించి పెక్కుచోట్లఁ గాన నగుచున్నది. పేరిగాడు సంగీతము వినునప్పుడు సారచెంబుతొడు నకు సంబంధించిన హాస్యమింతింతన రాక వింతగానున్నది. ఇట్టి హాస్యరసపూరిత ఘట్టములను శాస్త్రిగారు సృష్టించుటకూడ సామాజిక మనోరంజన దృష్టితోడనే.

శాస్త్రిగారికిఁ జారిత్రక వీరపురుషులపై నాదరాభిమానము లెక్కువ. అందును నాంధ్రదేశ చరిత్రయన్న వారికిఁగల ప్రీతి యతిమాత్రమైనది. ఈ ప్రీతియే వారిచేఁ జరిత్రాత్మక వస్తువిస్తరణముతోఁగూడిన ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధ నాటకములను వ్రాయించినది. బాల్యమునవారు తండ్రిగారు చెప్పఁగాఁ బ్రతాపరుద్రదేవుని కథవిని తదాకృష్టులై పెరిఁగి పెద్దలైన పిమ్మట దానిని గథగా వ్రాయుటయేకాక నాటకముగాఁగూడ నిబంధించిరి. శీలమాన సంరక్షణమునకై ప్రాణములఁ దృణములుగా విసర్జింపఁజాలు వెలమవీరులయుఁ దదంగనలయు వర్తనములు వారి నెంతో యాకర్షించి నాటకరచనమునకుఁ బ్రేరేచినవి. ఈనాటకమానుషంగికముగా, దదాశ్రయులును వెలమవంశ విభూషణులునైన వెంకటగిరి రాజాగారి సంతోషమునకును హేతువైనది. ఈరెండు నాటకములలో శాస్త్రిగారి పరిపక్వమైన జాతీయతాభిమానము సర్వతోముఖముగా సాక్షాత్కరించుచున్నది.

పాత్రపోషణమున శాస్త్రిగారి దండెవేసినచేయి. చైతన్యము లేని చెక్కడపు బొమ్మలను గాక సజీవములైన పాత్రలను వారు చాకచక్యముతో సృజించుచుందురు. ప్రతాపరుద్రీయమునందలి యుగంధర చెకుముకిశాస్త్రుల పాత్రములును పేరిగాని పాత్రమును పాఠక సామాజికుల మనఃఫలకములఁ జిత్రితములై మఱచిపోవుదమన్నను మఱపునకు రావు. పరిణతబుద్ధులకు యుగంధరుఁ డెల్లపుడు నుత్తమమంత్రి మూర్తిద్వితయముతో స్పష్టముగా గోచరించుచునే యుండును. ఇట్లే బొబ్బిలియుద్ధమును జూచినవారు రంగారాయ వెంగళరావుల వీర్యమానోద్రేకములను, బాపారాయని శౌర్యస్వామిభక్తులను, మల్లాంబ శీలాభిమానమును, వేంకటలక్ష్మి ప్రభుభక్తిని, విజయరామరాజు క్రౌర్యకాపట్యములను, బుస్సీ సహజౌదార్యమును విస్మరింపఁజాలరు. రంగారాయాదులు విరోధుల పాలికి భీకర రాక్షసులైనను మృదుభావమండితములైన మానవహృదయములు లేని వారుకారు. యుద్ధమునకుఁ బోవుటకుముందు రంగారాయఁడు తమ్మునిఁ గౌఁగిలించుకొని "దైన్యమని తలంపకుము. వీరులమైనను మనుష్యులమే కదా" యని పల్కుట యిందుకుఁ దార్కాణము. శాస్త్రిగారికిఁ బురుషపాత్ర చిత్రణమున నున్నంత నేర్పు స్త్రీపాత్రచిత్రణమునఁ గానరాదు. వారు చిత్రించిన స్త్రీపాత్రలలోని కెల్ల నెల్లి పాత్రయే సుస్పష్టరేఖలతోఁ దీర్చి దిద్దినట్లుండును. జాతిచే రజకియయ్యు నీతిచే నామె నాతులకు మేలుబంతియై యలరారుచున్నది. దశమాంకమున రాజా రజకదంపతుల తగవుపరిష్కరించు సందర్భమున నెల్లి "ఎఱ్ఱిదాన్ని రచ్చించండి మారాజా" అని పలుక చెకుముకి జనార్దనాదులు "నీవంటి వెఱ్ఱి కులస్త్రీల కందఱకు నున్నఁ దరించిపోదు"రని యామెను బ్రశంసింతురు. అల్పజాతి సంజాతయయ్యు నామె మగనిపైఁ జూపిన ప్రేమాభిమానము లట్టివి.

విప్రపురంధ్రీ శుభాశీర్వాదపాటవముపై శాస్త్రిగారి కమితమైన విశ్వాసము. వారిని యథోచితముగాఁ బూజించి తృప్తినొందించినచో నాపదలు నిరస్తములగుటయు శుభపరంపరలు చేకూరుటయు సంభవించునని వారి యభిప్రాయము. ప్రతాపరుద్రీయ బొబ్బిలి యుద్ధనాటకములలో రాణులు ముత్తైదువలైన విప్రకుటుంబినుల నాహ్వానించి యర్చించిన దృశ్యములు రెండున్నవి. ఈరెండును గొంచెమించుమించుగా సదృశరచనకలవై శాస్త్రిగారి వైవిశ్వాసమును దేటతెల్లము కావించుచున్నవి.

శాస్త్రిగారు తమ నాటకములలో నందందు స్వానుభవసిద్ధములైన విషయములు నెన్నింటినో చొప్పించియున్నారు. వారి జీవిత

చరిత్ర విశేషముల నెఱింగినఁగాని యీరహస్యము వ్యక్తముకాదు. బాల్యమున రాజమహేంద్రవరములో నుండునప్పుడు శాస్త్రిగారును వారి యనుజులైన వేంకటసుబ్బయ్యగారును బలువురు మిత్రులతో గోదావరిలో నీదుటకు బయలుదేఱిరఁట. శాస్త్రిగారీత సరిగా రానందునఁ గొంతవఱకేగి యలసి మునిఁగిపోవుటకు సిద్ధమైరి. వారి సోదరు లెల్లోవారిని నేలతగులువఱకు నతికష్టముమీదఁ గొని పోయిరి. అప్పటికిని గండము గడచినట్లులేదు. ఇంతలో దూరమున నొక పడవ కనఁబడఁగా వారు 'పడవోయి పడవ' యని కేకలు వేసిరఁట! కొంతసేపటికా కేకలు విని పడవవారు ఏం బ్రాహ్మలయ్యా! ఏంపనయ్యా గోదావరిలో అని కసరి వారిని బడవపై నెక్కించుకొని గట్టుచేర్చిరఁట! శాస్త్రిగారీ యనుభవమును విద్యానాథుఁడు గోదావరిలో నీదుకొని యేఁగుచుఁ బడవవారిని రక్షణార్థమై పిలుచునప్పు డుపయోగించిరి. శాస్త్రిగారు విశాఖపట్టణమునుండిన తఱి వారియింటి పొరుగుననున్న వృద్ధుఁడొకఁడు జవ్వనియైన తన భార్యను "నేను గండచీమను. ఏమనుకున్నావో పట్టుకుంటే వదల"నని పల్కి బెదరించుచుండువాఁడుట! శాస్త్రిగారామాటలనే ప్రతాపరుద్రీయమునఁ బిచ్చివానిచే శిష్యులతోఁ బలికించినారు. ఇట్లే ప్రతాపరుద్రీయమునందలి స్వారస్యపుఁ బాటకిని, ఆనందబాష్పములకును సంబంధించిన విశేషములను శాస్త్రిగారు జనవినోదినిలో సంగీతమును గుఱించిన వ్యాసములో ముచ్చటించినారు. బొబ్బిలియుద్ధ నాటకమున బుస్సీ మనస్సంతాపకరమైన కార్యమేదైన జరిగినప్పుడు 'జిహోవా' యని పల్కుచుండును. శాస్త్రిగారి జవకుల నొకసారి యుద్యోగమిచ్చినదొర యాయన తన దర్శనమునకు రాలేదని కోపమున నిమ్ముద్యోగము నుండి తొలఁగించిన నేమిచేసెదరని బెదరింప నాయన వెంటనే తడవుకొనక బైబిలు చర్చల సందర్భమున వినియున్న వారగుటచే 'జిహోవా' యని బదులు పల్కిరఁట. శాస్త్రిగారీ సంఘటనమును జ్ఞప్తియందుంచుకొనియే కాఁబోలు బుస్సీచేఁ గొన్ని సందర్భములలో నా మాటననిపించిరి. ఈవిధముగనే శాస్త్రిగారు తమకు సమకాలికులైన వ్యక్తులను సందర్భోచితముగాఁ దమ నాటకములం దెక్కించిన భాగములు కొన్నియున్నవి. విశాఖపట్టణమునందలి యొక మద్యవిక్రేత కాకాలమున బొడ్మిన్ అను పేరుండెనఁట! బొబ్బిలి యుద్ధమున సారాయిలేనిదే యుద్ధముచేయ నిరాకరించిన సిపాయులకు మామాటగా బొడ్మిన్‌తో వారికి సారాయి మామూలు కొలఁత ప్రకారమిమ్మని చెప్పు"మని యావార్త తెచ్చిన వానితో బుస్సీపల్కియుండెను. ప్రతాపరుద్రీయమునందలి ఘనపండాదిగ్విజయజ్యోతిషికులును, గులాంద ప్రక్షేర్మనిషీకవియు శాస్త్రిగారికి సమకాలికులలో పరిచితులలో యైనట్టివారే.

శాస్త్రిగారు ప్రతాపరుద్రీయము రచించిన క్రొత్త దినములలో నందలి భాషా ప్రయోగౌచిత్యమును గుర్తింపలేకయు నీర్ష్యాద్వేషముల నడంచుకొనలేకయు సమకాలిక పండితులు కొందఱు దానినీ దీవ్రముగా విమర్శించియుండిరి. అందుచేత నేవారు "వేంకటరాయశాస్త్రి కృతి వెంగలిమూక లెఱుంగశక్యమే" యనియు "వ్రాసితిమున్ ప్రతాపుకథ పండితమానులగుండె నీరుగాననియు" రెండు మూఁడుచోట్ల నుద్ఘాటించియుండిరి. ఇంతేకాక ప్రతాపరుద్రీయమున పిచ్చివానినోట తమ శత్రువులకు నాశమంగళముపాడించిరి. "వీరడు రాగడు నాకు శూన్యం పెట్టినారు. వాళ్ళకి శాశాపంచూడు, వీరడికి రాగడికి నాశమంగళం" అన్నమాట పిచ్చివానిది మాత్రమేకాక వేంకటరాయశాస్త్రిగారిది కూడను. బొబ్బిలియుద్ధ నాటకమున సూత్రధారుఁడుకూడ నీవైరి వర్గము ప్రసక్తి తెచ్చి వారికిఁ బెద్దలచేఁ జెంపపెట్లగునని సూచించినాఁడు.

శాస్త్రిగారు పాత్రల సంభాషణద్వారా ఒక్కొక్కప్పుడద్భుతముగా భావికార్య సూచనకావించుచుందురు. ఈ పద్ధతి ధ్వనివంతమై సామాజికుల కపారమైన యానందము కలిగించుచుండును. సంభాషించు పాత్రలలో నొక్కరు పల్కుమాటల నింకొకరు సామాన్యార్థముతోనే గ్రహించి తదనుగుణముగా నుత్తరము లొసంగుచుందురు. కాని యందేదో గంభీరమైన విశేషార్థమిమిడియుండి కథముందుకు సాగినకొలంది క్రమక్రమముగా వ్యక్తమగుచుండును. జనార్దనుఁడు నౌకర్లతో మీరు తురకలను జక్కఁగాఁ గొలువవలయునని పలుక వారు "తురకలపని అయిందనిపించి మఱీవొస్తా." మని పల్కుదురు. వలీఖాను చెఱుముకిశాస్త్రితో "సాస్తుర్లూ మాకి ఆమొత్తం సున్న చెప్పి వెల్లండి చాలు"ననఁగాఁ చెఱుముకి "అట్లే చేసెదను ఒకటొకటిగా చెప్పి మొత్తముచేసి సున్న చేసిపోయెద"నని పల్కును. లతాను వర్తకులు తెచ్చిన వస్తువుల వెలలుకట్టిన స్నేహమునకు "మీకి వోరంగోల్కి వదిలి వేస్తాం మరి తమరు బందిఖానాకిరావద్ద"ని రాజుతోఁ బల్క నాతఁడు "సుల్తాన్ భాయీ జవాబ్ పదిమాటలు యెందుకు మరి యిక్కడికి రాం" అని చెప్పును. తరువాత జరిగిన కథావిధానమునుబట్టి చూడనీ పైని పేర్కొనఁబడిన వాక్యములెట్లు గంభీరార్థ గర్భితములై భావ్యర్థసూచనము కావించుచున్నవో తెలియనగును.

ఇట్లే పాశ్చాత్యులు *Dramatic irony* అని చెప్పుకొండొక నాటకీయ చమత్కారముతోఁ గూడిన వాక్యములు శాస్త్రిగారి నాటకము లందచ్చటచ్చట గానఁబడుచుండును. ఇందుసంభాషించు పాత్రలలో నొకరు పల్కుమాట లాసందర్భమున రెండవవారికి సామాన్యముగానే కనఁబడినను ఇతరులకు వింతర్థముతో గోచరించుచుండును. పేరిగానిఁగూర్చి యుగంధరుఁ డెల్లికి జోస్యము చెప్పుమనఁగాఁ జెనుముకి "దేవతార్చన పెట్టెలో సాలగ్రామమువలెఁ బేరిగానిని సవారిలో కాపాడుచున్నారు. ఖయిదులోనున్నాఁడే కాని రాజయినాఁడు. వానికేమి లోపమని పల్కును. ఈమాటలు తురకలు పేరిగానిని గొనిపోయి రను కొనుచున్న యెల్లికొక విధముగాను, అతఁడు ప్రతాపరుద్రుఁడుగానంతఃపుర నిబద్ధుఁడైయుండెనని యెఱింగిన సామాజికుల కింకొక విధముగాను అర్థమగుచున్నవి గదా! సుల్తానును వర్తకులోడలోనికిఁ గొనిపోవుచుండఁగా పిచ్చివాఁడు, అహో సుల్తాన్! నిన్ను నేను మాయింటికి తీసుకొనిపోతూవుంటే వీళ్ళునన్ను అడ్డుతున్నారని పల్కినపల్కులుకూడ నిట్టివే. తురక సౌదాగరు వేషమునఁ బ్రతాపరుద్రుఁడు వర్తకులు తెచ్చిన వజ్రమువెలకట్టి చెప్పఁగా నావర్తకులు "జగత్ప్రభూ! మీరు సాక్షాత్ప్రతాపరుద్రులవారే. స్వర్గస్థులగుట అబద్ద" మని పల్కుదురు. ఈమాట సులతాను, వలీఖానుల కిరువురికి రెండువిధములుగా వ్యక్తమాటయే కాక సామాజికులకు యథార్థవిషయమును బోధించి

యాశ్చర్యము కలిగించుచున్నది. ఇట్టి చమత్కారముతోఁగూడిన వాక్యములు ప్రతాపరుద్రీయమునిండ నెన్నియో కానిపించును. అనిరుద్ధుఁ డుషాకన్య సౌందర్యమును విదూషకునికి వర్ణించి చెప్పుచు "ఉషావతారమంచుఁ గాంతనూహ సేయుదున్ సఖా" యని పల్కును. అనిరుద్ధునికిఁ దాను వర్ణించుకన్య యుషయే యను సంగతి తెలియదు. కాని సామాజికులకుఁ దెలియును. అందుచే నిచ్చట నాతఁడు ప్రయోగించిన యుషావతార మనుమాట చమత్కారగర్భితమై యిరుతెఱఁగుల యర్థమును వెల్లడించుచున్నది.

సంస్కృత నాటకకర్తలు క్రొత్తపాత్రయేదైన ప్రవేశించునప్పుడు రంగముననున్న పాత్రల సంభాషణద్వారా తత్ప్రవేశము నిందుకముందుగనే సూచించుచుందురు. ఇట్టి కళావిశేషము సంస్కృతనాటకములు పెక్కింటిలోఁ గాననగుచుండును. సంస్కృతనాటక కళాసర్వస్వమును జూఱగొన్న వారగుటచే శాస్త్రిగారు తమ నాటకములలో నట్టి పాత్రప్రవేశసూచనలను పెక్కుచోట్లఁ గావించియున్నారు. ప్రతాపరుద్రీయమున ఖుస్రూ "ఈసమయంలో యంధరంరాజ్ సాస్తురుల్ భాయివుంటే యెంతో షహాయుంవుండు" నని యనుకొనుచుండఁగా "సాయముగానుండు నెడల సిద్ధముగానున్నా"నని చెకుముకిశాస్త్రి ప్రవేశించును. ఇట్టి సూచనలు మిగిలిన రెండు నాటకములందుఁగూడఁ గలవు.

శాస్త్రిగారు సంస్కృతనాటక లక్షణములను జాలవఱకను సరించినారు. ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధములలో వీరము ప్రధానరసము. తదనుగుణముగా నానాటకముల ప్రస్తావనలందు శరదృతువు వర్ణింపఁబడినది. ఉషా నాటకమునఁ బ్రధానరసము శృంగారము. మొదటి రెండు నాటకములందును వస్తువు చరిత్రాత్మకమైనది. మూఁడవదానఁ బౌరాణికమైనది. మూఁడింటియందును నాయకులు ధీరోదాత్తులే. ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధముల బదిబదియంకములును, ఉషానాటకమున నేడంకములును, నున్నవి. మూఁడు నాటకములందును వృత్తవర్తిష్యమాణకథాంశములను, యుద్ధాద్యుద్వేగకర విషయములును సందర్భానుగుణముగా విష్కంభప్రవేశకములచే సూచింపఁబడినవి. బొబ్బిలినాటకమున యుద్ధక్రమమంతయు నివేదకులచే వర్ణింపఁబడినది. ఉషానాటకమున బాణాసురబాహుచ్ఛేదవృత్తాంతమును జిత్రలేఖ విష్కంభమున సూచించినది. ఈ విధముగా ననుచితములు నీరసములును నుద్వేగకరములునైన విషయములను శాస్త్రిగారు పెక్కుచోట్ల సూచ్యమాత్రములను గావించినను గొన్నిచోట్ల సూచ్యములు కావింపవలసిన వానిని రంగముననే ప్రదర్శించియుండిరి. రంగారాయాదులు స్వయముగాఁ బొడుచుకొని చనిపోవుట, తాండ్రపాపారాయఁడు విజయరామరాజును జిత్రవధ కావించుట మున్నగు ఘట్టములతోఁగూడిన దృశ్యములిందుకు నిదర్శనములు. విద్యానాథుఁడు గోదావరిలో నీతకొట్టుకొని పడవల కడకుఁబోవుట రంగమునఁ బ్రదర్శించుటకు వీలగునట్టిది కాదు. నవమాంకమున రాజపురప్రవేశోత్సవమును వర్ణించు విద్యాధర దంపతుల సంభాషణము విష్కంభప్రాయముగా నున్నది.

సంస్కృతనాటకములందంకములను దృశ్యములుగా విభజించు నాచారము లేదు. అందొక్కొక్క యంక మొక్కొక్క రంగము. ఆంగ్లనాటకములలో నట్లుకాక యంకము లావశ్యకమునుబట్టి కొన్ని రంగములుగా విభజింపఁబడియుండును. శాస్త్రిగా రాపద్ధతి ననుసరించి తమ నాటకములందలి యంకములను బలుస్థలకములుగా విభజించియుండిరి. ఐక్యత్రయమున వీ రొక్క కార్యైక్యమును మాత్రమే పాటించిరి. మూఁడు నాటకములందును రంగములు కథాసందర్భము ననుసరించి వివిధప్రదేశములకు మాఱినవి. ప్రతాపరుద్రీయ బొబ్బిలి యుద్ధోషా నాటకములందుఁ గథ జరుగుటకుఁ గ్రమముగా నేడు మాసముల పదునైదు దినములు, ఒక సంవత్సరము పట్టియుండును.

బొబ్బిలి యుద్ధనాటకము చిన రంగరాయని పట్టాభిషేకముచే మోదాంతముగానే కానిపించినను ఆద్యంతము విషాదచ్ఛాయాసమావృతమై యున్నది. అందునాయకుఁడైన రంగారాయఁడే కాక యనవద్య చరిత్రులును, వీరశిరోమణులును, సామాజిక సానుభూతి సమాకర్షణ సమర్థవర్తనులునైన మహనీయులు పలువురు మరణించిరి. ఆదృష్టితోఁ జూచిననది యుదాత్తమైన విషాదనాటకమే యనిపించును. క్రూరుఁడైన విజయరామరాజందుఁ బ్రతినాయకుఁడు, నాయకమరణావసానములైన విషాదాంతనాటకముల రచించు సంప్రదాయము మనము పాశ్చాత్యులనుండి గ్రహించినదే.

శాస్త్రిగారు తమ మూఁడు నాటకములను సంస్కృతనాటక లక్షణము ననుసరించి నాందీప్రస్తావనలతోడనే యారంభించిరి. నాందులలోఁ జంద్రనామాంకితత్వనియమము కాని పదనియమము కాని పాటింపఁబడలేదు. అవియాశీఃపూరితములై యించుక కావ్యార్థమును మాత్రము సూచించుచున్నవి. ప్రస్తావనలలోఁ బ్రరోచనము, కవి నామాదికథనము, కావ్యార్థసూచనము, పాత్రప్రవేశసూచనము యథాలక్షణముగ నొనరింపఁబడినవి. ఉషలోని ప్రస్తావనలో ఋతువర్ణనము లేదు. మిగిలిన రెండింట శరదృతువర్ణనము కావింపఁబడినది. నాటకరామణీయమున కుత్కర్షకలిగించు సాధనములలోఁ జమత్కారగర్భితమును సుసంబద్ధమునగు సంవాదసరణి యొకటి. శాస్త్రులుగారి నాటకములన్నింటిలో, ముఖ్యముగాఁ బ్రతాపరుద్రీయములో, నీసంవాదపద్ధతి మిక్కిలి సరసగంభీరముగా సాగినది. ఏపాత్ర యెప్పుడేది మాటాడిన నది నాటకకథాబంధమునకు బిగువుగూర్చునదిగానుండుటయే యందలి విశేషము. ప్రతాపరుద్రీయ సప్తమాష్టాంకములలో వెఱ్ఱివాఁడు శిష్యాదులతో సంభాషణము చేయు సందర్భమున నీసంవాద సౌందర్యము పరాకాష్ఠనందినది. వెఱ్ఱివాఁడర్థాంతరద్యోతకముగా మాటలాడు మాట లతిగంభీరములై శాస్త్రులుగారి లోకజ్ఞతకును సమయస్ఫూర్తికిని దార్కాణములుగానున్నవి. తాటికాయపాట సందర్భమున వెఱ్ఱివాఁడు "దీనిని చెకుముకికి తగిలించి యినుముతో కొట్టు. ఎంత నిప్పుపుడుతుందో చూడు" మని శిష్యునితోఁ బల్కుమాటలఁ బరికించిన నీ విషయము తేటతెల్లమగును.

శాస్త్రిగారు తమ నాటకములలోఁ బద్యములను బాటలను గూడ వాడినారు. సాధారణముగా స్త్రీపాత్రలకును నీచపాత్రలకును వారు పాటలనే వ్రాయుచుందురు. బాల్యమునుండియు వారికి జంగముపాటలన్నను జానపదగేయములన్నను మక్కువ

రెక్కువ. వారట్టి పాటలపద్ధతులను నందలి జాతీయములను బాగుగా గ్రహించి తమ పాటలలోఁ దత్సదృశములైన ప్రయోగములెన్నో కావించినారు. వీరిపాటలన్నియు రసానుగుణములును బాత్రానుగుణములునై యెంతో రమణీయములుగా నుండును. అందును బ్రతాపరుద్రీయమునందలివి సరసమైన పదప్రయోగమునను, బ్రకరణోచితమైన యర్థగాంభీర్యమునను, సాటిలేనివై యానాటకముప్రచారమున కెన్నియో విధములఁ దోడ్పడియున్నవి. వెర్రివాఁడుపాడిన పాటలాంధ్ర వాఙ్మయమున నద్వితీయములైనట్టివి. అసలు శాస్త్రిలుగారి నాటకములలోఁ బద్యములకంటెఁ బాటలే యెక్కువ సహజమధురములుగా గోచరించును. వారి పాటలనువలెఁ బద్యములను విని సామాజికు లానందించుట కష్టము. ఏలయన వారి పద్యములు శబ్దార్థములు రెంటనతిప్రౌఢములై సావధానముగాఁ గూర్చుండి యాలోచించునప్పుడు కాని సుబోధములు కావు. వారి శైలిలో గాంభీర్యమున్నంత మార్దవములేదు; ప్రౌఢిమయున్నంత ప్రసన్నతలేదు. వారి వర్ణనపద్యములు పెక్కు గంభీరభావనాపూరితములై యాముక్తమాల్యదయందలి పద్యములను దలపించుచుండును. వారి పద్యములలో నచ్చ తెలుఁగు పదములయుఁ దద్భవపదములయు సంఖ్య హెచ్చు. ఆ పద్యములు సులభముగా నర్థము కాకపోవుటకిదియే హేతువు. తఱుచుగా వస్తువర్ణనమునకై వారు పద్యములను వాడుచుందురు. అట్టివర్ణన పద్యములు ప్రాయికముగాఁ బ్రబంధపద్యములవలెనుండును. కోపమును సూచింపవలసి వచ్చినప్పుడు వారు సాధారణముగా స్రగ్ధరావృత్తమును వాడుచుందురు. కొన్నియెడల వారి పద్యములుపైనుండు సంభాషణముతో నవ్యవహితమైన సంబంధము కలిగి యత్యంతసుందరములుగా నుండును. బొబ్బిలియుద్ధమునందలి "వీర బొబ్బిలి యిదే పేరుపొందిన లంక" యను పద్యమును, బ్రతాపరుద్రీయాష్టమాంకమునందు రాజు యుగంధరుని పాదపద్మములఁ బట్టుకొని "ఈ యుగ్మమునకు వెలకలదా శాస్త్రిలవారూ" అని పేరుముకి శాస్త్రి నుద్దేశించి చదువు పద్యమును నిందుకు నిదర్శనములు. మొత్తముమీఁద శాస్త్రిలుగారి పద్యరచన దృశ్యకావ్యముల కంత యనుకూలముగా నుండదనియే చెప్పవలయును. వారి గేయములలో మాత్ర మాయానుకూల్యము సర్వతోముఖమై యొప్పారును. ఒక్కచో శాస్త్రిలవారే "ఈపాటచేసిన మహాకవి యెవరు? మంచితేనెఁ జెంచెతను బొగడుదురు కాని తేటెని దలంప"రని జనార్దనమంత్రిచే నొక గేయమును బ్రశంసింపఁ జేసినారు.

శాస్త్రిలవారి కాధునిక కవిత్వముపై నంతే యాదరమున్నట్లు తోఁపదు. ప్రతాపరుద్రీయ షష్ఠాంకమునఁ బేరుముకి శాస్త్రి కవియై కొలువునకరుదెంచి చెప్పిన పద్యముల యర్థమును పేరిగాఁడు గ్రహింపఁజాలక వానిని నిరసించును. అప్పుడాతఁడు ధార్త్యము చేయఁదలంచి "సలవమడతలకిమలెనే" యను పేలవమైన పద్యమును జెప్పెను. పేరిగాడు దానిని మెచ్చుకొని యక్షరలక్షలీఁ దలంచి "కయిస్సర్లూ! చెప్పవయ్యా! ఈలాంటి కయిత్తం సెప్పే వోళ్ళింక మీదయినా వుంటారావుండరా" యని యడుగును. అప్పుడు పేరుముకి "ఇట్టి కవులింకఁ బుట్టఁగలరు. ఇంక ఆఱునూరేండ్లకు వేఱు దొరతనంలో కొన్ని తావుల మీబోటి రసజ్ఞులే బహుళముగుదురు. వారికై మీబోటి రసికులే కవనములు చేయుదురు. వారు ధయాలు చదువుకున్నవారికన్న తామే మేలని తలంచువారే."యని సమాధానమిచ్చును. ప్రతాపరుద్రుని కాలమున కాఱునూర్ల సంవత్సరములు లెక్కించిన నాధునికకాలమే కదా వచ్చును. మఱియు నాధునికకాలమున నపండితులే యెక్కువగాఁ గవులగుచున్నారనియుఁ గవితాకామిని పండితుల కడకువచ్చుటయే లేదనియు ఉషానాటకమున వారు ప్రస్తావనలో సూచించియున్నారు.

శాస్త్రిలవారి నాటకములను బరిశీలించినప్పుడు పాత్రోచిత భాషాప్రయోగమున వారు చూపిన ప్రతిభ యనన్యసామాన్యముగాఁ గానిపించును. సంస్కృత నాటకములలో నీచపాత్రలకును స్త్రీబాలాదులకును బ్రాకృతభేదములలో నేదో యొకటి వాడఁబడుచుండును. ప్రాకృతమునకుఁగూడఁ బూర్వవైయాకరణకల్పితమైన వ్యాకరణ వ్యవస్థయుండుటచే దానిని నిరాక్షేపముగా నాటకములందు వాడుట కవకాశము కలిగినది. తెలుఁగున వ్యావహారిక భాష మండలమును బట్టియు జాతికులాదులను బట్టియు నైకవిధములుగా మాఱుచుండును. దానిని వ్యాకరణానుశాసనము లేకపోవుటయే కాక దానిని వాడినచో నరకము ప్రాప్తించునను పూర్వలాక్షణిక వ్యవస్థితమైన బిభీషికయుఁగలదు. అదియునుగాక భిన్నభిన్నగతికమైన దాని స్వరూపము నవగాహనము చేసికొని పాత్రోచితముగా దానిని వాడుట యతికష్టసాధ్యమైన విషయము. తెలుఁగునాటకములలో ధైర్యముతో మొట్టమొదట దాని నౌచిత్యభరితముగా వాడి రసికులచే బళే యనిపించుకొన్నవారు వేంకటరాయశాస్త్రిలవారే. పాత్రోచిత భాషాప్రయోగ విషయమున వారు సాధించిన విజయమనన్యసాధ్యమైనది. అట్టి ప్రయత్నములో వారి ననుసరించి వారివలెనే సమగ్రమైన సాఫల్యమునందిన వారు శ్రీ గురుజాడ అప్పారావు పంతులుగారు. శాస్త్రిలుగారుకూడ సంస్కృత సంప్రదాయము ననుసరించి స్త్రీబాల సేవకాదులకు వ్యావహారిక భాష నే వాడియుండిరి. నిజమునకు వ్యావహారిక భాషను వాడుటలో ఘనత యేమియును లేదు. కాని వారు ప్రదర్శించిన పాత్రోచితత్వము మాత్రము పరమాద్భుతమైనది. బ్రాహ్మణులు, పరిజనులు, రాణివాసపుస్త్రీలు, సామాన్యపౌరులు, మహమ్మదీయులు మున్నగువారు ప్రయోగించుభాషను వారు కడుమెలఁకువతోఁ బరిశీలించి, యాత్మీయతము చేసికొని, యచ్చెరువు గొల్పు సౌలభ్యముతో ననుసంధించియుండిరి. అందును దురకలు మాటాడు తెలుఁగును వారలవరించుకొన్న తెలుఁగు నిరతిశయ ప్రతిభా ప్రదర్శకము గానున్నది. అది యెంతపాత్రోచితమో యంత సరసమును నెంత వికృతమో యంత చమత్కారగర్భితమునై యలరారుచున్నది. శాస్త్రిగారి తండ్రిగారికి మహమ్మదీయ శిష్యు లొకరుండెడివారఁట. వారాయనతో మాటలాడునప్పుడు తమ మతగ్రంథములలోని విషయములను దెల్పుచు "ఆ అరాబియా దేషంలో వఖ్ పఖీర్" అను విధమున మాటలాడుచుండెడివారఁట! బాల్యమున నామాటలను వినిన శాస్త్రిగారప్పటినుండియు దానిని హృద్గతము చేసికొని తమ నాటకములలో నద్భుతావహముగా వాడియున్నారు. శాస్త్రిగారికిఁ బాత్రోచిత భాషాప్రయోగమే కాని సర్వపాత్రలకును గ్రామ్యమును వాడుట మాత్రము సమ్మతము కాదు. వారు పాత్రోచిత భాషావాదులే కాని

గ్రామ్యవాదులుకారు. అన్యత్రవారు వాడు భాషలాక్షణికమై, జాతీయ పదసూక్తి పరిపూర్ణమై పండిత జనమనోరంజకముగా నుండును.

శాస్త్రిగారు నాటకకళా విషయమున సాధించిన పరిణతి పాటవము లపూర్వములైనవి. కథా నిర్మాణమున, రసపోషణమునఁ, బాత్రచిత్రణమున, లక్షణాను సరణమున, నౌచిత్యపాలనమున, భాషాప్రయోగమున, భావప్రకటనమున, ప్రదర్శనానుకూల్య ప్రాపణమున, సన్నివేశకల్పనమున వారు చూపిన నైపుణ్యమగణ్యమైనది. ఆంధ్రమున నాటకము లవతరించిన యారంభదినములలోనే వారు స్వతంత్రముగా నాటకరచన సాగించి వాని నప్రతిమ ప్రతిభా ప్రభావముతోఁ బరిణతినందించిరి. వారి నాటకములలో నచ్చటచ్చట నలఁతిలోపములుండుఁగాక. అవి వారపారధీవిశేషమునఁ బరఁగించు గుణపరంపరలో శతాంశమును గానేరవు. "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతి."

# భారతి

శ్రీ తెన్నేటి సూరి

## 1

గోడమీది గడియారం రెండు గంటలు కొట్టింది—

షెల్ఫులోనుంచి ఒక యెర్రట్టపుస్తకం బయటికి వచ్చింది; డబ్బాలోనుంచి ఒక సిగరెట్టు పైకి లేచింది. గది పొగతో అయోమయమై కావురు వేసిపోతోంది.

ఎర్రట్టపుస్తకం చెల్లాచెదరై బోర్ల బొక్కలుగా బల్లమీద పడ్డది; ఆరిపోయిన సిగరెట్టుపీక గదిమూలకు దూకింది.

మరొక పచ్చట్టపుస్తకం షెల్ఫులోనుంచి యువతలకు వచ్చింది; మరొక సిగరెట్టు డబ్బాలోనుంచి పైకి లేచింది. మరొక పర్యాయం గది పొగతో అయోమయమైపోయింది.

పచ్చట్టపుస్తకం గజిబిజై యెర్రట్టపుస్తకం ప్రక్కనే, బల్లమీద బోర్లబొక్కలుగా పడ్డది; రెండో సిగరెట్టు పీక గదిమూలకు దూకింది.

షెల్ఫులోనుంచి నీలిరంగుపుస్తకం బయటికి వచ్చింది; డబ్బాలో మూడో సిగరెట్టు ఖాళీ అయింది; గది మరోపర్యాయం కావురు వేసిపోయింది.

నీలిరంగు పుస్తకం గిరగిరా తిరుగుతూ బల్లమీద పడివున్న రెండు పుస్తకాలమీదా దూకింది; గదిమూలకు మూడవ సిగరెట్టు పీక దూకింది.

షెల్ఫులోనుంచి నాలుగో పుస్తకం — డబ్బాలోనుంచి నాలుగో సిగరెట్టూ ఖాళీ—

గోడమీది గడియారం నాలుగు కొట్టింది.

నాలుగోపుస్తకం బల్లమీద దూకింది—నాలుగో సిగరెట్టు పీకకూడా మూలకు ఉరికింది.

అయిదోపుస్తకం అయిదో సిగరెట్—ఆరోపుస్తకం, ఆరో సిగరెట్—ఏడోపుస్తకం, ఏడోసిగరెట్—చకచకా బల్లమీదా, గోడమూలా, గుట్టలు పడిపోయినై.

షెల్ఫులో పుస్తకాలన్నీ చెల్లాచెదరై రెక్కలు విరిచి, బజార్లో గుట్టపోసిన కోళ్ల పిట్టల్లా బల్లమీదా—డబ్బాలో సిగరెట్లన్నీ దగ్ధకాష్ఠాలై గోడమూలా పోగులుబడ్డయ్.

గడియారం అయిదుకొట్టేసింది—

నిస్పృహగా నిట్టూర్పు విడిచి, డబ్బాలోవున్న చివరి సిగరెట్టు తీసుకుని అగ్గిపుల్ల వెలిగించాడు. నిప్పుల్లవెలుగులో సిగరెట్టు పొగతో కావురువేసిపోయిన ఆ ముఖం, చికాగ్గా చెరిగి గజిబిజై వున్న క్రాఫింగు జుట్టుతో బీభత్సంగా కనుపించుతోంది.

కుర్చీదగ్గిరనుంచి కదిలి కిటికీదగ్గిరికి పోయి నిల్చున్నాడు. కిటికీలోనుంచి బయటికి ఆకాశంవంక చూస్తున్నాడు.

గగనపథాన ఎక్కడా వెలుగురేఖ లేదు; నల్లటి మబ్బులు ఆవరించి, సిగరెట్టుపొగతో కావురువేసిన ముఖంలా, చింతాక్రాంతంగా వుంది.

కిటికీచువ్వలమీద సిగరెట్టు నలిపి విసుగ్గా బయటికి విసిరేశాడు. నెమ్మదిగా గదిలోనుంచి మధ్య హాల్లోకి వస్తున్నాడు.

"గాన మధువీచికల
కలహంసవై—విరతి
కన్ను మూయర సామి
కళవళింపగ నేల—
ఉయ్యాల, జొంపాల
ఊతునా నాసామి ?
వెయ్యారు గీతికల
విరిసి పోదునురార!—
ముత్యాలశాలలో,
నా—ముగుద మానసములో,
విరజాజి దీపికలు
వెలిగించితిని రార! ||గా||

పడమటింట్లో ఒక సమ్మోహన గీతం సెలయేరులా ఆవిర్భవించి, అమృతవాహినులై నలుముఖాలా వాతావరణమంతా వ్యాపించిపోతోంది. ఆ మధురమంజుల గీతారావంతో ఆ భవనం యావత్తూ ఉత్తేజితమౌతోంది.

అతనికి మాత్రం పాట వినిపించుతోందిగాని, మాధుర్యం చెవిసోకటంలేదు.

మధ్య హాల్లోకి వచ్చాడు; పడమటిల్లు జిలిబిలి సంగీతాల కోలాహలంతో స్వర్గసీమలా వుంది. తన నైరాశ్య విషాద ప్రవేశంతో ఆ ఆనందోత్సవాన్ని భగ్నం చెయ్యగూడదనుకున్నాడు.

పిల్లిలా, చప్పుడు గాకుండా అడుగులు వేసుకుంటూ, గోడదగ్గిరికివచ్చి, వంకెకు వ్రేలాడుతున్న తుండుగుడ్డ తీసి బుజాన వేసు

* ఈ సంవత్సరము ప్రపంచ కథానికల పోటీకి పంపించిన తెనుగు కథ.

కున్నాడు. గోడమూలనున్న చెప్పులు కాళ్ళకు తగిలించుకుని బయటికి బయలుదేరాడు.

'ఇలా ఒకసారి, లోపలికివచ్చి వెడతారూ?'—పడమటింట్లోనుంచి ఒక తియ్యటి గొంతు పిలిచింది. అతను వెనక్కు తిరిగిచూచాడు.

'బయటికి వెళ్లబోతున్నారల్లే వుంది—కాఫీ తయారు చేశాను—త్రాగి వెళ్లండి'—

చెప్పులు గోడమూల వదిలేసి, పడమటింటివైపు నడిచాడు. ద్వారబంధానికి చేరబడి మండిగంమీద కూర్చున్నాడు.

ఆరోగ్యంతో మిసమిసలాడుతున్న అవయవాలతో ఒక స్త్రీమూర్తి, కుంపటిముందు కూర్చుని కాఫీ కలుపుతోంది. అతను గుమ్మంమీదికి వచ్చి కూర్చోగానే, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ ముచ్చటగా, ఆ కబురూ ఈ కబురూ చెప్పటం ప్రారంభించింది:

"మీరు చూడకనే పోతిరి—ఎంత చక్కగావుంది!—"

"ఏవిఁటీ?"—

"బుజ్జాయి సంగతుండీ!—ఇదేవిఁటి? ప్రొద్దున మన ఎల్లావు యీనిన సంగతి మీకు తెలీనే తెలీదా యేవిఁటి?"

ఆ మాటవిని అతనికి నవ్వాలనిపించిందిగాని, నవ్వటం అలవాటు తప్పి చాలారోజులై వుండటంచేత, నవ్వలేకపోయాడు. కాఫీత్రాగి కప్పూ సాసరూ క్రిందపెడుతూ:

'భారతీ!'—

'ఏవిటి?' అన్నట్టు అతని ముఖంలోకి తెల్లబోయి చూసింది. అర్థంకాని విషాదచ్ఛాయలేవో అలుముకుని అతని ముఖం అయోమయంగా వుంది.

'ఈ జీవితం నీకు ఎలావుంది?'

'అదేం ప్రశ్న?—ఎలా వుండట మేవిటి?-హాయిగా వుంది-అసలెందుకు అలా అడిగారూ?'—

'ఏఁవ్బే—ఏవీఁలేదు — ఏదో వెర్రిమాటడిగాను—ఏఁ మీ తోచక' అంటూ నీళ్లు నవిలి, లేచి బయటికి వెళ్లిపోయాడు.

## 2

పొలాన్నుంచి తోలుకొచ్చిన పశువులన్నిటినీ కట్టు గొయ్యలకు కట్టేసి మేతలువేసి, పాలేళ్లు యెవళ్లత్రోవను వాళ్లు యిళ్లకు వెళ్ళిపోయారు. పాలు పితుక్కునే పని పూర్తి అయాక క్రొత్తగా పుట్టిన లేగదూడకు తల్లి పొదుగుదగ్గర పాలుకుడవటం నేరుపుతూ భారతి గొడ్డదొడ్లోనే వుంది.

వెంకయ్యబాబు పొలాన్నుంచి వచ్చీ రావటమే మామూలు ప్రకారం సరాసరి గొడ్డదొడ్లోకి వచ్చాడు. ఆయన దొడ్లోకి రావటం గమనించి దొడ్లోవున్న గొడ్లన్నీ సంతోషంగా చెవులు రిక్కించి కళ్లు చారడేసిగా విచ్చులుకుని ఆయనవంక ఆప్యాయంగా చూస్తున్నయ్. క్రొత్తగా బుడ్డవేసిన గిత్తదూడ మోర పైకెత్తి 'అంభా' అంటూ జాలిగా అరిచింది. 'ఆ ఏవిటీ? అని విసుక్కుంటూ వెంకయ్యబాబు సరాసరి దానిదగ్గరకొచ్చి వెన్ను నిమిరాడు. బుసకొట్టి గాట్లోకి చూపిస్తూ మళ్లా 'అంభా' అన్నది. గాట్లోకి తొంగిచూచాడు. అసలే ఎందుకో చిరాగ్గావున్న మనిషికి అదిచూసి కళ్లు మరింత చింతనిప్పులయాయి. పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ పాకలోకి వెళ్ళి వెలిగమీదనుంచి ఒక జనపకట్ట తీసుకొచ్చి విచ్చదీసి గాట్లో వేస్తూ:

'తగని మైమరుపు వెధవలకు—నోరులేని సన్నాసులని కనికరమైనా లేదు' అని పాలేళ్ళమీద విసుక్కున్నాడు.

'అసి భడవాముండా!' అని ఆశ్చర్యపోయింది భారతి. 'అది గాదు మావఁయ్యా! చిన్నిగాడు దానికి జనపకట్ట వేసే వెళ్లాడు. పరాకులేకుండా వూదుకుతిని, మారాంచేస్తే మళ్లా వేస్తారుగదా అని మీరు లోపలికి రావటంచూసి అలా వగలుబోతోంది—మీ చనువు చూసుకుని అది అలా ఆడుతోంది.'

'దాని ఒక్కదాని మాటే యేవిఁటి?—నా చనువు చూసుకునేకదూ యీ యింటో ప్రతిఒక్కరూ ఇలా భాగోతాలాడటం—నా గారాబాలవల్లనే యీ యిల్లు యిట్టా ముక్కచెక్కలై పోతోందని నువ్వు సూటిపోటిగా నన్ను ఎత్తిపొడవక్కర్లేదు. తలకు తాకి బొప్పెకడుతున్నా యింకా తెలుసుకోకుండా యేడుస్తానా?' అంటూ ఎక్కడలేని కోపమూ ముంచుకొచ్చేసి చివాల్న గొడ్లదొడ్డి తలుపు తెరుచుకుని యింట్లోకి వెళ్ళిపోయాడు.

మావఁగారు అన్న ముక్కల్లో యే ఒక్కటీ భారతికి బోధపడలేదు. చిరునవ్వు నవ్వంది మాట్లాడే అలవాటు లేని ఆ వృద్ధుడు ఆవాడు అంత కోపంగా యెందుకున్నాడో అర్థంకాలేదు. లేగదూడను తీసుకొచ్చి పందిరిగుంజకు కట్టి తానుకూడా లోపలకు వెళ్ళింది.

పొలంనుంచి రాగానే వెంటనే వేడినీళ్లు పోసుకుని భోజనానికి కూర్చోవటం మావఁగారికి అలవాటు. వంకెనున్న తుండుగుడ్డా, కొల్లాయీ తీసుకువచ్చి ఆయనకు అందించింది. వాటిని భుజానవేసుకుని, స్నానం చెయ్యటానికి ఆయన దొడ్లోకి వెళ్లాడు; భారతి వంటయింట్లోకి వెళ్ళి మడిగట్టుకుంది. పీటా, మంచినీళ్ళుబెట్టి విభూతిపండు తీసుకొచ్చి పీటప్రక్కను వుంచింది. వడ్డన యేర్పాట్లన్నీ పూర్తిచేసేసి సిద్ధంగా కూర్చుంది.

ఆయన స్నానంచేసి వళ్ళు తుడుచుకోవటమే తడవుగా మడిగట్టుకుని పీటమీదవచ్చి కూర్చున్నాడు. ప్రశాంతత చిందులాడుతూవుండే ఆయన ముఖం కందగడ్డలా యెర్రబడి భీషణంగా వుంది. పలకరించటానికి కూడా భయంవేసి, కిక్కురుమనకుండా పిల్లిలా వడ్డన చేస్తోంది.

ముఖాన విభూతి రాచుకుని తలవంచుకుని భోజనం చేస్తున్నాడు. స్తిమితంగా కూర్చుని కడుపునిండా భోజనంచేసే అలవాటున్న ఆ వ్యక్తి ఆనాడు అన్నం సహించనివాడులా మెతుకులు కొరుకుతూ, ఇటూ అటూ ముద్దలు తోసేస్తున్నాడు. భోజనం

సగపడబడ్డది. చివాల్న తల పైకెత్తి, కళ్ళవెంట చింతనిప్పులు రాలుస్తూ;

'తమ భర్తగారు యివాళ మళ్లా పట్నం వెంచేసేరా యేం.' అన్నాడు.

'లేదే'—

'లేకపోవటమేమిటి?—ఎందాకా సూసిపెట్టుకుంటావ్ ?'

'ఆయన అంతర మేమిటి? నా అంతర మేమిటి—ఆయన్ను నేను సూసిపెట్టడం యేమిటండీ—నా ముఖం.'

'సూసిపెట్టు సూసిపెట్టు—వాడి విషయం నీకే అంత నెప్పి లేనప్పుడు కాటికి కాళ్లుచాచుకునున్న వాడికి నాకెందుకు యీ మనస్తాపమంతా?—ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది. ఇంతకీ, పాతకాలపు వెర్రిబాగులవాణ్ణి నాకళ్లల్లో దుమ్ముగొట్టి తిరుగుతున్నాడు సరే—సర్వం తెలిసిన పడుచుదానివి నీ నెత్తిన కూడా చెయ్యిబెట్టి యిష్టంవచ్చినట్టు ఆడుతున్నాడు, అదీ విచిత్రం. నువ్వుకూడా నోట్లో నాలుకలేని యిలాంటి గంగిగోవువు కావటం నిజంగా నా దురదృష్టం'

'అర్థంకావటంలేదు మావయ్యా! ఆయనసంగతేమిటి ఇంతకీ?'—

'ఓహో! ఊరంతా కోడై కూస్తున్నా నీకింకా తెలీలేదన్న మాట! తెలీయక కాదులే, కొడుకు ప్రతాపం తండ్రి నోటివెంట విని ఆనందించాలని అనుకుంటున్నావల్లే వుంది—సరే విను—నా కుమారరత్నం పట్నంలో ఒక అమ్మాయిని బెట్టుకుని వెలుగుతున్నాడు—తెలిసినట్టైనా యిప్పటికేనా?'—

'అబ్బెబ్బే!—ఇవి ఎవరో గిట్టనివాళ్లు కల్పిస్తున్న మాటలు—ఆయన అలాంటి మనిషి కారు'—

'ఛట్! నోర్ముయ్యి!—ఏడిచినట్టుంది నీ కాపరం—ఇక ఆట్టే మాట్లాడకు—నీ వెలితక్కువతనం చూస్తే నాకు అసహ్యం కూడా వేస్తోంది'—కలుపుకున్న పెరుగుముద్ద ప్రక్కకు త్రోసేసి లేచిపోయి చెయ్యి కడుక్కున్నాడు. మడి పంచె విప్పుతూనే, వీధి వాకిలి అరుగుమీదకు పోయి కూర్చున్నాడు.

# 3

విశాలమైన నదీగర్భం; వర్షఋతువులో ఊళ్ళూ నాళ్ళూ ముంచెత్తే ఆ మహానది చిక్కిశల్యమై, నదీగర్భానికి మధ్యగా సన్నని ఒక పాయలో మాత్రం, సిలమండిల లోతున జాలిగొలిపే స్థితిలో నెమ్మదిగా ప్రవహిస్తోంది. రాజారావు, నీటిఒడ్డునున్న యిసుకదిబ్బమీద తుండుగుడ్డ పరుచుకుని పడుకున్నాడు. ఆకాశం వంక చూస్తూ, గత చరిత్రనంతా నెమరుకు తెచ్చుకుని ఆలోచిస్తున్నాడు.

రాజారావు ఎం. ఏ., పూర్తిచేసుకుని యింటికి రాగానే వెంకయ్యబాబు కోడల్ని తీసితెచ్చుకున్నాడు. రాజారావు ఆయా ఉద్యోగాలకోసం కొంత ప్రయత్నించాడు. వెంకయ్యబాబు అధికార వర్గాలలో పలుకుబడి వున్నవాడు కాకపోవటంచేత, పెద్ద ఉద్యోగమేమీ లభించలేదు. గుమస్తా ఉద్యోగంకోసం ఊళ్ళు పట్టుకు తిరగవలసిన గతేం వచ్చిందని, వెంకయ్యబాబు కొడుకు చేస్తున్న సన్నరకం ప్రయత్నాన్ని లేవీ పడనిచ్చాడు కాదు. అసలు ఆయన అంతర్యంలో వున్న విషయం వేరు. దశాబ్దిపైబడి, దీపం బెట్టే ఆడదిక్కు లేక ఆయిల్లు శ్మశానవాటికలా పడుంది. మళ్ళా ఆదేస్థితి సంభవించటం ఆయనకు ససేమిరా యిష్టంలేదు.

కాపురానికి వచ్చీ రావటమే భారతి గృహానికి సంబంధించిన యావత్తు బాధ్యతలనూ నెత్తిన వేసుకుంది. ఆవుల్ని పాలు దీయటం దగ్గిరనుంచీ స్వయంగా చేసుకునేది. 'అంతమంది పాలేళ్లు వుండగా ఆ శ్రమంతా యెందుకు' అని మావఁగారు మందలించితే, పాడి గొడ్లనీ, పడుచుతెంటినీ పరాయివాళ్ళకు వప్పగించితే ఇక ఆయిల్లు కోలుకోదని సమాధానం చెప్పేది; నిరంతరం యేదో పాటా పద్యం పాడుకుంటూ, యేదో ఒకపని చేసుకుంటూ, ఆనందంగా వుంటోంది.

రాజారావు పరిస్థితిమాత్రం కేవలం ఇందుకు భిన్నంగా వుంది. అవూళ్లో అతనితో మాట్లాడేవ్యక్తి యే ఒక్కడూ లేడు. అతన్ని యించుమించు యేదో పరాయిజాతివ్యక్తిలాగా పరిగణించుకున్నారే తప్ప ఆప్యాయంగా యే ఒక్కరూ పలకరించరు. పోనీ వాళ్ళు పలకరించకపోయినా, తనే చొరవచేసి పలకరించుదామనుకున్నా, వాళ్ళతో మాట్లాడటానికి యే ముక్కా అతనికి తోచేది గాదు. ఒకొక్క క్షణం గడవటం ఒకొక్క మహాయుగంగా వుండేది. చేతికందిన పిచ్చిపుస్తకమల్లా చదువుతూ వుండేవాడు. చదవగా చదవగా అతనికి అన్ని పుస్తకాలూ ఒకే రకమైన ఊకదంపు సోదిగా తోచటం మొదలెట్టింది. గత్యంతరం లేక చదివిన పుస్తకమే మళ్లా చదువుతే చికాకు బయలుదేరింది. రోజులు గడచినకొద్దీ అతనిలో ఏదో అర్థంకాని అనంతమైన చికాకు బయలుదేరింది. తనమీద తనకే కోపంగానూ, చిరాకుగానూ వుండేది. ఇంట్లోకీ బయటికీ కాళ్ళు బలపాలు కట్టేటాగు ప్రొద్దస్తమానం తిరుగుతూ వుండేవాడు. చుట్టూవున్న ప్రపంచం యావత్తూ నిర్జీవమైన శూన్యంగా తోచేది.

క్రమేపీ ఈ మానసికపరిస్థితి శారీరకమైనదౌర్బల్యంగా మారింది. తనలోవున్న జీవశక్తులన్నీ కర్పూరంలా హరించిపోతున్నట్టు రోజురోజుకూ దిగజారిపోవటం మొదలుబెట్టాడు. తలనొప్పి, అజీర్తి, పసరు పెరగటం, మలబద్ధకం, కాళ్ళుసలపటం ఈరకమైన బాధలెన్నో పెరిగినై. తన శరీరంలో యేదో జబ్బు ప్రారంభమై వుంటుందని అనుమానపడ్డాడు. డాక్టరుతో సంప్రదించితే ఆయన గంటలతరబడి పరీక్షచేసి, 'మరేమీ జబ్బులేదు, అంతగా కాకపోతే, ఒకసారి ఆముదం తీసుకోమని సలహా యిచ్చాడు. ఒకసారికాదు పదిసార్లు తీసుకున్నాడు. కాని వ్యాధి స్వరూపంలో మార్పేమీ కనుపించలేదు. అసలు ఆ వ్యాధి మానసికమైనదో, శారీరకమైనదో అతనికి అర్థం కాలేదు. అతని స్థితి గతులు గమనించి భారతి యెందుకలా వున్నారని యెప్పుడేనా అడిగితే, ఏమి చెప్పటానికి తోచక 'యెలావున్నాను బాగానే వున్నాగా' అంటూవుండేవాడు. అసలు, యిదమిద్ధమని బాధ యేమిటో తనకోటి తెలిస్తేగదా, ఇతరులకు చెప్పటానికి?

ఇలా వుండగా ఒకరోజున, తండ్రి యేదో పనిమీద, పట్నం వెళ్ళిరమ్మని పంపాడు. రైలెక్కి పట్నం వెళ్లాడు. టికెట్ కలెక్టరుకు టికెట్టిచ్చి గేటులోనుంచి బయటికి వస్తున్నాడు. ఇంతలోనే—'ఒరే! భయ్యా! రాజూ' అని ఒక గావుకేక వినిపించింది. చిరపరిచితమైన గొంతులా వినిపించటంచేత తల పైకెత్తి పారజూచాడు. స్టేషన్‌లో వున్న పుస్తకాలషాపుదగ్గిర నుంచుని, పంతులు, చప్పట్లుగొట్టి బొబ్బలు పెడుతున్నాడు. రాజు అటువైపు నడిచాడు. సమీపానికి రాగానే, పంతులు కరచాలనంచేసి, 'పెళ్లికి రమ్మంటే రాకపోయావే, నమ్మరంతివి; ఇదిగో అస్మద్భార్యా రత్నం చూశావా?'—అని ప్రక్కన నిల్చునున్న స్థూలకాయంగల ఒక స్త్రీని చూపించాడు. ఒళ్లంతా బయటికి కనుపించుతూ యెర్రవాయిలు చీరే, పెదవులకు దట్టంగా పట్టించిన యెర్రరంగూ, ముఖంనిండా చెమటకు తడిసిన పౌడరు మకిలీ అదో వ్యాలకం మనిషిలా వుంది. పంతుల వెకిలిసంభాషణకు ఆవిడ నొచ్చుకోలేదు సరికదా ఉల్లాసపడుతున్నట్టు కూడా కనుపించింది. పంతులు ధోరణిగా చెప్పుకుపోతున్నాడు:

'మాజీ జిల్లాసిరస్తా లేటు అభిరామయ్యగారి ఏకైక సంతానం—అంటే ఆయన లంచాలుపట్టి ఆర్జించిపోసిన ధనరాసులన్నిటినీ కళాపోషణార్థం వ్యయం చేయవలసిన బాధ్యత యావత్తూ యిప్పుడు మన భుజస్కంధాలమీద యెక్కివున్నది అని దీనితాత్పర్యం. పదవోయి బడ్డూ యీ శుభముహూర్తానే మన కళాకేంద్రాన్ని దర్శింతువుగాని'—

'ఈయన మీ చదువుకునేరోజుల్లోకూడా యిలాగే మాట్లాడుతూవుండేవారా అండీ?' అన్నదావిడ ముసిముసినవ్వులు నవ్వుకుంటూ.

'కొత్తగా మళ్ళీ నిన్నడగటం దేనికిరా సోదరా? ఈ వాచాలత చూసికాదుట్రా ఈ శకుంతలానవలా తిలకం ఈ దుష్యంత మహారాజును వరించింది? లేకపోతే పాపరు వెధవకు మనకు మణికిరీటాదులు వగైరా ఎక్కడవుండేడిశాయి?

'పేరు శకుంతలాదేవి అనేనా? ఏలినవారి తాత్పర్యం?'

'మరేనోయి అజ్ఞానీ!—శ్రీమతి శకుంతలా ఎం. ఏ., సెక్రటరీ మహిళాసంఘం, ప్రెసిడెంట్ కళాకేంద్రం, సినీ అండ్ డ్రామెటిక్ క్రిటిక్, రచయిత్రి వగైరా ఇంకా అనేకం; యింటికి తగులడదాంపద, యివ్వవలసిన భోగట్టా యింకా దస్త్రాలతరబడి వుంది'—

'ఇప్పుడు కాదులే—కొంచెం తొందరపనిమీద వచ్చాను—కొన్ని సరుకులు కొని వెంటనే గ్రామానికి వెళ్ళిపోవాలి: మరోక పర్యాయం వస్తాను'—

'కుదరదు పదవోయ్ రోగ్!' అని భుజంమీద చెయ్యి వేశాడు.

'ఫరవాలేదులెండి; నౌకరుచేత సరుకులు తెప్పించి గ్రామానికి పంపుదాం—మీరు వచ్చి తీరాలిసిందే—ఇంతమంది మిత్రుల పరిచయం కలిగిందిగాని మిమ్మల్ని కలుసుకోవడం పడనేలేదు.—ఈయన మీసంగతి తరుచు చెబుతూ వుంటారు' అని ఆవిడకూడా వత్తిడి చేసింది.

'అమ్మో వీడా! వీడు రాజారావనే గొప్పమేధావి. రాధాకృష్ణన్‌కంటే చాలా గొప్ప వేదాంతి; ప్రపంచచరిత్రవ్రాసి ప్రధానమంత్రి కాదలిచిని రాజకీయ దురంధరుడు — ఆంధ్రా నెహ్రూ, హెరాల్డ్ లాయిడ్, లాయడ్ జార్జి, జార్జి వైకౌంట్ డడ్లీ, ఇడ్లీ అయ్యంగార్, ఐన్‌స్టీన్, స్టీన్‌బెక్ వగైరా—'ది గ్రేట్ బుక్ వరమ్ ఆఫ్ ఇంటర్ నేషనల్ లిటరేచర్'—అనగా—అంతర్జాతీయ సారస్వత సర్వస్వభక్షకైకదక్షు పిపీలికాగ్రేసరుడు—ఇక పదండి పోదాం! అంటూ పడదోసుకుపోయాడు. తప్పనిసరిగా, రాజు, ఆనాడు కళాకేంద్రాన్ని దర్శించవలసి వచ్చింది.

ఆ యిల్లు ఒక పెద్ద దివాణంలా వుంది. వచ్చేవారు వస్తుంటే వెళ్ళేవారు వెడుతూవుంటారు. అనేక రకాల కళాకారులు అక్కడికి చేరి చిత్రవిచిత్రాలైన విషయాలెన్నో మాటాడుకుంటూ వుంటారు. ఉపన్యాసాలమీద ఉపన్యాసాలు హోరెత్తిపోతున్నయ్. కాఫీ త్రాగేవాళ్లకు కాఫీ, టీ త్రాగేవాళ్లకు టీ నౌకర్లు విధీ విరామం లేకుండా అందించుతున్నారు. సిగరెట్టు డబ్బాలు అసంఖ్యాకంగా బల్లలమీదపడి దొర్లుతున్నయ్. వాళ్లంతా యెంతో ఉల్లాసంగా వున్నట్టు రాజుకు తోచింది. వాళ్లంతా అంత సంతోషంగా ఎలా వుండగలుగుతున్నారో రాజుకు అర్థంకాలేదు. వాళ్లని గనుక సరీగా అర్థం చేసుకోగలిగితే తన మానసికవ్యాధికి, తగిన చికిత్స యేదైనా లభ్యం కావచ్చునని ఆశించాడు. అవకాశం వున్నప్పుడల్లా అక్కడికి వస్తూ పోతూ వుండటానికి నిర్ణయించుకున్నాడు. అందుకోసం ఆనాడే ఒక క్రొత్తసైకిలు కూడా కొనేశాడు.

* * * *

ఆ సమాజంతో పరిచయం యేర్పడినకొద్దీ రాజుకు మొదట్లో యేర్పడిన విభ్రాంతులన్నీ మబ్బుతెరల్లా విడిపోవటం మొదలుబెట్టినై. వాళ్ళల్లో ప్రతి ఒక్కడికీ కూడా తను యేజబ్బుతో బాధపడుతున్నాడో అదే జబ్బు వున్నట్టు అవగతం చేసుకున్నాడు. తను ఒంటరిగా గ్రామంలో వుంటూ వుండటంచేత, పరులతో మాటాడే సావకాశంలేక చదివిన పుస్తకమే చదువుతూ తన్నుతాను 'బోర్' చేసుకుంటున్నాడు. వీళ్లు నలుగురూ యిక్కడ ఒకళ్లతో ఒకళ్లు కలుసుకునే సావకాశం వుంది గనుక వాగిన వాగుడే దినదినం ఊకదంపుగా వాగుతూ ఒకళ్ళనొకళ్లు బోర్ చేసుకుంటున్నారు; అంతే తేడా. అందులో ప్రతిఒక్కడు తను మాట్లాడుతున్న దేవిటో తనకే అంతుబట్టకుండా మాట్లాడుతూ వుంటాడు. అందరికీ ఒకే రకమైన దీర్ఘరోగం (క్రానిక్ డిసీజ్)—చెప్పిన పాత సంగతే దినదినం చెబుతూవుండటం; పాడిన పాతపాటే దినదినం పాడుతూవుండటం; తమ్ముతాము బోర్ చేసుకుని యితరులను బోర్ చెయ్యటం.

తను యే వ్యాధితో బాధపడుతున్నాడో అక్కడికి చేరే ప్రతిఒక్కడూ అదే వ్యాధితో తీసుకుంటున్నట్టు, రాజుకు స్పష్టమైపోయింది. ఆ వ్యాధియొక్క స్వరూప స్వభావాలను సంపూ

ర్థంగా అవగతం చేసుకోవాలని అతనికి పట్టుదల కలిగింది. అక్కడికి చేరే వ్యక్తులనే గాక తనకు తారసిల్లే ప్రతివ్యక్తినీ అదేదృష్టితో పరిశీలించటం మొదలుపెట్టాడు. దేశంలో వున్న జనాభాలో, సగటున, నూటికి తొంభైమందిలో ఆ వ్యాధి చిహ్నాలు అతనికి గోచరమైనై. ఆవేశంతో ఈ పరిశోధన కార్యక్రమానికి పూనుకున్ననాటినుంచి అతనిలో ఏదో కొంత నూత్నచైతన్యం పొటమరించటం ప్రారంభించింది. క్రమేపీ ఆరోగ్యంకూడా చక్కబడుతున్నట్టు తోచింది.

*

మామూలు ప్రకారం ఒకనాటి సాయంత్రం అతను కళాకేంద్రానికి వచ్చాడు. మధ్య హాల్లో యెవ్వరూ కనుపించలేదు. వరండా మెట్లుదిగి పెరటితోటలోకి అడుగుపెట్టాడు. తోటలో వున్న రాచవుసిరిచెట్టుక్రింద శకుంతలాదేవి, భావకవితల్లజుడు శశికుమార్ కనుపించారు. శశికుమార్ పద్యాలు చదివి విని పించుతున్నాడు; శకుంతల, చేతిలోవున్న తాళం చెవుల గుత్తిని పూలబంతిలా పైకి ఎగరేసి పట్టుకుంటూ ఉల్లాసంగా వింటోంది.

శశికుమార్:—‘అందుకోరాని గగన పర్యంకసీమ
ఆణిముత్తెపు చుక్కల రాణి వీవు!’—

శకుంతల:—సెబాస్! బాగా అన్నావు.

శశి:—‘దుస్సహావిషాద పాతాళ దుఃఖవీధి
ప్రాకులాడెడు ఒక వానపాము నేను’—

శకుంతల:—ఛీ! వెధవా! పండంటి మగబిడ్డవని ఆశపడ్డాను; నువ్వొ పురుగువెధవ్వేనా?’—తన మనస్సులో కలిగిన జుగుప్సనంతా వెళ్ళగక్కుతూ చికాగ్గా కంటగించుకుంది.

వాడు తెల్లమొహం వేశాడు—

అందుకోలేనని తెలిసినవెధవ్వ మరి యెందుకీ రభసంతా?’

‘చేతిలో కాని లేదు—పదో అయిదో పారేస్తావని’—

‘ఆ యేడుపు ముందే యేడవకూడదూ—దీనికో ఏకాంతమూ, ఈ శృంగార కావ్యకలాలాపం ఈ చెత్తంతా దేనికి?’—

దూరాన రాజా కనుపించాడు.

‘రావోయ్! రాజా—ఇలారా—ఇక్కడున్నాం’ అని కేక పెట్టింది.

‘ఏదో కావ్యగోష్ఠిలో వున్నట్టున్నారు’—

‘మనవాడు చేతావాతా గాని శృంగారకాండ ఒకటి మొదలుపెట్టాడులే—కొంచెం వీడి గ్రంథం కనుక్కుంటున్నాను.’

‘ముక్కుపచ్చలారని పసిబిడ్డ; వాణ్ణిపట్టుకు యెందుకు వేళాకోళాలాడతావు.’

‘అరితేరిన దిడ్డంతివి నీవు దిగాశుగా రంగంలోకి—దా కూర్చో’—

రాజు, ఆ వ్యక్తి వొళ్లు తెలియని రసపిచ్చలోవుందని గ్రహించాడు. ప్రసంగం పెంచితే రసాభాసంగా తయారవుతుందని తటాయించుకున్నాడు.

‘ఇక్కడే కూర్చోండి లోపలికి పోయి యిప్పుడే క్షణంలో తిరిగొస్తాను’ అని వాళ్లిద్దర్నీ చెట్టుక్రింద వదిలేసి చకచకా లోపలికి వెళ్లిపోయింది.

రాజు: కుమార్ ఆ పద్యం యెందుకు వ్రాసినట్టూ?

శశి: కావ్యం యెందుకు వ్రాశావంటే యేవిటి చెప్పటం.

రాజు: వ్రాస్తే వ్రాశావనుకో, దాన్ని అలా తెగపొగిడావు దేనికి?

శశి: పదిరూపాయలు పారేస్తుందేమోనని.

రాజు: ఇంతేనా?

శశి: లేకపోతే ఆ తాటకిమీద నాకు ప్రణయమనుకున్నావా?

రాజు: అమాయకుడివి, దానిసంగతి నీకు తిన్నగా అర్థం కావడంలేదు—జాగ్రత్తగా మెసులు.

శకుంతల వరండాలోకి వచ్చి, “శశీ!” అని కేక పెట్టింది. శశి లేచి దగ్గిరికి వెళ్ళాడు. అతని చేతిలో ఒక పదిరూపాయలు పారేసింది. అతను ఆ దారిన అటే బయటికి వెళ్లిపోయాడు. శకుంతల వరండామెట్లు దిగి, గేటు తీసుకొని కారు గారేజ్ లోకి వెళ్ళింది.

రెండుక్షణాల్లో గారేజీలోనుంచి బయలుదేరి, కారువచ్చి భవనంముందు ఆగింది. ‘రాజా!’ అంటూ శకుంతల కారులోనుంచి కేక పెట్టింది. రాజు ఉసిరికచెట్టు క్రిందినుంచి లేచి కారుదగ్గిరికి వెళ్లాడు. శకుంతల డ్రైవరు సీటులో కూర్చునుంది.

‘ఎక్కు కార్లోకి.’

‘ఎందాకా?’

‘చెబుతా ఎక్కు.’

‘నాకు కొంచెం పనుంది?’

‘ఏమీలేదు ఎక్కు—మనకు పనేవిటి?’

‘ఎక్కడికో చెప్పరాదూ’

‘ఎక్కడి కేవిటి? సినిమాకని తెలీడం లేదూ—తోచక చస్తుంటే.’

‘సినిమా చూస్తే తోస్తుందా?’

‘రాతిముఖం పెట్టుకు తర్కం మాట్లాడకు—నాకు వళ్ళు మండుతుంది’—

‘అవును మెదడును ఉపయోగించి ఆలోచించితే మనం అసలు బ్రతకలేము—సరే చద్దాంపద’—పోయి వెనకసీట్లో కూర్చోబోయాడు.

అలా వెనకసీటులో తగలడబోతున్నావేం—ఇంట్లో శ్రీమింగెయ్యనులే—ఇలా ముందుసీటులోకి అఘోరించు’

‘మింగెయ్యకపోయినా ప్రక్కసీట్లో కూర్చుని బాతాఖానీ వేస్తే కారు యే వంతెనకో వేసికొట్టి నన్ను హత్యచేసి నువ్వు ఆత్మహత్య చేసుకుంటావ్’—

‘మీ మగముండాకొడుకుల్ని చూస్తే నాకు అదేమంట—ఆడదంటే అంత హడిలి చస్తారేం—ముందు లేచి, వొస్తానంటావా లావా?’—

దిగివెళ్ళి ముందుసీటులో కూర్చున్నాడు. కారు రోడ్డువెంట పలుపుతెంచుకున్న బర్రెగొడ్డులా ఎగబడిపోతోంది. జనం తప్పుకుంటున్నారు.

శకుంతల : పంతులు యింటికొచ్చి మూడురోజులైంది.

రాజు : క్లబ్బులో మూడురోజులనుంచి అహోరాత్రులూ చీట్లపేక సాగుతోంది.

శకుంతల: ఈమధ్య తాగుడుకూడా అలవాటైంది.

రాజు : నువ్వూ తాగుతున్నావ్.

శకుంతల : రాజూ!

రాజు : బుకాయిస్తావెందుకు?—తాగితేగాని బ్రతకలేని స్థితికి వచ్చావ్; ముందు ముందు, తాగి బ్రతకలేని స్థితి యేర్పడి ఆత్మహత్య చేసుకుంటావ్—నీ వ్యాధికి అది సరియైన మందు కాదు.

కారు సినిమాహాలు గేటుముందు ఆగింది; ఇద్దరూ దిగి లోపలికి వెళ్లారు. మొదటితరగతి టికెట్లుకొని బాల్కనీమీదికి పోయి కూర్చున్నారు.

లైట్లు వెలుగుతున్నయ్; ఫాన్లు తిరుగుతున్నయ్; రాజు జనాన్ని పరిశీలించుతున్నాడు. శకుంతల అనవసరమైనస్థాయికి గొంతు పెంచి, రాజుతో ఆ పిచ్చిమాటా యీ పిచ్చిమాటా, హాలంతా వినిపించేటట్టు బిగ్గిరిబిగ్గిరిగా చెబుతోంది. మధ్యమధ్య పగలబడి నవ్వుతోంది. హాల్లోవున్న జనమంతా లేచి నిల్చుని ఆ యిద్దరివంకా విడ్డూరంగా చూస్తున్నారు. రాజుకు చిరాకు పుట్టుకొస్తోంది.

లైట్లు ఆరిపోయాయి, సినిమా ప్రారంభమైంది. శకుంతల 'రన్నింగ్ కామెంట్రీ' మొదలు పెట్టింది. మధ్యమధ్య పెద్దపెట్టున నవ్వుతోంది. హాల్లో జనం సినిమా చూడ్డం మానేసి వాళ్ళవంకే చూస్తున్నారు. రాజుకు అంతకంతకు వళ్లు మండుకుపోతోంది.

హాలుమానేజరు వచ్చి 'దయవుంచి కొంచెం నెమ్మదిగా మాట్లాడుకోండి' అని మర్యాదగా మందలించి వెళ్ళాడు. శకుంతల అతనిమాట వినిపించుకోలేదు.

శకుంతల:—వెధవబోరింగ్ — ఈ సినిమాతీసిన చెత్త వెధవెవడో—

రాజు:—బాగుండకపోతే, యింటికి పోదాంపదరాదూ?

శకుం:—ఇప్పట్నుంచీ యింటికిపోయి చావమన్నావా?—తోచి యేడవకనే కాదూ ఇక్కడికి అఘోరించిందీ?

రాజు :—మరింకేం మెదలకుండా కూర్చుని చూడు—ఫిలిం కొంతో బాగుంది కూడా.

శకుం:—అవును; వాడు నీవంటి పతివ్రతలకోసమే ఈ ఫిలిం తీసినట్టున్నాడు (ఊపిరి సలపకుండా పగలబడి నవ్వేస్తోంది.)

'ఏవిటే రభసంతా?'—

'నాకు బోరింగ్ గా వుంది'—

'ఏమంటావ్?'—

'మంచివాడివి అలా దారికిరా—నేను చెప్పినట్టు వింటే నవ్వటం మానేస్తాను—లేకపోతే ఆట ఆఖరయ్యేదాకా నీకర్మ యింతే!—

'ఏవిటామాట?—చెప్పరాదూ'—

'నాతో బీచికి వస్తానంటే యిద్దరంలేచి వెళ్లిపోదాం—లేకపోతే యిక, నీ యిష్టం.'

'ఇప్పుడు మళ్లా బీచికి దేనికి?'

'సరే యింకేం అనుభవించు'—

'సరే పోదాం పద'—

ఇద్దరూ లేచి బయటికి వెళ్లిపోయారు. శకుంతలవచ్చి కార్లో కూర్చుంది. అవమానంతో కందగడ్డయిన ముఖంతో అతనుకూడా వెళ్ళి ప్రక్కసీట్లో మౌనంగా కూర్చున్నాడు. కారు బయలుదేరింది.

'నా వంట్లో బాగుండటంలేదు రాజూ!'

'ఏమిటి జబ్బు?'—

'తెలీదు—అనుక్షణం యేదో ప్రాణం పోతున్నట్టుగా వుంటుంది.'

'అవును నాకూ అలానే వుంటుంది—ఏదైనా వాగుతూ వుంటే కొంచెం ఉపశాంతిగా వుంటుంది'—

'వేళాకోళంగాదు'—

'కాదు నిజమే చెబుతున్నాను—యిదేదో ఒకరకమైన జబ్బు; ఇది ఇంచుమించు మనవాళ్ళందరికీ వుంది. దేశంలో వున్న జనాభాలో ముప్పాతికమంది యిదే వ్యాధితో తీసుకుంటున్నారనుకుంటాను'

'నీకు ప్రతిదీ వేళాకోళం.'

'నిజం చెబితే నీకు వేళాకోళంగా వుంది. ఈ వ్యాధి విషయమై నేను డాక్టర్లనుకూడా సంప్రదించాను. వాళ్లకీ అంతు చిక్కలేదు.'

కారువచ్చి సముద్రపుటొడ్డున ఆగింది. ఇద్దరూ కారుదిగి యిసుకపర్రమీదుగా నడుస్తూ నీటి ఒడ్డుకు చేరుకుంటున్నారు. పిండి ఆరబోసినట్టు వెన్నెల; నిర్మానుష్యంగావుంది. నడుస్తూ నడుస్తున్న శకుంతల గిరుక్కున వెనక్కు తిరిగి అతనివంక చూసింది.

చేతులు రెండూ వెనక్కు కట్టుకుని ఒకొక్క అడుగే ధీమాగా ముందుకు వేస్తూ మౌనంగా నడుస్తున్నాడు. ఆ మౌన గంభీరమూర్తిలో స్ఫురించుతున్న ఆ మనఃస్థైర్యం శకుంతలను కలవరపరిచింది. ఆ మందరపర్వతాన్ని ఛిన్నాభిన్నంచేసి పారెయ్యాలనే వెర్రి ఆవేశమొకటి శకుంతల మనస్సులో ఆవిర్భవించింది. చివాల్న అతనికి అడ్డంవచ్చి నిల్చుంది. ముఖం ఆవేశంతో కందగడ్డయి, పెదవులూ బుగ్గలూ గజగజా వణికిపోతున్నయ్.

'రాజూ!'—

'ఆఁ...'

'కావిలించేసుకోనా?'

'ఎందుకూ?'

'నా మనసు బాగులేదు'—

'నన్ను కావిలించుకున్నా నీమనసు బాగుండదు—పంతులు నిన్ను యెన్నిసార్లు కావిలించుకున్నాడు కాదు?'—

'వాడు వట్టి లుచ్చా!—వాడిమాట యెత్తకు—నేను ఆలంబనం లేని తీగలా, అల్లాడుతున్నాను' చేతులు రెండూ త్రాచుపాముల్లా అతని కంఠానికి పెనవెయ్యబోయింది. అతను చిరాగ్గా రెండుచేతులూ అందిపుచ్చుకుని వారించి:

'ఆగు ఒకమాట చెబుతాను; పంతులుమీద నీకంత చిరాకు కలగటానికి వాడుగాదు కారణం—నీ మనస్సే; రేపు తెల్లవారేసరికి నీకు నామీదకూడా చిరాకు పుడుతుంది. ఈ సంవత్సరంలో నీకు అనేకమందిమీద ఇలా చిరాకు కలిగింది—అవునా?'—

'రాజూ!'—

'కోప్పడకు—నిక్షేపంలాంటి భార్య యింట్లో వుండికూడా నేను ఎందుచేత సుఖంగా బ్రతకలేకపోతున్నానో, నిక్షేపంలాంటి భర్తవుండి నువ్వూ, నిక్షేపంలాంటి భార్యవుండి నీ భర్తాకూడా, అదే కారణంచేత, హాయిగా బ్రతకలేక పోతున్నారు.'

'నేదా... [illegible] ...!—నేను చచ్చిపోతున్నాను—

నీకు

...

రాలేదు.

అమర్చిం

కూడా పక్కలు పరిచివచ్చింది. ఇంత ప్రొద్దుపోయినా యింకా యింటికి రాలేదేమా అని ఆందోళనగా ఎదురుతెన్నులు చూస్తోంది.

వెంకయ్యబాబు పక్కమీదవచ్చి పడుకున్నాడు. ఆయనకు నిద్రపట్టలేదు. లేచి పడిమంచంమీద కూర్చున్నాడు. చుట్టమీద చుట్ట వెలిగిస్తూ గిజాటుగా ఆలోచిస్తున్నాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

ముంగిలి గడపలమీద చెప్పుల చప్పుడు వినిపించింది; భారతి ఆదుర్దాగా హాల్లోకివచ్చి తొంగిచూచింది. రాజారావు మెట్లెక్కుతున్నాడు—

'ఇంకా పడుకోకుండా అలానే కూర్చున్నారేం నాన్నా! నిద్రపట్టడం లేదా?' అని తండ్రిని పలకరించాడు.

'నిద్రా నిప్పులూ!—ఇంకా నా బ్రతుక్కి నిద్రేమిటి?'—రుసలాయన మండిపడ్డాడు.

రాజారావు విభ్రాంతుడయ్యాడు; తండ్రికి అంత కోపం యెందుకొచ్చిందో అతనికి అర్థంకాలేదు. కిక్కురుమనకుండా హాల్లోకి వచ్చేశాడు. చెప్పులు విప్పుతూ, భార్యను దగ్గిరికి పిలిచి; రహస్యంగా: 'భారతీ!—నాన్న అలా కోపంగా వున్నారెందుకు?' అని ఆదుర్దాగా అడిగాడు.

'మరేం లేదులెండి—పెద్దప్రాణం—ప్రొద్దస్తమానం పని చూసుకొచ్చి, ఏదో అలా కొంచెం విసుగ్గా వున్నట్టున్నారు.'

'మరేం లేదుగదా?'

... చాలా ప్రొద్దుపోయింది—భోజనానికి ... కొంచెం పెందరాళే ఇం...

'వీధిలో పెంట పోగు బండీ—దొడ్లో పెద్దెడ్ల జతా ఆపడ్డం లేదుండీ'—

'చిన్నదొర పెద్దెడ్ల జతను పూన్చుకుని పాటిమట్టి బండి పడమటి చేనుకు తోలుకెళ్లారు. నిన్ను చిన్న జతను తోలుకెళ్లి తూర్పు చేలో నారుమడి దున్నమన్నారు. వచ్చి మధ్యాహ్నం చూసుకుంటారు.'

వీరాయి విస్తుపోయాడు—'చిన్నదొర పాటిమట్టిబండి తోలుకెల్డమేంటుండీ!—సదువుకున్న మారాజు ఆరికేం కర్మ!'

'చదువుకున్న వాళ్లు సంసారం దిద్దుకోగూడదా యేవిట్రా?—పిచ్చివాగుడూ నువ్వూనూ—వెళ్లి నీపని నువ్వు చూసుకో' అని మందలించి, చకచకా లోపలికి వచ్చేస్తోంది.

'భారతీ!—

ఈలోగా నిద్రమెలుకూవచ్చి, మగత నిద్రలో యీ సంభాషణంకా చెవులబడ్డ వెంకయ్యబాబు చివాల్న పక్కలో లేచి కూర్చున్నాడు.

'ఏవిటి మావయ్యా!'—గిరుక్కున వెనక్కు తిరిగి మావగారి మంచానికి దగ్గరసా వచ్చింది.

'భారతీ! మతి స్తిమితంలేని ముసలివాణ్ణి, తొందరపడి యేదో పిచ్చివాగుడు రెండుముక్కలు వాగాననుకో—ఇంతలోకే యిలా బుద్ధి చెప్పెయ్యాలా?'

'అదేవిటి మావయ్యా అంతమాట అన్నారూ!—ఏవిటి అపచారం?'

'గడుసువారింటి ఆడబడుచువు—అపచారంలా కనుపించేట్టు చేస్తావా?—నా చేతిలో కర్రలాక్కుని యిప్పట్నుంచీ వాడికిచ్చేస్తే పనీపాటా, లేకుండా నేను బ్రతికేదెలా?'

'ఏభైయేళ్ళు పైబడి యింటిదగ్గిర కూర్చోవలసిన పెద్దలు, మీరే, పనిలేకుండా బ్రతకటం కష్టమని బెంగపడుతుంటే పాతికేళ్ల హుమ్మస్సులోవున్న పడుచువారి సంగతేవిటి?'

'మంచిపనే చేశావులే!'—

'ఇది చాలా చిత్రమైన దేశం—ముసలీ ముతకా పనులకోసం ప్రాభవాలకోసం ప్రాకులాడుతూ, పడుచువాళ్ళనూ, బలసంపన్నులనూ యిళ్ళల్లో కూలేసి, కుమలబెట్టుకుంటూ వుంటారు'—

'ఆసి నీదేశమూ నువ్వూ బంగారంగాను!—ఇంత పక్షపాతమేవిటే? వాడిసంగతే ఆలోచిస్తావుగాని నాగతి ఆలోచించవేం? పోనీ నీ కడుపున ఒకకాయ గాసింది గనక మనవణ్ణి బుజానెత్తుకుని తిరగమన్నావా?'—

భారతికి యెక్కడలేని సిగ్గూ ముంచుకొచ్చింది; సమాధానం చెప్పకుండా తలవంచుకుని ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది.

పడమటింట్లో నా…

# మోదుగు ముత్తైదువ

శ్రీ దాశరథి

కొండలపై పూలు పూచి
గుండెలలో జ్వాలలేచి
ఉగాది, ఉగాది, ఉగాది;
రమ్మ, రమ్మ, ఈలోకం నాది.

శిశిరుడనబడు రాక్షసు చేతిలో ప
రాభవముగన్న భూజాత రమణి వీవు,
రమ్మ మోదువా! నీ శరీరమ్ము నిండ
పువుల పచ్చడ మొండు కప్పెదను నేను.

నాదైలోకముగాది నేసికొనుచుండన్ ప్రోడుగానుండ నీ
కీ దౌర్భాగ్యమ దేల? ఈగహన రాజ్యైకాధిపత్యమ్ము నీ
చే దోయిన్ మకరందధారలటు వర్షింపింతు గైకొమ్ము, స
మోదంబున్ ఘటియిల్ల నీ భువికి నీ మూర్ధాభిషేకమ్మునన్

ఆమూలాగ్రము పద్మరాగసుమ మావ్యాకీర్ణమై సాంధ్య వే
ళామంజుచ్ఛట లుల్లసిల్లగ నవోల్లాసమ్ముతో వేకువన్
మామర్యాదలుస్వీకరింప పర తెమ్మా! ఆంధ్రభూమండలీ
గ్రామీణప్రమదా వినీల కబరీ రంగస్థలీ లాసికా!

మొన్న మొన్న దాక మూగి దానవె గాని
నీవు నోరు తెరచినావు నేడు;
అణగి మణగియున్న ఆలోచనలనెల్ల
పూవుపూవు నాల్క పోల్కి పల్క
నిను వృథాయటంచు నిందించు వారలే
నేడు నీకు వంత పాడినారు
ఎవ్వరధికులైన అవ్వారి మాటలో
మాటకలుపు పొట్టకూటివారు.

అని ప్రబంధ యుగ గంధ బంధురంబైన చాటూక్తి
శక్తితో పద్యవాద్యములతో శిశిరపలాశి పరా
భూతయగు పలాశ నీలకైశిక నామంత్రింప, నాయ
మయు నోటువేయనేర్చిన యీనాటి లంబాడీ చాన
చందంబున కుసుమముల ముసుగెనక మెనగ
మిసమిసలాడుచు నాడుచు నెదుటం గాన్పింప—

ఒకవైపు నుండి మల్లిక వచ్చి దూకింది
ఒక్కకేవ నుండి సంపెగ పూవు వ్రాలింది
ఒకవంక నుండి అశోకమ్ము చేరింది
డాబుగా చాన గులాబి వేంచేసింది

(చతుస్సుమాల బృందగానం)

"మా పరిమళ లహరిచే మధు
మానసమే పులకించు చున్నది
మా తనూ పులకాంకురమ్ముల
మధువు ధారగ పారుచున్నది. మా పరీ...

గగన నీల పటావ గుంఫిత
గహనలక్ష్మికి శోభ మేమే.
అగరు ధూప పరిమళమ్ముల
నందజేసెడి వారమేమే మా పరీ...

పరిమళము లేనట్టి కుసుమము
వనమునకు రాజ్ఞి యగునెట్టులు?
భావ మందని పద్యజాలము
జీవ కవితా శిల్పమెట్టులు?

(తాళం మారిన బృందగానము)

రాజ్యం మాకే రావలె
రాణులు మేమే కావలె
ముక్కు మొహం యెరుగనట్టి
మోదుగుకే హక్కు లేదు
రాజ్యం మాకే రావలె
రాణులు మేమే కావలె
రాణులు మేమే కావలె
రాజ్యం మాకే రావలె"

కవి: "నలువురిలో ఎవరు రాణి?
ఎవరు రాణి నలువురిలో"

పుష్పచతుష్టయం: "నేను నేను నేను నేను
నేనే నేనే నేనే"

కవి: "నీవా, నీవా, నీవా!
నీవు, నీవు, నీవు, నీవు!"

పు.చ: నేనే, నేనే, నేనే
నేను, నేను, నేను, నేను"

కవి: "ముక్కూ ముఖీ యెరుగని
మోదువు కెందుకు రాజ్యం!
మీలో మల్లీ బాలను
ఏలికగా చేసినాను
ఏలుకోండి వనరాజ్యము
వనరాజ్యము నేలుకోండి"

పుష్పత్రయం: "వద్దు వద్దు మల్లి వద్దు
పుష్పద్వయం: గులాబి కావాలి రాణి
పుష్పత్రయం: గులాబి వద్దే వద్దు
పుష్పచతుష్టయం: గుద్దు లాడుకుంటాము"

రాజ్ఞీ పదవికి రణం జరిగింది
ద్వేషం వ్రణంలా పెరిగింది
తన్నుకున్నాయి మల్లికా చంపకాలు
ద్వంద్వయుద్ధం చేశాయి గులాబీ అశోకాలు
పదాలు పదాలు విరిగాయి
పరీమళాలు తరిగాయి
రంగు పోయింది హంగు పోయింది
పొంగు పోయింది కొంగు పోయింది
పోయింది ఆమోదం
ఇది బహు ప్రమాదం!

(దూరంనుంచి నినాదాలు)

"గులాబీది రాజ్యం
గులాబీది రాజ్యం"

..................

..................

"అశోకముది రాజ్యం
అశోకముది రాజ్యం"

కవి: "ప్రశాంతి ఇక 'పూజ్యం'
కృథా జ్వాల కాజ్యం"

పు.చ: రాజ్యం! రాజ్యం!
రాజ్యం! రాజ్యం!
పరాగాల నరాగం పోయింది
శరీరాన రక్తరాగం క్రమ్మింది

మాసిన తలల్తో
దూసిన ఖడ్గాలతో
ఊడిన పోకముళ్లతో
వాడిన ముఖాలతో
చిరిగిన రైకలతో
తరిగిన కాంతులతో
ఒరిగిన పైటలతో
పెరిగిన ముత్యాలపేటలతో
సుమ బాలికా మతల్లికలు
అమవసరాత్రి ఝిల్లికలు
కొడిగట్టిన తిల్లికలు
అయ్యో! అయ్యో! అయ్యో,
ఏమిరణం! ఎట్టిరణం!
ఝణం ఝణం ఝణం ఝణం
ఘణం ఘణం ఘణం ఘణం
లయ తప్పని శ్రుతి తప్పని
గతి తప్పని యతి తప్పని
రణం రణం రణం రణం
రణం రణం రణం రణం

పక్కన నవ్వింది మోదువు
కణకణ లాడే అగ్గి కైదువు!
మేమిచ్చే రాజ్యం ఆవిడకేగా!
మెజారిటీవోటు ఆవిడదేగా!
శిశి శిశి శిశిర రాక్షసుని
శిరస్సురస్సురశ్శిరస్సు ఛేదించే
వాడి వాడి, వేడి వేడి
కైదువు ఈ మోదువు
ఈ మోదువు ముత్తైదువ!

* సంస్కృత రూపకచర్చ

# మురారి అనర్ఘరాఘవ పరిశీలన

శ్రీ వెల్దండ ప్రభాకరరావు

"మురారేస్తృతీయః పంథాః" యను నార్యోక్తి సమంజసముగుటేగాక సుప్రసిద్ధమైనది కూడ. ఏలనన సంస్కృత సాహిత్యమున, మురారి, యనర్ఘ రాఘవనాటక రచనకతమున యత్యున్నతమగు స్థానము నాక్రమించినాడు. అట్టి యుదాత్తమగు నాటకము రచించుటయం దతడే సిద్ధసంకల్పుడు. ఈ విషయము మురారి అనర్ఘ రాఘవ పరిశీలమున గాని తేటపడదు. మురారి నెవ్వరును అనుకరించలేదు, మించలేదు. అనుకరింప యత్నించిన ప్రసన్న రాఘవకర్తకు మాత్రము 'బాలమురారి' బిరుద ప్రదానము జరిగినది. ఆ బిరుదమందే యతనియనుకరణ మెంతవరకు విజయవంతమైనదో తెలియవచ్చుచున్నయది. అతడు సంపూర్ణముగ సఫలీకృత మనోరథుడు కాలేదు. అట్లగుటకు కారణములు. అతనికి పరిపూర్ణపాండిత్యప్రకర్ష గాని, ప్రతిభాప్రాగల్భ్యములు గాని, లేకపోవుటే. మేఘసందేశమందు మహాకవి కాళిదాసు "రిక్తః సర్వో భవతిహి లఘుః పూర్ణతా గౌరవాయ" యను శ్లోకమునం దేతద్విశేషము నుల్లేఖించినాడు. సంస్కృత సాహిత్య మొకమహారణ్య. మందుకు ప్రబల ప్రమాణము, "సంస్కృతారణ్య సంచారీ విద్వన్మత్తేభశృంఖలమ్" యను చాటువుగూడ కలదు. ఇందలి సత్యాసత్యము లెట్లున్నను సంస్కృత సాహిత్యమందు పరిపూర్ణపాండిత్యము సాధించి ప్రచండపిండము గావలచిన నాచార్యుని మోల కనీసము ద్వాదశవర్షంబు లధ్యయనము చేసినిష్కృష్టంబుగ వ్యాసంగము చేసిన గాని సాధ్యము కానేరదు. మురారి షట్ఛాస్త్రంబులను పరిపూర్ణముగ జీర్ణించుకొని తగు నుపజ్ఞను సాధించి సాహిత్యశాస్త్రమును నందు ప్రత్యేకపటిమను పొందినాడు. అశిథిలపదబంధమే సాహిత్యము. అంతేగాక శబ్దములు సుపరిచితములే. కవిత్వముయొక్క సారమంతయు "ఏకశ్శబ్దః సమ్యగ్ జ్ఞాతః సుప్రయుక్తః స్వర్గేలోకే కామధుక్ భవతి" యను వాక్యమం దిమిడియున్నది. సాహిత్యముయొక్క పరమావధి రసాస్వాదన. అందులకే "రసోవై సః" యన్నారు. ఇట్టి రసస్వరూపము సాహిత్యశాస్త్రము కరతలామలకముగ నెఱిగిన సాక్షాత్కరింపదు. తత్కారణమున మురారి సాహిత్యశాస్త్రమునం దసాధారణ ప్రజ్ఞ సాధించి పండితమండలీమండనమగు యనర్ఘ రాఘవనాటకమును రచించి కృతకృత్యుడయ్యెను. దీనియందు కోశములందలి మారుమూలలపదములను విశృంఖలంబుగ గుప్పించినాడు. దానివలన శబ్దశాస్త్ర నిష్ణాతులైనవారికిని, నిఘంటుపరిశీలన చేసిన వారికినిమాత్రమే పఠనపాఠన యోగ్యమై యలరారుచున్నది. దానివలన నీగ్రంథమునకు గురుతర గౌరవమే లభించినది. అలంకార ప్రచురమైనది. పదజాలమునకు మేలుబంతియైనది. ఇది యిట్లుండ మొదట పేర్కొన్న నా భాణకములో సూచింపబడిన "మురారి" యనర్ఘరాఘవ కర్త కాదనియు, అతడు మీమాంసావాదులలో నొకడనియు, కుమారిలభట్టు, ప్రభాకరభట్టు వాదములకన్న భిన్నమగు వాదమొకటి సృష్టించుటకు కారణభూతు డయ్యెననియు వచింత్రు. అయినను సంస్కృత నాటక చరిత్రపశీలనమున గాని యీ నానుడి సమంజసముగా గన్పట్టదు. అనగా యనర్ఘరాఘవ కర్తకు సమన్వయము చేసుకోవచ్చును. విలక్షణలక్షితములైన కాళిదాసు, భవభూతి పథములను విడిచి నాటకరచనయందు పృథక్స్వతంత్రపంథా నవలంబించినాడు. ప్రతిభావ్యుత్పన్నమైన మురారి ప్రత్యేకత యనర్ఘరాఘవమందు సుస్పష్టముగా గానవచ్చును. కాళిదాసుడు వ్యంగ్యప్రధానుడు, భవభూతి వాచ్యప్రధానుడు. మురారి కల్పనాప్రధానుడు. దానికతముననే మురారిది మాఘవమార్గమని చెప్పుటకు వీలుపడినది. మురారి నాటకము దానికదియే యనర్ఘము. విద్వన్మణులకు సైతము జీర్ణముకాకుండ యానాటినుండియు నేటివరకు నిశితకాల పరీక్షల కాగియుండుటవల్ల నుత్తమ సాహిత్యమునకు లక్షణమైన సార్వకాలీనతాముద్ర దీనికి లభించినది. ప్రౌఢపరిపాక మందుండుటవలన దీనికి సార్వజనీనత కలుగలేదు.

మురారి గురుకులక్లిష్టుడు. అంతేగాక యతడచంచలమగు నాత్మవిశ్వాసముతో, యకుంఠితమగు శ్రద్ధాభక్తులతో, శారదాంబ నుపాసించి తన యుపజ్ఞవలన యనితరసాధ్యమగు సాహిత్యసారమును వడపోత గావించితినని యీ క్రింది శ్లోకమున నుడివినాడు.

దేవీం వాచముపాసతేహి బహవ స్సారంతు సారస్వతం
జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కింత్వస్య గంభీరతా
మాపాతాళనిమగ్న పీవరతను ర్జానాతి మంథాచలః.

మంథాచలమున కాపాతాళనిమగ్నపీవరతనువను విశేషమును వాడుటవలన సర్వేంద్రియ స్వాధీనసమర్థత సూచించబడినది. శారీరదార్ఢ్యము జారిన పిదప సాధించగలుగున దేమి యుండదు. మురారిట్టిదశలోనే సాహిత్యసంపదను ప్రత్యక్షమొనరించుకొనియెనని ధ్వనించుచున్నది. నేటి చదువు ఒరులుగట్టిన సేతువై వార్ధి దాటుటేయని వేఱుగా చెప్పనక్కఱలేదు. సంస్కృత విద్యాభ్యాసమాంగ్లభాషానువాదములద్వారా జరుగుచున్నది. సంస్కృత

* లక్నోలో జరిగిన అఖిలభారత ప్రాచ్య విద్యాపరిషత్ సమావేశము చదివిన ఆంగ్ల వ్యాసమున కనువాదము.

వ్యాఖ్యానములేనిదే ఐచ్ఛికభావముగా గోని గీర్వాణమందు పట్టభద్రుడనయితినని యొక రనుట నాకు ప్రత్యక్షానుభవము. పై శ్లోక మనర్ఘరాఘవమందు లేదుగాని యప్పయదీక్షితునికువలయానందమున మురారి కృతముగా నుదాహృతమైయున్నది. అంతేగాక 'కావ్యేషు నాటకమ్ రమ్యమ్' 'నాటకాంతమ్ హిసాహిత్యమ్' యనునూక్తుల యాథార్థ్యము నెఱింగియే కాబోలు శ్రవణశ్రావణయోగ్యమగు మహాకావ్యరచనముకన్న నాటకరచనమే యుత్తమమని తలంచి మురారి యనర్ఘరాఘవమును రచించినాడు. నాటకగతిని యున్నను యేడంకములలో దాదాపు 470 శ్లోకములుండుటవలన గీర్వాణసాహిత్య విద్యాపరిషత్తు దీనికి మహాకావ్యముద్ర వేసినది. 'విద్యదౌషధ' మనినను బాగుండును. గ్రంథమొకటే రచించినందున తత్కర్త సర్వశక్తి లిమిడియుండుట స్వతస్సిద్ధము. అందు గాక మరెందు తమ తమ ప్రతిభావిశేష ప్రాగల్భ్యములను ప్రకటించగలరు. అట్లు చేయనిచో వారి కాత్మ సంతృప్తి చేకూరుటెట్లు? వారి వాక్కుల కమరత్వము లభించుటెట్లు? తద్వత్తే మురారి యనర్ఘరాఘవ మొక్కటే రచించిన కారణముగా యతని ప్రతిభాతిశయములు చక్కగా జాలువారినవి. పాండిత్యప్రకర్షక మేలుబంతియై యలరారుచున్నందున కేవలవిద్వజ్జన సేవ్యమై సామాన్యులకు సర్వసాధారణముగా దుర్భేద్యమైనది. గీర్వాణభాష కాదికవి యగు వాల్మీకి పెటవదే భిక్షు. రామాయణ మహాకావ్యమేకధాటిగా యతని హృదయ గహ్వరములనుండి వెలువడిన యమృతసోన. కాళిదాసు ఉవతరించువరకు రామాయణమందలి కొన్ని సర్గలే సంస్కృతభాషాధ్యయనపరులకు రఘువంశములేని లోటు పూర్తిచేసి పఠనపాఠకయోగ్యములై వ్యవహరించినవి. వాల్మీకిహృదయము చక్కగా నెఱుగుట కల్ల. కాని శైలి సరళముగా నుండుటవలన సంస్కృతమున సామాన్యపరిచయమున్న వారినిగూడ దలలూపజేయునది వాల్మీకికవిత. అందు వామలూరు తనయుని తపఃప్రభావము సర్వస్వము ధారాగతమై యున్నది. అంతేగాక రామాయణమందలి యతురసమామ్నాయము భావవిభూతిని కల్గించుననుట తథ్యము. సరస్వతీసారభూతము రామాయణము. బ్రహ్మసైతము వాల్మీకి నుద్దేశించి "మచ్ఛందాదేవతే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ" యని శ్లాఘించినాడు. ఇదియేయా కావ్యమునకు తగిన ప్రశంస. ఇటి రామాయణగాథయొక్క పూర్వార్థమే యనర్ఘరాఘవములోని యితివృత్తము. ఉదాత్తమగు నాయకమణి గాథ రచించుటవలనగూడ యనర్ఘరాఘవమున కొక ప్రత్యేకతకల్గినది. రామాయణమందున్న దివ్యత్వము మరొక గ్రంథమునందులేదు. తత్కారణముననే ఇతరభాషలలో నసంఖ్యాకమగు యనువాదములుండుట వలన దాని ప్రచార మత్యధికమైనది. వేదవ్యాసుని మహాభారతసంహిత పంచమవేదమయ్యు నందు రాజ్యకాంక్ష, రాజనీతి, భ్రాతృవధ ఇత్యాదు లభివర్ణితములైనందున భారతమునకు రామాయణ తుల్యమైన దివ్యత్వము లభింపలేదు.

భట్టమురారి కాశ్మీరదేశనివాసి. కాశ్మీరము గీర్వాణసాహిత్య వికాసమునకు ముఖ్యకేంద్రముగా విలసిల్లినది. అందు పెక్కు కవులు జన్మించినారు. ఖండన ఖండనఖాద్యము, విద్యదౌషధబంభరమగు నైషధీయ చరిత్ర మహాకావ్యము మొదలగు గ్రంథములు రచించిన భారతీసిద్ధుడు భట్టహర్షుడీ కాశ్మీరమునకు చెందినవాడే. దీనికి సంబంధించిన యైతిహ్యముకూడ నొకటికలదు. శారదాపీఠముకూడ నిందే నెలకొని యుండినది. రాజసభలందు పండితులకు కలుగు వాగ్వాదములను పరిష్కరించుటకు శారదాంబయే యవతరించెనని గూడ భాషింత్రు. ఈ సమాచారము కొంతవరకు నైషధీయ చరిత్ర పీఠికలో నివ్వబడియున్నది. కాశ్మీరదేశమందే ఇటీవల మంత్ర తంత్రశాస్త్రగ్రంథములు లభించినవి. వానిని కాశ్మీర ప్రభుత్వము ప్రకటించుచున్నది. రత్నాకరుడు కాశ్మీరము (855-884 వరకు) నేలిన అవంతివర్మయాస్థానకవి. కావున మురారి కాలము 9 వ శతాబ్దారంభమని చెప్పవచ్చును. కొందరాతని నాంధ్రుడందురు. దానికి కారణము తన నాటకమునందు సప్తగోదావరమును వర్ణించుటయే యందురు. అన్ని ప్రదేశములను వర్ణించుచు సప్తగోదావరమును గూడ వర్ణించినాడు. మురారి సప్తగోదావరమును మాత్రమే వర్ణింపలేదు. భవభూతి తన నాటకత్రయమున నెన్నియో మార్లు గోదావరీ ప్రశంస గావించినాడు. దానివలన యతడాప్రాంతమువాడనుట కొంతవరకు సమంజసము. అంతేగాక యతడాప్రాంతనివాసి యనుటకు ప్రబలమగు సాధారములు గలవు. నాకుంజూడ మురారి కాశ్మీర నివాసియనియే నమ్మిక. ఇది చరిత్రకారులు నిర్ధరింపవలసిన విషయము. నాటకము నానందించుటపోయి యాతని నివాసమును నిర్ణయింపబూనుట "నీవీమోక్షణవేళాయాం వస్త్రయాల్య పరీక్షణమ్" అను లోకోక్తిని పాటించినట్లగును. మురారి సప్తమాంకమున గోదావరమునే కాక, యగస్త్యనిద్వితీయ నివాసము రోహణాచలమును, తామ్రపర్ణిని, మలయాచలమును, పంచవటిని, మారీచుని ప్రస్రవణశైలమును, గోదావరిని, మాల్యవంతమును, మహారాష్ట్ర రాజధానియగు కుండినమును, ఆంధ్రదేశలక్ష్మీసప్తగోదావర నాయకరుచిరు ద్రాక్షారామభీమేశ్వరుని, ద్రవిడమహాకాళనాథుని, చేదిదేశకలచురీక్షత్రియ ప్రధాననగరి మాహిష్మతిని, యమునను, గంగను, వారాణశిని, మిథిలను, గౌడరాజధాని చంపను-యిత్యాది ప్రదేశములను విరివిగా వర్ణించినాడు.

మురారి మౌద్గల్యగోత్రోద్భవుండు. తంతుమతీ వర్ధమానతనయుండు. బాలవాల్మీకి బిరుదాంకితుడు. శబ్దబ్రహ్మ మాఘ్రాణింపని సుజనులు తన కవితను విమర్శించుట సహింపడు. ఈతని కవిత వాల్మీకి వాగమృతకూపనిపాన లక్ష్మిచే విలసిల్లుచున్నది. అంతేగాక సౌరభ్య నిర్ఝరగంభీరమును, మనోహరమునై యున్నది. కకుత్స్థకుల ప్రశస్తి ధ్వనించుచున్నది. అనర్ఘరాఘవమునందీ విశేషములు వెల్లడియగుచున్నవి. స్వోత్కర్షయుని కొన్ని విశేషములు వర్ణింపనివి యుండియుండును. అన్నింటి నిట నుదాహరించుట యప్రస్తుతము. ఒకటి మాత్ర ముల్లేఖించెదను.

మురారి పదచింతాయాం భవభూతేస్తు కా కథా
భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు.

దీనివలన మురారి భవభూతి తరువాతివాడను విషయము స్పష్టమగుచున్నది. భవభూతిపాండిత్యమును మించుటకు మురారి యెన్నియో ఘట్టములందు ప్రయత్నించి స్వచ్ఛందముగా విజృంభించినాడు. మురారికి శబ్దముల పొందిక చక్కగా కుదిరినది. పై యాభాణకమందు మురారి స్వోత్కర్ష ధ్వనితమగుచున్నది. కాని యది

రెవరి కృతమో తెలియదు. భవభూతిరచించిన యుత్తర రామచరిత్రలో రామాయణమందలి యుత్తరార్ధ (ఉత్తరకాండ) గాథ యభివర్ణితమైనది. భవభూతి కొన్ని మార్పులను చేసినాడు. భట్ట మురారి యనర్ఘమందు రామాయణగాథలోని పూర్వార్థము వర్ణింపబడినది. ఈరెండు నాటకములలో పాండిత్య విషయములో మాత్రమే తారతమ్య పరిశీలనచేయవచ్చును. పాండిత్య విషయమున మురారి భవభూతికన్న మిన్న యనవచ్చును.

అనర్ఘరాఘవ పరిశీలనచేయుటకు పూర్వము సంస్కృత నాటకస్థితి కొంత యెఱుంగవలయును. కాళిదా సవతరించుటకు పూర్వము భాసుని నాటకములు కలవు. భాసుడు 18 నాటకములను రచించినాడు. అవే భాసనాటక చక్రమను పేర ప్రకటితమైనవి. కాళిదాసు రచించిన మూడు నాటకములలో శాకుంతలమే యగ్రగణ్యము. చాలామటుకు సంస్కృత నాటకములకు పౌరాణిక గాథలే యితివృత్తములుగా నున్నవి. అందును వాటిని భారతనాటకములుగాను, రామాయణనాటకములుగాను, భాగవతనాటకములుగాను విభజింపవచ్చును. ఇవి యసంఖ్యాకములుగ నున్నవి. భవభూతి రచించిన నాటకములలో రెండింటియందు రామాయణ గాథ యభివర్ణితమైనది. రామాయణగాథనే నాటకేతివృత్తముగా వాడుట సర్వసామాన్యమని భట్ట మురారి "అహో సకలకవిసార్థ సాధారణీఖల్వియం వాల్మీకసుభాషితనీవీ" యని కంఠోక్తిగా యనర్ఘరాఘవమందు వక్కాణించినాడు. మురారిది రామాయణ నాటకములకు చెందినదే. మహావీరచరిత్ర, ఉత్తర రామచరిత్ర, కుందమాల, జానకీహరణము, ప్రసన్నరాఘవము, ఆశ్చర్యచూడామణి, బాలరామాయణము, ఉదాత్తరాఘవము, అభిషేక నాటకము, ప్రతిమానాటకము, రామాభ్యుదయము, ఛలితరామము, మైథిలీయము, యిత్యాదులీ పరంపరలోనివే. ఇంతేకాక నాటకములను రసవత్తర నాటకములుగాను, ప్రయోజన నాటకములుగాను, కేవల నాటకములుగాను విభజింపవచ్చును. అనర్ఘరాఘవము రసవత్తర నాటకము. ఉత్తమ నాటకములనునవి చాలా కొద్దిగా నున్నవి. శాకుంతలము, ఉత్తరరామచరిత్ర, మృచ్ఛకటికము, ముద్రారాక్షసము, వీటికే యగ్రతాంబూలము. ఈ శ్రేణివే ఆశ్చర్యచూడామణి, వేణీసంహారము, హర్షుని నాటకములు, ప్రబోధచంద్రోదయము. ఇటీవల వచ్చినది సంకల్పసూర్యోదయము. పై నాలుగు ఉత్తమ నాటకము లొక్కొక్క గుణమునకుగాను విలక్షణలక్షితములై యొక ప్రత్యేకత కలిగియుండుటచే ప్రసిద్ధిజెందినవి. వీటికే మంచి ప్రచారముకలదు. పఠనపాఠనములు కలవు. ప్రబోధచంద్రోయము అద్వైత సిద్ధాంతవాదమును ప్రతిపాదించునాటకము. సంకల్పసూర్యోదయమును వేదాంతదేశికుడు విశిష్టాద్వైత సిద్ధాంతమును నిరూపించుచు ప్రబోధచంద్రోదయమును ఖండించుచు వ్రాసినాడు.

ఇతఃపూర్వము చెప్పినట్లు అనర్ఘరాఘవనాటకేతివృతము రామాయణమునుండి గ్రహింపబడినది. ఇట్లు కవులు రామాయణగాథ నితివృత్తముగా గైకొని వేర్వేఱువిధముల సమర్థించుకొన్నారు. కాళిదాసుకూడ "రఘూణామన్వయం వక్ష్యే" యన్నాడు. వీరిసమర్థనలకు కారణము నాకు చూడ యీ క్రిందిదిగా గన్పట్టెడిని. రామాయణము నితరగాథలతో పోల్చుట తగదు. దానికదియేసాటి. అందున్న దివ్యత్వము తదితర గ్రంథములందు లేదు. మురారి తా నవర్ఘ రాఘవమును రచించుట నిట్లు సమర్థించినాడు. అంతకు పూర్వ మాతడు తన శక్తి సామర్థ్యములను ప్రకటించుకొనినాడు. సోత్కర్షయే యయినను నాత్మ విశ్వాసముగలవారికిది నైసర్గికము. "అస్తీత్యుపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి" యను యుపనిషద్వాక్యము సువిదితమే కదా,

తత్తాదృగుజ్జ్వల కకుత్స్థకుల ప్రశస్తి
సౌరభ్య నిర్భరగభీర మనోహరాణి
వాల్మీకివాగమృత కూపనిపానలక్ష్మీ
మేతాని బిభ్రతి మురారి కవే ర్వచాంసి.

ఇట్టి సుగుణగణములుగల మురారి కవిత యన్య విషయములలో విజృంభింపజాలదని భావించి తన పని నీ రీతి సమర్థించినాడు. వ్రాయబోవునది వీరరస నాటకము. ధీరోదాత్తుడగు నాయకుడు కావలయును.

యదిక్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్య చరితం
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః
స్వమాత్మానం తత్తద్గుణగరిమగంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యంతి కవయః.

చర్విత చర్వణమని భావించి రాముని గాథను వీడినచో యట్టి యుదాత్తతమ గుణములు గల నాయకు డెందు లభించును? తమతమ పాండిత్యముల నెట్లు సద్వినియోగపరచుకో కలుగుదురు. తమ గంభీరవాక్కులకు సార్థక్య మెట్లొనగూడును. ఇదియొక నాటకములకే గాదు. భోజుడు చంపూరామాయణమందుగూడ తన గోడు నిట్లు నివేదించినాడు.

వాల్మీకి గీతరఘుపుంగవ కీర్తిలేశై
స్తృప్తిం కరోమి కథమప్యధునా బుధానామ్
గంగాజలైర్భువి భగీరథయత్నలబ్ధైః
కింతర్పణం నవిదధాతి జనః పితౄణామ్.

గంగాజలములు భగీరథుని తపశ్చర్య ఫలితముగ భూతలమునకు తేబడినను జనులు పితృదేవతలకు తర్పణము లిచ్చుటలేదా. తద్వత్ వాల్మీకిచే కీర్తింపబడిన రామచంద్రుకథనే రచించి పండితులకు తృప్తిగావించెదనని సమర్థించినాడు. కంకంటి పాపరాజకవి ఉత్తర రామాయణము రచించుచు "వరుసం దిక్కన యజ్వ" యను పద్యములో 'రాఘవేశ్వరుచారిత్రము లెంద రెన్నిగతుల న్వర్ణించినన్ గాలదే' యని సమర్థించినాడు. అంతేగాక సాహసించి మరొక ముందంజవేసి నిర్భీతిగ 'జానకీజాని కథల్ రచింపకయ సత్కథ లెన్ని రచించెనేనియున్ వాని వివేక మేమిటికి వాని కవిత్వమహత్వ మేటికిన్' అని వాపోయినాడు.

మురారినాటమున కితరనాటకముల కున్నంత ప్రచారము లేదు. ఉత్తమమగు నాటకముల నాల్గింటిని మొదటనే పేర్కొంటిని. ఈనాటకము ప్రచారములో లేకపోవుటకు తగు కారణములు గలవు. సంస్కృత భాషాధ్యయన పరులకు పంచకావ్యములు చదివి

శాకుంతల పరిచయమైన పిదపనే కాని యితర ప్రౌఢనాటకములు చదువుట కర్హత కలుగదు. ప్రాచీన సంప్రదాయానుసిద్ధముగ సంస్కృత భాష గరపు నాచార్యుల నిర్బంధ నిర్వచన మిది. ప్రౌఢ కావ్యములలో లక్ష్మీసహస్రము, నైషధ మహాకావ్యము లగ్రగణ్యములు. వీటిని చదువుటకు తగు ప్రోత్సాహము లభింపదు. వీటి ప్రత్యేకత యన్వయకాఠిన్యము, శ్లేష, శైలీక్లిష్టత. ఇట్టి గ్రంథములు చదువుటకుగాని చదివించుటకుగాను విద్యార్థులుగాని ఆచార్యులుగాని పూనుకొనరు. నాటకములలో ననర్ఘరాఘవము ప్రౌఢనాటక మనదగును. గద్యకావ్యములలో భట్టబాణునిహర్షచరిత్ర మీ శ్రేణికి చెందినదే. ఈనాటకరాజ మితః పూర్వ ముల్లేఖించినటుల పాండిత్య ప్రకర్షకనర్హమై యుండుటవలన విద్వన్మణులకు విద్యార్థులకు సైతము విసుగుగల్గించుచుండును, రఘువంశము, మేఘసందేశము, కుమారసంభవము, శిశుపాలవధ, కిరాతార్జునీయాది కావ్యములకు మల్లినాథ సూరి సుబోధకరమగు వ్యాఖ్యానములు కలవు. ఇంతేగాక యితర వ్యాఖ్యానము లసంఖ్యాకములుగా నున్నవి. చాలావరకు నివి ముద్రితములై లభించుచున్నవి. కాని మురారి కున్న వ్యాఖ్యానములలో రుచిపాతి వ్యాఖ్యతోగూడిన నాగరలిపి ప్రతి మన కిప్పుడు లభ్యమై శరణ్యమగుచున్నది. మైసూరిశ్రీప్రతి వ్యాఖ్యాన త్రయ సమేతమైనను అది ఇపుడు లభింపదు. దానిని మరల ప్రకటించుటకు పూనుకొననులేదు. ఈనాటకమునకు తగు ప్రచారము లేకుండుటకు కారణ మన్వయకాఠిన్యము ప్రధానమైనది. అంతేగాక సంస్కృత విద్యాపరిషత్తు ఈగ్రంథమున కనాదరము చూపి యన్యాయము చేసినది. ఇది చాల విషాదకరమైన విషయము. వ్యాకరణ పాండిత్యమున కాకరమని విమర్శింతురు. విమర్శనమనగా సహృదయతతో అందలి గుణాగుణములను నిష్పాక్షికబుద్ధితో వ్యక్తిత్వములతో సంబంధములేక నిరూపింపవలయును. ఒకవేళ మనకేదేని గ్రంథమన్వయముగానిచో దాని యన్వయము చేసుకొనగల సమర్థతగాని యోగ్యతగాని లేదని తలంచుట పండితలక్షణము. విమర్శనను గూర్చి డా. సామ్యుల్ జాన్సన్ అన్న వాక్కు యథార్థము. విమర్శనముయొక్క పరమావధి ప్రాచీనులను ప్రశంసించుట, నవీనుల లోపములను బయటపెట్టుట! కవి బ్రతికియున్నంతవరకు నాతని కనిష్టమగు గ్రంథప్రాశస్త్య ముగ్గడించి యాతనినితూలనాడుదురు. అతడు మరణింపగానే యతని యత్యుత్తమ గ్రంథమును ప్రశంసించి పైకెత్తుదురు. ఇది సమంజసము కాదు. కాళిదాసుకూడ ఇటువంటి యభిప్రాయమునే వ్యక్తపరిచినాడు.

పురాణమిత్యేవ నసాధుసర్వం
నచాపి కావ్యం నవమి త్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే
మూఢఃపరః ప్రత్యయ నేయబుద్ధిః.

బలవదపి శిక్షితుడైన కాళిదాసు ఇచ్చిన నిర్వచన మిది. లక్షణయుక్తముగ నుండుటకూడ నీనాటకమునకు ముప్పేయయినది. విపట్టపరీక్షలకుగాని ప్రాచ్యవిద్వత్పరీక్షలకు గాని యనగా శిరోమణి తత్సమానమగు నితర పరీక్షలకుగాని పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడలేదు. శిరోమణికి, ఎం. ఏ., పరీక్షలకు నిర్బంధపాఠ్య గ్రంథముగా నిర్ణయింపబడిన నీగ్రంథమునకు తగు న్యాయము జరిపినవారగుదురు. గీర్వాణసాహిత్య పాండిత్యమునకు నికషోపల మనబరగు నీనాటకమున కట్టి సుదినంబులు రాకపోవు. పట్టభద్రులైన వారు తమ విజ్ఞాన మవితథముగాదని నిరూపించుకోగల్గుదురు. సంస్కృత సాహిత్యపు నాయువుపట్టుకూడ సునాయాసముగ కరతలామలకమగును. అంతేగాక యీనాటకముపై విమర్శనలు చాల అరుదు. దుష్ప్రచారమును తొలగించి యందలి గుణగణములను నిరూపించి సాహితీపిపాసువుల నేతన్నాటకపఠనమునకుగాను పురికొల్పుటత్యావశ్యకమై యున్నది. దానిపై కృషిచేయుటకు కూడ నోపిక యెవ్వరికిని నున్నట్లులేదు. కావున సుబోధ మగు వ్యాఖ్యానములేకుండుట, పఠనపాఠనములు లేకుండుట, నిర్బంధ పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడకుండుట—ఇవియే మురారి నాటకమునకు ప్రచారము లేకపోవుటకు కారణములు. విశ్వవిద్యాలయ ప్రాంగణములలో దీనికి ప్రవేశము లభింపలేదు. ఇటుపేక్ష చేయబడి, ప్రచారములో లేనినాటకముయొక్క యుదాత్తత కేవలము దీనిని సమగ్రముగా వ్యాసంగముచేసినగాని తేటపడదు.

మురారి ప్రౌఢుడు. అతని కవితారీతి గౌడికిజెందినది. ఈ నాటకమందలి ప్రధానరసము వీరము. అంగిరసముశృంగారము. ప్రతిభావ్యుత్పన్నుడగుటవలన నిత డుపయోగించిన పదజాలము గంభీరమై వర్ణించిన ప్రతి విషయము నుదాత్తతనే ప్రకటించుచున్నది. సరస్వతిని "నిత్యప్రగల్భవాచాలాం ఉపతిష్ఠే" యని గంభీరభాషణముల నుతించినాడు. డొక్కశుద్ధియైనవాడు దిక్కనిట్లు విశృంఖలంబుగ వాకొనజాలడు. దీనిలో నొక రాజకీలి గన్పట్టుచున్నది. వాల్మీకినిగూడ నీవిధముగనే నుపశ్లోకితము చేసినాడు.

త మృషిం మనుష్యలోక
ప్రవేశ విశ్రాంతి శాఖినం వాచాం
సురలోకా దవతరణ
ప్రాంతర ఖేదచ్ఛిదం వందే.

ఇంతేగాక యెన్నియో స్థలముల స్వచ్ఛందముగా విహరించినాడు. సమాసపదఘటితమగు రచన ఇతనికి కరతలామలకముగుటే కాక సుదీర్ఘ సమాస ప్రయోగముకూడ నితని కైవసమయినది. ఎంతటి తాదృగ్దీర్ఘ సమాసమైనను సునాయాసముగ శ్లోకమునం దిముడ్చగల దిట్ట. మధ్యాహ్నకాలమును వర్ణించుచు నొక పెద్ద సమాసము నిందు విసరినాడు.

ఉద్దామద్యుమణి ద్యుతివ్యతికరప్రక్రీడ దర్కోపల
జ్వాలాజాలజటాలజాంగల తటీనిష్కూజకోయష్టయః
ఘామోష్ణప్లవమాన సూర్యకిరణ క్రూర ప్రకారాద్బ్రళో
రాయుష్కర్మ సమాపయంతి ధిగమూర్మధ్యాహ్న కూష్మా దిశః.

ఇందు మొదటి రెండు పాదము లొకటే సమాసము. ఇందలి రెండవ పాదమును కొద్దిగా మార్చి చేసి శ్రీనాథకవి సార్వభౌముడు తన హరవిలాసమందును తదితర కృతులందును "జ్వాలాజాలమరీచి జాంగలతటీవాచాలకోయష్టియై" యని వాడుకొనినాడు. ఇట్టివే కొన్ని ప్రయోగములను రామకృష్ణుని కవిత్వమందగపడును. అతనికి మురారిప్రయోగించిన తత్తాదృక్ యను పదముపై వ్యామోహ మెక్కుడుగా నున్నట్లు కన్పించును. ద్వైరాజ్యము, పాణింధ

మము, కింపుర్వాణ, వ్యామ్ర గాహ్య స్తనీభిః, ద్యావాపృథ్వ్యవకాశములు మొదలగు శ్రీనాథుని పదములు మురారి శబ్దభాండాగారమే. మురారిచేసిన మధ్యాహ్నవర్ణనను భవభూతి మరొక్క విధముగా చేసినాడు.

> కండూలద్విపగండ పిండకషణా కంపేన సంపాతిభిః
> ఘర్మ స్రంసితబంధనైః స్వకుసుమై రర్చంతిగోదావరీం
> ఛాయాపస్కిరమాణ విష్కిరముఖ వ్యాకృష్ట కీటత్వచః
> కూజత్క్లాంతకపోతకుక్కుటకులాః కూలే కులాయద్రుమాః.

రామాయణము పెద్ద గ్రంథము. పాత్రలు చాలనుండుట వలన దానిని నాటకముగా ప్రదర్శించుట కష్టతరము. మురారి మాత్రము చాలా తక్కువ పాత్రలతో కాలక్షేపము చేసినాడు. విష్కంభములతోనే యెక్కువ సమాచారమును చెప్పించి కథా వేగమును హెచ్చించినాడు. విశ్వామిత్రుని ప్రవేశముతో నాటకము ప్రారంభమయినది. కొన్ని యనవసర ఘట్టము లిందు బొందుపరుపబడలేదు. ఇప్పటికే సుదీర్ఘతరమగు నాటకమయినది. అనగా నంకములందు శ్లోకముల సంఖ్య పెరిగిపోయినది. కొందరిమతమున శ్లోకము లెక్కువగ వ్రాయుటే నాటకప్రత్యేకతను ప్రతిభా విశేషమును వ్యక్తము చేయగలదని యందురు. అట్టి శ్రేణికి చెందినవాడు మురారి. వివరముగ చెప్పవలసినతావుల వివరముగాను సంక్షిప్తముగా చెప్పవలసినప్పుడు క్లుప్తముగాను చెప్పసమర్థుడు. సప్తమాంకము సంపూర్ణముగా వర్ణనలతో నిండియున్నది. దేశాటనము వలన లభించుభావవిభూతి కొంత యీవర్ణనము మూలకలగా గ్రాహ్యమగును. జటాయువు రావణునివారించు సందర్భమునను, రామలక్ష్మణుల వాలిసంవాదము, పరశురామ రామసంవాదము ఇత్యాది ఘట్టములలో గంభీరపదప్రయోగము చేసినాడు. ఉదాత్తమగు భావములను చెప్పవలసినపు డుదాత్తమగు పదజాలము ద్వారానే దానిని లక్షణముగా స్ఫురింపజేయవలయును.

మురారి గద్యరచనయందుకూడ దిట్ట. భవభూతి కొంతవరకు గద్యరచనకు పాటుపడినాడు. మురారి శ్రవణ సుభగములైన గద్యముల రచించెను. నాంద్యంతమున సూత్రధారుడు కలహాకందళుడనువాడు ద్వీపాంతరమునుండివచ్చి రౌద్రభీభత్స భయానకభూయిష్ఠమగు నాటకమును ప్రదర్శించి లోకమును వ్యాకులపెట్టెననియు తానట్లుగాక పురుషోత్తముని సేవింపవచ్చిన సభాసదులను రసవత్తరమగు నవర్ఘరాఘవ నాటకమును ప్రదర్శించి సంతసపరతుననియు చెప్పినాడు. కొందఱు మురారి నాటకమనుటకన్న మహాకావ్యమనుటయే న్యాయమని పరిగణింతురు. శ్లోకము లెక్కువగా వ్రాసినందులకు దానికీయపప్రథవచ్చినది. నేడుకూడ అనగా 20 వ శతాబ్దమందుకూడ పద్యము లెక్కువగానున్న నాటకములున్నవి. పద్యము లెక్కువగానుండిన గాని యొక పారిషదవర్గమునకుగాని తన్నాటకకర్తకుగాని సంతృప్తియుండదు. మురారి బహుగ్రంథకర్త యని యితరులు పేర్కొన్నను తదితర గ్రంథములు లభ్యమగునంతవరకు నతడీ నాటకరాజ మొక్కటే వ్రాసెనను నిశ్చయమునకు రాకతప్పదు. అట్టియెడ మురారి తన కవితాపాటవమున కనర్ఘరాఘవమును రంగస్థలముగా జేసికొనినాడు. అదియును యుక్తియుక్తమే.

ఈవిషయమునే మురారి ప్రప్రథముననే "స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథముపకరిష్యంతి కవయః" యని వాకొనినాడు. విద్వత్ప్రమోదంబుగ వ్రాసిన నీకృతిని జీర్ణము చేసికొనుమాటటుంచి "సత్కవిగా పుట్టుటకూడ నేడు దోసమని యెక్కొణింతు కామేశ్వరీ" యను తిరుపతి వేంకటేశ్వరుల నిర్వచనము నేటి కవిత్వ వాతావరణమును బహిర్గతము గావించెననుటలో సందియములేదు. అనర్ఘ రాఘవమును నాటకముగాను కావ్యముగానుకూడ మనము పరిగణించి ప్రయోజనద్వయములను సాధించిన వారగుదుము. ఇట్టి నాటకమును ప్రదర్శించుట చాల అరుదు కావున నద్దానిని శ్రవ్యప్రబంధముగా చదివి యానందించుట మేలు. షేక్సుపియరు నాటకములను మనము చదివి యానందించినట్లే మురారి నాటకమునుగూడ చదివి యానందింపవచ్చును. మిల్టనుకవి పారడైజ్ లాస్ట్, (స్వర్భంగము) ను జీర్ణించుకొనుట ఆంగ్లభాషా పాండిత్యము మేరగా నిర్ణయింపబడినది. మురారిని జీర్ణించుకొనుట గీర్వాణభాషాపాండిత్యమునకు మేరయని మనము పరిగణింపవచ్చును. ఇతని కవనము సంస్కృతినానుడులతోను, కవిసమయములతోడను నిండియున్నది. వాటిని కొన్నింటిని ముందు వివరింతును.

మురారి ప్రకృతివర్ణన బహుళముగ జేసినాడు. సప్తమాంకమున నితడు వర్ణించిన ప్రదేశము లసంఖ్యాకములుగా నుండుటచేసి గురుకుల క్లిష్టతతోపాటు మురారి దేశాటనముచేసినట్లు విదితమగును. చెట్లయాకుల మధ్యనుండి భూమిపైపడు వెన్నెలను "ఇహ తిలతండులితం మృగాంకరోచినా"యని వర్ణించినాడు. ఈవర్ణన భట్టబాణుని కాదంబరిలోని "అత్యచ్ఛతయా స్పర్శానుమేయం హిమజడం" అను మనోహరవర్ణన జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఋషులను వారి సంప్రదాయములను వారి నిత్యకర్మలను యజ్ఞయాగములను విరివిగా వర్ణించినాడు.

మురారి విష్కంభములద్వారా ఎంతో సమాచారమును తెలిపి కథాగమనమును మిక్కిలి త్వరపెట్టినాడు. ఇందు సీతాకల్యాణమైన పిదప రామలక్ష్మణు లయోధ్యకు రాకుండగనే వారికరణ్యవాసము ప్రాప్తమయినది. అందులకే దశరథుడు "వత్సే జానకి ! నిశాచరాణామాతిథేయా భవితుం దశరథగృహంప్రవిష్టాసి" యనినాడు. నాటి రాజు లాగతానాగతవేదులు. దీనివలన రావణునిచే జానకీ హరణము ధ్వనితమగుచున్నది. గుహునిచే రామునికి హనుమత్సుగ్రీవులమైత్రి కల్గింపబడినది. రామాయణమున రామసుగ్రీవులమైత్రికి హనుమంతుడు కారకుడు. గుహుడంగవస్త్రమిచ్చినట్లుకలదు. రామాయణమున నంగవస్త్ర మిచ్చినవాడు సుగ్రీవుడు. ఇవన్నియు కథావేగమునకు తోడ్పడినవి. ఇందు చిత్రింపబడిన లక్ష్మణుని పాత్ర చాల చిత్రమయినది. అతడు సోదరుని యాజ్ఞ మాళిదాల్చుటేగాక యప్పుడప్పుడు రాముని పరిహాసముచేయు స్వభావము కలవాడు. విశ్వామిత్రుడు శివధనుర్భంగమునకు తోడ్కొనిపోయిన సందర్భమున రామునుద్దేశించి లక్ష్మణుడు పరిహాసముగా "ఆర్యాయా మయోనిజన్మని కన్యాయాంచ" యనిపలికి యతనికి కోపము కల్గించినాడు. దానికి రామచంద్రుడు "భగవన్ ఇక్ష్వాకుకులగురోయదభిరుచితం భవతే" యని తప్పించుకొన్నాడు.

అంతేగాక రాముడు "కథ మన్యదేవ కిమపి ప్రహసనం నూత్రయతి" యని లక్ష్మణుని మందలించినాడు. రామలక్ష్మణుల మనస్తత్త్వమును పాత్రపోషణమును చక్కగ నిరూపించినాడు. విశ్వామిత్రుడయోధ్యకువచ్చిన రామలక్ష్మణులను తనవెంట రమ్మనినప్పుడు "యదభిరుచితం భవతే తాతాయచ" యనియన్నారు. రామలక్ష్మణుల యన్యోన్యతనుగూర్చి దశరథుడు ప్రశంసించుచు "పృథక్ప్రయత్నా పేక్షీ నాయ మర్థః నఖలు ప్రకాశమంతరేణ తుహినభాను రుజ్జిహీతే" యన్నాడు. అంతేగాక మురారి విశ్వామిత్రుని శిష్యులచే రాముని యవతారప్రయోజనములు రెండుగా చెప్పినాడు. మొదటి దహల్యాశాప విమోచనము, రెండవది రావణ సంహారము. మురారి రాముని మనస్తత్త్వము మరొక స్థలమందుగూడ తన యస్ఖలిత మగు ఉక్తిప్రత్యుక్తి వైదగ్ధ్యమున చెప్పినాడు. శివధనువు తెచ్చునప్పుడాతనికి తానుధనుర్భంగం చేయగలనని తత్ఫలితముగా సీతను పెండ్లియాడగలనని యొకతలంపు మెరుపువలె మెరసినది. అవతారపురుషుడగు నారామచంద్రునకే యట్లనిపించినది. అయితే యీ మెరుపు అతని మనస్సును కొంత కళవళపరచినది. వెంటనే యిట్లు కలిగిన మనోవికారము నీవిధముగవ్యక్తపరచినాడు. "కథ మశీకవికల్పైరాత్మానం వినోదయామి" ఇట్టి సంఘటన లింకెన్నియోగలవు. మన స్తత్త్వపరిశీలనముచేయుటయందు మురారి ప్రవీణుడని పించును. భార్గవ రాముడు రామునిగూర్చి "క్షత్రియ డింభ, రాజన్యపోత, పాపవిక త్థనకులకళంక," యని పలుమార్లు యథేచ్ఛగ సంబోధించినాడు. తత్ఫలితముగ వచ్చిన ప్రత్యుత్తరమువలన రోషాతిరేకము వృద్ధి పొందినది. క్రోధాగ్నిప్రజ్వలితమై రామునితో యుద్ధసన్నద్ధుడైనాడు. అంతవరకు వారి యస్ఖలితమగు ఉక్తిప్రత్యుక్తి వైదగ్ధ్యము అనుభవించి తీరవలసినదే. ఇట్టిఘట్టమే వాల్మీకిలో రామలక్ష్మణులకు జరిగిన సంవాదముతో పోల్చవచ్చును. రావణుడు సీతను హరించిన పిదప రాముడతని నుద్దేశించి పులస్త్యబ్రహ్మవంశమునకు చెందిన వాడవయ్యు నిట్టిపని నేలచేసితివని చింతించినాడు. నిజముగ నీ పనికి తత్క్షణమందే రాముని క్రాగ్రహము రావలసినదే. కాని యట్లురాకుండ ధీరోదాత్తనాయకుని మనస్తత్త్వమును వర్ణించినాడు. ఇట్టి వనేకములు కలవు. వ్యాసవిస్తరభీతిచే వివరింపనైతిని.

భార్గవరాముడు రామునిచే జయింపబడినప్పుడు నేను నీయందు వైష్ణవధామమును గాంచితినని తృప్తిం జెందినాడు, మానవ మాత్రునివలెనే శ్రీరాముడు సీతావియోగమునకు దుఃఖించినాడు. లక్ష్మణునకు నతని నూరడించుటకూడ దుస్సాధ్యమైనది. సంయోగ వియోగములు శాశ్వతములు కావని తెలిసియు యవి జీవితమున చక్రనేమిక్రమమున వచ్చునిమ్నోన్నతములని గూడ రాముడు భావింపలేదు. తాను కేవలనిమిత్తమాత్రుడననియు దైవనియోగమున నన్ని సంభవించుచున్నవనియునన్న తలంపును స్పష్టపరుచున్నది శ్రీరాముని పాత్ర. రావణ సంహారానంతరముకూడ తండ్రియానమాళిదాల్చి సముద్రమునకు సేతువుకట్టి రాక్షసబాధ లేకుండ దండకారణ్యమును గాలించి దశగ్రీవోపసర్గము గ్రాహించితినన్నాడు. మొదటినుండియు రామునకు లక్ష్మణుడాంతరంగిక కార్యదర్శిగా మెలగుచువచ్చినాడు.

మురారి వాడిన యలంకారములు కొన్ని నవీనములుగానున్నవి. రమణీయమగు సాత్మానుసంధానమే కవిత్వముకదా. అట్టి భావోద్వేగము మురారికవితలో చక్కగా జాలువారినది. మురారి సూక్తులు కొన్నింటి నిట నుదాహరించుచున్నాను. "సత్యమిదం యచ్ఛీలస్వామీ తచ్ఛీలతస్య ప్రకృతయః", "అహో క్షుద్రైరపి సంభూయ భూయోభిరేకో మహాన్ దుష్కరః కదర్థయితుం", "సతోష్యమతిదుఃఖో నిర్దుఃఖ ఇతి లోక ప్రవాదః", "ఆత్మద్రవ్యప్రకృతి సంపన్నో నయస్యాధిష్ఠానం విజిగీషు రితి అత్రప్రథమోదాహరణం దాశరథిః", "దేశకాల వ్యవహితస్యాపి ప్రమేయ గ్రామస్యయథా సమ్ముఖీనమాదర్శతలం స్థవిరబుద్ధిః", "విజిగీషురదీర్ఘసూత్రతాహి కార్యసిద్ధేరవశ్యంభావః", "కష్టంభవత్యేవ వైధర్మ్యదృష్టాంతేనాను మానితో మూలచ్ఛేద నిమిత్తాత్కర్మణో నివర్తిష్యతే లోకః", "యావద్ద్రవ్యభావీహి గుణో విజిగీషూణామదాత్తతా - విశేషేణ పునరయం రామభద్రః", "నామోదయతి కిమిందుః కుముదం పునరస్య సర్వస్వమ్", "నఖలు ప్రకాశమంతరేణ తుహినభాను రుజ్జిహీతే", "సవితారం తరణిమణిరప్యనునిర్వాతి", యిట్టి వనేకము లింకను గలవు. మురారి భరతవాక్యముకూడ పరిశీలింపదగినది. అది యతని హృదయమును బయల్వెట్టును. అత్యున్నతమగు కవిత్వము వ్రాయునప్పుడు దానిని సమర్థులగువారే చదివి యానందించవలెనను కోరిక యుండుట సహజము. సమంజసమైనదికూడ. భవభూతికూడ యీ విషయము నెన్నియోమార్లు వచించినాడు. ఉత్తరరామచరిత్రలో "యథాస్త్రీణాంతథావాచాం, సాధుత్వేదుర్జనోజనః" యనియు మరొక్కచో "తత్సమృత్వావదహతియద వస్కంద్య హృదయమ్" యనియు మాలతీమాధవమున "యేనామ కేచిదిహ" యను శ్లోకము లోన చెప్పుకొనినాడు. అంతేగాక భరతవాక్యమందు "శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతాం ప్రాజ్ఞస్యవాణీమిమాం" అని చెప్పినాడు. మురారి తన యీ క్రిందిభరతవాక్యమందు శబ్దబ్రహ్మ పరిమళ మాఘ్రాణించని సుజనులు కవుల గంభీరవాక్కులలోని గుణదోషములను నిరూపింపకుందురుగాక యన్నాడు.

సమున్మీలత్సూక్తిస్తబక మకరందైశ్శ్రవణయో
రవిశ్రామ్యద్ధారాసతత ముపచిన్వంతు కవయః
నశబ్దబ్రహ్మోత్థ్యం పరిమళమనాఘ్రాయ సుజనః
కవీనాం గంభీరేవచసి గుణదోషాన్రచయితు.

పాండిత్య ప్రకర్షకుగాని, యభూతకల్పనా విశేషములకుగాని మురారిది యందెవేసిన చెయ్యి. మురారి వ్రాసిన "రత్నాకరో జనయితా" యని చంద్రునిగూర్చి వ్రాసిన శ్లోకములోని భావము శ్రీనాథుని శృంగారనైషధమందు "అవతంసంబవు పార్వతీపతికి" యను పద్యములోన గాన్పించును. మురారి యితర కవుల కనుకరణీయుడయ్యెననిన యతని విలక్షణ ప్రతిభావిశేషముల కిదియే తార్కాణము.

# తెరపడని నాటకం

'బుచ్చిబాబు'

★

ఆధారం—వొక ప్రాచీన గాథ.

**వ్యక్తులు:**

| | |
|---|---|
| చక్రవర్తి | మూర్ఖుడు |
| బావగారు | పండితుడు |
| మంత్రి | ఉపాకన్య |

[ప్రపంచ చరిత్రలో ఎక్కడైనా జరగొచ్చు; ఎప్పుడైనా జరక్క పోవొచ్చు]

చక్రవర్తి, తలని రెండు చేతులతోనూ పట్టుగుని విచారంతో సోఫాలో పడివుంటాడు. మంత్రి, భయపడుతూ ప్రవేశించి, మాట్లాడటానికి ధైర్యం తెచ్చుగుంటాడు.

'మూర్ఖుడు'—సోఫాకింద ముసుగుతన్ని పడుకునుంటాడు. ఒకటిరెండు క్షణాల నిశ్శబ్దం. సోఫాకిందనుంచి డబ్బా మోగించిన ధ్వనొస్తుంది. మంత్రి అదిరిపడతాడు.

మంత్రి: ఎ, ఎ,...ఎవరది?

[డబ్బామోత నిలిపి, బైటపడతాడు 'మూర్ఖుడు']

మూర్ఖుడు: చిన్నయసూరి మీ శాత్రవుడు—అమాత్యుడా. మీకు వ్యాకరణం రాదని యీనాడు విశదమైంది. ఎవరది అని ప్రశ్నించకూడదు. 'ఏమిటది?' అని అడగాలి.

మం: ఓరి—నువ్వా! ఆ డబ్బాచప్పుడేమిటి?

మూ: అల్లా అడగమనే నా ప్రార్థన. భయం పోయేటందుకు మీరు చేతులు నలుపుకుంటున్నారు; నేను డబ్బా మోగించుకుంటున్నాను.

మం: భయంకాదు—భార్యా వియోగంవల్ల దుఃఖసముద్రంలో మునిగిన మహా చక్రవర్తికంటబడేముందు కనబర్చవలసిన అణకువ—నమ్రత.

మూ: అవుతే నాదీ అంతే. సముద్రంలో మునిగిపోతూన్న చక్రవర్తిని 'రక్షించండోయ్' అని విన్నవించుకునే ఆర్తనాదం.

మం: చక్రవర్తి విచారంలో వున్నారు. వినోదాల కిది సమయం కాదు.

మూ: హాయిగా పడుకునేందుకు సోఫాలుంటే, ఎంతటి విచారాన్నైనా తట్టుకోవచ్చు. విచారంలో వున్నప్పుడే మనుషులకి వినోదం కల్పించాలి. అందుచేత కష్టాల్లో వున్నప్పుడు, నవ్వుతూ ఎదుర్కొనే ధైర్యం వున్న మనుషులు కావాలోయ్ అమాత్యా—కాబట్టి...

(పాటలో పడతాడు)

రాణీకోసం రాజు కాడోయ్
రాజ్యంకోసం రాజు.
రాణి మరణం, సంధ్యకాల శరణం
మరో రాణీ అవతరణం—
రాజ్యం పోతే, రాణీ లేదు, రాజా లేడు—
వారిని మోసే మోతగాడికే మోక్షం

(అంచేత—) మోసేటందుకు వోపిగవున్న మనుషులు కావాలోయ్!

(చక్రవర్తి లేస్తాడు)

చక్ర: మంత్రీ, పరిహాసానికిది సమయం కాదని చెప్పండి ఆ మూర్ఖునితో. మేం దుఃఖ సముద్రంలో మునిగివున్నాము.

మూ: ఈత రాకుండా ఎందుకు నీళ్లల్లోకి దిగారు స్వామీ! మిమ్మల్ని లేవదీయకపోతే, స్వామిద్రోహం.

మం: ఛీ, పొమ్మావలకు!

మూ: సముద్రానికి అవలిగట్టంటూ లేదులెండి మరి!

చక్ర: నోరు మూయుము.

మూ: మహామంత్రుల నోరే—!

మం: మహారాజా—మరొక విషాద వార్తకూడా యుద్ధభూమినుంచి తెలియవొచ్చినది.

చ: మేము తట్టుకోగలము చెప్పండి.

మం: రాజశ్యాలకులు—కన్యకాప్రసన్నమల్లు ఖైదీఅయినారు.

చ: అయ్యో—విధి వుష్పాంగి వొకేసారి మనమీద విరుచుకు పడినదా—! బావగారికొరకు కార్చేటందుకు కన్నీరే లేనట్లుంది మనస్థితి.

మూ: అట్లాగనడం అజ్ఞానం. కన్నీరు కార్చడానికి మేమంతా లేమూ? పన్నులంటే యిచ్చుగోలేరుగాని మీ ప్రజలు మీ రనుజ్ఞనిస్తే, నిష్పేచీగా వొగంటసేపు రోజూ ఏడుస్తూ కూర్చో గలరు.

చ: నీ అకాల వినోద ప్రకర్ష మా కోపానికి గురికానియ్యకు.

మం: రాజశ్యాలకులు శత్రువుల చేతిలో చిక్కినతోడనే మన సేనలన్నీ చెల్లాచెదరములైనవి. జయం వారిదే—మనకి వోటమి.

చ: హా...మనకి అపజయమా—!

మూ: ఇది నిజంగా ఏడవాల్సిన వార్త ప్రభూ.

చ: పో, పశువా.

మూ: బుద్ధి గడ్డితినే, మీ కొలువులో ప్రవేశించాను.

చ: నీ మూర్ఖత్వాన్ని సహించం. శిక్షిస్తాం.

మూ: మూర్ఖులకే రాజాశ్రయం, రాజసన్మానం. అందుకనే తమ కొలువులో యింత జీతం యిచ్చి నియమించుకున్నారు.

మం: నువ్వు చెప్పింది నిజమైతే నేనూ మూర్ఖుణ్ణే అవాలి!

మూ: నేనొక్కణ్ణే కాదంటే మాత్రం ఏంలాభం చెప్పండి.

మం: నీ తెలివి శ్రుతిమించుతున్నట్లుంది.

మూ: తెలివి సంగీతమైతే అట్లే అవును.

మం: తెలివి తక్కువ వాడితో తర్కమేమిటి నాకు.

మూ: నేను తెలివితక్కువ వాడినికాను. అతి తెలివిగల వాడిని. అంటే అజ్ఞానిని.

చ: నీ అజ్ఞాన జ్వాలలు మమ్మ కాలుస్తున్నాయి. అర్పేసి, పో—

మూ: అజ్ఞానం ఆరదు—పొమ్మంటే పోదు, స్వామీ. మీరు నిజంగా మీ బావగారికోసం విచారిస్తున్నారా? మీరూ, ఆయనా రాజ్యపాలన విషయాలలో తగవులాడుకోని క్షణం వున్నదా? ఇహ, రాణీ అంటారా! రాజుకి రాణీలు కొదవా!

చ: ఎవరురా అక్కడ.? ఈ మూర్ఖుని బంధించండి.

మూ: మూర్ఖత్వాన్ని బంధించే గొలుసులు మీ దగ్గర లేవు. నేనే, దూరంగాపోయి, యథేచ్ఛగా బంధించుకుంటాను. (దూరంగా వెడతాడు)

చక్ర: మరి మన కర్తవ్యమేమిటి మంత్రీ.

మం: మీరు తేరుకోవాలి ప్రభూ. దూరప్రాంతాలలోని మన సామంతుల సేనలను రప్పించి యుద్ధసన్నాహం చేయిస్తాను. మీ గ్రహబలం నిర్ణయించడానికి పండితుల్ని రప్పిస్తాను. అనుజ్ఞ యిస్తే నే వెళ్ళివస్తాను.

చక్ర: సత్వరం వెళ్ళిరండి.

మూ: రెండుగ్రహాలిక్కడే వున్నాయి — అమాత్యుడు శుక్రుడు, నేను శని—

చక్ర: వినోదకాడా, నీ ఛలోక్తులు కూడా నీ అంతటి వార్ధక్యం గలవి. యీ కష్టపరంపరతో నాకూ యీ క్షుద్రజగత్తుకీ ఏదో బంధం తొలిగినట్లయింది.

మూ: అమ్మో—దేవుడికొంప మునిగింది. ఎందుకంటారాసి మీకు జ్ఞానోదయం అవుతోంది. 'సత్-చిత్ ఆనందం' అనే ధనానికి కష్టాలు మేడమెట్లు. మీరు మొదటి మెట్టుమీద కాలు పెట్టారు. రాజు లెవరు? రాణీలెవరు? ఆదోవ, యీదోవ. ఆసందు, యీ గొంది, ఆబాట యీమార్గం, అన్నీ వొల్లకాటికే కదా!

చక్ర: నీ కింతటి పాండిత్యమూ పుస్తకపఠన వల్లనే కలిగిందా మూర్ఖుడా?

మూ: చాలా పుస్తకాలని, పఠించడంకంటె, వ్రాయడం సులువు మహారాజా. నేర్చుకోతగ్గదేదీ పఠనీయంకాదు. ఎందుకంటారా—పాండిత్యం జ్ఞానంకాదు మహారాజా—పుస్తకాల పాండిత్యం భార్య చక్కదనంలాగున, యితరుల ఆనందానికేగాని మనకోసం కాదు. అట్లాంటి పాండిత్యం, అదుగో—వొస్తున్నారే—ఆ పండితులవారిది.

[పండితుండు, మంత్రి, జ్యోతిష్కుడు ప్రవేశం]

పండితుడు: నమస్కారం మహారాజా—(మూర్ఖునికేసి చూచ కుటిలంగా నవ్వుతూ) పాండిత్యం పుస్తకాలలో గాక మరెక్కడ లభ్యమవుతుంది రాజమూర్ఖుడా?

మం: మన పండితులు చెప్పింది సత్యం. ఆయనవద్ద పెద్ద పుస్తకభాండాగారమున్నది. ఆయన అవలోకించని విజ్ఞానశాస్త్రం లేదు; అభ్యసించని కళ లేదు, చవిచూడని ఆధ్యాత్మికానుభూతి లేదు.

చ: సంతోషం. మీ పుస్తకభాండాగారంయొక్క విలువెంత?

పం: నేను లెక్కించలేదు ప్రభూ. షుమారు మూడువేల పుస్తకములు—పెర్షియా నవాబు ఆమధ్య నాకు పంపిన నాలుగు వందల గ్రంథములూ, వొక్కొక్కటి...

(వేళ్లమీద లెక్కలు మొదలెడుతూ గొణుగుతుంటాడు.)

మూ: నేను చెప్పగలను రాజా. వీరి భాండాగారం విలువ, మంత్రి పదవి.

చ: అంటే?

మూ: అంటే—ఆయన యీ గ్రంథాలన్నీ పఠిస్తూ కాలం, శక్తి, వృధా చెయ్యకుండా వాటిని లోకవ్యవహారాలకి వినియోగిస్తే యీపాటికి మంత్రివుదురు.

చ: (వికటంగా నవ్వుతూ) అంటే, అంటే, మన మంత్రిగారు, జన్మలో పుస్తకం చదివినపాపాన పోలేదనేగా—నీ చమత్కారం తాత్పర్యం...

మూ: కాదు, జన్మలో పుస్తకం చదివిన పుణ్యానపోలేదని.

(ఇద్దరూ నవ్వుతారు)

ఘం: మహారాజుకో విన్నపం—మూర్ఖుల సంపర్కంవల్ల పండితులుగూడ మూర్ఖులవుతారు. చెడ్డవారితో మంచివారి చెలిమి గురించి తమకు తెలియందేముంది! (నవ్వుతాడు)

మూ: మంచివారి స్నేహంచేసిన చెడ్డవాడు చెడ్డవాడా? లేక చెడ్డవాని స్నేహంచేసిన మంచివాడు, మంచివాడా? ముందు నిర్ణయించండి.

మం: ఇది తర్కశాస్త్రానికి సంబంధించినది—పండితులు సమాధానం చెప్పగలరు.

పం: స్వామీ తమ సెలవైతే యీ శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలను తమ పఠన నిమిత్తమై పంపించగలను.

జ్యోతిష్కుడు: (సంచీలోంచి వో గ్రంథాన్ని తీసి) నా దగ్గర నే వుంది స్వామీ.

చ: చూసి, మూర్ఖునికి సమాధానం చెప్పండి.

జ్యో: పామరునివద్ద పండిత ప్రకర్షతగదు ప్రభూ, అరసికుని వద్ద కవితా గోష్ఠా!

మూ: ముసలిదాని ముందు నూతన యవ్వనపు నూగారు మీసం దువ్వడమా!

జ్యో: తమరు ఏకాంతంగా వున్నప్పుడు యీ పుస్తకం చదివి వినిపిస్తాను. తమరే విమర్శిస్తురుగాని.

మూ: నిష్పాక్షికంగా వొక గ్రంథాన్ని విమర్శించాలంటే ఆ గ్రంథాన్ని అసలు చదవకూడదు మహాప్రభో!

మం: అదెట్లా?

మూ: చదివినవెంటనే పక్షపాతబుద్ధి యేర్పడుతుంది కాబట్టి, అసలు చదవకుండానే విమర్శించాలి.

జ్యో: రాజా—యీ గ్రంథం మణిత్రయములోనిది. కామందక నీతిశాస్త్రం. ఇదిగో యీ చిన్నిపొత్తం (సంచీలోంచి మరో పుస్తకం తీస్తూ) దీనిపై నే వ్రాసిన వ్యాఖ్యానం.

మూ: ప్రభూ—వీరి పుస్తకాన్ని నే చదివాను. ఈ గ్రంథంలో నూతనమైనవి, మంచివీ ఎన్నో వున్నాయి.

జ్యో: మూర్ఖుడు, సంపూర్ణంగా మూర్ఖుడు కాడన్నమాట!

మూ: మీ పుస్తకం చదవనంతవరకూ కేవలం అరసున్నగాడినే. చదివింతర్వాత పరిపూర్ణత వొచ్చింది. కాని వొక్కటే పేచీ.

చక్ర: ఏమిటది?

మూ: వీరి పుస్తకంలో నూతనమైనవి బాగాలేవు; బాగున్నవి నూతనమైనవి కావు.

జ్యో: దీనిని పకుతర్క వితర్కం అంటారు స్వామీ.

మూ: క్షమించండి మహారాజా, మంచిచెడ్డల నిర్ణయం చేసేది తర్కంకాదు—నీతిశాస్త్రం. మూర్ఖుల సంపర్కానికి విలువకట్టేది వేదాంతం. వీటికి పునాది విజ్ఞానశాస్త్రం. ఈ శాస్త్రాలన్నీ జ్ఞానభవనానికి యిటికెలు—బోధలన్నీ తాపీపనివాడు—అనగా యీ జ్యోతిష్కపండితుడు. ఇటికలు కదలకుండా తాపడం చేసేది మరో వొస్తువుంది...

మంత్రి: అదేమిటో మాకు తెలీదనా?

మూ: క్షమించండి—ఆ వొస్తువు లేదు.

చక్ర: అంటే?

మూ: లేదంటే, అది లభ్యమవదు.

పం: అది ధనం.

మూ: కాదు, ధనంజయ పండితా.

మం: కీర్తి.

మూ: కాదు, కీర్తి కామేంద్రియ జితుడా!

మం: మరింకేమిటి నీ తలకాయ.

మూ: మీ జన్మకల్లా వొక్కసారి నిజం సెలవిచ్చారు. నా తలకాయ మీకెల్లా లభ్యమవుతుంది?

చ: అమాత్యుని తూలనాడుతున్నావు. పొమ్మవలకు.

మూ: నేను చెప్పిన వొస్తువు సృష్టిలో లేదు, బాహ్యప్రపంచంలో హుళక్కి; స్థూల జగత్తులో మిథ్య! (దూరంగా వెళ్ళి కూర్చుంటాడు.)

చ: శత్రువులబారినుండి బావగారి విడుదల ఎప్పటికి జరుగుతుందో చెప్పగలరా కర్మయోగి పండితా.

జ్యోతి: లెక్కలన్నీ పూర్తైనవి స్వామీ—శని ప్రారంభంలో కీడు చేసి తీరుతాడు—బృహస్పతి ఆరోస్థానంలో వున్నప్పుడు తప్పదు. చివరలో మేలు జరగాలి. మరి నాలుగు మాసాలకి శని ఐదులో కొస్తాడు. అక్కడనుంచి మహారాజయోగమే—

చ: నేను రాజునైయుండగా, బావగారికి రాజయోగమేమిటి—? మళ్ళా శ్రద్ధగా లెక్కలు కట్టండి.

మం: (నవ్వి) రాజయోగమంటే,—అంతటి 'దశ' అని గాని, వారు రాజవుతారని కాదు.

జ్యో: అంతే స్వామీ—

చ: మన రాజయోగమే బావగారికీ పట్టుకుంటుందా—?

జ్యో: తప్పక పట్టితీరుతుంది ప్రభూ.

చ: అవుతే శని, ముందూ చివరాకూడా; కీడుచేస్తున్నాడన్నమాటేగా!

మం: అదెట్లు ప్రభూ?

చ: నాకు పట్టిన రాజయోగమెట్లాంటిదో, మీరు చూస్తూనే వున్నారుగా. భార్యావియోగము;-బావగారు శత్రువుచే జిక్కినారు; ప్రజలలో అరాజకము; ఎక్కడచూసినా తిరుగుబాట్లు. కోశాగారములు నిండుకున్నవి. అనుచరులు, వొక్కొక్కరే, ఎండిన ఆకులవలె యుద్ధభూమిలో రాలిపోతున్నారు.

మూ: (దూరంగా వుండే) ఉన్న వొక్క శ్రేయస్కామీ వాక్ బంధంలో వున్నాడు.

చ: మూగవాడా—నువ్వు మాట్లాడవొచ్చు.

మూ: మీ రాజ్యంలో, మీకు పట్టిన శని, మీ ప్రజలందర్నీ పీడిస్తోంది స్వామీ. శనివల్లనే, మూగవాళ్లుకూడా, అంకెళ్లు పడి పొయ్యేటట్లు మాట్లాడే యోగం పట్టింది.

చ: ఈ రకం రాజయోగమే బావగారికీ పడుతోందా.

జ్యో: కాదు మహారాజా—మహారాజుల కష్టాలు మిగత ప్రజల కష్టాలవంటివి గావు.

మూ: రాజులకి పట్టే 'శని' 'రాజ శని'

మం: నోరుమూయుము.

మూ: రాజుగారి యాజ్ఞ నోరు తెరవమని—మంత్రిగారు మూయమని. ఎవరిమాట శిరసావహించను. కర్మయోగి పండితా—మా నోట్లో శని వుందా, చెప్పండి.

జ్యో: నువ్వే శనివి—నీ నోట్లో వుండడమేమిటి?

మూ: ఇహ నేం!—మిమ్మల్ని పట్టుగుంటా—

[వొచ్చి, కర్మయోగి కాళ్లు గట్టిగా పట్టుకుంటాడు.]

మం: వొదులుము—

చక్ర: ఛీ, మూర్ఖుడా—పండితులవారి పాదాలమీద పడతా వెందుకు?

మూ: నేను మూర్ఖుణ్ణికాను. శనిని. పండితులవారి పాదాలకి శని పట్టింది. నేనేం చెయ్యను. నాలుగు మాసాలవరకూ, ఆగో స్థానంలోకి రాను. అంతవరకూ యింతే. మీ బావగారికీ వీరికీ వొకేసారి విమోచన జరగాలి.

జ్యో: ఇదేమి కర్మ!

మూ: ఇది కర్మయోగి కర్మ.

పండి: శనిని వొదిలించే మార్గంకూడా వున్నది మూర్ఖుడా.

చక్ర: ఆ మార్గమేమిటో చెప్పండి. మా బావగారికి పట్టిన శనిని వొదిలిద్దాం.

పండి: తమకి తెలియందేముంది. దానాలివ్వాలి ప్రభూ.

చక్ర: ఏమి దానాలు.

పండి: గోదానం

జ్యో: భూదానం.

మం: సువర్ణదానం.

మూ: ఆ దానాలన్నీ మామూలు ప్రజకి పట్టిన శనిని వొదిలించడానికి. మహారాజుల శనికి వేరే దానం కావాలి.

చ: ఏమిటది—?

మూ: పండితులవార్నే చెప్పమనండి స్వామీ—

జ్యో: నా కాళ్లు విడిచిపెట్టు—చెప్తాను.

పం: మూర్ఖుని తాత్పర్యం, జ్ఞానదానం ఇవ్వాలని కాబోలు.

చ: జ్ఞానదానమేమి?

మం: గ్రంథాలు—మతగ్రంథాలు, వేదాంతగ్రంథాలు దానమివ్వాలని కాబోలు.

మూ: ఇవ్వడం కాదు, స్వామీ—యీ జ్ఞానదానాలు మీరు పుచ్చుకోవాలి—మీదగ్గరున్నవాటినే యివ్వగలరు గాని, శనివాటిని ఎట్లాగిస్తారు?

మం: చక్రవర్తికి జ్ఞానం లేదనా నీ తాత్పర్యం! ఎంత సాహసం? ఎంతటి అపచారం. మహారాజా—ఇతనిని శిక్షించాలి.

మూ: అజ్ఞానానికి మించిన శిక్ష లేదు. అజ్ఞానుల భవనంలో కూలిపనికంటె మించిన శిక్ష లేదు.

చ: ఛీ, పలుగాకీ. మేం అజ్ఞానులమా? మంత్రీ, ప్రపంచంలోవున్న విజ్ఞానాన్నంతటినీ మన భవనానికి తెప్పించండి.

మం: ప్రభూ, అది అంత సులువైన పని కాదు. విజ్ఞానాన్నంతా కొన్ని లక్షల గ్రంథాలలోగాని సేకరించటం జరగదు.

మూ: పైగా జ్ఞానార్జనవల్ల వీ భోగభాగ్యాలని మీరు పొందలేరో, వాటిని నిరసించడానికికూడా విజ్ఞానం తోడ్పడుతుంది స్వామీ.

చ: ఈ వినోదాలు లేకపోతే, జీవితం యింత దుర్లభంకాదు. ఎవరురా అక్కడ, (చప్పట్లుకొట్టి) ఈ మూర్ఖుని బంధించండి. (మూర్ఖుడు దూరంగా పారిపోయి, వోమూల నక్కుతాడు)

మంత్రి: యిది నా ఆజ్ఞ, పండితుల్ని నియమించి లోకంలో వున్న జ్ఞానాన్ని గ్రంథాలలో యిమిడ్చి నా పఠన నిమిత్తమై తెప్పించండి.

పం: అమ్మయ్యో! కొన్ని సంవత్సరాలు పడుతుంది ప్రభూ.

చ: పట్టనివ్వండి—మీరు పండితబృందానికి ఆధిపత్యం వహించండి.

మూ: (మూలనుండి) ధనంజయ పండితా!

మం: ఆ పుస్తకాలకోసం దేశాటనం...

పం: పదిపదిహేను సంవత్సరాల వ్యవధి...అనేక కొండల ఏనుగులు, వొంటెలు,

చక్ర: పొండి—మారుమాటాడక పొండి—మీ యిష్టం వొచ్చినవాటిని తీసుకోండి. జ్ఞానాన్ని సంసిద్ధం చెయ్యండి.

మం: ప్రభూ, యీ గ్రంథసేకరణకి కావల్సిన ధనం... (గొణుగుతాడు).

మూ: (దగ్గరగా వొచ్చి) స్వామీ, యీ మూర్ఖుని దొక సలహా. ప్రజలపై పుస్తకాల పన్నొకటి విధించండి—ఒక్కొక్క పుస్తకం చదవాలంటే, ప్రతి వ్యక్తీ ప్రభుత్వానికి కొంత సుంకం చెల్లించాల్సి వుంటుందనండి.

మం: దానివల్ల ప్రజలు చదవడం మానేస్తారు. మనకి డబ్బెట్లా వొస్తుంది?

మూ: వెర్రిమంత్రీ. చదవనివారిపైగూడా, చదవని ప్రతి పుస్తకానికీ వొక సుంకం వుంటుందనండి. అట్లా చదవనివారు, ఆ పుస్తకాన్ని ప్రభుత్వానికి స్వాధీనం చెయ్యాలని చాటించుదాము. రాజభవనం లోకంలోని పుస్తకాలతో నిండుతుంది.

చ: చక్కటి యోచన. ఓరి మొద్దూ—నీకేం బహుమానం కావాలో కోరుకో.

మూ: నాకా స్వామీ? నా క్కావల్సింది మీ రివ్వలేరు.

చ : ఇవ్వగలం. ఇది మా వాగ్దానము.

మూ : నా క్కావాల్సింది తృష్ణ—అంటే, ఆకలి, ప్రభూ...

చ : (వికటంగా, నుక్క తిప్పుకోకుండా నవ్వుతాడు)

[మంత్రి, పండితుడు, జ్యోతిష్కుడు, వెడతారు]

మూ : చవిచూచి తెన్నో రుచుల
పటిక బెల్లం, తేనె, చక్కెర;
అన్నిటికంటె మధురమైనది, ఆకలి;
పశువులకు పెట్టు పటిక బెల్లం;
పాప కట్టు, చక్కెర,
తేనె త్రాగును, కన్య.
నే నాకలితో నిశ్చింతగా నిర్జీవినయ్యెద.

[తెర సగం జారుతుంది. మూర్ఖుడు పాడుకుంటూ నిష్క్రమిస్తాడు. తెర మరికొంచెం దిగి, మెల్లగా పైకి లేస్తుండగా, ఉషా కన్య నాట్యం చేస్తూ ప్రవేశిస్తుంది.]

ఉషా : ఇస్, అబ్బ, నేను నర్తకిని—రాణీ నెట్లాగవుతాను?

చక్ర: (వెనకనుంచి సంభ్రమంతో) నాట్యం చేస్తూ, సింహాసనం పైకి చేరుకుని కన్నుల కదలికతో లోకంలో ధర్మస్థాపన చేసి, పెదవుల చలింపుతో అజ్ఞానాన్ని అంతం చేసి, ఆనందంలో సృష్టిని, నిద్రపుచ్చగల ఉషారాణివి నీవే సుమా.

ఉ : నాకొక్కటి తెలీడంలేదు. ఇంతకీ నే రాణీనా కానా?

చక్ర: అమాయకత్వం యింత అందమైంది గనక నే ఆ మూర్ఖునికి రాజాదరణ లభించింది.

ఉ : అసలర్థం కావటంల్లా!

చక్ర: మందమతీ, ఎక్కడకి? (చప్పట్లుకొట్టి) ఉషాకన్యకో సందేహం—రాణీ అవుతుందా అని.

మూ: మీరు రాజైతే ఆమె అట్లాగే రాణీ అవుతుంది ప్రభూ.

ఉ : అదేమిటి అట్లాగంటాడు మొద్దు.

చక్ర: ఛీ, అల్పుడా, నేను రాజు కానంటావా!

మూ: ఎవరు రాజు, ప్రభూ?

చక్ర: సమాధానం నువ్వే ఇవ్వు.

మూ: ప్రజల్ని పాలించేవాడు.

చక్ర: నేను పాలించటంలేదా?

మూ : అది తమకే తెలియాలి—ఎవరు రాణీ?—రాజుని పాలించేది.

ఉ: భలే భలే—అవుతే నే రాణీ నే—నే రాణీని...(సంతోషంతో నాట్యంలోకి దిగిపోతుంది. చక్రవర్తి సోఫాలో పడి కళ్లు మూస్తాడు.)

మూ: (పాడుకుంటూ దూరంగా వెళ్ళి కూర్చుంటాడు)
మహారాజుల మైకం
రాణులకోసం మైకం

తీరని చందం, ఆరని అందం
అణాకానీ ఆనందం
పల్లకాటిలో బ్రహ్మానందం
మహారాజుల మైకం.

[ఉషాకన్య దూరంగా మరో సోఫాలో వాలిపోతుంది]

[మెల్లగా మంత్రి ప్రవేశిస్తాడు]

మం: (మెల్లగా) మహారాజా.

చ: ఎవడురా నా ఆనందాన్ని ధ్వంసం చేసిన దుర్మార్గుడు?

మం: ఆ నిర్భాగ్యుణ్ణి నేను ప్రభూ. పండితులు తమరు కోరినట్లుగానే గ్రంథాలు తెచ్చారు.

ఉ: (మైకంలో) గంధం...గంధం...గంధమైతే వొళ్లంతా పూసుకుంటా.

చ: గ్రంథాలేమిటి, గంద్రగోళమేమిటి?

పం: (బైటపడి) మహాప్రభూ, పదేళ్లు కష్టించి, ఐదువందల పండితులం దేశదేశాలు తిరిగి, ప్రపంచంలో విజ్ఞానాన్ని సేకరించి తమ పఠన నిమిత్తమై తమరు కోరినట్లుగా తెచ్చివున్నాను.

చ: ఎక్కడ? ఏవి?

మం: ఇటు దయచెయ్యండి.

చ: ఇదేమి పరిహాసం—అది వొంటెలగుంపు. దాని వెనక—ఏనుగులు...

పం: వాటిమీద వున్నవే గ్రంథాలు మహారాజా.

చ: (వికటంగా నవ్వి) పిచ్చి పండితుడా—అవి చదవడానికి ఎన్ని సంవత్సరాలు పడుతుందో, మీరిద్దరూ లెక్కలు కట్టి చెప్పండి. రోజుకి వొక గ్రంథం చప్పున, సంవత్సరానికి మూడు వందల అరవైనాలుగు...లెక్కలు కట్టండి...(నవ్వుతూ) తెలివిహీను డెక్కడ?

మూ: మూర్ఖత్వమిందుగల దందులేదను సందేహము వలదు చక్రి, ఎందెందు వెదకిచూచిన అందందే గలదజ్ఞానం. నేను ఆదర్శమైన శుంఠనే నంటారా ప్రభూ?

చ: ఫరవాలేదు—దోవలో పడుతున్నావు. అజ్ఞానాన్ని వెలిగించగలదేది?

మూ: ఆ ప్రశ్న అజ్ఞానాన్నడగడంకంటె మించిన అజ్ఞానం ఏది ప్రభూ?

చ: ఈమాత్రం తెలీదా. (విరగబడి నవ్వుతాడు)...ఉషాకన్య...ఓయి ఖాళీ మెదడూ—తనని రాణిని చెయ్యనేమో అన్న సంశయంవల్ల నన్ను విడనాడిపోతానన్న స్త్రీకి నీ సమాధానం ఏమిటి?

మూ: ఈ అజ్ఞాన చక్రవర్తి బ్రహ్మచారిగా వుంటాడు ప్రభూ.

చక్ర: (ఇంకా నవ్వుతూ) నువ్వు వాంఛించిన స్త్రీ నిన్ను పరిత్యజించినప్పుడు, నువ్వు దుఃఖంతో భగ్నహృదయుడవై మరణించవా?

మూ: తప్పకుండా మరణిస్తాను—ప్రభూ, నలభైఏండ్ల తర్వాత.

చక్ర: స్త్రీ ప్రేమతో నీకంతటి వినోదం కలిగిందా! ఇదుగో. నువ్వు పెండ్లి చేసుకుని తీరాలి—ఇది నా ఆజ్ఞ.

మూ: ఏమిటి స్వామీ యీ దురంతం...మిమ్మల్ని త్యజించిన స్త్రీని నాకెందుకు కంటకడతారు.

చక్ర: ఛీ—పశువా...

[లెక్కలు కట్టడం ముగించి, పండితుడు, మంత్రి దగ్గరగా వస్తారు.]

పండి: ప్రభూ. మీరు చెప్పినప్రకారం, పదిసంవత్సరాలకు మూడువేల నాలుగువందల అరవై గ్రంథాలు చదవగలరు.

చక్ర: ఇష్...ఉష సౌందర్యంలో పవ్వళించింది.

మం: ఒక వొంటెపైననే, ఐదారువేల గ్రంథాలున్నాయి.

మూ: గ్రంథం, గ్రంథం...అనడం ఎందుకు? పుస్తకం అనలేరు?

ఉష: గంధం, గంధం...ఏదీ నా వొంటికి పూసుకుంటా...

చ: ఈ గ్రంథాల ప్రస్తావన ఉష కానందం కల్గించింది. మంత్రి,—మీ లెక్కలప్రకారం, నేను వెయ్యి జన్మలెత్తినా యీ గ్రంథాలు చదవడం పూర్తవదు. అందుచేత పండితులను వినియోగించి, యీ విజ్ఞానాన్ని క్లుప్తీకరించి, వొక వెయ్యి గ్రంథాలలో యిమిడ్చి తీసుకురండి...

పం: చిత్తం. (వెడతారు)

చ: ఎవరు పరిచారిక...గంధం తీసుకురా...ఉషా... మంచులో పరువెత్తిన కుందేలువోలె నాట్యం చెయ్యి.

[నాట్యం చూస్తూ చక్రవర్తి కళ్ళుమూస్తాడు. ఉష కొన్ని క్షణాలలో సోఫామీద వాలిపోతుంది. మూర్ఖుడు పాడుకుంటూ వెళ్ళి మూలగా కూర్చుంటాడు.]

మూ: మహారాజుల మైకం.
మహారాజుకి రాణీవాసం.
ప్రేమకి కారాగారం—
పారావానికి పరిహాసం...
నెత్తురు కక్కిన త్రాచుపాములు,
తారల కోరపెదవులు.
అవి బంధించిన విజ్ఞానం, విజ్ఞానం,
కళ్లలో అంధత్వం
కాంచనిదే అంతిమ అజ్ఞానం...

[తెర మెల్లగా దిగి, వెంటనే లేస్తుంది. చక్రవర్తి సోఫాలోనే పరుంటాడు. మూర్ఖుడు మూల నిద్రపోతూంటాడు. ఉష కుర్చీలో పవ్వళిస్తుంది—నెత్తిమీద కిరీటం వుంటుంది. రాజశ్యాలకుడు, ప్రసన్నమల్లు ప్రవేశిస్తాడు.]

ప్రసన్నమల్లు: మనకి సంపూర్ణవిజయం సమకూరింది మహారాజా—లేవయ్యా బావా...శత్రుసేనలు పలాయితములైనవి...

బంగారము, రత్నాలు, మణులు, ఆహారపదార్థాలు, వీటితో మన కోశాగారములు నిండినవి.

చ: ఎవరు? ప్రసన్నమైతిరా బావగారూ. మనకి విజయం ఎవరివల్ల సమకూరినదో!

ప్ర: మనవల్లే—అనచ్చు.

చ: అదెట్లా. మీరు బంధితులైతిరిగా.

ప్ర: మనం బంధితులం కావడంవల్లే. ఇంత పెద్దఘటం శత్రువుల చేతులో చిక్కిందా. నన్ను విడిపించాలంటే, మరో అంతటి పెద్దఘటం శృంగార వినోదాలకి వీడ్కోలు చెప్పి, శత్రువుల్ని చండాడడం జరిగింది.

చ: పోనీ, ఆ ఘనకార్యం ఎవరిది?

ప్ర: నాచేత ఎందుకు చెప్పిస్తావయ్యా...

చ: మంత్రిగారిదేనా...శుభవార్త.
మిమ్మలను, ఫలానా వుపరాజ్యాలకి ప్రభువుగా నియమిస్తున్నా, మిగిలిన ఫలానా రాజ్యాలకి, మంత్రిగారిని, నియమిస్తున్నా... నాకు యీ వుపరాజ్యాలపేర్లు జ్ఞాపకంలేవు.

ప్రసన్న: మనకీ జ్ఞాపకంలేవు.

మూ: (లేచి) అంతకంటె శుభవార్త. ఫలానా చక్రవర్తీ, నేను వివాహం చేసుగుంటున్నాను. పదేళ్లక్రితం తమరు ఆజ్ఞాపించారు. ఇప్పటికి నిశ్చయించుగున్నాను. శత్రువుల సేనాని పుత్రిక నన్ను వలచింది. పొరబాటు. నేను వలచాను, వలలో చిక్కుకున్నాను.

చక్ర: తొందరపడకు వికలబుర్రా! ఆమె ప్రేమని పరీక్షించి మరీ చేసుకో. ఉషాకన్య నన్ను పదిసంవత్సరాలు పరీక్షించింది. ఆమె రాణీ అయింది. నీ ప్రియురాలిపేరు?

మూ: సంధ్యా కన్య.

ప్ర: అబ్బా! చూస్తివా పతితుడా. ప్రేమ మూర్ఖత్వాన్ని కూడా జయించగలదు.

మూ: మూర్ఖత్వాన్ని కూడా కాదు ప్రసన్నంగారూ, మూర్ఖత్వాన్నే.

ప్ర: అవతలకి పో, తుచ్ఛుడా!

మూ: పోయి, సంధ్యని వెదుకుతాను,

ప్ర: బావగారు...ఆస్థాన పండితులు, అమాత్యులు, వేంచేశారు.

చ: ప్రవేశపెట్టకండి. ఉషారాణీ...

ఉ: ఎవరు?

చ: నేనే?

ఉ: ఎందుకు?

చ: మేం రాచకార్యాలలో నిమగ్నులం కానున్నాము. మీరు శయ్యామందిరంలోకి నిష్క్రమించరాదు?

ఉ: నాకు బద్ధకంగా వుంది. మీరే అక్కడికి పొండి.

ప్ర: అన్యాయం మహారాణీ...

ఉ: ఇది మీకెందుకు?

# ది మెట్రోపాలిటన్ ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

(హెడ్డాఫీసు : కలకత్తా)

**1953** లో పూర్తిచేసిన నూతన వ్యాపారము } రూ. **8** కోట్ల **76** లక్షలు మించినది.

★

మద్రాసు బ్రాంచి: నెం. 52/53, తంబుచెట్టి వీధి, జి. టి. మ(దాసు-1.

ఇతర దక్షిణ ఇండియా ఆఫీసులు: విజయవాడ, మధుర, బెంగుళూరు, కారైకుడి & ఎర్నాకులం.

---

## నూతన సంవత్సర తీర్మానములు!

1. నీటి యెద్దడి తొలగించండి
2. మెయర్సు పంపు వాడండి




అవసరమునకు తగినట్టి నమూనాలు, రకములు

మోటారుచే నడుపబడునది — లోతులేని బావులు

ఇంజనుచే నడుపబడునది — లోతుగల బావులు

చేతిలో వాడదగినది — గొట్టపు బావులు

★

సోల్ ఏజంట్లు:

## వాటర్ సప్లయి స్పెషలిస్ట్సు లిమిటెడ్,

**45,** తంబుచెట్టి వీధి, మద్రాసు-**1.**

చ: అక్కడ ఏకాంతంగా వుండొచ్చు. సంగీతము, నాట్యము, వినోదములు, అక్కడ ఏర్పాటవుతున్నాయి.

ఉ: నేను వెళ్లలేను. అవన్నీ యిక్కడే ఏర్పాటుచెయ్యండి.

చ: ఏమిచెయ్యడం ప్రసన్నమల్లు? (ప్రసన్నమల్లు చెవులో ఏదో చెబుతాడు)

[చక్రవర్తి చప్పట్లు కొడతాడు]

మూ: ఉషారాణీ, మీరు కోరిన వినోదాలు యిక్కడే ఏర్పాటవుతాయి. మీరు వెళ్ళకండి.

ఉ: నాకు వచ్చావు—ఏవీ వినోదాలు?

మూ: అరుగో మంత్రివర్యులు, పండితులు—వారిక్కడ గణితశాస్త్రపఠనం సల్పుతారు. లోపలికి రండి స్వామీ.

[వొస్తారు.]

ఉ: అంటే ఏమిటి?

మూ: (ఒక పుస్తకం తీసి చదువుతూ) మూడుమూళ్ళు తొమ్మిది; మూడు నాలుగుల-పన్నెండు; మూడైదుల పదిహేను. మూడేళ్లెంత?

ఉ: (లెక్కలు మొదలుపెడుతుంది) ఏమో బాబు, ఇదేం వినోదం?

మూ: ఇవన్నీ చక్రవర్తిగారికి నేర్పుతారుట; తరవాత చక్రవర్తిగారు మీకు నేర్పుతారు.

ఉ: ఎందుకు?

మూ: బ్రహ్మదేవుణ్ణి అడగండి ఆ ప్రశ్న.

ఉ: అవుతే నే వెళ్ళిపోతాను.

మూ: అంత సులువుగా వెళ్లనివ్వము. మీకు కసితీరా బాగా జ్ఞానం బోధించిగాని విడిచిపెట్టము.

ఉ: అమ్మో—నే వెళ్లిపోతాను.

ప్ర: లెక్కలంటే ఉయ్యాలా వూగటం అనుకున్నారా?

మూ: ఉరి తీయించడం అనుకున్నారా? తొమ్మిదేళ్లెంత?

ప్ర: బావగారూ, రాణీగారి సమక్షాన మీరు గణితశాస్త్ర పారాయణ సల్పగలిగితే, మీరా శాస్త్రాన్ని అభ్యసించే అర్హతే లేదంటాను.

మూ: కారాగారంలో ప్రసన్న మల్లయ్యగారు కొత్తచీకటి తెలివిని తెచ్చుకున్నారే. స్త్రీ సమక్షంలో శాస్త్ర పఠనానికి సిద్ధపడిన మీరెంత తెలివిహీనులో మరిచారా?

ప్ర: బావగారూ, యీ మూర్ఖుని బంధించండి—నేను ఖిలానా వుపరాజ్యానికి అధిపతినన్న విషయం మరిచినట్లున్నాడు.

మూ: తమరు యిన్నాళ్ళూ అబలా ప్రదేశాని కధిపతులు; అది బ్రహ్మచారుల స్వర్గం. నేనూ బ్రహ్మచారినే, మీపాద సేవకుణ్ణి; ఏల యీ మనఃకాఠిన్యం?

పం: స్వామీ—విజ్ఞానాన్ని, మీరు కోరినట్లుగా వెయ్యి గ్రంథాలలో సేకరించి తెచ్చాము.

చక్ర: వెయ్యి గ్రంథాలే—

ఉ: నాకో వెయ్యి వజ్రాలు కావాలి—కిరీటంలోకి.

చక్ర: వొక్కొక్క గ్రంథంలో ఎన్ని పుటలు.

మూ: ఒక్కొక్క బుర్రలో ఎన్ని వెంట్రుకలో ఎవరికెరుక?

పం: కొన్నింటిలో వెయ్యి, మరికొన్నింటిలో రెండువేలు.

మూ: ఒక్కొక్క పుటలో ఎన్ని వాక్యాలు?

పం: (లెక్కలు మొదలెడతాడు)

ఉ: నాకోపం వొచ్చింది.

చ: ఎందుకు ఉషా.

ప్ర: యుద్ధంలో జయించి వొచ్చాము. హాయిగా వినోదించక, యీ పుస్తకాల గొడవేమిటని.

మం: ఆ ఏర్పాట్లన్నీ నే చూస్తాను. ముందు యీ పండితుల వార్ని బహూకరించి.—

మూ: ఒక్క పుటలో ఎన్ని పంక్తులో చెప్పలేని యీ గణితశాస్త్ర కోవిదుడికి సన్మానమా—!

ప్ర: బాగా అడిగావు, అరిపోయిన బాణసంచా గాడా.

పం: కొన్ని పుటలలో, నలుబదిఏడు, మరికొన్నింటిలో—

ఉ: నే విహారానికి పోతున్నా...

మూ: నేనూ వీకిపోతున్నా...

చ: వీకేమిటి నీ తలకాయ!

మూ: విహారానికి పొట్టి—ఇది వేగిరంయుగం; విపులీకరణకి టైం లేదు.—అనగా తావులేదు. ఉ. వీకి రా. 'యు' అనంతరం వి. ఉత్సవం. 'ల్పుదాం' 'ట్యం' 'నం' 'సరగమ పదనిసా' 'జగణం' 'రగణం' 'లం' కాదహనం...

ఉ: (నవ్వుతూ వెడుతుంది) స్తున్నా. రీటంలో వె జ్రాలు ...వాలి. రా, రాజా...

చక్ర: 'స్తున్నా' ఉ, దాం, మిద్దాం.

మం: ఇదెక్కడి కర్మ.

పం: మరి యీ గ్రంథాలు...

ప్ర: థాలు. ద్రంలో వెయ్యండి. నేనూ పోతున్నా... జయభే...నిస్తా...డాం, డాం...'జాం', 'జాం'

మం: మహారాజా—విజ్ఞానానికి స్వస్తేనా?

చక్ర: ఆనందసాగరంలో వున్నాము. మాకిప్పుడు వ్యవధి లేదు. రోజుకొక పుట చప్పున, వెయ్యి గ్రంథాలు చదవడానికి ఎంతకాలం పడుతుందో,

మూ: క్కలు...కట్టి...ప్పమనండి...

[తెర సగం జారుతుంది. పండితుడు, మంత్రి తప్ప, మిగత అందరూ నిష్క్రమించడం; చీకటి కావడం, మళ్ళీ కాగడాల వెలుగు. ఆ వెలుగులో ఉష నాట్యం, మళ్లా చీకటి, కొందరు జనం అటూ యిటూ నడవడం, వెలుగు, మళ్ళా చీకటి, వెలుగు—యివన్నీ జరుగుతూండాలి. పండితుడు, మంత్రి మూలగా కూర్చుని చుట్టూ గ్రంథాలని పరిశీలిస్తూంటారు. ఈసారి తెర లేచినప్పుడు,

వ్యక్తులందరూ, కొత్త ముసలివాళ్లవుతారు. మెల్లిగా, మాట్లాడతారు.]

చ: లెక్కలు కట్టి చెప్పండి.

ప: ముందే కట్టివుంచాం మహారాజా. ఈ వంద గ్రంథాలు చదవడానికి పన్నెండు సంవత్సరాలు పట్టవచ్చు.

చ: మహామంత్రీ, యుద్ధమున కన్నీ సిద్ధమైనవా? శత్రు రాజుల కండకావరము అణచివెయ్యడానికి యీమారు నేనే స్వయముగా, యుద్ధభూమికి వొస్తున్నాను.

మం: మే మందరమూ లేమా ప్రభూ. నాలుగువేల గజబలం; పదహారువేల అశ్వదళం,...

చ: నాకు తెలుసు, శత్రువులను సంపూర్ణంగా ధ్వంసం చేస్తే గాని, నాకు శాంతి సమకూరదు.

పం: ప్రభూ, యీ వంద గ్రంథముల మాట?

మూ: మా రాజుగార్ని విసిగించకండి. వొంద గ్రంథాలకి వ్యవధి లేదు. పదింటిలో కుదించండి.

చ : చక్కటి యోచన.

పం: దానికి వొక సంవత్సరమైనా కావాలి ప్రభూ.

మూ: ఓ కానివ్వండి. ఈలోగా మా యుద్ధాలుకూడా ముగుస్తాయి.

మం: రాజా—పది సంవత్సరాల క్రితం, వెయ్యి గ్రంథాలు తెస్తిమి—వందలో యిమిడ్చి తెమ్మన్నారు,—తెస్తిమి—

చక్ర: ఇప్పుడు పదింటిలో కుదించి తెమ్మన్నాను. తేండి..

[తెర సగం జారుతుంది—అందరూ వెడతారు చీకటి. మళ్లా వెలుగు, ఆ వ్యక్తులే మళ్ళా వొస్తారు—తెర లేస్తుంది.]

చక్ర: చూశావా మూర్ఖుడా,—మన ప్రసన్నమల్లు శత్రుపక్షమైనాడు.

మూ: ఎందుకవరు ప్రభూ? ఆ పరిస్థితుల్లో నేనూ అవుతాను. వాళ్ల సేనాధిపతి చెల్లెల్ని తమరు చూళ్లేదు.

చక్ర: ఛీ పశువా—ఇది పరిహాసానికి సమయం కాదు.

మూ: అపరాధం స్వామీ—ఇది విజ్ఞానానికి సమయం. అదుగో పండితులవారికి పదేళ్లాయుష్షు.

చక్ర: అమాయకుడా, వెయ్యేళ్లాయుష్షు అనాలి.

మూ: కాదు స్వామీ. విజ్ఞానాన్ని పది పుస్తకాలలో కుదించి తెమ్మని ఆజ్ఞాపించారు; తెచ్చారు. అవుతే—నా బుర్ర మీద పది వెండ్రుకలు కూడా లేవు ప్రభూ.

చక్ర: మూర్ఖుడా నీ వయస్సెంత?

మూ: మీ దంతో సాదీ అంతే. అంటే యాభైఅయిదు. అందుకుగాను నేనూ వివాహమాడ నిశ్చయించాను.

చ: ఏమిటీ? ఇంకా సంధ్యాదేవి నేకే ఎంత నిశ్చలమైన, పవిత్రమైన ప్రేమ, నీది!

మూ: కాదు చక్రీ...సంధ్యాదేవి చీకట్లోకి జారింది. ఈమె పేరు నిశిరాత్రి.

చ: హా, హా—(నవ్వుతాడు) ఈ వయస్సులో నీకు పెండ్లేమిటి పేరిన తెలివి!

మూ: ఈ వయస్సులో తమకి యుద్ధాలేమిటి విర్రవీగిన వార్ధక్యం!

పం: ప్రభూ.—ఇదుగో మీరు కోరినట్లుగా పది పుస్తకాలు. (తివాచీమీద పరుస్తాడు)

చ: మా కిప్పుడు పుస్తకాలకు వ్యవధి లేదు. మూర్ఖుడా మంత్రిగారిని రప్పించి, యుద్ధసన్నాహం చేయించు.

పం: స్వామీ—ఈ గ్రంథాల కుదింపులో మంత్రిగారి మెదడు చెడి మంచాన పడివున్నారు.

చ: యుద్ధానికి కావల్సింది మెదడు కాదు,—శరీరం. అహ హా హా—. (నవ్వుతూ) ఆ శరీరాన్ని రప్పించండి.

మూ: అహా, ఏమీ యీ చక్రవర్తి బుద్ధికుశలత. వీ గ్రంథమూ చదవకయే యీ యుక్తిని సంపాదించిరి. ఆ పది గ్రంథాలూ చదివితే, వీరు జయించేటందుకు శత్రువులే వుండరు కాబోలు పండితులవారూ!

పం: అందుకు సందేహమా!

[మంత్రి మూల్గుతో ప్రవేశిస్తాడు.]

మం: స్వామీ వొక విషాదవార్త.

చక్ర: విన్నాను. మీకు మెదడు చెడి మంచాన పడినారట.

మం: అది విధివ్రాత. అంతకంటె విషాదమైనవార్త. ఉష నిష్క్రమించినది.

మూ: హా—ఉష! గంథము చదివిచూడకనే వీడ్కోలిస్తివా.

చక్ర: నిష్క్రమించడమేమిటి?

మూ: లేచెళ్లడానికి రాజభాష ప్రభూ.

చ : హా—ఇంకేది దారి నాకు.

మూ: 'గోదారి' అన్నది జనవాక్యం.

చ: పో, కుంక !

మూ: నాకేది దారి?

పం: ప్రభూ—ఇదే మంచి సమయం గ్రంథపఠనానికి; ప్రేయసినుండి ఎడబాటు; బంధుకోటి పరాయిపక్షం; మూర్ఖునికి కూడ జ్ఞానోదయమయ్యే దివ్య సమయం.

చ: హా ఉష—తుదకిట్లు చేసితివే.

మూ: తుదకిట్లా చేస్తే ఏడవడం దేనికి? మొదటినుంచీ యిట్లాగే చేస్తోంది ప్రభో.

పం: పది పుస్తకాలు, పది వారాలు రాజా.

చ: ప్రసన్నమల్లు కండకావర మణచాలి; ఉషని వెదికి తీసుకురావాలి; అంతవరకూ నాకు శాంతిలేదు...మంత్రి, పండితుడా—ఈ పది పుస్తకాలలోని సారాంశం, వొక్క పుస్తకంలో సంక్షిప్తీకరించి తేండి.

పం: హా—ఇంకానా.

మం: (మూర్ఛపోతాడు.) శో.

మూ: రాజుగా రొక్కటే గనక వొక్క పుస్తకం. ఉష కూడా వుంటే రెండింటిలోకి కుదించమందురు అంతేనా స్వామీ.

చ: పో. తుంటరీ—ముందు నీ అజ్ఞానాన్ని నా కరవాలానికి బలిచేస్తాను. (లేస్తాడు)

మూ: కత్తికోసం వెదుకుతున్నట్లున్నారు. అల్లా లోపలికి వెళ్ళి, కుడివైపుకు తిరిగి, తిన్నగా నడిచి మంటపం ద్వారా ఎడమవైపుకు తిరిగి...

చ: నోరుమూయుము. (మీదికొస్తూ లోపలికెళతాడు)

మూ: బాబో...(చక్రవర్తి, పండితుడు యిరువైపులా వెళతారు)

"చలి, చలి, చలి.
కరవాలానికి బలి—
వార్ధక్యంలో ప్రేమకి వెలి.
ప్రేమకి యుద్ధం బలి,
చలి, చలి; చలి.
చలిమంటకి మరీమరీ చలి
యుద్ధానికి శాంతి అంతిమబలి—
ఉషోదయం, సంధ్యారాగం
మండి చచ్చిన మిట్టమధ్యాహ్నం
చీకటి కామం,
అంతిమ అజ్ఞానం.

[తెర సగం జారుతుంది. కొంచెంసేపు అంతా చీకటి. అందులోనుంచి, మూర్ఖునిపాట మాత్రం వినబడుతూ వుంటుంది. ఈ వ్యవధిలో రంగం మారుతుంది. వెలుగొచ్చేటప్పటికి, చక్రవర్తి మంచంమీద పరుంటాడు. తెర లేవాలి.]

చ: ఇక నేను బ్రదకను మూర్ఖుడా—నా ఆత్మకి శాంతినిచ్చే దివ్యసందేశం, ఏ గ్రంథంలోనైనా వుంటే చదివి వినిపించవూ. (మూల్గుతాడు).

మూ: మనోవ్యాధికి మందు లేదు, మహారాజా—

చ: నాకీ ప్రపంచంతో నిమిత్తం, ఉషాకన్యతోనే పోయింది పశుతుల్యుడా. సామంతులు స్వతంత్రులై రాజ్యాన్ని విచ్ఛిన్నం గావించారు. ఇక నాకు మిగిలిందేమిటి?

మూ: మీకు మిగిలింది మిమ్మల్లను గురించిన చింత. ఈరకం ఆధ్యాత్మిక చింతనకూడా వో రకం మనోవ్యాధే ప్రభూ. అచింతని దైవంకూడా వారించలేడు.

చ: నీది నాస్తికత్వం.

మూ: బాహ్యప్రపంచంలో, ప్రక్రియలు వెదకడమే మూర్ఖత్వం. బాహ్యప్రపంచాన్ని లోబరుచుకున్న వొక శక్తిగా దైవాన్ని అన్వేషించకపోవడమే నాస్తికత్వం. అదొక్కటే యథార్థం.

మం: తమరు లేచుకోవాలి మహారాజా—వైద్యులేమీ భయం లేదంటున్నారు. ఇది వార్ధక్యంలో ప్రాప్తించే మాంద్యం. వేరు వ్యాధి కాదు.

చ: నాకీ వైద్యులలో నమ్మకంలేదు.

మూ: స్వామీ—గాడిదకు పశువైద్యునిలో నమ్మకం లేక పోయినా, చికిత్స పొందుతుంది కదా!

మం: పశువా! ఇప్పుడా పరిహాసం! ప్రభూ విశ్రాంతి తీసుకోండి.

చ: నాకు ఆ ఫలానా రాజుని హతంచేసేవరకూ శాంతిరాదు. ఉష వాడి స్వాధీనంలో వుందట. అయ్యో, నొప్పి, బాధ!

మం: స్వామీ, మీరు కోరినట్లుగా మూడుసంవత్సరాలు కష్టించి, మన పండితులవారు, ప్రపంచంలోని విజ్ఞానాన్నంతనీ వొక చిన్ని గ్రంథంలోకి యిమిడ్చి సిద్ధంచేశారు. తెప్పిస్తాను. ఎవరక్కడ? (చప్పట్లుకొడతాడు)

మూ: ఇక్కడ అజ్ఞానాంధకారం ప్రభూ.

మం: మూర్ఖుడా, ధనంజయ పండితుణ్ణి ప్రవేశపెట్టు.

మూ: చిత్రం. (చిత్తం బదులుగా అనడం.)

[మంత్రి, రాజుగారికి సపర్యలు చేస్తుంటాడు. మూర్ఖుడు పాడుకుంటూ వెడతాడు]

"రాజుకి చిత్తం, రాణీకి చిత్రం,
మహామంత్రికి ప్రాయశ్చిత్తం
కూలీకి విత్తం, పండితునికి పాత్రం
జగత్తంతా వల్లకాటిలో ఆయత్తం,
ఏసు వేసుకున్న మేకుల శయ్య
సోక్రటీస్ విషం తీసుకున్న విషమసమస్య
వాల్మీకి కదిపిన కోతులపుట్ట
వేమన విప్పిపారేసిన విద్యావస్త్రం
మార్క్స్ సరీలియస్, షేక్స్పియర్, షా,
మాంటెయిన్, మాటర్లిన్క్,
కాళిదాసు, భవభూతి, ఒమార్, కన్ఫ్యూషియస్,
అందరూ కలిసి త్తిన గాలి మేడ—
టాగూర్, ప్లేటో తుడిచిన మేడలో అద్దం
మహాత్ముడు వేసిన రాయికి పగిలిన సత్యం
చివరికి కూలీకి పాత్రం, కవికి విత్తం
శ్మశానవాటిక స్వర్గంలో ఆయత్తం."

చ: అయ్యో, బాధ—మంత్రి, యుద్ధభూమినుండి వార్తలేమి?

మం: ప్రభూ, తమరు శాంతించండి. శత్రువులు రాజీకి వొచ్చారు. దేశానికి శాంతి సమకూరింది.

చ: నా కంతా చీకటిగావుంది. వెలుగు కావాలి.

పం: ఇదుగో స్వామీ, గ్రంథం. పఠించమంటారా?

చ: ఇప్పుడు నాకు చదివేటందుకు వోపిగలేదు; వినేటందుకు మనస్సూ లేదు.—నేను వెళ్ళిపోతున్నాను. అందులో వున్న సందేశం వొక్క వాక్యంలో చెప్పండి—...విని సంతోషిస్తాను. తొందరగా...అయ్యో, అమ్మా...

పం: ఒక్క వాక్యంలోనా—ఒక్క పదినిమిషాలు వ్యవధి నివ్వండి రాజా... తెలియపరుస్తాను.

చ: ఈ ప్రాణి పదినిమిషాలు నిలవలేదు జ్ఞానబోధ చెయ్యండి. త్వరగా కానివ్వండి. ఈ జగత్తంతా ఏమిటి? ఎందుకు? మన మెవరం? త్వరగా...ధనంజయా...

ధం: (త్వరితంగా పుటలు తిరగవేస్తూ, గొంతు సవరించుకుని)

ఇదుగో...ఈ జీవితం...

మూ : మహారాజా—ఈ గ్రంధంలో వున్నది విజ్ఞానం. మీకుండవల్సింది జ్ఞానం. అది స్థూలజగత్తులో లేదు స్వామీ. నే నేనాడో చెప్పాను. మీ హృదయంలోనే వుంటుంది.

చ : ఆ...హా...అయ్యో. నే...(పిచ్చిగా నవ్వుతాడు)

మం : అయ్యో. మహారాజు స్పృహలో లేరు. వైద్యుని పిలిపించండి.

చ : మన మెవరం? హాహా...ఎవరం?

(మూర్ఖుడు మెల్లగా పాడుతుండగా, తెర పూర్తిగా జా[illegible]తుంది)

మూ : ఎవరం? ఎవరం? మన మెవరం?
ఆత్మకి అనంత జాగరం...
వెలుగునీడని వెదకే అంధత్వం
దైవంచాటుని ఘోర పశుత్వం
ఎవరం? ఎవరం? మన మెవరం?
కూడూ, గుడ్డా, నెత్తిన కొంపా,
పిల్లా, మేకా, శనివారం సంబరం
ఇంతే ప్రభుత్వం.
తరతరాల సంతానం సంతాపం
ప్రపంచతత్వం.
అడక్క పెట్టింది నీలో మిగిలిన జ్ఞానం
అందర్నీ అడుక్కు తిన్నది విజ్ఞానం
అంతిమ అజ్ఞానం



# * రా రాజు

శ్రీ కొత్తనారాయణ చౌదరి

ద్వైతవనంబులో సమితదైన్యపరిస్థితిఁ గుందుచున్న కుం
తీతనయుం డొకప్పుడు మదిం బెగడొంది, సుయోధనుండు ధా
త్రీతలమెట్టు లేలునొ పరీక్ష యొనర్చి సమగ్రవార్త నా
కై తెలియంగఁ జేయుమని యాజ్ఞ యొసంగెను గూఢచారికిన్.

వాఁడు మహాప్రసాదమని వానిని వీడ్కొని హస్తినాపురిన్
దోడనె చేరి కౌరవుల దోర్బలమున్ గురురాజు స్వాస్థ్యమున్
గాఢముగా నెఱింగి చనిగ్రక్కున ధర్మజు మానసంబులోఁ
గాఁడఁగఁ జెప్పఁగాఁ దొడఁగెఁ గానససీమఁ గ్రమంబుగా నిటుల్.

దేవా, సత్య మెఱింగి వచ్చితి – మహాధీరుండు దుర్యోధనుం
డేవారిన్ గణుతింపనేరఁ డొకయింతే నిచ్చలున్; రాజ రా
జై వాల్లభ్యము సూపు, సర్వధరణీ వ్యావృత్తియే గాని దు
ర్భావం బేదియు లేదు వానియెదలో భావింప సర్వాత్మనా

దానదయాదిసద్గుణ విధానములన్ బచరించి మించి వి
న్నాణము సూపి నిర్మల మనంబున దివ్యయశంబు గూర్చి స
మ్మానము నొందు నెల్లెడల మానధనాఢ్యుఁడు రాజరాజు దే
శాన సమస్తవిద్యల విశారదుఁడై వెలుఁగొందు నిత్తఱిన్.

కామము క్రోధమున్ మొదలుగాఁ గల వర్గము నీసడించి గా
రామున రాజ్యలక్ష్మికిఁ గరంబుగఁ గూర్చుచు నెల్లవారికిన్
సేమ మొనర్చుచున్ మదిని జింతయుఁ జీకును లేక శాశ్వతం
బౌ మనుమార్గ మేమఱక హాయిగ నేలుచునుండె నిద్ధరన్

అరయఁగ సామదానముల నన్నిట శాస్త్రము చెప్పినట్టు లా
నరపతి నిర్వహించు; నొకనాఁడును సైతము దారిదప్పి యాం
తరువును మీఱఁ డాతని విధంబు విచారణసేయ నుత్తరో
త్తరము మనోహరంబయి ముదంబొనఁగూర్చును సజ్జనాళికిన్.

సైఁపఁడు ధర్మవిప్లవము – శాంతినిగోరును, మంత్రగుప్తిలో
నోపినవారి నేర్పఱిచి యుక్తిగ శత్రురహస్యమున్న దే
దో పరికించు; రాజ్యమున కూఁతము నయ్యెడివారి బాములన్
బాపును; న్యాయమూర్తి యగు పార్థివుఁ డాతఁడు ధర్మనందనా!

---

* భాస-భారవి మహాకవుల కవితకు ఛాయానువాదము.

నలుగడ నేల యేలుచు ననారత మాతఁడు నిండుకొల్వులో
పలఁ బలు 'రాజకీయములు' పారము ముట్టఁగనేర్చి తీర్చు; నా
వల నఖిలావనీపతు లపారభయంబున దోయిలించి జో
తలు కడుబత్తితోఁ గ్రమపథంబునఁ బెట్టుచు నుందు రిమ్మహిన్.

నిచ్చలు క్షత్త్రియోత్తములు నెయ్యము వియ్యము గోరి బత్తిమై
వచ్చియు నిచ్చు వాజిగజవర్గము పెంపయి కొల్వుకూట మం
దచ్చట ముచ్చటన్ జరుపునప్పుడు కౌరవచక్రవర్తి య
త్యుచ్చదశావిశేషమున కువ్విళులూరుచు నుందు రెందఱో

తడవులఁబట్టి దేశము ముదంపడి క్షామము లేక క్షేమమె
క్కుడు గడియించెఁ; గర్షకులకున్ గురుభూములు పాయినిచ్చు; నె
క్కడ నొకఁడేనిఁ దిండికిని గాలిన మానిసి లేఁడు; చూడ నె
య్యెడను సమస్తసంపదలు వృద్ధిని బొందె విచిత్రరీతిగా.

జనపదలాభమేమఱని సాధుచరిత్రుఁ డుదారుఁ డా సుయో
ధనుఁడు వసూపమానుఁడు ముదంబున రాజ్యము నేలుచుండ నా
తని గుణరాశిలోఁ దడిసి తానెస్వయంబుగ సర్వథా ధనం
బును బ్రసవించు మేదిని యపూర్వమహామహిమంబు సూపుచున్

సామము చూపఁగాఁ దగిన స్థానము నెన్నఁడుపేక్షసేయఁ డిం
కేమి యొనర్చినన్ ఫలిత మీయనిచోటఁ దురీయసాధనం
బేమఱి యుండఁ డా నృపతి యిమ్మగ నాలు గుపాయముల్ మహా
స్వామి! నిజప్రతిష్ఠ దయివాఱు తెఱంగునఁ జూచు నిచ్చలున్.

వృత్తికి వృత్తి కెయ్యెడను వేఱిమి సుంతయు లేదు; గ్రామముల్
పత్తనముల్ పరస్పరము భాగ్యము పొందిక నందుకొంచు న
త్యుత్తమ మైత్రితోఁ బొదలు; నొయ్యన వర్ణవిపర్యయంబు లే
దిత్తఱి; వాని రాజ్యమున నేదియు లోపము లేదు ధర్మజా!

మానధనాఢ్యులై కరము మన్ననచేఁ జెలువారి శౌర్యమున్
బూని సమస్తభాగ్యములు పొంది మెఱంగు ధనుర్ధరుల్ నిజ
ప్రాణములైన నిచ్చి తమ వంతు ఋణంబది యీఁగఁగోరి య
మ్మానవనాథు నాజ్ఞలు ప్రమాణముగాఁ దలదాల్తు రెప్పుడున్.

ఎన్నఁడుగాని యాతఁడు వహింపఁడు కేల ధనుస్సు; మోమునం
దెన్నికసేయఁ గోపమొక యింతయుఁ గానఁగరాదు; రాజలో
కోన్నతుఁ డా సుయోధను మహోన్నతశీలమె యెల్లవారికిన్
గన్నులపండువై యమితగౌరవమున్ బచరించు నిద్ధరన్.

అతఁడు నృపాసనస్థుఁడయి యాలనపాలన సేయుచుండఁ జిం
తితమగు కోర్కియేరికి మదిన్ నిలువంగను లేదు; లోకు లా
మెతలుగ వానిమాటల ప్రమేయము నెంచి తదీయశాసనం
బతి వినయంబుతో నరవి నౌదల దాలుతు రేక తాన్నులై.

నరపతి చారచక్షువయి నల్వురి మేలునుగీడు లెన్నగా
నరయుచు దేశదేశములయందలి వార లొనర్చు పూజలన్
బొరయుచు వారొసంగెడి యపూర్వబహూకృతు లందుకొంచు ని
బ్బరముగ మోయుచుండు భువిభారమనంతుఁడు వోలె నిచ్చలున్.

వెలయఁ ద్రివర్గముల్ నృపుని విజ్ఞత - యొప్పిదమైన సద్గుణం
బులను సమన్వయించి తమ బుద్ధికి నాతఁడు పక్షపాత దృ
ష్టులు చవిచూడనట్టి పరిశుద్ధుఁడె యంచు నెఱింగి యాసతోఁ
గలకలలాడుచున్ సుఖముగాఁ బొనుపొందుచుఁ జేరె నాతనిన్.

సమయము చూచి తమ్ముని ప్రజాపరిపాలన సేయ యశావరా
జ్యమున నలంకరించి యనుయాయిజనంబులు నిచ్చమెచ్చ మో
దమునఁ బురోహితుం డనుమతంబని చూపెడి త్రోవ - యాగముల్
క్రమముగఁ జేయ సాగె గుణగణ్యుఁడు కౌరవనాథుఁ డిత్తఱిన్.

ఈవిధమైన యాతని యహీనపరాక్రమ యుక్తసర్వతే
జోవివిధోగ్ర సుందర విశుద్ధమహీపరిపాలనం బిలన్
భావి పురాతనాద్యతన పార్థివజాతికి మేలుబంతిగాఁ
గావుట ధర్మరాజెఱిఁగి కష్టమనస్కుఁడె యయ్యె నొయ్యనన్.



# ప్రాచీనాంధ్ర శతక పరిశీలన

శ్రీ బులుసు వెంకటేశ్వరులు

## 1

పరమపావన మగు నాంధ్రసారస్వతారామమున నత్యంత రమణీయములై దివ్యపరిమళమును వెదచల్లినవి శతకసుమములు. తోడి ప్రబంధ సుమసౌరభమును మించలేకపోయినను వానితో సమానముగ విరాజిలఁ గలిగిన శతక ప్రసూనములు లెక్కకు మిక్కిలిగా వెలసినవి.

ఆంధ్రసారస్వతమున నన్నయభారతము జనించిన నూఱు సంవత్సరములకే ప్రథమశతకము పొడచూపినది. అంతకుఁబూర్వము సైతము శతకము లున్నట్లు వినుటయేకాని తగిన దృష్టాంతములు లభింపని కారణమున నాఁటినుండియే శతకోద్భవమైనదని నిర్ణయింపవచ్చును. ఈ కాలమే క్రీ. శ. 12 వ శతాబ్దముగాఁ జరిత్రజ్ఞు లెంచియున్నారు. అంతకుఁబూర్వము ప్రాకృత సంస్కృతములలో శతకము లుండుటచే నాంధ్రమునను నంతకుమును పే శతకము లుండియుండవలెననుట సమంజసమే యైనను మన దురదృష్టవశమున నవి కాలగర్భమునఁ గలసియుండుటచే నూరకొనవలసి వచ్చినది. కావునఁ, బండ్రెండవ శతాబ్దమే శతకోద్భవమునకుఁ బ్రారంభమనుకొందము.

ప్రప్రథమునఁ బుట్టిన శతకము మల్లికార్జున పండితారాధ్య ప్రణీతము, శైవభక్తి ప్రతిపాదకము నగు శివతత్త్వసారము. ఈ శైవమత ప్రతిపాదకమగు శతకము, పుట్టునాఁటి కాంధ్రదేశమునందలి మతస్థితి యెట్లున్నదియు దిక్ప్రదర్శనముగానైనఁ దెలిసికొనవలెను.

అనేక శతాబ్దములకుఁ బూర్వమునుండియు ననఁగా క్రీస్తు జన్మింపని క్రితమునుండియు శైవవైష్ణవ మతములు కర్ణాటాంధ్ర ద్రవిడదేశములందు సుప్రతిష్ఠములై యున్నవి. అందు ముఖ్యముగా, శ్రీ రంగక్షేత్రము గల దక్షిణదేశమున వైష్ణవమతమును శ్రీశైల పుణ్యక్షేత్రము గల కర్ణాటాంధ్రదేశములందు శైవమతమును వ్యాపించియున్నవి. కాని, నాఁటి యాంధ్రదేశమందలి శైవులు పాశుపత, కాలాముఖ, కాపాలికాది భిన్నపద్ధతులలో నుండి యైక్యతఁ గోల్పోయిరి. ఈ యైక్యమాత్ర నిబద్ధులు కాని శైవు లన్యోన్యకలహములతోఁ బరస్పర మనస్పర్థలతో విరోధించుకొనుచుండిరి. ఈ సమయమును గనుపట్టి తమ జైనబౌద్ధమతములు వ్యాపింపఁజేయుటకును, శైవమత ప్రాబల్యము నణఁచుటకును సిద్ధనాగార్జునాది జైనబౌద్ధ ప్రచారకులు శ్రీశైలమునుజేరి స్వమత వ్యాప్తికి సర్వతోముఖముగఁ బాటుపడఁజొచ్చిరి. శైవుల మతవిభేదములకుఁ దోడు జైనబౌద్ధమతము లహింసాతత్త్వ ప్రతిపాదకము లగుటచేతను, జాతిభేద విరహితము లగుటచేతను గర్మసిద్ధాంత తృణీకృత ములగుటను జనాళిమనముల నాకర్షింపఁజొచ్చినవి. పైగా శ్రీశంకరుని యద్వైత శంఖానినాదముతో జైనబౌద్ధమతములతోఁ బాటు శైవమతమును నొక్కసారిగ సన్నగిలఁ జొచ్చినది. బసవన్న స్థాపించిన వీరశైవమతమునఁగల బ్రాహ్మణద్వేషము, వేదదూషణము స్వమతాఘాతములై శైవమత సంస్కరణల కావశ్యకతఁ గూర్చినవి.

అట్టి సమయమున నాంధ్రదేశమున వెలసి చక్కని సంస్కరణము మూలమున స్వమతవ్యాప్తిఁజేసిన మహనీయుఁడు మల్లికార్జున పండితారాధ్యులు. ఈతఁడు బ్రాహ్మణులను వేదములను నిందింపకుండ నద్వైతమును ఖండించి తన మతవ్యాప్తికై శతకము విరచించెను.

మల్లికార్జున పండితారాధ్యులు క్రీ. శ. 1160–70 ప్రాంతమునకుఁ జెందినవాఁడు. గోదావరీమండలమునఁగల భీమేశ్వరమున భీమేశ్వరున కర్చకుఁడైన భీమనపండితునకును గౌరాంబకును బుట్టిన ఋగ్వేదశాఖీయుఁడు. గౌతమసగోత్రుఁడును, వీరమాహేశ్వరాచారముల ననుసరించినను బ్రాహ్మణత్వమును గార్హస్థ్య ధర్మములను విడువనొల్లక ఆచరణరూపకమైన సత్యముల నే శతకమున వెల్లడించియున్నాఁడు. 'భక్తిమీఁదివలపు బ్రాహ్మ్యంబుతో బొత్తుఁ బాయలేను నేను బసవలింగ' యని బసవనికి బంపిన వాక్య మిది ధ్రువపఱచును.

శివతత్త్వసారము శతకమగునా? కాదా? యను శంకయు నొకప్పుడు కలిగినది. కాని, యొకే మకుట మెల్లెడలేకపోవుట శతకారంభదశనే సూచించును గాని శతకము కాదనుట కుపకరింపక పోవుటచేతను,

“శతకంబు శివతత్త్వసార మాదిగను...”

అని పండితారాధ్య చరిత్రమునఁ బర్వతప్రకరణమున నుండుటచేతను 150 పద్యములకుఁ బైఁగా 'శివా' యను మకుట ముండుటచేతను, క్రీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారును వారి ననుసరించి కీ. శే. వంగూరి సుబ్బారావుగారును దీనిని శతకమనియే పరిగణించుటచేతను, నిది ప్రథమ శతకముగా గ్రహింపఁబడినది.

ఈ శతకము కేవలము శివాధిక్యము నుద్ఘోషించుచు నాఁటికే ప్రాబల్యముఁ గాంచిన యద్వైతమును ఖండించుటకుఁ దగిన యుక్తియుక్తులతో శైవమతప్రాబల్యమునకును, పండితారాధ్య చరిత్రాది శైవగ్రంథములు జనించుటకును, మూలకందమైనది. నన్నయ

తిక్కనల నడిమికాల మున జనించిన దగుట సారస్వత దృష్టి ననుసరించినను దీనికిఁ జాల ప్రాముఖ్యమున్నది.

ఇందు ముఖ్యముగా పశుపాశ పతిజ్ఞానము, అద్వైతమత ఖండనము, జగత్కర్తృత్వవిచారము, భవాది శబ్దవివృతి, జగత్కర్తృ లక్షణము, శివభక్తి వివరణము, భక్తుల మహిమ, శివనిర్మాల్యము, శివదీక్షితుఁడు, శివభక్తుఁడు, భక్తిప్రాశస్త్యము, బాహ్యపూజామహిమ, శివాపచారదోషము, దక్షాధ్వరధ్వంసము, ప్రళయ వర్ణనము, శివగణ వర్ణనము, సద్భక్తుల మహిమ, భక్తప్రశంస మొదలగు విషయములు వివరింపఁబడినవి.

"శ్రీపతి వాక్పతి ముఖ్య మహా పురుషులు నెఱుఁగనోప రతి వాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ, రూపము నేనెట్టిదని నిరూపింతు శివా."

అని శ్రీకారములోడనే గ్రంథారంభము చేసి యనంతములైన వేదములు, సమస్తవేదాంతములు, శ్రీపతి వాక్పతి ముఖ్యులును శివునిఁ బొడఁగానలేరనియు నట్టి యవాఙ్మనసగోచరుని 'దురిత హార మనియు శుభములు, దొరకొను ననియుఁ' దలఁచి ప్రణుతించుట కారంభించినాఁడు, శివమార్గమునకు శివసంహితలకు, శివపంచాక్షరికి, శివగణములకు, శివునకు సంబంధించిన సమస్తమునకు జయ మపేక్షించి కవి తన యనన్య భక్తిని వెల్లడించినాఁడు.

పిమ్మట పాశుపతశైవ సంప్రదాయముల ముఖ్యసిద్ధాంతముల నిట్లు నిరూపించినాడు.

"జీవుల నేకులు పశువులు, భావింపఁగఁ బ్రకృతి వికృతి బంధము పాశం,
బావృతము లగు ॰ బసువులు, నీ వారెంటికిని పతివి..."

అనియు, బ్రహ్మోక్త సమస్త హరిబ్రహ్మాది పిపీలికాంత పశువుల కందఱకును శివుఁడే పతి. ఆ పశుపతిని వేదోక్తమార్గమున గొల్చి దేహపాశ బంధచ్ఛేదనమునఁ బసువులు ముక్తములగుననియుఁ దత్సిద్ధాంతము. పాశుపతు లద్వైతమును గర్హింతురు. సన్న్యసమును నిందింతురు. ఈ పాశుపత సిద్ధాంతము విశిష్టాద్వైత సిద్ధాంతములతో సమముగా నుండును. వీరును శ్రౌతస్మార్త కర్మలతో సమానముగా ఆగమోక్తములైన కర్మల నాచరింతురు. ఈ విషయములెల్ల నిందు సువ్యక్తములై యున్నవి.

ఇఁక, నద్వైతఖండన విషయమున కవి మాయావాదమును దన యుక్తులచే ఖండింపఁ జూచినాఁడు. మాయావాద ఖండనమున విశిష్టాద్వైతమును గ్రహించి తదితరముల కేవల ద్వైతమతాభిమానమును జూపినాడు. అతని మతమిది: "జీవుఁడు శివుఁడను వాక్యము ప్రతిపాదకము. జీవునకు బంధమోక్షదశావస్థలు గలవు. శివునకు లేవు. పరమేశ్వరునకు జీవునకు మహాధాత్రీధర పరమాణువుల యంతరము కలదు. అందుచే జ్ఞానియగువాఁడు భక్తిహీనుఁడేని మోక్షమున కనర్హుఁడు."

ఏ తన్మతానుసారముగా నద్వైతపరము లగువానిని ద్వైతపరములుగాఁ బ్రతిపాదించుట చిత్రముగాఁ గానవచ్చును.

ఈ శతకమున మనము గ్రహించి యానందింపవలసినది యిందలి భక్తిప్రాశస్త్య వివరణమే.

"స్వర్గాపవర్గ సుఖము ని,
రర్గళసామ్రాజ్యసుఖము నాత్మజ విద్యా
వర్గాదిలోక సుఖములు,
భర్గ! భవత్పాదభక్తి ఫలములు రుద్రా!"

అనునదియే యెల్లెడల విస్తరింపఁబడినది. తద్భక్తిభావము లిట్టివి: భక్తితోఁ గొల్చిన గాని ముక్తి లేదు. భక్తి ధర్మమువలన జనించును. ధర్మము వేదోక్త సదాచారమువలనఁ గలుగును. ఈ ధర్మాధిక్యముచే, నతి నిర్మలబోధయు, విరక్తి, నిష్ఠ గలుగును. దీన భక్తి వృద్ధి యగును. శివభక్తి నరసుర తిర్యక్స్థ చరాచరజీవులకు, నరతిర్యగ్గర్భ యౌవనస్థాది పకూత్కారములకు సిద్ధినిచ్చును. శివభక్తి లేని వివిధాధ్వర ముఖ్యసకల వేదపురాణాది విహితకర్మము లన్నియు నిష్ఫలములే.

ఇఁక, శివభక్తుఁ డెట్టివాఁడైనను బంకజమురీతి సమాదరణీయుఁడే. శివభక్తునకు హరిపద్మజ వాసవ విస్తర విభవములు తృణప్రాయములు. "ఆకాశము పొడగీసిన, భూకంపంబైనఁ బంచభూత ప్రళయ వ్యాకులమైనను, కులగిరులు జిఱ్ఱదిరిగిన, జలరాసులు మేరదప్పి చనుదెంచినను, దిక్కులు వీడ్వడి కలిసినను దిక్కరులు మదంబుడిగి తిరిగినను, భూతములు తల్లడిల్లినను పాతాళము బయలు పడినను బ్రహ్మప్రళయ మేతెంచినను—వేయేల, ప్రాణములు పోయినను దల తెగినను శివభక్తుఁడు" జంకఁడు.

శివభక్తుఁడు తలఁచిన నాయుధములు కుసుమములగు; అబ్ధులు మెట్టలగు; మహామదగజములు గండశిలలగు; అతనికి క్షుత్తృష్ణాది విపత్తులు, జలతపన శీతబాధాదులు, కలుగవు. పరపరివారత్వము, నిష్కారుణత్వము, మరణపునర్భవాదులు నుండవు. అందుచే, శివభక్తులు త్రిజగత్పావనులు; భవాంధతమస పటల విఘటనోద్యద్విత నిజమహిమార్క విభాసులు.

శివనిర్మాల్యము భక్తులకుఁ బ్రబలోపయోగి; అభక్తులకంట రానిది; శివభక్తురాలైన స్త్రీ పతి శివభక్తుఁడు కాఁడేని ఆమె భర్తకు బుద్ధి చెప్పవచ్చును. బుద్ధి తలకెక్కదేని ఆమె యాతని మీఱవచ్చును. భర్తను దృణీకరించినను శివపూజా దురంధరయగు స్త్రీ యోగ్యురాలే. ఇందుల కుదాహరణము లననూయ,(?) అలాయని యను ముని భార్యలు.

శివభక్తుడు విడివడని శివజ్ఞానముచే సమస్తమును విడిచి దురహంకారము పోనాడి తన్ను దాను మఱచునట్లు శివునకు బాహ్యాభ్యంతరపూజ చేయవలయును.

శివభక్తుల కర్తవ్య మిట్లు వివరింపఁబడినది : వారు జీవహింస చేయరాదు; శివనింద చేయువారిని చంపవలయు; శివాపచారము చేయు గ్రంథములు కాల్పవలయు. శివతీర్థములో కాని శివాజ్ఞచే గాని జీవత్యాగము చేసికాని ముక్తిని పొందవచ్చును. శివునకైఁగాని శివభక్త్యర్థముగాని శివవిద్యాచార్య విషయమునఁగాని జీవిత

ధర్పించిన ముక్తి కలిగి తీఱును. అట్లు శివార్థ మసువుల వీడినవారికి బరలోక విధు లనవసరము, వారికి ముక్తి సిద్ధము.

మానసికముగాఁ గాని కాయికముగాఁ గాని వాచికముగాఁ గాని యేవిధముగాని, శివాపచారము చేసిన యాతఁ డెంతటివాఁ డైనను మహా దుర్గతిని పొందును. దక్షాధ్వరధ్వంస మిందుఁకు ఉదాహరణము.

క్షయము లేకపోవుటచే మోక్షములేదు. కావునఁ బరమ కరుణాంతరంగుఁడగు నీశ్వరుఁడు మానవుల దుఃఖనివారణకై లయ మొనర్చుచుండును.

శివాభిలాషానుసారము లోకాలోకము, సురపతిలోకముతోఁ గూడి బ్రహ్మలోకము, వైకుంఠలోకము చేరి లోకత్రయ మెల్లఁ బ్రమథలోకమైనది. ఈ ప్రమథులు మహావీరులు, వీరవ్రతులు, వీరావతారులు. వీరు సర్వజ్ఞులు, సర్వగతులు, సర్వశుభాగములు, సర్వ సంగత్యాగులు, సర్వ పరిపూర్ణులును. కావుననే కవి యా భవ్యగణములోఁ జేర్చవలసినదిగాఁ బరమేశ్వరునిఁ బ్రార్థించినాఁడు.

తన్నుఁ గన్న తండ్రి తల తెగదునిమినవాఁడు, తన కన్నిచ్చినవాఁడు శివనింద విని ప్రాణత్యాగ మొనరించినవ్వాఁడు, తన తలలు తఱిగి శివున కర్పించినవాఁడు—వీరే మహా శివభక్తులు; వీరి త్యాగము, వీరి మోక్షాసక్తి శివభక్తులకు నిత్యధర్మములు. దీని ననుసరించియే శివభక్తి.

"శివునకుఁ దనువును మనువును, శివభక్తులకును ధనంబు జిత్తప్రీతిన్
భువినిచ్చి యెల్లవారికి, శివుఁడను నేననకయునికి శివభక్తియగున్"

అని నిర్వచింపఁబడినది. ఆ భక్తికల 'అతఁడె స్వరూప సుందరుఁ, డాతఁడె సౌభాగ్యవంతుఁ డాతఁడె గుణవి, ఖ్యాతియశుండు..."

మహాభక్తుఁ డంత్యజుఁడైనను నగ్రజన్ముఁడే. ఆ భక్తుఁ డగ్రజన్ముఁడైనను నంత్యజుఁడే. కావుననే చెన్నయ మాలఁడు తన మహాభక్తిచే నగ్రజన్ముఁ డయ్యెను. దక్షుఁ డది లేనికారణమునఁ బచ్చి మాలఁడయ్యెను. ఇది ఈ శతకవిషయ సంక్షిప్త వివరణము.

ఈ శతక కర్త పండితారాధ్యులు దివ్యమహిమోపేతుఁడు. మహిమలెల్ల శివతత్త్వసార పీఠికలోఁ గలవు. ఈతఁడు వేద ప్రామాణ్యము కలవాఁడు. వేదవాక్యములు ద్వైతము నే బోధించుచున్న వని ప్రతిపాదించినాఁడు. "వేదోక్తమార్గమున సత్యాదరమున నిన్నుఁ గొలిచి...ముక్తులగుట సిద్ధము రుద్రా!" "వేదోక్త సదాచారా పాదనమున...పురాపాదిత దురితక్షయమై..." మొదలగు చోట నీతని వేద ప్రామాణ్యబుద్ధి గోచరించును.

మాయావాదమును ఖండించుచోట ననిర్వచనీయాద్యనుపపత్తులు గ్రహించి ప్రయోగించుటచే నీతని భాష్యజ్ఞానము వెల్లడి యగుచున్నది.

మఱియు నద్వైత ప్రతిపాదకములగు పరమసత్యముల నీతఁడు ద్వైత ప్రతిపాదకములుగాఁ బ్రతిపాదించుటలోఁ జూపిన యుక్తు లీతని ప్రతిభావ్యుత్పత్తులు చాటుచున్నవి. వేదవాక్యములు ద్వైతమే బోధించుననుటయు, "తత్త్వమసి" యను సూత్రమును 'తస్యత్వం అసి' యని యర్థము చేయుటయు మొదలగున విందుల కుదాహరణములు. ఈ యాపట్టుల నీతని బోధకశాశక్తియు నద్భుతముగాఁ గానవచ్చును.

"కల దనసోపక లేదని,పలుకఁగ నేరకయు మూకబధిరులక్రియని
మ్మల నద్వైతులు తమ లో,పల వగతు"రట !
"నిత్యమహాజన దూష్యము, ప్రత్యక్షాది ప్రమాణ బాధా బాహ్యం
బత్యనుచిత మద్వైతి' మనియు;
"మాతయు మానము మేయము, భాతిగ మిథ్యయని పల్కుపాతకు
లాత్మ, ద్వైతులు ప్రమాణశూన్యు' లనుటలోను,

పండితారాధ్యుల వాదశక్తికంటె వాదిశక్తియే గోచరించును.

తన వాదమును శక్తివంతముగాఁ జేయుటకై శ్రుత్యుక్తుల నే పద్యముల వాఁడియున్నాఁడు: 'మద్భక్తా నవినశ్యంతి,' 'న మే భక్తాః ప్రణశ్యంతి,' 'లింగద్వయం సమాఖ్యాతమ్,' 'తేనసహ సంవసేత్,' 'తస్మైదేయమ్ తస్మాద్గ్రాహ్యమ్,' 'సచపూజ్యో యథాహ్యహమ్' 'నకర్మణా నతపసా నజపైర్న సమాధిభిః' 'రజ్జుః కూపాద్ఘటం యథా,' 'పథవర్తిని తేషాయ మయథా తథా,' 'సుదూరమపి గంతవ్యమ్' మున్నగున వనేకము లిందుల కుదాహరణములు.

ఈ శతకమునఁ బండితారాధ్యులు చక్కని లోకోక్తుల నేకములను వాడియున్నాఁడు. 'పువ్వుల కతమున నారలు తలకెక్కునట్లు' 'పలమేఁడు ప్రత్తికైనను గులమమ్మడు వోవునట్లు' 'పిండకూడు పెట్టిన మెరయలక్రియ' 'పుట్టినని చచ్చిచానని పుట్టెడు పువ్వులవిధమున' 'ఓడునఁబోసిన జలంబు యుక్తి' 'పరిమళము లేని కుసుమము కరమొప్పని భంగి,' 'మసి కప్పడమునఁ బొదవిన యసదృశమాణిక్యమట్లు,' 'పసిడిగమ్మగ వలచిన విధమున' (బంగారు నఁకు దావి యబ్బినట్లు) మొదలగున వనేకములు విరాజిల్లుచున్నవి.

నన్నయ తరువాత మనకు బాగుగాఁ దెలిసినవాఁ డితఁడే యైనను నన్నయ కావ్యలక్షణములు వ్యాకరణానుసారమయిన సలక్షణ భాషాసంపద యీతని కృతిలో స్పష్టముగాఁ గానవచ్చుచున్నవి.

ఈతని గ్రంథమున నేఁడు కానరాని కొన్ని మాఱుమూల పదములును గలవు: పొనలు, మేలిల్లు, వలచు ( = పరిమళించు), నిరాణ (క. నిరాళ = స్వచ్ఛమైన.) వక్కండు, (కృశించు) బత్తళి (క. నగ్నత్వము) పలమేఁడు, కట్టడి, పినుగు, బడపండు (కు. సం. 7. 70.) అన్నఁడు, లోడుకొను, ముద్దటలు, పాదఱి (పాదలి), నూడుపట్టెలాడు, హావి, అఱిమెల్వడు, పాసవోరు, మసదిఁ, మొల్లమురిఱలు, బిలబిలినిష్ఠలు, మొదలగునవి.

వ్యాకరణమున, 'మను' ధాతువుపై మంత్రజేయేనిన్, అనాఁటికి అన్నఁడు అనురూపము, ఒక్కచోటనే దథప్రాస, (440.) 'కర్మ (కమన్) నిర్మా (నిమాఱ) తెమ్మల, ఇమ్మలతోడి ప్రాస, (317.) 'కర్మ (కమఱ) నిర్మల (నిమన్ల) తెమ్మల, నిర్మింతు (నిమిఱంతు.) (320.) 'నమ్మిన' 'ధర్మము (ధమన్ము) అనుప్రాస లున్నవి. ఇవి కర్ణాట సంప్రదాయానుసారము రావచ్చుననియు వీనినే 'వలపలగిలుక ప్రాస'మందు రనియు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణ రావుగారు వ్రాసియున్నారు.

పైఁజూపిన రీతిగాఁ బ్రథమమున జనించిన శివతత్త్వసార మను శతకము లక్షణయుక్తమై చక్కని నిర్దుష్టమైన శైలిలో శైవమత ప్రచారమునకై నిర్మింపఁబడినది. ఇది శతక వాఙ్మయమునఁ దొలి శతకమగుటే కాక నన్నయ తిక్కనల నడిమి కాలమున జనించిన యాంధ్ర కావ్యరత్నమనవచ్చును. ఈ శతకచ్ఛాయలే శైవశతకములకును ననుకరణ సాధనమై, మూలమై చిర స్థాయితఁ గాంచఁగల్గినవి. మకుటవిషయమునఁ బహుమకుటము లుండుటయు లభ్యమైన పద్యములు, నాలుగువందల యేనుబది తొమ్మిదుండుటయు దప్పించినచో నిది ప్రథమ శతకప్రసూనమని యానందింపవచ్చును. పిమ్మట, శతకలక్షణము పూర్ణముగాఁగల వృషాధిపశతకము నరయుదము. శైలీకాఠిన్యము, సంస్కృత భాషా ప్రయోగము, లధికముగాఁగల యీ శతకము పామర జనవ్యాప్తము కాలేదు. అందులకే ఈ శతకము పండితులకే యుద్దేశింపఁ బడినదన వచ్చును. శతకములు పామరజనోప యోగమునకే ఉద్దేశింపఁబడిన వను నపప్రథకు తావులేదు. ఇందులకీ ప్రథమ శతకమే ప్రమాణము.

## 2

గత ప్రకరణమునఁ గాంచిన శివతత్త్వసారమునకు సుమారు వెనువెంటనే బయలుదేరిన సంపూర్ణ శతకము వృషాధిప శతకము. ఇదియును శైవమత గ్రంథమే. బసవన్నచే స్థాపింపఁబడి మల్లికార్జున పండితారాధ్యులచే సంస్కరింపఁబడిన శైవమతమునకు మహోద్ధారకుఁడగు పాల్కురికి సోమనాథుఁడీ శతకకర్త. ఈతఁడును బండ్రెండవ శతాబ్దమునకుఁ జెందినవాఁడు. కాకతీయ రాజ్యమును బాలించిన మొదటి ప్రతాపరుద్రుని కాలమువాఁడు.

ఈతఁడు 'బసవపురాణాది బహుకృతుల్ చెప్పి,
వసుమతి వీరశైవముఁ బ్రతిష్ఠించి,
సకల మాహేశ ప్రసన్నతఁ గన్న,

వాఁడని పిడుపర్తి బసవన వ్రాసిన 'వీరశైవ దీక్షాబోధ'లో నున్నది. ఈతఁడు బసవపురాణము, సోమనాథ భాష్యము (సం.) అనుభవసారము, పండితారాధ్య చరిత్రము, చతుర్వేదసారము, వృషాధిప శతకము, చెన్నమల్లు సీసములు, రుద్రభాష్యము, బసవ రగడ మొదలగు ననేక గ్రంథములే కాక సోమేశ్వర శతకాదులు కర్ణాటభాషలో విరచించియున్నాఁడు.

ఈ సోమనాథుఁడు మహాభక్తుఁడై తన గురువగు బసవేశ్వరునే శివస్వరూపునిగా నెంచి "బసవేశ్వర తనయః, బసవేశ్వర గోత్రకః, అని చెప్పుటకు గర్వించి "బసవా! బసవా! బసవా! వృషాధిపా!" యను మకుటముతో నీ యుత్కృష్ట శతకమును వ్రాసియున్నాఁడు. (ప్రాచీన శతకములలో శివతత్త్వసారము పరిపూర్ణ శతకము కాదన్నచో నియ్యదియే ప్రథమ శతకమగును.) ఈతడు

"ధర నుమా మాతాపితా గురు వనఁగ
వర పురాణోక్తి శ్రీశ్వరకులజుఁడ."

నని చెప్పుకొన్న భక్తాగ్రేసరుఁడు; మఱియు, "గురుర్దేవో మహేశ్వరః" యనునది మన ప్రాచీన సంప్రదాయము.

ఈ వృషాధిప శతకమును వ్రాయుటకుఁగల కారణములు రెండని కవి యిట్లు తెలుపుచున్నాఁడు:

"నోరికి వచ్చినట్టు లొక నూఱువిధంబులఁ బ్రస్తుతింతు నే
నేరుతు నేరఁ బొమ్మనక..." యనున దొకటి.

"బసవఁడు ప్రీతిఁ గైకొనియె భక్తిమెయిన్ విరచించినాడు మున్
బసవపురాణమంచు ననుఁ బ్రస్తుతిచేయుదు రట్లుగాన నీ
యసమ దయాధురీణతకు సంకిలిపాటు ఘటిల్లకుండ..."

ననునది రెండ కారణము.

ఇందు భక్త్యావిష్టుఁడై కవి చేసిన బసవేశ్వర స్తోత్రము మొదటిభాగముగాను బసవేశ్వర భక్తవీర ప్రశంసలు ద్వితీయ భాగముగను మనము గ్రహింపవచ్చును. మొదటి డెబ్బది పద్యములును బసవేశ్వర సంబోధనపూర్వక పూర్ణస్తోత్రమును మిగిలినవి భక్తలీలా భక్త ప్రశంసాపూర్వకములును నున్నవి. ద్వితీయ భాగమున బసవఁడు 'అఱువత్తూరు మువ్వురు' కూర్మిబంటుగా వోడసుల సుతుఁడుగా తేరసుల భృత్యుఁడుగాఁ ద్రివిధముల స్తుతింపఁబడినాఁడు.

దీనిలో మొదటిభాగమున ప్రధానమకుటమే కాక దానికిఁ బూర్వము 'నీవె దిక్కు' 'శరణ్యమయ్య' 'నీవంగడమేఁ జుమయ్య' మున్నగునవి 'బసవా బసవా బసవా వృషాధిపా' యను మకుటము నకుఁ బూర్వమందున్నవి. ఇందు భగవంతుని భక్తిభావనచే 'మహోత్సుకత' 'దీనగతి' 'గౌరవలీలఁ' బ్రణుతించి యన్నివిధములచేతను 'సంతతము' బ్రార్థింతునని చెప్పుకొన్న భాగ మద్భుతభక్తి సమన్వితమై యున్నది.

"ఖ్యాత యశః ప్రపూరిత జగత్త్రితయాయ నమోనమో మహా
పాతక ఘాతకఘ్న పద పద్మయుగాయ నమోనమో సము
ద్ద్యోత వృషాయ తేయనుచు నుత్సుకతన్ బ్రణుతింతు..."

"ఆప్తగణ ప్రవిష్ట సకలార్తి హరాయ నమోనమో సుఖా
వాప్తికర స్మితాంచిత కటాక్షదయాయ నమోనమో సము
ద్దీప్త గుణాయ తే యనుచు దీనగతిన్ బ్రణుతింతు..."

"కల్పిత జంగలింగమ సుఖ స్ఫురణాయ నమోనమో యసం
కల్ప వికల్ప మార్గకథిత ప్రథితాయ నమోనమో గుణా
కల్పవరాయ తే యనుచు గౌరవలీల నుతింతు..."

"మార్జిత మన్మథాయ పరిశోభిత భస్మవిలేపనాయ సం
పూర్ణ మనోరథాయ గతపూర్వ భవాశ్రిత వర్తనాయ తే
వర్ణనిరాసకాయ సశివాయ నమోయని సంతతంబునిన్
వర్ణన చేయువాఁడు..."

మఱియు, నీతఁ డెనిమిది భాషలలో బసవని స్తుతించి తన యష్టభాషా పాండిత్యముతోఁ బాటు తనస్వభక్తిని వెల్లడిచేసినాడు.

"హృన్నలినే స్మరామి భవదీయ పదద్వితయం భవాటవ
స్విన్నతను శ్రమాపహ మశేషజగత్ప్రణుతం సదేశని
మ్నన్న దయానిధే..." యని సంస్కృతమునను,

"పరమనె రొన్నె యాండవనె పన్నగతానె యనాథనాథనే
పెరియవనే పుళిందవనె పేదుడయానె పిరావ యప్పనే
తిరిమురి యుయ్యో నే..." అని ద్రావిడభాషయందును,

"హసులెయ యెన్న రక్షిసువు దారయ చెన్న వనీత వెందు మ
న్నిసువుదు నిమ్మడిం గెరగు నిమ్మప్రసాదియె నిమ్మతొ త్తినే
కసిగలి...అని కన్నడభాషయందును,

"దేవవరా తుమ్హిద గురుదేవ మ్హణూను తిణ మ్హిచ గో
సావతురా తుమ్హిచ తుమసాచ ప్రసాద అమీ కృపాకరా."

అని ఆర్యభాషలోను,

"అనయముఁ జేతులందు భవదంఘ్రి సరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యను మాటల నిన్ వరివస్యరోమ్యహా
మ్మనుచు"

మణిప్రవాళమునను, అరుదుమణి ప్రవాళమునను, త్ర్యైయమణి ప్రవాళమునను, జానుతెనుంగునను, పెక్కుభాషలు కలిపి యొక్కపద్యమున స్తుతించి సోమనాథుఁడు తన యష్టభాషా వైదుష్యమును పరమేశ్వర స్తోత్రమునకై వినియోగించి ధన్యాత్ముఁడైనాఁడు.

పై ప్రకార మాతఁడు శివస్తోత్రలహరిలో నోలలాడి, ద్వితీయభాగమున శివభక్తుల లీలలను సంస్మరించినాఁడు. ఈతఁడు స్మరించిన శివభక్తులు వీరు: శివనాగయ్య, బిజ్జలుఁడు, ఫణిహారి, సంగయదేవుఁడు, మడివాలు మాచన్న, కిన్నరయ్య, కక్కయ్య చోడిలదేవర బాచిరాజు, వల్లభప్రభుఁడు, మాదర చెన్నలింగము, మోళిగమారయ్య, కలికేత బ్రహ్మయ్య, ముసిడిగ చౌడరాయఁడు, కన్నడ బ్రహ్మయ్య, సుంకర బంకిదేవుఁడు, తెగ్గు బొమ్మయ్య, చెన్న బసవన్న, సురియ చౌడయ్య, శృంగి బొప్పయ్య, మొఱటద వెంకదేవు, హాలినహళ్లి కల్లిదేవుఁడు, ఆరియమరాజు మొదలగువారు. వీరిలోఁ గొందఱకు శివుఁడు కూర్మిబంటుగను, కొందఱకు సుతుఁడుగను, మఱికొందఱకు భృత్యుఁడుగను గానవచ్చినట్లు విదితము చేసినాఁడు.

ఈ శతకమునఁ బాల్కురికి సోమనాథుని పాండిత్య వైదగ్ధ్యములు, అభిరుచులు, నధికముగాఁ గానవచ్చుచున్నవి. సోమనాథుఁడు సంగీత శాస్త్రపారంగతుఁడగుట బసవేశ్వరుని 'గానరస ప్రవీణునిగా' 'సముదంచిత నాదకళా కలాపునిగా' 'నాదకళావినోదునిగా' 'వినుత నవీనగాన గుణవిశ్రుత భక్తవిధేయ కాయు'గాఁ బ్రస్తుతించి యున్నాఁడు.

మఱియు, సోమనాథుఁడు జంగమలింగార్చనా విశారదుఁడగుట దన గురుదేవుని 'శ్రీ గురులింగమూర్తి'గా 'జంగమోత్తుంగు'గా 'జంగమ వితాన దయావిహితావగాహుని'గా 'జంగమ సమీహిత కారి గుణావకాశుని'గా 'శ్రిత జంగమ పాద కిరీట కూటుని'గా స్తోత్రము చేసియున్నాఁడు.

ఈతఁడు మహావిరాగ సంపన్నుఁడై యీశ్వరుని 'భవపాశ వితాన ముక్తుని' గను ఈ భవవ్యాధికి నీవె మం' దనియు 'భవాది రోగ సద్వైద్యుఁ'డనియుఁ బలువిధములఁ గొనియాడినాఁడు. విశిష్టాద్వైత సంప్రదాయానుసారము శివభక్తి కళత్రుని' గాను 'పరిరంభిత భక్తి కళత్ర గాత్రుని' గను—ప్రార్థించియున్నాఁడు.

సోమనాథుఁ డష్టభాషాకవి; అనేకోత్కృష్ట గ్రంథకర్త, కవితాచార్యుఁడు, యతీశ్వరుఁడు, శైవదేశికుఁడు, వేదవేదాంగ వేత్త, వేదభాష్యకారుఁడు, గొప్ప తార్కికుఁడు, మహావిరాగి, విజ్ఞానశాలియని పిడుపర్తి సోమనాథుఁ డన్న వాక్యములకెల్ల నీ శతకమున ప్రమాణములు కానవచ్చుచున్నవి.

సోమనాథుని శైలీరమ్యత ప్రశంసాతీతము. సంస్కృత పద భూయిష్ఠమైన యీతని కవితాలహరి గంగాప్రవాహ వేగాతి వేగ గమన వైఖరిఁగలది. ఈ కవితఁగల యోజోగుణ సంపత్తికి;

"విరచిత శుద్ధ సాళగ నవీన మృదుస్వర మంద్ర మధ్యతా
రరుచిర దేశిమార్గ మధుర స్వరగీత సుధాతరంగిణీ
తరల తరంగజాల సముదంచిత కేళివిలోల..."

"అసమశిలీముఖస్ఫుర దహంకృతి కర్తన కర్మ కర్మఠా
భ్యసన ధురీణ విభ్రమ గణాధిప పాదసరోజ సంతత
ప్రసృమర సౌరభోరు మకరందక సిక్త వనక్రియాకళా
వ్యసన..." మొదలగు పద్యము లుదాహరణములు.

ఇందు మొదటిభాగమునఁ గల పద్యము లించుమించన్నియు నంత్యప్రాస నియమము కలవి. ముక్తపదప్రాసములకు శబ్దాలంకారములకు నీ శతకము పుట్టినిల్లు, వృత్త్యనుప్రాసములు శబ్దావృత్తులు ననేకములు గలవు.

"గురుపద పద్మపద్మయ విశుంఠిత జంగమశీల ఖేల సు
స్థిర మృదు పాదమోద సముదీర్ణ విశేష మహత్త్వతత్త్వ ని
ర్భర భుజశౌర్య ధుర్య పరిరంభిత భక్తి కళత్రగాత్ర..."
"ఇహపరసిద్ధ సిద్ధ బసవేశ్వర ఈశ్వరభక్త భ[illegible]
ద్గహన విలోక లోకహిత కారణ కా[illegible] జన్మ జన్మదో,
షహరణ దక్ష దక్షరిపు సన్నిభ సన్నిభరూప రూప ని
ర్వహణ..."
"సురవర పూజ్య పూజ్య గుణశోభిత శోభితరూప రూ
పవి, స్ఫురతరశీల శీల గుణపుంగవ..." మొదలగున వనేకములు చూపవచ్చును.

సోమనాథుఁ డంతటి శైవమతోద్ధారకుఁడయ్యు శివవిష్ణు భేదము గలవాఁడనుట కొక్క పద్యముగలదు: ద్రౌపదీమానభంగము కాకుండ వలువలొసఁగి కాపాడిన శ్రీకృష్ణుని బసవస్వరూపునిగా స్తుతించినట్లే క్రింద పద్యము సాక్ష్యమిచ్చుచున్నది.

"వేఁడిన మిండజంగమము వెక్కసమందఁగఁ దత్సభాస్థలిన్
నాఁడట నారి వల్వొలువ నైజపుమానము దూలకుండఁగాఁ
బోఁడిమిఁ బట్టుపుట్టములు ప్రోవులుఁ బెట్టిన పుణ్యమూర్తి! నీ
వాఁడఁ జుమయ్య...

వృషాధిప శతకము మహాభక్తి సంభరితము. జాతి వివక్షతఁ ద్రోసివేసి సకలజీవులకు శివస్వరూపమును బోధించున దీతని నూతన శైవజాతివ్యవస్థ. ఈతడు శివుఁడు;

గోదావరీ తీరస్థ పట్టిసగ్రామాంతర్గత వీరభద్రస్వామిని సేవించుచు, గొంతకాలముండి శ్రీశైలయాత్రకు వెడలి తిరిగి వచ్చుచు, కృష్ణా తీరమున విశ్వామిత్రాశ్రమమనఁబడు సత్రశాల యను పుణ్యస్థలమున శ్రీ మల్లికేశ్వరస్వామిని సేవించుచు సర్వేశ్వర శతకమును విరచించెను.

ఈతని శతకావిర్భావావసరమున నొక యద్భుతగాథ ప్రచారమున నున్నది. ఇది యమానుషమని తీసివేయ నవసరము లేదు. మహాభక్తుల విషయమున నిట్టి వనేకములు నేఁడును గాననగుచున్నవి.

ఈతఁడు కృష్ణానదీతీరమునఁ గూరుచుండి యొక్కొక్క పద్యము నొకతాటియాకుపై వ్రాసి దానిని కృష్ణానదిలోఁ బడవైచువాఁడు. అది ప్రవాహమునకుఁ గొట్టుకొనిపోక ఎదురీదివచ్చెనా యది గ్రాహ్యమనియు, నట్లు రానిపక్షమునఁ దనశిరమునకు గండకత్తెర వైచుటకును నాతని నిర్ణయము. ఈ ప్రకార మాతఁడు విరచించిన యెనుబదియాఱు పద్యము లటులనే యెదురీదిరాఁగా, వాని నొకమాత్రమున గ్రుచ్చియుంచిన పిమ్మట నెనుబదియేఁడవ పద్యము :

"తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర మీపాద పయోజ పూజితములై యత్యద్భుతం బివ్విరుల్
కరులౌ నశ్వములౌ ననర్ఘమణులౌఁ గర్పూరమౌ హారమౌ
దరుణీ రత్నములౌఁ బటీరతరులౌఁ దథ్యంబు సర్వేశ్వరా."

అనునట్లురచించి ప్రవాహమున వేయనది యెదురీది రాలేదు. వెంటనే యాతఁడు శిరశ్ఛేదనమునకై గండకత్తెర వేసికొన నుంకించునంతలో నొక పసులకాపరి 'నాకొక తాటియాకు దొరికె నది చూడుఁ' డని యిచ్చి యదృశ్యుఁడయ్యెను. అందు నైపద్యమునకు బదులు :

"ఒక పుష్పంబు భవత్పద ద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోప చారముల నిన్నర్చించుచోఁ బెద్ద నై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుటఁ దాఁ జిత్రంబె సర్వేశ్వరా!"

అను పద్యముండుటఁజూచి సంతసించి యా రెండు పద్యములను గ్రంథమునఁజేర్చి మిగిలిన పద్యముల నన్నిటి నా ప్రకారమే ప్రవాహమున వైవ నవి యన్నియు నెదురీదిరాఁగా వాని నెల్లఁ దన గ్రంథమునఁ జేర్చి ముగింప నీ శతక పూర్తియైనది. తరువాతఁ గొంత కాలమున కాతఁ డా సత్రశాలయందే సిద్ధినందెను.

సర్వేశ్వరశతకము సద్భక్తి ప్రతిపాదమున నుత్తమమైనదగుటేకాక శతకపరిణతిలో వృత్తరచనా విన్యాసమున నోజోగుణాదులచే నుత్కృష్టకవితాపాటవమున నారితేఱినదై యున్నది. తన కాలమును నామమును దానే చెప్పకొన్న శతక కవులలో నీతఁడే ప్రథముఁడు.

ఈ శతకమున, పరమేశ్వర స్వరూప నిరూపణము, ఈశ్వరాజ్ఞా శక్తిప్రభావము, అర్చన జపతీర్థముల యంతరార్థము, సద్భక్తి సద్భక్తుల మాహాత్మ్యము, పరమేశ్వర భక్తసంబంధము, తత్త్వతత్త్వజ్ఞ నిర్ణయము, శివయోగానందము, చిత్తవశీకరణము, భక్తి సంస్కారఫలము, మొదలగు విషయములు చక్కఁగాఁ బ్రతిపాదింపఁబడినవి.

నిర్గుణుఁడు నిరాకారుఁడునగు నీశ్వరుని క[illegible]రూ వెలుఁగుట సాధ్యముకాదు.

"జలజాత ప్రభవాచ్యుతాదులు మదిం జర్చించి చర్చించి (నీ)
కలరూపారయ లేక చిక్కులు పడంగా..."

నితరులకు సమర్థతయేది? అపౌరుషేయములగు వేదములు సైతము :

"ఒకమాటీసకలంబు నీ మహిమగా నూహించుచున్ వెండియు
న్నొక్కక మాటెద్దియు నీవు గావనుచు నేయుక్తిం బ్రశంసింప నే, రక...
చిక్కువడ్డ వనినన్..."

ప్రవ్యక్తమైయుండు నిన్ను భావకుఁ డెవ్వఁడును గ్రహింపఁజాలఁడు. ఐనఁ బ్రయత్నించి చూతమన్నను నీశ్వరస్వరూపమగమ్యగోచరము. విశ్వేశ్వరునకు విశ్వప్రవృత్తియందు వైరుధ్యస్థితి గానవచ్చుచున్నది. అతఁడు సకలాధీశ్వర పట్టభద్రుఁడు. భిక్షాగామి, అత్యంతశాంత కళాత్ముఁడు: రౌద్రమూర్తి, అతిసౌందర్యాంబికా సంగమాధికలోలుఁడు : దివ్యయోగి. ఇట్టి ద్వంద్వములకాకరమైన యాతని స్వరూపముఁ దర్కింపఁ దొరఁకొనుట యజ్ఞానమే యైనను, యథాశక్తి భక్త్యావృత్తులతోఁ ద్రివిధములుగాఁ దోఁచు నీశ్వర స్వరూపానుసంధానము చక్కఁగాఁ జేయఁబడినది.

## పరమేశ్వరస్వరూప నిరూపణము

మొట్టమొదట పరమేశ్వరావ్యయరూప మిట్లు నిరూపితము :

"ఏపారంగ నజాండభాండ నికరం బేరూపులోఁ బుట్టి యు
ద్దీపించుఁ మఱి రూపులెల్ల సమసుప్తింబొంది యేరూపులో
లోపింపం గలయుంగ నంతటికిఁ దా లోనై విజృంభించి యే
రూపం బవ్యయమై వెలుంగు నది నీరూపంబు సర్వేశ్వరా!"

తరువాత, సర్వేశ్వరుని స్థూలసూక్ష్మరూపము లిట్లు వర్ణితములు :

"ఆకాశానల చంద్రసూర్య పవమానాత్మజ్ఞ విశ్వంభరా
ప్రాకామ్యాంచిత మూర్తిభేదముల నీ బ్రహ్మాండ నానాఘటా
నీకప్రాకట జీవభావ విలసన్నిర్మాణ కర్మాద్భుతా
స్తోక శ్రీకరమూర్తియై వెలుఁగు నీ స్థూలంబు సర్వేశ్వరా!"

అనియు,

"అతివాఙ్మానసమునై యజాండనిలయంబై యాదిమధ్యాంత వ
ర్జిత రూపాధిక నిష్కళంకపదమై సిద్ధాంతమధ్యాత్మ సం
యుతమై కోటిరవి ప్రకాశయుతమై యోంకారమంత్రాది సం
స్తుతమై యేచి యచింత్యమై వెలయు నీ సూక్ష్మంబు సర్వేశ్వరా!"

అనియు వివరింపఁబడినవి.

పిమ్మట, ఈశ్వరుఁడు త్రైగుణ్యశక్తిస్వరూపు డనియు భువనోత్పత్తి విధించుతరి బ్రహ్మస్వరూపమున, తత్ప్రభవమున మృడ

స్వరూపమునను, కల్పాంత సంక్షోభ నటనమున హరస్వరూపమునను వర్తించునని వర్ణించినాఁడు.

## ఈశ్వరాజ్ఞా శక్తిప్రభావము

ఈశ్వరాజ్ఞా శక్తియే పవన, హిమధామ, అనల, పానీయ, ఆత్మ, రవి, అంబర, మహీవలయము లనెడి యష్టాంగములను భువనంబులయందు త్రిదశ ణాంగములుగాఁ బుట్టించును. ఈ యాజ్ఞా శక్తియే పుణ్యపాపావళి కారణములుగా మర్త్యులను సురలుగను, సురలను మర్త్యులుగను, నల్పుని ఘనునిగా, ఘను నల్పునిగా గావించి యింద్రజాలము రీతి జీవులను లీలామాత్రముగా నాడించుచుండును. ఈ శక్తియే రాజరూపమున భూలోకమున దుష్టశిక్షణ, శిష్ట రక్షణలు గావించుచుండును.

## అర్చన జపతీర్థముల యంతరార్థము

ఈశ్వరార్చనకుఁ బ్రథమ పుష్పము సత్యము. ద్వితీయసుమము దయ, విశిష్టము నేకనిష్ఠా సమోత్సవసంపత్తియుఁ దృతీయ కుసుమము. పరమేశ్వరసేవ, తద్భక్తసేవ—ఇవియే జపతపములు:

భవదుఃఖార్ణవయానపాత్రముగాఁ బంచాక్షరీ మంత్రము గొని చిత్తశుద్ధితో జపింపవలెను. ఈ మంత్ర ప్రాశస్త్య మెట్టిదనగా:

"భవదీయానన పంచకంబు వలనం బంచాక్షరీ మంత్రము
ద్భవమై తత్పదవర్ణ పద్ధతుల శంభత్పంచభూతంబులు
ద్భవనంబై యఖిలంబుఁ బుట్టెను లనత్పంచాక్షరీ మంత్ర మీ
భువనాండంబులఁ దల్లియై మనుచు..."

సమస్తవేదములు శాస్త్రములు నీ పంచాక్షరీమంత్ర భాష్యములే యగును. ఈ పంచాక్షరియే ప్రణవాక్షరమగు నోంకారమైన విధ మిట్లు వర్ణింపబడినది:

"సంకీర్ణాక్షరలీలాక్షరత్రయము భాస్వన్నాద బిందుక్రమా
లంకార ద్వితయంబుతోఁ గలిసి లీలన్ దివ్యయోగీంద్ర హృ
త్పంకేరుహ భూతములందు రూఢమగుచున్ బంచాక్షరీ మంత్రమ
య్యోంకారాత్మకమా..."

కావున, జపమనఁగాఁ బంచాక్షరీ మంత్రజపమే.

## తీర్థము లనఁగా

"రమణన్ భక్తసమగ్ర దర్శనము తీర్థశ్రేణి, తద్గోష్ఠితీ
ర్థము తద్దివ్యదయావలోకనము తీర్థంబు..."

"...తత్త్వార్థ మూహింపఁ దీర్థము లందెల్లను దివ్యతీర్థము
భవద్భక్తుండు..."

వేయేల:

"పలుతీర్థంబులఁ ద్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్
తల మీఁదం జలికించుకోఁ దగును దీర్ఘం బాడ భారంబు త
త్ఫల మత్యల్పము భక్తపాద యుగళాంభస్స్పర్శ నిర్భారమై
యలరున్ శాశ్వత భుక్తిముక్తి నిలయంబై..."

అని తీర్థసేవ యంతరార్థము భక్తసేవయే యని ఘోషింపఁబడినది.

## సద్భక్తి సద్భక్తుల మహత్త్వము.

సద్భక్తి యనంత మహత్త్వము కలది. అది మానవుని శెంచుటలోఁ దల్లియు, రుజాపటల దుష్పీడావిధిక్షోభ వారింప వైద్యుఁడును, కుమారక్రీడఁ జొచ్చుతఱి రక్షింపఁ దండ్రియు సంపద్వృద్ధి యొసంగుటలో దాతయు నగును. అరిపీర ప్రకరమును, మహాశోక మృగములను, సంసార వికార వేదనలను, వజ్రపంజరమై రక్షించును. సూర్యోదయముతోఁ జీకట్లు మాయమగువట్లు సద్భక్తి భావోదయముతో సమస్త మాయాపటలమును విచ్ఛిన్నమగును. అందుచేతనే భక్తియోగప్రాశస్త్య మిట్లుగ్గడింపఁబడినది.

"అరయం గర్మవిధాన దానవిధివద్ధ్యానోత్తమ జ్ఞానముల్
వరుసం జేర్కొన నాల్గుయోగములు తత్త్వంబెందు నీభక్తి వి
స్తర భావ్యక్రియలెల్లఁ బొల్లులగుటన్ దద్భక్తియోగంబులోఁ
బరఁగం దక్కిన మూఁడు యోగములకుం బ్రాణంబు..."

ఈ సద్భక్తిభావమునకు బలవ ... : బలహీనుఁడు, ప్రౌఢుఁడు: మూఢుఁడు; కులజుఁడు; నీచుఁడు అను భేదములు లేవు.

'ఒక పుష్పంబు భవత్పద ద్వయముపై నొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదు.'

ఇట్టి సద్భక్తుఁడు జలధులు మేరల నాక్రమించి పొంగినను గదలఁడు. జలజాతప్రియ శీతభానులు సంచారములు తప్పినను చొప్పు తప్పఁడు. అచలభక్తుఁడు పైకొనివచ్చు కర్మముల వారించి మాయామల జ్వరములు గూల్చి సంసారాబ్ధి లంఘించి పరమవ్యోమమును జేరును.

సద్భక్తుల మహిమ వర్ణనాతీతము. వారికి దయకలిగినచో రౌరవ పదగ్రస్తాత్ముని దేవేంద్రునిఁ జేయఁగలరు. వారికి కోపమే గల్గినచో దేవేంద్రుడైనను రౌరవోత్కర పంక ప్రవిలీన కీటముగాఁ గల్పింపఁగలరు. సద్భక్తుఁ డింద్రుని చతురాస్య క్రమాయుష్కుఁడే కదా క్షితిపాలుఁడనియు, నజునాకాద్వయము వాఁడేకదా యమరేంద్రుఁడనియు, విష్ణున్న మోహము వాఁడేకదా బ్రహ్మయనియు వారందఱుఁ ద్రోసిరాజని యీశ్వర సాలోక్య సామీప్యస్థితి నందఁగలఁడు. అతఁడు భ్రమర కీటన్యాయమున పరమవ్యోమ తత్త్వమున నవ్యయ లీలనుండును. అమరేంద్రాచ్యుతాదుల కీశ్వరాజ్ఞ యనుల్లంఘనీయము. ఈశ్వరునకు భక్తునాజ్ఞ దాఁటరానిది. కనుక వీ రందఱికన్న భక్తుఁడే మిన్న. ఒక్కమాటలో:

"శివసాహిత్యుల సత్కరస్థలము కాశీక్షేత్ర మాహాత్మ్యదే,
శివిశాలోన్నత శాఖ లారయఁగఁ బంచక్రోశ మాపాణిసం
భవశోభాన్విత చిత్రరేఖలు మహాభాగీరథీ తీర్థముల్."

## భక్త భగవత్సంబంధము

భక్తునకు భగవంతునకు భేదములేదు. భక్తుల హృదయము భగవంతునిదే. అగుటచే భక్తు నెంతటి శక్తివంతు లప్రతిపక్షులు హింసింపఁజూచినను ఈశ్వరుఁడు వారలఁ జంపి భక్తుని రక్షించును.

శ్వేతమునీంద్రుఁ జంపఁ గినాశుఁ డేతెంచి యీశ్వర క్రోధానలమున కాహుతి యగుటయు దధీచి శ్రీకృష్ణుని చక్రమును దుత్తుమురుచేసి యుప్పొంగుటయు నిందుల కుదాహరణములు. భక్తుఁడున్న చోటఁ భగవంతుఁ డెప్పుడునుండును; ఈశ్వరధ్యాన చిన్మూర్తులై సన్మునులెల్ల నచ్చోటనే యుందురు; మంత్రాంగాతురయుతములై సర్వతీర్థములు నచ్చటనే యుండును. మఱియు, భక్తుల కెల్ల నీతఁడే హృదయ మగుట వారిసౌఖ్య మాతనిసౌఖ్యము వారి కూర్మి యాతనికూర్మి, వారికోప మాతని రౌద్రప్రభావము, వారల వాక్యనిర్ణయ మాతని వాక్యనిర్ణయము. ఆభక్తులప నాతనిపై స్థిరభక్తి లబ్ధియు నాతనిభక్తులతోడి గోష్ఠీ మహోత్సవ లీలావిభవము, నాతని యనుదిన ధ్యానానుమోదములు నిత్యస్థితులు. వారికి శ్రీవత్సాంకుర మావిశేషత, వాక్ప్రినాథుచాతుర్యము, దేవాధీశ్వరువైభవాతిశయము; తిగ్మాంశుతేజము శ్రీదేవీనందను రూప విభ్రమమును దృణప్రాయములు.

## తత్త్వ తత్త్వజ్ఞ నిరూపణము

ఈశ్వరార్చనము, సద్భక్త పుంగవగోష్ఠీవిభవము, విమలనూత్మ ధ్యానయోగము నివియే సంపూర్ణసుఖములనియు వీనికి స్వర్గోకాధికత్య సుఖ మెందును నీడుగా దనియు గ్రహించుటే తత్త్వము. ఈ తత్త్వమెఱిఁగినవాఁడే తత్త్వజ్ఞుఁడు.

## శివయోగానందము

చంచలస్వభావము గల దశప్రభంజనముల శిక్షించి సుషుమ్నను జేర్చి సూర్యచంద్రులఁ గట్టి మనస్సదనమున నీశ్వరు సుస్థితుఁ జేసినఁ గల్గు శివయోగానంద మద్వితీయము అనుపమము. ఆశివ యోగి లోపల, బయటఁ గలవైనను శివస్వప్న మే కాంచును.

## చిత్త వశీకరణోద్యోగము

పరమేశ్వరునకుఁ జిత్తము వశీకృతము చేయుట:

“అమితోత్సాహము నంది నీకుఁ దన సర్వార్థంబులుం గూర్చి నేమములో నిచ్చుటకంటె శౌర్యగుణ సామర్థ్యంబునం జేసి ప్రాణము నీకిచ్చుటకంటె దుస్తరభవోన్మాదంబు మర్దించి చిత్తము నీకిచ్చుట పెక్కు భంగుల మహౌదార్యంబు...”

“ఘనవైరి ప్రకరంబుఁ దాఁకి యనిలోఁ ఖండించుకంటెన్ మృగేంద్రునిఁ జేపట్టుటకంటె దిగ్గజముతోఁ ద్రోపాడుకంటెన్ మహాశనిఁ దావేయుటకంటె ఘోరభవదుశ్చారిత్ర వారించి రంజనతోఁ జిత్తము శిక్ష సేయుట మహాశౌర్యంబు...”

అట్టివానికి!

“దివిజేంద్రత్వముఁ బద్మజత్వము జగత్సేవ్యస్థిరానర్ఘలో
త్పవరూపం బగు కేశవత్వమును నీసద్భక్తి సంవృద్ధిలో
లవ మాత్ర స్థితులు......”

## భక్తి సంస్కారఫలము

భక్తి సంస్కారము కల మహాత్ముఁడు ‘విదితోద్దండ ప్రతాపోత్కటుస్ఫుటకోపానలమూర్తియై యముఁడు కాంపోకుండఁ గాచుకొనఁ గలఁడు. ఆతఁడు దారసమన్వితుఁడైనను గందర్పుని మిగుల నీఁడు, మోహాంబుఁ జైకొనఁడు', రాజ్యవైభవము కల్గినను గర్వింపఁడు.

ఈశతకమునందుఁ దత్కర్త సద్భక్తపుంగవుఁడుగా, మహా విరాగ సంపన్నుఁడుగా, యోగీంద్రుఁడుగా, మహాకవిగాఁ గాన నగుచున్నాఁడు. ఈతఁడు వైరాగ్యబోధఁ గావించుచు:

“కాయం బన్నది వారి బుద్బుద సదృక్షం బందు రూపింప లే
ప్రాయం బన్నది శారదాంబుద తటిత్ప్రఖ్యం బగుం దత్సుఖ
శ్రేయం బన్నది మాయ...”

యని యద్భుతముగాఁ దెలిపినాఁడు. ఈతని ప్రౌఢవర్ణనలు శివయోగిని వర్ణించుటలోను, భ్రమరకీటన్యాయము, శివనామాంకము మొదలగు విషయబోధనములం దద్భుతముగా నొప్పినవి. ఈ శతకమందెల్లఁ బ్రౌఢవర్ణనములతో, నపూర్వ సాదృశ్యములతో భక్తిపూరిత హృదయముతోఁ గవి ప్రతిభావ్యుత్పత్తులు వెల్లడియగుచున్నవి. ప్రతి పద్యమునందును నచంచల భగవద్భక్తి, యపూర్వాధ్యాత్మిక విజ్ఞానము, నద్భుత కల్పనములు వెల్లివిరియుచున్నవి.

“అనురాగంబున నిన్ను జూచు దలపోయుం జొక్కు గాంక్షించు వర్ణన సేయం దమకించు సిగ్గువిరియుం బ్రార్థించు శోషించు నంత నిదిధ్యాసముఁ దాల్చుఁ దన్ను మఱచున్...అను చోటను,

“సికతాధామముచ్చేసి నీకు మదిలోఁ జెన్నొంది క్రీడించు బా,
లకు లింద్రాదికు” లనుటయు,

“సతి వేడ్కం దన ప్రాణవల్ల
భునితో సంయోగ మర్థించుఁగా కతనిం బ్రార్థనచేసి సౌఖ్యముఁ
గొనిపో నట్లాడు నే...” యనియు నన్నచోటులను,

పంచేంద్రియోద్వృత్తమైన చిత్తమునకు నీఁగకును, భవపంకనిమగ్నమైన విలాసమునకు జీవికి, ఈశ్వరదివ్య శృంగారధ్యానమున జిక్కిన చిత్తమునకు మహీయ జ్యోత్స్నానందమునందు చకోరపోతమునకు, ననలోత్పాదమున కాధారమైన కాష్ఠములు ననలము గాల్చుటను, దేహసత్కర్మమథనము చేఁ గలిగి రెండింటిని దెఱచు సర్వేశ్వరభక్తి వహ్నిగాను, బోల్చిన పోలిక లద్భుతములు.

వృత్తరచనా విన్యాసమున నీకవి హస్త మారితేఱిన దనుటకు బూర్వోదాహృత పద్యములే సాక్షీభూతములు. ఈతని కవిత్వ మోజో ప్రసాద గుణసంభరిత మనుటకు వరుసగా రెం డుదాహరణములు చూచినఁ జాలును. ఓజో గుణమునకు:

“ఉరుసంసార గజేంద్ర దర్పదళనవ్యాఘ్ర ప్రతాపోగ్ర కే
సరి దుష్పాపశరీరబంధ విపులక్ష్మాజ వ్రజచ్ఛేద వి
స్ఫురిత క్రూరకుఠార ధారదురిత ప్రోద్భూత జీమూత దు
స్తర సంఘాత విఘాత మారుతము నీ సద్భక్తి సర్వేశ్వరా.”

ప్రసాదమునకు:

“ఎచ్చో నీ పదభక్తుఁడుండు మది నింపెక్కం బ్రయత్నంబుతో
నచ్చో నీ వనిశంబు నుండుదు త్వదీయధ్యాన చిన్మూర్తులై
యచ్చో సన్మును లెల్ల నుండుదురు మంత్రాంగాతురాయుక్తులై
నచ్చోఁ దీర్థము లెల్లనుండు నిది వేదార్థంబు సర్వేశ్వరా!”

భాషాశుద్ధికి గ్రంథమంతయు నుదాహరణములుగా నీయ వచ్చును:

ఈతని ప్రతి పద్యమును భాషామాతకొక నూతనాలంకారమే యగు:

మొత్తముమీఁదఁ గవి చెప్పికొన్న ట్లీతని శతకము భక్త జనానురంజకముగాఁ జిత్రార్థాంచిత శబ్దబంధురముగా, సేవ్యమై సజ్జనశ్రోత్రానంద కరంబుగా, శుభాంచితమై యున్నదనుటలో నతిశయోక్తి యావంతయు లేదు. శతకములలో నిది తృతీయమే యైనను, ప్రౌఢిమలో, భావములో, భాషా సౌందర్యములో నుత్తమోత్తమమైనది.

## 4

పదుమూడవ శతాబ్దిలో వెలువడిన శతకములలో నొక్క సర్వేశ్వర శతకమే మనకుఁ బూర్ణముగా లభ్యమయినది. దాని పరిశీలనముతో నా శతాబ్దము పూర్తియైన దనవచ్చును. కాని, పదుమూఁడవ శతాబ్దాంతమున (క్రీ. శ. 1270) విశ్వేశ్వర శివదేశికు లనబడు శివదేవ మంత్రి యొక్క శతకమును విరచించినట్లు మనకు, కొన్ని యాధారములు లభించుచున్నవి. ఈ శతక మింతవఱకు నెవ్వరికిని లభ్యము కాలేదు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు త్రిపురాంతకోదాహరణ పీఠికలో నీ క్రిందిపద్యము శివదేవయ్య శతకములోనిదని యుదాహరించిరి.

"అరయఁగఁ బిన్ననాఁట సిరియాలుఁడనై యెలఁ బ్రాయమందు సుం
దరుఁడను నంబియై పదను దప్పిన గుండయగారి చందమై
ధరఁ జరియింపఁ గల్గినఁ దథాస్తు వృథాపరిపాక రూప దు
ష్కర జననం బిదేమిటికిఁ గాలుప నే శివదేవధీమణీ."

ఇంతకుమించి మఱియొక యాధారమేమియును లేదు. ఈ శతకము శివదేవయ్య పై నితరులు రచించినదో శివదేవయ్యయే తన నామముకుటముతో విరచించెనో తెలియదు.

విశ్వేశ్వర దేశికులు వేదవేదాంగముల నెఱిఁగిన మహాజ్ఞాని యనియు శైవమతవ్యాప్తిలో పండితారాధ్యుని తరువాత నీతఁ డంతటివాఁడై సుప్రసిద్ధి గాంచెననియు, కాకతి గణపతిదేవ చక్రవర్తికి మంత్రియై ప్రజారంజకముగ నుండి 'అనుభవసార' మను నుత్కృష్ట గ్రంథమును రచించెననియు కీ. శే. చిలుకూరి వీరభద్ర రావుగారు వ్రాసియున్నారు. గ్రంథము లభింపనిదే గ్రంథ కర్తృ నిర్ణయము హాస్యాస్పదమే యగును.

అందుచేఁ బై ప్రకరణమున బద్దెనకాలమునకుఁ దరువాత జనించియుండునని యూహింపఁబడిన సుమతిశతకమును గూర్చి పరిశీలింతము. ఏతత్పరిశీలనకుఁ బూర్వము పండ్రెండు పదుమూడు శతాబ్దములలో జనించి మనకు లభ్యమైన శతక విమర్శనము ననుసరించి యేతద్విషయ మొకసారి సింహావలోకనము గావింతము.

ఆంధ్ర సారస్వతమునఁ బ్రాఙ్నన్నయార్యయుగమున జన్మించిన కావ్యవిషయములు స్పష్టముగాఁ గానరానట్లే శతక వాఙ్మయమునఁగూడ మల్లికార్జున పండితారాధ్యులకుఁ బూర్వమున శతక వాఙ్మయవిషయ మింతవఱకు గోచరము కాలేదు. నన్నయయే యొక శతకమును వ్రాసియుండెననియు, సాంధ్ర భారతాదిపర్వమునఁ జాప్యమహాదేవి కుండలములు గొనితెచ్చుట కేఁగి యుదంకుఁడు చేసిన యాదిశేష స్తవము శతకరూపమున నున్నదనియు నన్నమాటలకు విశ్వాసము, విలువ, యెంతయున్నను జారిత్రకముగా నాధారము లేనపుడవి యంతగా నుపకరింపవు. కావున, మల్లికార్జున పండితారాధ్యులే శతకవాఙ్మయ బ్రహ్మగా నంగీకరింపవచ్చును.

పిమ్మట, శైవమత ప్రచారమునకై శైవకవులు మొదట శతక వాఙ్మయము నాధారముగాఁ జేసికొనినట్లు కానవచ్చుచున్నది. బౌద్ధ జైన మతవ్యాప్తికై ప్రాకృతములో బౌద్ధులును, జైనులును శతకములు వ్రాయుట నెఱిఁగి మతవ్యాప్తికి కావ్యరూపముకన్న శతకరూపమే యెక్కువ ప్రయోజనకారిగా నుండునని యెంచి కాఁబోలును శైవకవులును శతకవాఙ్మయమును ఆంధ్రమున సృష్టించిరి. వారి యుద్దేశమేదియైనను, మహానుభావులగు వారి మూలమున మనకొక మహోన్నతవాఙ్మయము లభించినందులకు ప్రథమమున మన మా శైవకవులకు వందన సహస్రము లర్పింతము:

ఆ శైవకవి పుంగవులనుండి వెలువడినవానిలో మొదటిదగు శివతత్త్వసారము, వేమన, భర్తృహరి మొదలగు శతకములవలె నూఱు పద్యములకన్న నధికముగాఁ గలిగినంతమాత్రమున శతకత్వమును గోల్పోవఁ జాలదు. మకుట విషయమునను 'శివా' యను మకుటము గల పద్యములు నూటనలుబదికి మించియున్నవి, మిగిలినవి కొన్ని 'అజా' 'రుద్రా' మొదలగు మకుటములతో నున్నవి. సమగ్రముగా గ్రంథము లభింపనపు డేమియుఁ జెప్పఁజాలము. వివిధ మకుటముల క్రింద నొక యుద్దిష్ట సంఖ్యగల పద్యములు రచియించియుండ వచ్చును. అందుచే దానిని 'శివతత్త్వసార' మను 'శివశతక' మన వచ్చును.

శతకవాఙ్మయారంభమున వెలువడిన శతకత్రయము ఉత్తమోత్తమ పండితాఖండలులచే విరచింపఁ బడియుండుట గొప్ప విశేషము. ఈ శతకత్రయకర్తలు మువ్వురును త్రిమూర్తులే. వారి పాండితీగరిమ, భక్తిజ్ఞానవైరాగ్యసమృద్ధి, ఆచరణపూర్వకమైన బోధనాపటిమ బోధ్యవిషయమందలి సత్యసంధత నిరుపమానములు, నిత్యనూతనములు. అందును మొదటిశతకమునఁ గల మతావేశము, పరమతదూషణము, ద్వితీయశతకమున లేదు. తృతీయ శతకమున నంతకును క్షీణించి యుత్తమ భక్తిమార్గమును వ్యక్తము చేయుచు కవితాపాటవమున నారితేఱి యుత్తమ కావ్యముగా మారినది. అందుచే శైవకవులు శతకవాఙ్మయ బ్రహ్మలు, శతకవాఙ్మయాభివృద్ధి భిక్షాప్రదాతలు; చిరస్మరణీయులు!

# దొంగలున్నారు! జాగ్రత్త!

★

శ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

రైలుబండి అర్ధరాత్రి కారుచీకటిలోంచి, కారడవిలోంచి వెళుతూంది. శేషయ్యగారు ప్రయాణం చేస్తున్న ఇంటరు క్లాసు పెట్టె చాల చిన్నది. పెట్టెలో రెండోమనిషి లేడు. మీదనున్న రెండు లైట్లలోనూ ఒకటి వెలగడంలేదు. రెండవది కూడా కాంతివంతంగా లేదు. కిటికీలన్నీ వేసి శేషయ్యగారు బెంచీమీద నడుం వాల్చేరు.

ఎదురుగుండా గోడమీద "దొంగలున్నారు జాగ్రత్త!" అని చదివేరు. ఆయన గుండె దడదడ కొట్టుకుంది. ఎవరేనా దొంగలున్నారేమో అని చుట్టూ ఒకసారి చూసి మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నారు. రైలువాళ్లకి సరిగా తెలుగుభాష రాదు. "దొంగలున్నారు జాగ్రత్త" అని వ్రాసుకుంటారా, ఎవరేనా? "దొంగలుంటారు" లేదా "దొంగ లుండగలరు" అని వ్రాసుకోవాలిగాని. శేషయ్యగారు తనలో తనే నవ్వుకున్నారు.

ఈసారి తను వచ్చినపని జయప్రదమైంది. కలపకొనడంలో గొప్ప వ్యవహారజ్ఞానం వుపయోగించి బేరంలో రెండువేల రూపాయలు మిగిల్చేడు. రాయిపూరు వెళ్ళి యీ సంగతి తన భార్యతో చెబితే ఎంతో సంతోషిస్తుంది. అవును మరి, దానికోసం, దాని పిల్లలకోసమేకదా యీ ఆర్జన అంతాను.

గాలి వూపుకి కిటికీ అద్దం "టఫీ"మని పడిపోయింది. పరధ్యాన్నంగావున్న శేషయ్యగారు ఒక్కసారి తృళ్ళిపడ్డారు. లేచి కూర్చుని కిటికీలోంచి చీకట్లోకి చూసి మళ్లీ కిటికీ మూసివేశారు. తన వొంటరితనం స్ఫురణకు రాగానే ఆయన కొక్కసారి భయంవేసింది. తన మొలలో రెండువేలరూపాయ లున్నాయి. ఇప్పు డెవడేనావచ్చి యీ డబ్బుకోసం తన్నిక్కడ చంపితే తన పెళ్లాం పిల్లల గతేమవుతుంది? ఆయన గుండెలు దడదడ కొట్టుకున్నాయి.

అయితే దొంగకు తనవద్ద రెండువేలున్నాయని ఎలా తెలుస్తుంది? రెండువేలేమిటి? యింకా ఎక్కువే వుండవచ్చునని వాడు అనుమానించడానికి అవకాశాలున్నాయి. తన జరీకండువా, చేతికి బంగారు వాచీగొలుసు, వేళ్లకు జిగజిగమెరిసే వుంగరం—ఇవి వాడి దృష్టి నాకర్షిస్తాయి. ఇవి తనకెంతో ప్రియమైన వస్తువులు; కాని తనకు ప్రమాదాన్ని తెచ్చిపెడతాయి. ఈ వస్తువులకోసం డబ్బుకోసం వాడు తన్ను కత్తితో పొడిచి చంపవచ్చును. ఆయన కండువాతీసి మడతపెట్టి తలగడక్రింద పెట్టేరు; వాచీగొలుసూ, వుంగరాలు చేతి రుమాలులోకట్టి లాల్చీ పక్కజేబులో వేసుకున్నారు.

అయితే దగ్గర డబ్బున్నంతవరకూ దొంగభయం పోదు. "దొంగలున్నారు జాగ్రత్త!" అని ఎదురుగుండా వ్రాసివున్న వాక్యం ఎంత తప్పించుకుందామన్నా కళ్లబడుతూనే వుంది శేషయ్యగారికి. ఆయనకు మళ్ళీ భయంవేసింది. తన కిప్పుడేమిటి దారి? వచ్చేస్టేషనులో పోలీసులకు రిపోర్టుచేస్తే! అబ్బే, వాళ్లెక్కడ! అనవసరంగా భయపడుతున్నావు పొమ్మంటారు. డబ్బుతో, విలువైన వస్తువలతో ప్రయాణం చేస్తున్న ప్రతివాడికీ రక్షణ యివ్వడానికి దేశంలోవున్న పోలీసులు చాలరని తోసిపారేస్తారు. అబ్బే, పోలీసువాళ్ళ సంఖ్య పెంచితేగాని భద్రత లేదు అనుకున్నారు శేషయ్యగారు.

శేషయ్యగారికి నిద్రపట్టడం లేదు. లేచికూర్చుని చుట్ట వెలిగించారు.

రైలుబండి ఒక చిన్న అడివిస్టేషనులో ఆగింది. అబ్బ బయట ఏమి చీకటిగావుందీ అనుకున్నారు శేషయ్యగారు. మళ్ళీ బండి బయలుదేరేసమయంలో పెట్టెతలుపు తోసుకుని లోపలికెవడో వచ్చాడు. బండి కదిలింది.

"ఒరే. దిగుదిగు, యీ పెట్టికాదు, ఇది పరుపులపెట్టి. దిగు! పో!" అని కేకలేశారు శేషయ్యగారు.

"అదేటి బాబయ్యా దిగమంటారు, బండికదిలిపోతేను, చావమంటారేటి, మంచోరే!" అని జాపోసుకుంటూ వాడు నేలమీద చతికిలబడ్డాడు.

"ఎవరు నువ్వు?" అని ప్రశ్నించేరు శేషయ్యగారు.

"ఎంకణ్ణి బాబు" అని జవాబిచ్చాడు వెంకడు.

వెంకడుట! వెధవ! జార్జిరాజులా వెంకడంటే లోకమందరికీ తెలిసినట్టు! శేషయ్యగారికి కోపం, చిరాకూ వచ్చాయి. అసలు ఆవెధవ వాలకం చూస్తూంటే టిక్కట్టులేనికకంలా కనిపించింది.

---

* ఈ సంవత్సరము ప్రపంచ కథానికల పోటీకి పంపించిన తెనుగు కథ.

తివాసీగుండూ, మొహంమీద కానీ అంత మచ్చ, నల్లగా జీడి పిక్కలా వున్నాడు. వస్తాదులా మెడలో చిన్న ఆంజనేయుడి బిళ్ల, జబ్బకి తావేజూ కట్టేడు. చిరిగిన బనీనూ, నిక్కరూ, కాళ్ళకి చిరిగిన కేన్వాసుజోళ్లూ వాడూ వొట్టి బికారి వెధవలా కనిపిస్తున్నాడు. నేలకూర్చుని బీడీ వెలిగించేడు. ఏం నిర్లక్ష్యం! దొంగవెధవ! అనుకున్నారు శేషయ్యగారు. వీడు నిజంగా దొంగేమోనని ఆయనకు అనుమానం కలిగింది. మరొక స్టేషను వచ్చేవరకూ వాడితో మెల్లిగా మంచిమాటల్తో కాలం గడపాలి. లేకపోతే యిలాంటివెధవలు ఎంతపాపానికైనా వొడిగడతారు అనుకున్నారు శేషయ్యగారు.

వాడు నేలమీద కూర్చుని బీడీలు కాలుస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. తరవాత మెల్లిగా జేబులోంచి డబ్బులుతీసి, లెక్కపెటి, మళ్ళీ జేబులో వేసుకున్నాడు. బీడీ చివరివరకూ కాల్చి, కిటికీలోంచి బయటికి పారేసి, 'తుబుక్కున' వుమ్మేడు.

"ఇప్పుడు టైమెంతవుతాదిబాబు" అన్నాడు శేషయ్యగారి వేపు తిరిగి.

ఏదో మహారాచకార్యాలు చక్కబెట్టేవాడిలాగ యీ వెధవకిప్పుడు టైమెందుకో? నిద్దరొస్తే పడుకోరాదూ, అనుకుని "పది గంటలైందిరా." అన్నారు శేషయ్యగారు పన్నెండుగంటలైందని చెప్పడాని కిష్టంలేక.

వాడేమీ మాట్లాడలేదు. తన పాతకేన్వాసుజోడు విప్పి, బండెక్కుతూన్నప్పుడు కొత్తగా చిరిగిన చిరుగును పరీక్షించి, మళ్ళీ తొడుక్కుని, బల్లకు చేరబడి, కాళ్ళు చాచుకుని, "సెలియా కనరావా!" అని యీలపాట ఎత్తుకున్నాడు. ఛీ! వొట్టి పోకిరీ వెధవ!

"ఏవూరురా నీది?" అన్నారు శేషయ్యగారు.

"ఇజానగరంబాబు"

"ఎంతవరకు వెళుతున్నావ్?"

"రాయిపూరు"

"ఎందుకూ?"

"అక్కడ పనులు దొరుకుతాయని సెప్పేనాగ బాబు."

"ఎవరు చెప్పేరు?"

"ఎవరేటి, సాలమందంటారుబాబూ. అయినా ఎల్లినాక ఏదేనా దొరకదేటి?"

"టిక్కెట్టు కొన్నావా?"

"లేదుబాబు, రోజూ రైల్లో తిరిగేవాడికి టిక్కెటేటి?"

"రోజూ ఎందుకు తిరుగుతావు? అసలు నువ్వేంపని చేస్తూ వుంటావు?"

"పనేటిబాబు, బిచ్చమెత్తుకుంటాను, అంతే."

"ఏం, రాయిలా వున్నావుగదా, ముష్టెత్తుకోడమేం? కూలి పని చేసుకోరాదూ" అన్నారు శేషయ్యగారు. ఆయనికి ముష్టి వాళ్ళంటే అసహ్యం. కాని అంతమాత్రచేత ఆయనకి ధర్మచింత లేదనడానికి వీలులేదు. ఆయ నప్పుడప్పుడు ఖైరాతీ సంతర్పణ చేయిస్తూ వుంటారు. ప్రేమ సమాజపోషకవర్గంలో సభ్యులు కూడాను. కాని దుక్కలా వున్నవాళ్ళు కూలి చేసుకోవాలని ఆయన వాదన.

"దొరికితే ఎందుకు సేసుకోంబాబూ? దొరికినప్పుడు కూలి సేసుకుంటాం. లేనప్పుడు బిచ్చమెత్తుకుంటాం" అన్నాడు వెంకడు.

"అసలు నువ్వు దుక్కలాగున్నావ్. నీకు ముష్టెవరు వేస్తారు?"

"అదే బాబు గొప్ప సిక్కొచ్చిపడింది. గుడ్డీ కుంటీ అయితే నాలుగు డబ్బులు దొరుకుతాయి. కాని బాబూ నేను మాత్రమేం తక్కువవాణ్ణేటి? అబ్బో! నేనసలే టక్కరియుండాకొడుకుని. నాలిక అంగుట్లోకి బిగబట్టేసి, మూగోడిలాగ ఏసమేసేస్తాను," అని వెంకడు తన ప్రయోజకత్వానికి తనలో తనే మెచ్చుకున్నట్లు చిరునవ్వు నవ్వేడు.

"ఈరోజుల్లో వండుకునే వాడికంటె దండుకునేవాడి పనే బాగుందిరా. రోజల్లా కూలిపనిచేస్తే రూపాయి డబ్బులు దొరకడం కష్టమవుతుంది. ఇలా అయితే కష్టపడకుండా రోజుకి రెండూ మూడూ దొరుకుతాయి. ఏం?"

"అబ్బో, అంతపాటైతే యింకేం! రాజుగారి కోట నాటి దొకటి కట్టించేద్దును. ముష్టెత్తుకుంటేమాత్రం ఏటి దొరుకుతాది బాబయ్యా? ఒకడా, ఇద్దరా? సూడండి బాబూ గుడ్డీ కుంటీఅంతా కలుపుకుని యీబండికి పాతికమందుంటారు ఎదవలు. ఇంతమందిలో ఏటి దొరుకుతాది బాబూ? ఏదో పావలా, అర్థా...అలాగే...... ఒక్కొక్కపూట అదీ దొరకదు" అన్నాడు వెంకడు అగ్గిపెట్టి కోసం నిక్కరుజేబు వెదుకుతూ.

"అయితే ఏమీ దొరకనప్పుడేమిటి చేస్తావు?"

"ఏదో వొకటి సేస్తాంగాని పస్తుంటామా?"

"అదే, ఏమిటి చేస్తావూ అంట."

"ఏటి బాబు సాలసిత్రం గడుగుతారు. ఏటి సెయ్యాలంటే మేటి? ఒక జేబు కొట్టేస్తే సాలదా? నాలుగు రోజులు జలసాగా ఎల్లిపోతాది. సరిగ్గా ఎయ్యాలిగాని బాబూ కొటుకు మించిన యిద్దే లేదనుకోండి" అని చిరునవ్వు నవ్వి, మళ్ళీ బీడీ వెలిగించి, బాగా దమ్ముతీసి, రైలింజనులాగ "గుఫ్, గుఫ్" మని పొగ వదిలాడు వెంకడు.

ఈసారి శేషయ్యగారి అనుమానం నిజమైంది. ఆయన గుండెలు దడదడ కొట్టుకున్నాయి. ఈ వెధవ తన్ను చంపి తన డబ్బు పట్టుకుపోతే యిక్కడ దిక్కేమిటి? ఇదేం కర్మమో గాని పెట్టెలో రెండో మనిషి లేకపోవడమేమిటి? పోనీ ఎవడో రెండో మనిషి వచ్చాడనుకుంటే రాగారాగా దొంగవెధవ రావడమేమిటి? ఇప్పుడేం చెయ్యాలి? అంతగా ప్రాణాలమీదికి వస్తే తన మొలనున్న రెండువేల రూపాయలూ వాడికి సమర్పించి ఒక నమస్కారంచేసి పూరుకోవాలి! అంతకన్న చెయ్యగలిగిం దేముంది?

ఛీ! అసలు బయలుదేరినప్పుడు ఎవరిమొహం చూశాడో గాని... అవునవును...తను బయలుదేరుతుండగా పిల్లి కాళ్ళలో పడింది. శేషయ్యగారికి పిల్లిమీద కోపమొచ్చింది.

అయితే శేషయ్యగారు గొప్ప తెలివైనవారు. ఆయన తన మనసులో వుండే భయాన్ని కించిత్తుకూడా బయటపెట్టలేదు. మీదు మిక్కిలి వెంకణ్ణి మంచిమాటల్తో లొంగదీసుకుని స్టేషను రాగానే పోలీసువాళ్ళకి అప్పజెప్పవచ్చు ననుకున్నారు.

"అవును, నిజమేనురా వెంకయ్యా, ఏదో పని చెయ్యకపోతే రోజు లెలాగడుస్తాయి చెప్పు? అందుకే పెద్దలు కూటికోసం కోటి విద్యలన్నారు. అయితే, ఒరే, ఎప్పుడేనా పట్టుబడ్డావా?"

వెంకడికి ఆశ్చర్యమేసింది. ఇంతవరకూ తనమీద తన తల్లీ, తను వొదిలీసిన పెళ్లామూ తప్ప యింకెవ్వరూ సానుభూతి చూప లేదు. ఒకరిద్దరు సహచరులు తప్ప ఎవరూ తన వృత్తిని మెచ్చుకో లేదు. అందులోకీ చదువుకున్నవాళ్ళూ, శుభ్రంగా బట్టలేసుకున్న వాళ్ళూ, కామందులూ తన వృత్తివల్ల తన్నెప్పుడూ అస హ్యించుకుంటారని వాడి నమ్మకం. అటువంటప్పుడు యీయన తన వృత్తిని సమర్థించడం వెంకడికి ఆశ్చర్యం కలిగించింది.

ఈ దొంగ వెధవ యింతకుముం దెప్పుడూ పట్టుబడకపోతే మొట్టమొదటిసారి తన చేతులమీదుగా పట్టుబడతా డనుకున్నారు శేషయ్యగారు. ఆయన మళ్ళీ అదే ప్రశ్న వేశారు:

"అయితే ఏంరా వెంకయ్యా, యింతకుముందు పెప్పుడేనా దొంగతనంచేసి దొరికిపోయావా?"

"ఎందుకు దొరకలేదుబాబూ, రెండుమూడుసార్లు ఖైదులోకూడా ఎళ్లేను."

"అయితే రెండుమూడుసార్లు ఖైదులో కెళ్ళినా దొంగపని మాత్రం వదిలి పెట్టలేదన్నమాట."

"లేదుబాబు, కొడవలికీ చిగ్గ నేదు, కొయ్యగూరకీ చిగ్గ నేదు"

"బాగానేవుందికానీ, ఒరే వెంకయ్యా యీ వృత్తి చాల ప్రమాదకరమైందిరా. అందులో ప్రాణభయంకూడా వుంది. మాట వరసకి నాదగ్గరికి ఎవడేనా చెడుబుద్ధితో వచ్చాడనుకో, నాదగ్గర ఎప్పుడూ పిస్తోలు రెడీగా వుంటుంది. "ధన్"మని కాల్చి పారే స్తాను. అంచేత నా మాటవిని యీ వృత్తి వదిలిపెట్టి ఏదేనా పని చేసుకో. పోనీ నీకు రాయిపూరులో పనిప్పిస్తాను నాతోరా. తిండీ, బట్టా, వుండడానికి యిల్లూ కాక రోజుకొక రూపాయి డబ్బులు దొరుకుతాయి. ఏం చేస్తావా" అన్నారు శేషయ్యగారు.

"ఓ, ఎందుకు సెయ్యను బాబూ, అలాగయితే నా నొగ్గేసిన ఆడదాయిని కూడా తీసుకొస్తాను బాబు."

"సరే అయితే" అన్నారు శేషయ్యగారు వెంకడి మొహం లోకి చూస్తూ.

వెంకడి మొహంలో సంతోషం కనిపించింది. వాడు తను వొదిలీసిన పెళ్ళాంగురించి ఆలోచిస్తున్నాడు. నిజంగా నరిసి చాల అమాయకురాలు. తను తిట్టినా, కొట్టినా ఎదురుతిరక్కుండా కుక్కలా పడివుంటుంది. నిజంగా తను ఎన్నిసార్లు దాన్ని చితక్కొ దన్న లేదు. అయినా తనంటే పడిచస్తుంది. నరిసికి తనెంతో అన్యాయం చేశాడు. దాన్ని మళ్లీ తీసుకొచ్చి ఒక యిల్లూ సంసారం నడపాలనే కోరికలు వాడిలో వుద్భవించేయి.

ప్రస్తుతానికి వెంకడివల్ల కించిత్తు ప్రమాదంకూడా లేదని శేషయ్యగారికి ధైర్యం కలిగింది. ఆయన మహా మహా ఉద్దండు లనే బుట్టలో వేసుకున్నాడు. ఈ వెధవ పీనుగ ఏమాత్రం! లేక పోతే యింత వ్యాపారం వొంటిచేతిమీద ఎలా నడిపిస్తున్నాడు! ఏభైవేల రూపాయల ఆస్తి ఎలా చేశాడు? ఆయనకు యింకొక ఆలోచన తట్టింది. ఈ వెధవను దారిలో దింపేయడంకన్న వీడిని రాయపూరువరకూ రానిచ్చి వీడిచేత సామానులు మోయించి తరవాత సావకాశంగా పోలీసువాళ్ళకు అప్పజెప్పవచ్చును. రాయపూరు స్టేషనులో కూలీలు విపరీతంగా డబ్బు అడుగుతారు. అంతేకాదు, వీడు సామాను పట్టుకుంటే యింటికి నడిచి వెళ్ళిపోవచ్చును. లేక పోతే అనవసరంగా రెండో మూడో దండుగ అనుకున్నారు శేషయ్యగారు.

"ఒరే వెంకయ్యా, రాయిపూరు స్టేషనులో యీ సామాను పట్టుకుని నా వెనకాతల వెళ్ళిపోరా, నా బంట్రోతని చెప్పేస్తా నులే. టిక్కట్టు ఎవడూ అడగడు."

"అలాగేను బాబయ్యా, సామానుకూడా అట్టేలేదు. రెండు పెట్టెలు, పరుపు, యీ సజ్జ అంతేకద బాబు."

"రెండు పెట్టె లేవిరా, ఒకటేకదరా."

"రెండుబాబు, మీద నొకటుంది. ఇదిగో యీ బల్లకింద తోలుపెట్టి వొకటుంది" అన్నాడు వెంకడు.

శేషయ్యగారు ముందుకు వొంగి, తను కూర్చున్న బల్లకింద వున్న తోలుపెట్టెని చూశారు. తోలుపెట్టె సరికొత్తది! నిగనిగ మెరుస్తోంది! రెండు తాళాలు వేసివున్నాయి. ఆయనకి ఆశ్చర్య మేసింది. ఈ పెట్టె తనదికాదు. ఎవరో యీ బల్లకింద మరిచి పోయారు. తనప్పుడే నాలుగైదు గంటలై ప్రయాణం చేస్తు న్నాడు; ఎవరూ యీ పెట్టెకోసం రాలేదు. ఆయన బుర్ర ఆలో చనలతో నిండిపోయింది. మెల్లిగా ఆ పెట్టెని ఎత్తిచూశారు. చాల బరువుగావుంది. లోపల ఏమి విలువైన వస్తువులు పెట్టేరో తెలీదు. వెండి సామానులు, నగలు, డబ్బు, ఏమైనా వుండవచ్చును.

"ఏంబాబు అలా సూస్తున్నారు, మీది కాదేటి?"

"నాదేనురా, మరచిపోయాను. మొన్న శనివారంనాడు విశాఖపట్నంలో 48 రూపాయలకు కొన్నానీ తోలుపెట్టె."

"బాగుంది బాబూ, సదువుకున్నోరుగదా, మీ సామాను మీరే మరచిపోతారా?" అని పకపక నవ్వేడు వెంకడు.

శేషయ్యగారికి పెట్టెతీసి అందులో ఏముందో చూడాలనిపిం చింది. కాని ఎలాగ? తాళాలు విరగ్గొట్టాలి. వీడుంటూండగా ఎలా విరగ్గొట్టడం? దొంగవెధవ బాగా దాపరించేడు శనిలాగ, అనుకున్నారు శేషయ్యగారు. ఆయన మళ్ళీ పెట్టెవేపు చూశారు. అహా! కొత్తపెట్టె! పెట్టే చేస్తుంది ఓ యేభై రూపాయలు! ఇంక

పెట్టిలోని వస్తువులెంత విలువైనవో! ఎవరో ధనవంతులు మరచి పోయివుంటారు! అంచేతే అంత నిర్లక్ష్యంగా వూరుకున్నారు. పెట్టి తీసి చూసినా బాగుండును! కాని ఎలాగ?

వెంకడు శేషయ్యగారిని తదేక దీక్షగా పరిశీలిస్తున్నాడు. ఈపెట్టి యీ షావుకారిదే అయితే అతనా పెట్టివేపు అలా చూస్తాడేం? ఎవడు మరిచిపోయాడో! పెద్ద బట్టలేసుకుని, దాబుగావున్న షావుకారు కాబట్టి ఇది తనదే అంటే ఎవరూ అనుమానించరని వాడి ధైర్యం! నిజమే! ఎవరనుమానిస్తారు? అయితే తనుకూడా దగా పడతాడా? వెంకడు బాగా ఆలోచిస్తున్నాడు.

వెంకడు తనవేపు చూస్తున్నాడని శేషయ్యగారు గ్రహించి, ఏమీ ఎరగనట్టు తలగడా కిందినుంచి దాశరథీ శతకం తీసి పద్యం గట్టిగా ఎత్తుకున్నారు.

బండి ఒక చిన్నస్టేషనులో ఆగింది. ఈ వెధవ నెలాగైనా యిక్కడ దింపేస్తే బాగుండుననుకున్నారు శేషయ్యగారు. అంతట్లో టిక్కెట్టు కలక్టరు తలుపుతోసుకుని లోపలికొచ్చాడు. టిక్కెట్టు కలక్టరు నిద్రమత్తుచేతనో ఏమోగాని కొంచెం తూలుతున్నట్టు కనిపించేడు. కొంచెం కోపంగా వున్నాడు. వెంకణ్ణి చూసి, "ఎవడ్రా నువ్వు" అన్నాడు చిరాకుగా.

"మాగి ఎంకణ్ణి బాబూ."

"దిగు వెధవా, నీ బాబుగారి బండిలా ఇంటరులో కూర్చున్నావ్, దిగు" అన్నాడు.

"సిత్తం బాబు" అని వెంకడు బండిదిగి ప్లాట్‌ఫారంమీద నిలబడ్డాడు. శేషయ్యగారు "అమ్మయ్య" అని నిట్టూర్పువిడిచేరు. టిక్కెట్టు కలక్టరు శేషయ్యగారి టిక్కెట్టు పరిశీలించి, తరవాత సామాను చూసేడు. టిక్కెట్టుమీద తీసుకువెళ్ళగలిగిన దానికంటె ఎక్కువ బరువువుందని అతను తూకాలూ, లెక్కలూ వేసి నాలుగు రూపాయల ఆరణాలు అదనంగా చార్జీ చేశాడు. శేషయ్యగారు తడుముకోకుండా డబ్బుతీసి యిచ్చారు. ఇంత విలువైన పెట్టి దొరికినప్పుడు యీమాత్రం రైలుచార్జీ యివ్వడంలో నష్టమేముంది? టిక్కెట్టు కలక్టరు దిగివెళ్ళగానే బండి కదిలింది. మళ్ళీ తలుపు తోసుకుని వెంకడు లోపలికి వచ్చాడు.

శేషయ్యగారికి వాడిని చూడగానే చిరాకేసింది. వెధవ, ఏలినాటి శనిలాగ పట్టుకు వదలకుండా వున్నాడు.

వెంకడు నేలమీద చతికిలబడి, బీడీ వెలిగించి రెండుదమ్ములు తీసేడు. ఈసారి ఎడ్ల రామదాసు తత్వం మెల్లిగా ఎత్తుకున్నాడు.

"బాబూ, అయితే యిందులో ఏటి పెట్టినారు బాబూ, అదు సార్జీ సేసినాడు? కాసింత బరువైతే ముండాకొడుకు టూరు కోరు!" అని వెంకడు శేషయ్యగారి కళ్లలోకి చూశాడు. శేషయ్యగారి కళ్ళలో కొంచెం గాభరా కనిపించింది.

"అబ్బే, ఏమీలేదురా...మాలాంటివాళ్ళ దగ్గర ఏముంటుందొరేశ్?...ఏవో నాలుగు బట్టలూ, ఏదో రామా, కృష్ణా అనుకోడానికి నాలుగు పుస్తకాలూ...ఏమిటుంటాయి చెప్పు?"

"గొప్ప ఇలవైన బట్టలే అయివుంటాయి. అంచేతే అంత బరువు!" అన్నాడు వెంకడు పెంకితనంగా.

"అబ్బే, లేదురా, మామూలుగా కట్టుకునే బట్టలే. అయితే అంత బరువెలా అయిందంటావా? మా బావమరిది వైద్యుడొకడున్నాడులే..."

"ఎక్కడ, యీ పెట్టిలోనా?" అన్నాడు చటుక్కున వెంకడు శేషయ్యగారిమాట పూర్తి కానివ్వకుండా.

"పూర్తిగా చెప్పనియ్యరా మరి! మాట కడ్డొస్తావేమిటి? మా బావమరిది మావూళ్లో వున్నాడు, పెట్టిలో ఎందుకుంటాడు? తెలివితక్కువ మాటలాడకు విను. వాడు చాల మంచివైద్యుడు. మందులు నూరుకోడానికి రాతికల్వం ఒకటి తెమ్మని వాడు బతిమాలేడు. విశాఖపట్నంలో కొన్నాను. కొంచెం పెద్దదే. అంచేతే వెధవ కల్వం అంత బరువు. కాని ఏంచేస్తాం మరి?" అన్నాడు శేషయ్యగారు. తన సమయస్ఫూర్తికి తనలో తను సంతోషించారు.

వెంకడు "హి, హి, హి!" అని నవ్వేడు. "రాతికల్వం అంత మంచిపెట్టిలో బంగారంనాగ ఎట్టినారు బాబూ" అంటూ వెంకడు మరో బీడీ అంటించాడు.

శేషయ్యగారు ముఖం చిట్లించి, సీరియస్‌గా దాశరథీ శతకం మళ్ళీ తీశారు. కాని మనసులో ఏదో భయం పీక్కుతింటూంది. తను నిష్కారణంగా యీ చిక్కులో పడ్డాడు. ఇందాక టిక్కెట్టు కలక్టరు వచ్చినప్పుడు వెంకడి గురించి చెప్పి పోలీసుల కప్పజెప్పవలసింది. చాల పొరబాటయింది. ఆయన కిప్పుడు వెంకణ్ణిచూస్తే భయం వేస్తూంది. ఈ దొంగవెధవ తన సంగతి కనిపెట్టినట్టుంది! ఏమిటి దారి?

వెంకడికి సర్వమూ అర్థమైంది. ఇంత అనుభవమున్న తన కళ్లలోనే దుమ్ముకొట్టేడు యీ షాహుకారు. అబ్బో! మంచి ఘనమైన దొంగలాగే వున్నాడే అనుకున్నాడు వెంకడు. అయితే పాపం యీ షాహుకారికి అనుభవంలేక యింతసేపూ మాటల్లో అలా పల్టీలు కొట్టేడు అనుకుని తనలో తను నవ్వుకున్నాడు వెంకడు.

తన్నింతసేపూ మోసంచేసినందుకు వాడికి శేషయ్యగారిమీద కోపం వచ్చింది. ఇంకో స్టేషను రాకముందే తనా పెట్టి పట్టుకుని బండి దిగిపోవాలి! అందులో ఎంత డబ్బుందో! నగలో, ఖరీదైన వస్తువులో ఏమిటున్నాయో, యీ షాహుకారి కెందుకు వదిలిపెట్టాలి? చేతికి చిక్కింది చూస్తూ చూస్తూ ఎందుకు జార విడుచుకోవాలి?

వెంకడు లేచి నిలబడి, మొలలోని కత్తితీసి, శేషయ్యగారి గుండెలమీద పెట్టేడు.

శేషయ్యగారు త్రుళ్ళిపడ్డారు. "అమ్మ బాబోయ్! దొంగ, దొంగ!" అని కేక వేశారు.

"ఇదిగో సెబుతున్నా ఇనుకో. కేకేసినా, లెగిసినా పొడిసేస్తాను తెలిసిందా. నాతోటి ఏసాలు మానీ. మాగెంకడి తడాఖా నీకేటి తెలుసు!"

"ఒరే నాయనా, చంపకురా, నీ పుణ్యముంటుందిరా, నీ కేమిటి కావాలో పట్టుకుపోరా బాబూ. పిల్లలవాణ్ణిరా," అని మొరపెట్టేరు శేషయ్యగారు. ఆయన భయంతో గజగజ వణుకు తున్నారు.

"నిన్ను సంపకపోతే నువ్వు నన్నొగ్గేస్తావేటి ? పిస్తోలేసి కాల్చేస్తావు."

"లేదురా నాయనా, నాదగ్గర పిస్తోలు లేదురా. ఒట్టినే సరదా కన్నానురా, చంపకురా" అని ఆయన ప్రాధేయపడు తూంటే వెంకడు రెండోచేత్తో బెడ్డింగు తాడు లాగి ఆయన రెండు చేతులూ కట్టేశాడు. ఇంకాయన పిస్తోలు పేల్చడం అసాధ్యం. ఎందుకేనా మంచిది, ఎక్కడేనా పిస్తోలుందేమోనని వెదికాడు వెంకడు. కాని ఎక్కడా లేదు.

"ఇదిగో ఎవరితోనేనా సెప్పినావంటే సమ్మారుసుంటావ్ తెలిసిందా?" అంటూ వెంకడు, బల్లకింద తోలుపెట్టెతీసి చేత్తో పట్టుకుని తలుపుదగ్గర నిలబడ్డాడు.

ఏదో స్టేషను సమీపిస్తోంది కాబోలు బండివేగం తగ్గింది. ఒక చేత్తో తోలుపెట్టె పట్టుకుని మరో చేత్తో తలుపుతీసి గుమ్మం దగ్గర నిలబడి దిగిపోడానికి వెంకడు సమయంకోసం చూస్తున్నాడు.

శేషయ్యగారు మెల్లిగా లేచి నిలబడి బండి గొలుసు లాగి, మళ్ళీ యథాప్రకారం పడుకున్నారు. గుమ్మం దగ్గర నిలబడి చీకట్లోకి చూస్తున్న వెంకడు ఇది గమనించలేదు.

బండివేగం బాగా తగ్గిపోయింది. వెంకడు బండిదిగి పొలాల్లోకి నడక ప్రారంభించేడు. బండి నిలబడిపోయింది. శేషయ్యగారు గోలచేస్తూ కట్లతోవున్న చేతులు చూపిస్తూ "దొంగ, దొంగ" పట్టుకోండి" అని వెంకడు వెళుతూన్న వేపు వేలు పెట్టి చూపించారు. బండిలోవున్న యిద్దరు ప్రయాణీకులు పరుగెత్తి వెంకణ్ణి తరిమి తరిమి పట్టుకుని తీసుకొచ్చారు.

బండిలో ప్రయాణీకులూ, రైలుగార్డూ అంతా శేషయ్యగారిమీద సానుభూతి చూపించేరు. శేషయ్యగారు అందరి గుండెలు కరిగిపోయేలాగ గుండెలు బాదుకున్నారు. "అయ్యో, కొత్త తోలుపెట్టండీ, అరవైరూపాయలిచ్చి కొన్నానండీ. ఈ దొంగవెధవ నన్ను చంపబోయాడండీ. వదలకండి, వెధవని పోలీసుల కప్పజెప్పండి" అని శేషయ్యగారు గోలపెట్టేరు.

"దొంగ వెధవా, పారిపోదామనుకున్నావా" అని ప్రయాణీకులు వెంకణ్ణి నాలుగు తాపులు తన్నేరు.

"ఈపెట్టె అడిదా ఏటి, అడగండి బాబూ అందులో విటుందో" అని వెంకడు ఏదో చెప్పబోయాడు.

"చూశారా, యీ దొంగవెధవ మాటలు! తన్నండి వెధవని" అని శేషయ్యగారు కళ్ళనీళ్ళు తుడుచుకున్నారు.

"తన్నండి వెధవని" అన్నారు ప్రయాణీకులు.

"కాళ్ళూ చేతులూ కట్టి బండిలో పడేయండి. వచ్చే స్టేషనులో పోలీసుల కప్పజెబుదాము" అన్నారు గార్డుగారు.

"ఈ వెధవ ఎన్నిసార్లు వెళ్ళేడో జైలుకి. వాడికి లక్ష్యమా ఏమిటి. నాలుగు తన్ని వదిలేండి" అన్నారొకరిద్దరు ప్రయాణీకులు.

అందరూ తలో జెల్లా కొట్టేరు. ఎవ డిష్టమొచ్చినట్టూ వాడు తన్నేడు. "ఫో. వెధవా, అదృష్టవంతుడివి బతికిపోయావు ఫో" అని వాడిని వదిలేశారు. బండి బయలుదేరింది.

శేషయ్యగారు ఒక నిట్టూర్పు వదిలారు. శని విరగడైంది: ఇంక తోలుపెట్టెతీసి చూసవచ్చును. అయితే మరో రెండు స్టేషన్లు దాటితే రాయిపూరు వచ్చేస్తుంది. హాయిగా యింటికి వెళ్ళే చూసుకోవచ్చు ననుకున్నారు మళ్ళీ.

శేషయ్యగారు రాయిపూరు స్టేషన్లో దిగి సామాను గుర్రపు బండిలో వేసుకుని యింటికి వెళ్ళేరు.

శేషయ్యగారు విజయగర్వంతో యింట్లో అడుగుపెట్టేరు. సామాను దింపించి, బండివాడికి డబ్బులిచ్చి పంపించిన తరవాత తను తీసుకొచ్చిన పిప్పరమెంట్లు పిల్లలకిచ్చేరు. భార్య లోపలి గుమ్మందగ్గర నిలబడి భర్తవేపు చూస్తూంది. అమాయకురాలు ఆవిడ కేం తెలుసు తను సాధించిన విజయం గురించి? తనతో యిన్నాళ్ళయి కాపరం చేస్తూందికాని ఆమెకు తన సామర్థ్యం గురించీ, తన వ్యవహారజ్ఞానం గురించీ ఏమీ తెలీదు. తన ప్రయోజకత్వాన్ని ఆమె గుర్తించలేదు. పాపం, చాల అమాయకురాలు. ఈ పెట్టెనుగురించి ఆమెతో ఏమని చెప్పాలి? ఏమని చెబితే ఆమె సంతోషిస్తుంది. నిజం చెబితే యిది తప్పు పనిగా భావించదుకదా? ఇన్నాళ్ళయి కాపరం చేస్తున్నా తను భార్య మనస్తత్వాన్ని గురించి నిర్ణయించుకోలేకపోతున్నందుకు తనమట్టుకు తనకే విచారమేసింది శేషయ్యగారికి.

ఈ పెట్టెగురించి యిప్పుడామెతో చెప్పకూడదు. పెట్టె తాళాలు తీసి, అందులోని వస్తువులను ఆమెకు చూపించి ఆశ్చర్యం కలిగించాలి అనుకున్నారు శేషయ్యగారు. చాల ఆకలిగా వుందనీ, వంట వేగం కానిమ్మనీ భార్యకు పురమాయించి తోలుపెట్టె తీసుకుని తన గదిలోకి వెళ్ళి గది తలుపులు మూసివేశారు శేషయ్యగారు.

తాళం కప్పలు చాలమంచివి. వాటిని విరగ్గొట్టి పాడుచెయ్యడ మెందుకని తనదగ్గరవున్న తాళాలగుత్తి తెచ్చి అన్ని తాళాలతోనూ ప్రయత్నించి చూసేరు. కాని అవి లొంగలేదు. ఎవరో పాపం గట్టికప్పలే వేసుకున్నారు. వీటినింక బలవంతంగా విరగ్గొట్టడం తప్ప మరి మార్గాంతరం లేదు. డ్రాయరులోంచి పటకారు తీసి తోలుపెట్టె తాళాలు విరగ్గొట్టేరు.

ఆయన గుండెలు జోరుగా కొట్టుకుంటున్నాయి. చేతివేళ్ళు వణుకుతున్నాయి. పెట్టె తలుపు తీశారు. మీద తెల్లటి పంచమడత వుంది. ఏమిటి, ఎవరిదీ పెట్టె? తన కెలా వచ్చింది? తను చేసింది మంచిపనేనా? కాదు, ఇది దొంగపని. అయితే ఎందుకు చేశాడు. దీనిగురించి ఎందుకింత తాపత్రయపడ్డాడు? తనకీ వెంకడికీ ఏమిటి భేదం? నిజంగా వెంకడు నిజాయితీపరుడు. తన వృత్తి దొంగతన

మని స్పష్టంగా నిర్భయంగా చెప్పేడు. ఈ పెట్టి దొంగలించినట్టు ఒప్పుకున్నాడు. ఈ పెట్టిని దొంగిలించే హక్కు వాడికి లేకపోవచ్చును. అయితే వాడికిలేని హక్కు తనకుమాత్ర మెలా వచ్చింది? చివరికి అంతా వాడిని నిందించేరు, శిక్షించేరు. పాపం వెంకడికి తను అన్యాయం చేశాడు? అయితే లోకంలో పాపాలు చెయ్యనివాడెవడు? ఏమిటో పిచ్చి గాని! ఆలోచనలతో ఆయన బుర్ర బరువెక్కిపోయింది. మనసులో అశాంతి వ్యాపించింది. వాటిని వదిలించుకుని తేలికపడదామని ఆయన గట్టిగా ఒకసారి నవ్వి పెట్టిలో చెయ్యిపెట్టి ఆత్రంగా తడిమేరు. రెండో చేత్తో పెట్టిలో మీద నేవున్న పంచముడత తీసి పారేశారు.

శేషయ్యగారి ఒళ్లు ఝల్లుమంది. శరీరమంతా చెమటపట్టింది చూపలేక తువ్వాలుతో మొహం కప్పుకున్నారు.

లోపల బొడ్డుకోయని పసిబిడ్డ దీర్ఘనిద్రలోవుంది. బిడ్డ శరీరం చల్లగా ఆయన చేతికి తగిలింది.

శేషయ్యగారి కళ్లు చీకట్లు కమ్మేయి. "పాపాత్ముణ్ణి క్షమించు తండ్రీ" అని ఒక కేక పెట్టేరు.



హరిణవిహారము

చిత్రకారుడు: శ్రీ ఎ. వి. యస్. ఆర్. జోస్యులు

## భద్రతకై వెదుకుచున్నవారికి తగిన ఆశ్రయం "ఇన్సూరెన్సు"

### భద్రత అనగా

సంపాదన ఉడిగినప్పుడు రాబడి,
మరణించినచో వార్సులకు ధనము.

★

## ది యునైటెడ్ ఇండియా రిటైర్‌మెంటు ఇన్‌కమ్ స్కీమ్

1. రిటైర్‌మెంటు రాబడి (నెలవారిగా చెల్లించు పద్ధతి) 55 లేక 60 సం॥ ల వయసులోనుండి ప్రారంభించి అదిమొదలు 15 సం॥ ల వరకు క్రమంగా చెల్లింపబడు పద్ధతి.

2. సంవత్సరపు మొత్తమునకు బదులుగా ఒకే మొత్తముగా తీసికోదలచిన, అట్లు తీసికొనుటకు తగిన పద్ధతి.

3. ముందుగా చనిపోయినచో రొఖ ఆదాయములు వార్సులకు చెల్లించతగిన పద్ధతి.

★

పూర్తి వివరములకు వ్రాయండి:

## ది యునైటెడ్ ఇండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్,

హెడ్ ఆఫీసు: "యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగ్",
పోస్టు బాక్సు నెం. 281, మద్రాసు-1.

---

బ్రాంచీలు, చీఫ్ ఏజెన్సీలు
ఇండియా, సిలన్, మలయ, సింగపూర్, బ్రిటిష్ తూర్పుఆఫ్రికా యందంతటా గలవు.

## నారసింహా లేహ్యాము




బంగారు చేర్చబడినది. ఇది మిక్కిలి వీర్యవృద్ధిని, బలమును, కలిగించుటలో అత్యుత్తమమైనది. మేహములు, నిక్కాక, నిస్సత్తువ, శుక్ల నష్టము, మూత్రము వెంట శుక్లముపడుట, అతిమూత్రము, మొదలగు వాటిని ఖండించి బలమును, కాంతిని, సంభోగశక్తిని కలిగించుటలో అమోఘమైనది. 2 డబ్బీలు చాలును. 20 తులముల డబ్బి రు. 3-4-0.

నోటు:—ప్రతి 20 తులముల లేహ్యమందున్నా 3/4 తులం లోహాభ్రక సింధూరముగాని, వంగాభ్రక సింధూరముగాని గలిపి సేవించిన సమస్త రోగములు శీఘ్రముగా హరించుటలో సందియము లేదు.

వాత ప్రకృతికి:- లోహాభ్రకం $\frac{3}{4}$ తులం 3-0-0.
ఉష్ణ ప్రకృతికి:- వంగాభ్రకం $\frac{3}{4}$ తులం 2-4-0.

పోస్టేజి ప్రత్యేకము. అన్ని ఔషధములతో సహా కేటలాగు ఉచితము.

### పి. సి. ఏ అండు కంపెనీ,
ఆయుర్వేద సమాజము,
పెరిదేపి :: నెల్లూరు జిల్లా.

---

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్ అండ్ కంపెనివారి

P.V. RAJAN'S SUPERIOR MADRAS SNUFF

శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

### R. S. సుగంధ ముక్కుపొడి

అన్నిటిలో సాటిలేనిది.
ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు:—

### పి. వి. రాజన్ & కంపెని,
అరక్కోణం, Arkonam, N. A. Dt.

# రాధావినోదము

శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

[రాధావినోద కావ్యమును సంస్కృతమున రామచంద్రాగమి రచించినాఁడు. ఇతఁడు పదునాఱు, పదునేడవ శతాబ్దుల తుది మొదళ్ళలో నుండియుండునని గోచరించుచున్నది. రామచంద్రాగమి ప్రౌఢ పండితుఁడు, కవి మూర్ధన్యుఁడు. ఇతడు ముక్తక కావ్య రచనమున దిట్టకూడ. రామచంద్రాగమిని గుఱించి మిత్రులు శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు వ్రాసిన వ్యాసము, భారతి 1950 నవంబరు సంచికలోఁ ప్రకటితము. అందు రామచంద్రాగమి విశేషములు పెక్కులు సూచితములు. ఇతని రాధావినోద కావ్యమును, నాకు లభించినంత వఱకు తెలుఁగున అనువదించితిని. అందలి కొన్ని పద్యములు ఈ క్రిందివి.]

మాలీనుఁడు, మాలీనుఁడు, మాలీనుఁడు, మాలి, మాలి, మాలీనుండున్,
మాలి, బలమాలి, మనఘనమాలి, నమాలి, వనమాలి, మముదయనేలున్.

బెరసిన విధుసుహృద్విరహమ్ము పేరిట భీమానలమ్మునఁ బీడనొంది,
విడువక వెన్నంటి యడలుచు విధుసుహృద్వరు కోల్తలకుఁ గాంచి తరళవృత్తి,
మలయ మచ్చరములు మలయాగతుండగు ననిలుధాటికినయి యవురునవురు,
విధుసుహృత్త్వము కల్మి వెలయించువదనమ్ము పేరిమిఁ బేర్గన్న విధుసుహృత్తు,
రాధ, భువనత్రితయ సమారాధనీయ చరిత, యనె నిట్లు తనకూర్చు సకియతోడ,
నీడితమ్ములైన పలుకులజాడ లెసక మెసఁగి తనయీడితత కేపుహాసఁగఁ గూర్చ.

కలువకంటి! కంటె? కలువల చెలికాఁడు పొలుపారుచున్నాఁడు పొడిచి, యదుగో,
తిమిరాకరమ్ములై తిమిరాకరమ్ములై శశికరమ్ములనైన స్వకరములన
వెలయించి యాదిశ కొలపు, లకరము లా కరముల ననుఁ దార్చెఁ జరమదశకుఁ;
దిలక మాదెన కంకమలకుఁడు కమలకుఁ డాతని మొగసి పాటలఁతి యవునె?
యడఁగ దిప్పాఁట నెప్పాట నలరుఁబోఁడి! కమల కోమల లోలల కాంత నేత్ర
యుగలుఁ డారమారముపాలి కఁనును గాద నంగఁబోక, పొమ్మిపుడె పొసంగ రయము.

ప్రమద! మదంబునం గుముద బంధురబంధుఁ డబంధురుండు నీ
హిమకరుఁ డెచ్చనై యతనుతే తనుతేతత, నన్, మతన్, మతన్,
మమత లడంగిపో, విధుసమాన, సమాన, మహాహిమత్వాల
బ్ధి, మడఁప సాగినాఁ; డతని తీఱనితీ రిటువంటిదే కదే!

మలిన్మై తీవలపైఁ జలించు నలిచే మాల్మింబరిత్యక్త, నూ
త్న లతాగ్ర్యన్, విధుభానుబృంద విధుతన్, సంత్యక్తకాంతిస్ఫుర

న్నలినిన్, దీర్ఘములైన యీ కనుల ప్రాంతంబందునందుండి యీ
లలి నీవో యలిరత్నమా! తొలఁప; వేలన్ మేలె జాలమ్మిఁకన్?

విధివశమ్మున విధువిధుతత్వమునఁ జిక్కి, సొంపు పెంపునుదూలి, సొక్కి సోలి,
యలికులమ్ముల చేతఁ గలసరసారస సారసమ్ముల చేత సరవివిడువఁ
బడు పాటునకుఁ బాలుపడి, వడిఁ జేడ్పడి, యతి తరమ్ముగఁ గొన్న యతివిభాత్వ
గతికి దారులు దీసి, కడకొన్న నెఱి విభయును నవిభయు నటు, వినమనమ్ము
నెనయు తామరమోముల నేలి మాఱు మొగము నిడినట్టు లొప్పు నప్పుణ్యసరసి,
సరసిరుహనేత్ర! పొలిచిపసందు సిమ్ము నిమ్మునకుఁ గాదు సుమ్మొక యించుకంత.

నెలకొను నేరిమిం గుముదినీదయితుం డక్కరమ్ములో కర
మ్ముల దయితోనలం దవిలి బోరనఁ గౌల్చుచు నున్నవాఁడు సు
మ్మ, లలన! యీతఁ డవ్వికచపుష్కరిణీ హరిణీవిలోల నే
త్రల వెత రూపుమాపువనిఁ దక్షిణమే జవిఁ గన్నవాఁడుగా!

విధురల విరహమ్ము పేరిటి పేర్గాము మొగకొన్న నడునెత్తి మొత్తుఁబడుల,
ధురితల, దయనీయచరితల, విధురిత తాభరితల, గరితలఁ, దలకొని,
నిలువున నుడికించు చలపాదితనమున విడువఁబోని జడుండు విధుఁ డితండు
పొడిసూపి పొడమిన గడియ మొదల్కొని యంక గతుండయ్యె నలరుఁ బోఁడి!
క్షిగతుఁ డాతఁడు తనకు నక్షిగతుఁడైన క్షణమ రవిమతి విమతి యీ కమలలతిక,
యతికిన యసహ్య గతిఁ దోఁచి, యట్టె మీలనమ్మున నిడియె మాఱు మొగమ్ముఁ; గంటె?

పవన మిదెన్నఁగా మలయపన్నగ పన్నగ రాజమండలీ
కవలిత మైనదేమొ, భ్రమఁగారియ వెట్టుచు జాలిమాలి, పైఁ
దవిలి దహించుచున్నయది, తన్వి! మదంగక మెల్ల, వల్లద
ప్పి వలితమై భ్రమించు, చెటు వీడక తానును నంగమద్గతిన్.

వనిత! నవని సనవనీపవని యనవని యలికులాలికుల యలికులాకుల హిమ
యహిమ సహాకారవని రనిమై పొసంగి యహిమ ననుఁ దాపమున ముంచు నహికిసయ్యె

రమణిరో! కాంచితే? మధుపరాగ పరాగ పరాగత భ్రమద్
భ్రమరనహాకులమ్మును బరాగితముల్ శశికాంతి కాంతిన
వ్యము నతిభవ్యముల్ విశదశారద శారద శారదమ్ము ఫు
ల్లము సహాగంధ గంధవహాలాలితముల్ వకుళప్రసూనముల్.

అరసి, యశోకదా! సురభి తారభి తాలి రతారతమ్ము, హె
చ్చు రమ తిరమ్ముగా, నవ, మశోక, మశోకము, మాశ్రయమ్ము, నీ
వరిమురి నాశ్రయింపు మిఁక; మాశ్రయుఁ డాశ్రితపక్షపాతి శ్రీ
హరి నినుఁ జేరవచ్చుట యథార్థ మలీంద్రుఁడు పద్మనింబలెన్,

తగ, మతపీవ్రము, న్నసిమతాత్వము నొందితి విప్వ డీసు హె
చ్చగ, నకిమిన్న ! న న్నవ మశోక మశోక మశోకదంబటం
టిగదె, యిహార్క్ మహోహా నవనీరద నీరదు మామవుగ్ మవుగ్
మగువరో ! తోడితే నరుగుమా! దయమై యమ నన్నుఁగావుమా!

అను తనరాధపల్కులు కలాఖ్య కలాఢ్య వయస్య, డాయనై
యనవనరోత్తమున్ వరు వరాయు వరప్రదుఁగాంచి చెప్పి చె
ప్పని యటు చెప్పె నొచ్చకిటు, ప్రస్ఫుటవృత్తిఁ, గలమ్మ ముత్కల
మ్మనుపమ మూర్జితమ్మ మృదుతామృదుతాతతమైన పల్కుతోన్.

అలఁదు కొనుచునున్న దారాధ, మెయి, భక్తచందన! మలయజ చందనమ్మ;
వెలయించుచున్నది నలినలోచన! నీదు నలిని, బహునలినీదలముల మెయి;
నెరయించుచున్నది నీ సునయన, మైన నలదమ్మ నలదమ్మ, నలిననాభ!
యమరుచుచున యున్న దామరు నాఱవ తూఁపు, నెత్తామరతూండ్లు మేన;
వింటె? కఱివేల్ప! యటులయ్యు, వెనుకఁబడని వెతల నదమన మవుచున్నదతివ, యతిత
రముగ; మా చుట్టఱికముసైతము లతాంగి కంగదలకే కతంబుగ నయ్యె నయ్య!

మకరేనకరుఁ డా హిమకరుఁ డౌ రహి నకరముతా కరములతో సముదితుఁడయి
పొదల, నముదిత యాముదిత యముదితముల్ పొనరించుఁ దనతమ్మి కనులు రెండుఁ;
బికిలి పో రవరవ ప్రిదిలి బీటలువాఱి యెన, పికరవము సముదిత మగుచు,
నముదితమ్ములు శ్రుతు లమరిచి యుంచు లే చివురాకు చేతులచేతఁ బ్రాఁతి;
మఱియు నవరవమ్ము మాటమాటన వమ్ముగాని తీ రెసంగ ఖగశతాంగ !
లలన యామె, హరిణలాంఛన లాంఛన లాంఛనయయి బడలులాగునఁ బడు.

అమరనుతా! యయోగ హృదయా! సహయోగ! వియోగ! నీవియో
గము నొక యింత సైపదికఁ గంజవిలోచన, కంజలోచనా!
యమరి మడిం గలట్టి చెలి నావలఁ ద్రోసి, తదీయమార్గము
న్నెమకుచుఁ జేరఁబొమ్మ, నవనీవిజమున్ మణిన్ విదిర్చుమా!

అంతర మెంచి యిట్టులను నాకలతోఁ గలతో వడింజనెం
దాంతుఁడు, ప్రోల్లసద్వనజదామజదామజ కాంతికాంతి, శ్రీ
కాంతుఁడు, రాధయున్నెడకుఁ; గన్గవఁగన్గొని శైలధారి న
త్యంతమనోహరున్ వరదు నామెయు సంతస మెంతయుం గనెన్.

సొబఁగున, రాధికాహృదయశోకదమాసగణమ్ముఁ గూర్చునె
చ్చుఁబడిని, రాధికాహృదయశోకద మీవరకావ్య మారచిం
పఁబడియెఁ, బూరుషోత్తమ కుమార జనార్దను జ్యేష్ఠపుత్త్రివా
సిఁ బరగు రామచంద్రకవిచేఁ గవిచేఁ గవిచే సుసంస్కృతిన్.

# పురాణభూగోళంలో భరతఖండాంధ్రదేశాలు

శ్రీ కె. ఈశ్వరదత్తు

మన ప్రాచీనులు బ్రహ్మసత్యము, జగత్తు మిథ్య యను వేదాంతసిద్ధాంతమునకే ఎక్కుడు ప్రాధాన్య మిచ్చుట చేత, భూగోళశాస్త్రవిషయమునకు వ్యాప్తి కలుగలేదు. కాని అష్టాదశపురాణములైన బ్రహ్మ, విష్ణు, మత్స్య, మార్కండేయ, బ్రహ్మాండపురాణాదులలో, రామాయణ, భాగవతములందును, భూగోళ విన్యాసమునుగూర్చి కొంచెమో, గొప్పయో వివరింప బడినది. పురాణ రచనాకాలమునాటికి మన పూర్వులు భూమండల విస్తృతినిగూర్చిన పరిజ్ఞానము ఎట్టిదో, ఆ భూగోళ విన్యాస వివరములందు మన భరతఖండమునందు, తన్మధ్యభాగమైన ఆంధ్ర దేశస్థితినిగూర్చి ఏవిషయములు తెలుపబడినవో సంక్షిప్తముగ నిందు వ్రాయుచున్నాను.

నేడు భూమండలమంతయు, ఆసియా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా, ఐరోపా యని ఖండములుగను, హిందూ, అట్లాంటిక్, ఆర్కిటిక్, మొదలైన సముద్రములుగను విభజింపబడినట్లే మన ప్రాచీనులును, భూభాగమునంతయు నేడు ద్వీపములుగను, నేడు సముద్రములుగను భాగించిరి. సంస్కృతపురాణములలో నుండి శ్లోకముల నుదాహరింపక, ఆంధ్రీకృత పురాణములైన, మార్కండేయ, విష్ణు, బ్రహ్మాండ పురాణముల నుండియే గద్య, పద్యముల నుట్టంకించుచున్నాను.

మ॥ ధరణీమండల విస్తృతంబు మతిస ప్తద్వీపరూపంబులన్
సరి దంభోనిధి వర్షశైల వనవిస్తారంబులన్ దైత్యని
ర్జర గంధర్వపురక్రమంబుల సమ స్తంబున్ వినంగోరెదన్
సరవిం జెప్పుడటన్న శిష్యునకు నాచార్యుండు దానిట్లనున్.

వ॥ అది యెట్లన్న జంబూ, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కరంబు లనెడు సప్తద్వీపంబులం బరివేష్టించి లవణేక్షుసురాసర్పిదధి దుగ్ధజలసముద్రంబు లేడు నొకటి కొకటి ద్విగుణవిస్తారంబులై యుండు. నీ సకలద్వీప మధ్యంబున జంబూద్వీపంబు విస్తరిల్లు. తదీయమధ్యంబున గనకరత్నమయమైన మేరు పర్వతంబుండు...

విష్ణుపురాణము - తృతీయాశ్వాసము. 18-20.

## ప్లక్షాదిద్వీప వర్ణనము

జంబూద్వీపము తర్వాత ప్లక్షద్వీపము వర్ణింపబడినది.

కం॥ మనుదెల్పితి జంబూద్వీ
పనియతి దద్విగుణమగును ప్లక్షద్వీపం
బున దగవి స్తృతిమానం
బనఘా! తద్విగుణమగును నాయతిఘనమై.

ఉ॥ దానినిజుట్టి యంబునిధి తద్దయు క్షారజలంబుచేత బెం
పూని చెలంగుచుండునట బొల్చును దేశములెన్ని యోనదీ
మానిత భూతలంబులుగ మానిజనావృతి భావనంబులై
వానిమహత్వ మెన్నుటకు బ్రహ్మకునైనను శక్యమానొకో!

బ్రహ్మాండపురాణము. తృ. ఆ. ప. 289 - 290.

ఈ ప్లక్షద్వీపమే నేటి ఆసియామైనర్ (*Asia Minor*) అను భూభాగమునకు సరివచ్చునని పరిశోధకుల యభిప్రాయము. ఈ ప్లక్షద్వీపము చుట్టును ఇక్షుసముద్రము కలదని పురాణకర్తలు చెప్పుదురు. ఈ ఇక్షుసముద్రమే ఇప్పటి ఎఱ్ఱసముద్రము, నల్లసముద్రము, కాస్పియన్ సముద్రము, పారశీక సముద్రము (*Red Sea, Black sea, Caspian sea, Persian gulf*) లుగా పరిగణింపబడవచ్చునని తెలియుచున్నది.

## శాల్మలి ద్వీపము

ప్లక్షద్వీపము తరువాత ఇక్షుసముద్రముగలదు. దానితర్వాత శాల్మలిద్వీపము గలదు. ఈ శాల్మలిద్వీపము నేటి ఆఫ్రికాయనం బడెడి ద్వీపఖండముతో పోల్పవచ్చునని పరిశోధకులు చెప్పెదరు. నేడును ఆఫ్రికా ఖండములో శాల్మలీ వృక్షములు విరివిగా పెరుగునట.

కం. ప్లక్షద్వీపము నవ్వల
నక్షీణ గభీరతా మహత్వంబులతో
నిక్షురస వార్ధి మెఱయును
లక్షద్వయ యోజనంబుల విశాలమ్మై

సీ. ఆ యిక్షురసవార్ధి యవ్వల శాల్మలి
దీపమ్ము మెఱయునా దీవి విరివి......

విష్ణుపురాణము. తృ. ఆ. 55-56.

## కుశద్వీపము

శాల్మల ద్వీపము తర్వాత కుశద్వీపము గలదు.

కం. క్షితినొప్పుఁ గుశద్వీపము
చతుర్థముగఁ గల్లుకడలి సర్వత్ర పరీ
వృతమైతగ శాల్మలివి
స్తృతికిఁ ద్విగుణితమునౌ ధరిత్రిఁ బెడంగై

ఆ. గౌరవర్ణులగుచుఁ గ్రమముగ వృత్తినొందు
వారు మనుజులెల్ల ఘోరపాప
హతులు గా రకాలహతులు గారతి దుఃఖ
మొందకయె చెలంగు చుందురచట

బ్రహ్మాండపురాణము ద్వి. ఆ. 331-334.

ఈ దేశజులు గౌరవర్ణులుగా వర్ణింపబడుటచేత ఈ కుశ ద్వీపము ఇప్పటి యూరోపాఖండముతో నీడువచ్చునని తెలియుచున్నది.

## క్రౌంచద్వీపము

కుశద్వీపము తర్వాత క్రౌంచద్వీపము గలదు దీని చుట్టు నేతి సముద్రము కలదు.

తే. ఆ కుశద్వీపమునకు నీడైన విరివి
యమరి ఘృతవార్ధి పరివృతంబై తనర్చు
నా పయోనిధి కినుమడియగు విశాల
మై చెలఁగె గ్రౌంచమన్ ద్వీపమనఘ చరిత.

విష్ణుపురాణము. తృ. ఆ. ప. 68.

ఈ క్రౌంచద్వీపము ఉత్తర అమెరికా ఖండము కావచ్చునని విజ్ఞుల యభిప్రాయము.

## శకద్వీపము

క్రౌంచద్వీపము తర్వాత శాకద్వీపము కలదు. దీని చుట్టు దధి సముద్రము కలదు.

కం. మానుగ గ్రౌంచద్వీప స
మాన విశాలంబు గలిగి మహనీయ గభీ
రానూన దధి సముద్రము
తానా ద్వీపంబు చుట్టుఁ దనరుచునుండున్.

కం. లోకస్తుత యా జలనిధి
యాకడఁ దద్ద్విగుణగుణితమైన విశాల
శ్రీకముగఁ జుట్టియుండును
శాకద్వీపంబు భవ్యసం రక్షితమై.

ఈ శకద్వీపము నేటి దక్షిణ అమెరికా ఖండమై యొప్పునని చెప్పబడినది.

## సప్తద్వీప సప్తసాగర సమేతయగు భూమి.

ద్వీపమనగా నాల్గు ప్రక్కలను జలముగలిగి మధ్య భూమిగల ప్రదేశమని పురాణములలోని ద్వీపమున కర్థము గాదు. బ్రహ్మాండ పురాణములోనే ద్వీపమనగా రెండు ప్రక్కల జలములు నావరించుటచే ద్వీపమని పేరు వచ్చెనని స్పష్టము చేయబడినది.

తే. ద్వివిధ జలములఁ గూడుట ద్వీపసంజ్ఞ
తనరు నంతట నుదకావృతంబునగుచు
నొప్పు; నుదకాయనం బౌట నుదధియండ్రు
పర్వతోన్నత గిరి యన బరఁగుచుండ్రు.

ద్వి. ఆ. ప 376.

అనగా సప్తద్వీపములు సప్త సాగర సంవృతములుగా వనుట స్పష్టము: సప్తసాగర సప్తద్వీప సమేతయగు భూమిధాత్రి పటమును జూచిన ద్వీపమనగా నేమియో తెలియగలదు.

## పుష్కరద్వీపము

శాకద్వీపము తర్వాత పుష్కర ద్వీపము కలదు.

తే. ఆపయః పయోధి యవ్వలదానికి
ద్విగుణ గుణితమైన విస్తరమున
నమరియుండుఁ బుష్కరాఖ్య మహాద్వీప
మచటి మహిమ చెప్ప నలవి గాదు.

కం. ఆ దీవిఁ దిరిగియుండును
స్వాదూదక జలధి దాని సమవిస్తృతమై
భూదేవ! యిట్లు సప్తప
యోధులం దొక్క కొలఁది నొనరు జలంబుల్.

విష్ణు పురాణము తృ. ఆ. ప 78-86.

## సప్త ద్వీపములు - సప్త సాగరములు
## నేటి ఖండములు - సముద్రములు.

| | |
|---|---|
| జంబూద్వీపము | ఆసియా (*Asia*) |
| క్షారోదము | హిందూమహా సముద్రము (*Indian Ocean*) |
| ప్లక్షద్వీపము | ఆసియా మైనర్ (*Asia-Minor*) |
| ఇక్షు సముద్రము | ఎఱ్ఱ, నల్ల సముద్రములు (*Red sea-Black sea-Persian gulf*) |
| శాల్మల ద్వీపము | ఆఫ్రికా (*Africa*) |
| సురా సాగరము | మధ్యధరాసముద్రము (*Mediterranean*) |
| కుశద్వీపము | యూరోపా ఖండము (*Europe*) |
| ఘృత సముద్రము | ఆర్కిటిక్ సముద్రము (*Arctic Ocean*) |
| క్రౌంచ ద్వీపము | ఉత్తర అమెరికా (*North America*) |
| దధి సముద్రము | అట్లాంటిక్ సముద్రము (*Atlantic Ocean*) |
| శాక ద్వీపము | దక్షిణ అమెరికా (*South America*) |
| క్షీర సముద్రము | శాంతమహా సముద్రము (*Pacific Ocean*) |
| పుష్కర ద్వీపము | ఆస్ట్రేలియా మొదలైన దీవులు (*Australia*) |
| శుద్ధజల సముద్రము | అంటార్కిటిక్ సముద్రము (*Antarctica*) |

## జంబూద్వీప వర్ణనము.
## భరత వర్షము.

సప్తద్వీపములలోను జంబూద్వీపము మొదటిది. ఈ జంబూద్వీపాంతర్భాగమే భరతవర్షము లేక భరతఖండము. మనము సంకల్పము చెప్పుకొనునప్పుడు మన ప్రాచీన భూమండల విన్యాసమును



లినోకట్ చిత్రము, బెస్తపడుచు శ్రీ. కె. భాగేశ్వరశర్మ

గూర్చి జ్ఞప్తికి వచ్చునట్లుగా 'జంబూద్వీపే భరతవర్షే భరతఖండే, దండకారణ్యే, కృష్ణా గోదావరీమధ్య దేశే' యని చెప్పుకొందుము. ప్రాచీన జంబూద్వీపవర్ణనము, నేటి ఆసియాఖండమునకు సాటి యౌచున్నది. ఈ జంబూ ద్వీపమధ్యమమున మేరుపర్వతము కలదు. ఈ మేరుపర్వతము కర్ణికాకారముగను, జంబూ ద్వీపము పద్మముగను, దానిచుట్టును, భద్రాశ్వ, భారత, కేతుమాల, ఉత్తర కురువర్షములు పత్రములుగను పురాణంబులందు వర్ణింపబడినది.

"ఈ సకల ద్వీపమధ్యంబున జంబూద్వీపంబు విస్తరిల్లు తదీయ మధ్యంబునఁ గనకరత్నమయంబయిన మేరుపర్వతంబుండు.

కం. భూపద్మమునకు నడుమై
యా పర్వతమొప్పుఁ గల్లికాకారమునన్
జూపట్టు యక్ష కిన్నర
తాపసగంధర్వ దేవతాసేవ్యంబై.

తే. ఖ్యాతి భద్రాశ్వ, భారత, కేతుమాల
కురుమహా వర్షములు మహీసరసిజంబు
నందు రేకులు మర్యాదలైనగరుల
బాహ్యభూములయందు జూపట్టుచుండు

విష్ణుపురాణము
తృ. ఆ. ప. 22; 35.

జంబూద్వీపము తొమ్మిదివర్షములు, లేక తొమ్మిది ఖండములుగ విభజింపబడినది. దీనిలో నేడు కులపర్వతములు గలవు. అవి హిమవంతము, హేమకూటము, నిషధము, మేరువు, నీలగిరి, శ్వేతాచలము, శృంగవంతమనునవి. ఈకులపర్వతము నంటుకొని, తొమ్మిదివర్షములు గలవు. అవి యేవనగా ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, హరి, కింపురుష, రమ్యక హిరణ్మయ, కురు, భరతవర్షములు. హిమవన్నగమునకు దక్షిణమునను, సముద్రమున కుత్తరమునను భరతవర్షముకలదనియు, ఈ భరతవర్షమునకు దూర్పున కిరాతులు, పశ్చిమమున యవనులు, మధ్యమమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు గలరు. ఈ భరతవర్షాంతర్భాగమే నేటి భరత ఖండము. హిందూ దేశము, భరతఖండము అని అవి మన రాజ్యాంగ శాసనమునందును మన మిప్పుడు పేర్కొని యున్నాము. భరతఖండమునకీ నామమేల కల్గెనో పురాణములందు తెలుపబడినది. స్వాయంభువ మనువు తనయుడైన ప్రియవ్రతునకు తొమ్మండుగురు పుత్త్రిలు. వారిలో అగ్నీధ్రుడను పుత్త్రుని జంబూ ద్వీపపాలకునిగా నియమించెను. ఆ అగ్నీధ్రునికి తొమ్మండుగురు కుమారులు పుట్టిరి. వారిలో ఋషభుడను వానిని హిమవంతమునకు దక్షిణఖండమున కధిపతిగా నియమించెను. ఋషభునకు భరతుడను పుత్త్రుడుకలడు. అతడే ఈ భూభాగమును పాలించుటచేత, నీవర్షమునకు భరతవర్షమనియు, భరతఖండమనియు పేర్లు వచ్చెను.

తే॥ హిమనగేంద్ర దక్షిణ వర్షమేలు నాభి
యాత్మనందను ఋషభుని నధిపుఁజేసి
యరిగె గానకు నతడు విజాత్మజన్ము
డైన భరతు బట్టముగట్టి యడవికరిగె.

వ. ఆ భరతుని పేర నివ్వర్షంబు భారతవర్షంబనం బొగడొందె. భరతుండును నిజనందను డగు సుమతి నధిపతిగావించి తపంబునకు జనియె.

మార్కండేయపురాణము - చ. ఆ. ప. 129 - 130.

## భరతవర్ష వర్ణనము

భరతవర్షము మన పురాణములలో తొమ్మిది విభాగములుగ జేయబడినది. వాని పేర్లు ఇంద్ర, కేతుమంత, తామ్రవర్ణ, గభస్తిమంత, నాగ, సౌమ్య, గాంధర్వ, వారుణ కుమారికాద్వీపములు. ఇందు, ఇంద్రద్వీపము నేటి బర్మాదేశముగను, నాగద్వీపము నేటి జాఫ్నాద్వీపకల్పముగను, గాంధర్వద్వీపము గాంధార దేశముతోను, సౌమ్యలేక కటాహద్వీపము మలయాద్వీపకల్పముతోను, తామ్రవర్ణద్వీపము సింహళద్వీపముతోను, వారుణద్వీపము సహ్య వింధ్య పర్వత పశ్చిమప్రాంతభూమికిని, కుమారికాద్వీపము దక్షిణ హిందూస్థానమునకును పరిశోధకులు పోల్చియున్నారు.

## కుమారికాఖండము - భరతఖండము

స్కాందపురాణాంతర్గత కుమారికాఖండమునుండి కుమారికా ద్వీపవర్ణనము నీదిగువ నిచ్చుచున్నాను.

కం॥ అని పంచలింగ మహిమము
వినిపించి యమర్త్యమౌని విషధరుడు పృథా
తనయున కిట్లని తెల్పెను
వినుబర్బరి యనెడు తీర్థ విషయంబింకన్.

చం॥ అదిమహిమాఢ్యతీర్థమగు నర్జున దాని నెఱుంగనీకు జె
ప్పెదు; నెటులద్దికల్గినదొ భూపవరాత్మజభూతలంబునన్
ఉదయముగాంచి ఖ్యాతిని మహోత్తమయై శతశృంగనాగ జెం
పొదవ జెలంగె నామెయె సముజ్వలరూపకుమారి కాఖ్యచేన్.

సీ. జనమత ప్రాతయై సంస్తవార్హ ప్రవృత్తినిమించెఁ ద
న్నామమున నిడియును,
గౌమారికా ఖండనామము దాల్చెను వర్గచతుష్టయ
వర్ణ్యఫలద
మగుఁజుమ్మ భూలోకమందు నానాగ్రామముఖ కల్ప
నయు నామె మూలమునను
వెలసెను; పార్థ! యాలలితాంగియే దీని భరతఖండం
బనఁ బడునటంచు

తే. జక్కఁ గల్పించె; ననుటయు సవ్యసాచి,
యిట్టులడిగె; మహాముని యిదియు మిగుల
నచ్చెరువుగాఁగఁ దోఁచెడు నాత్మకిపుడు
వినఁదగుందీని వృత్తాంతమును గడంగి

వ. మహేంద్ర, మలయ, సహ్య, శుక్తి మంతంబులు, ఋక్షపర్వతంబు, వింధ్య, పారియాత్రంబులు ననునవి వర్షపర్వతములు, కులపర్వతంబులు నాఁబడు. మహేంద్ర పర్వత పశ్చిమంబుగా నింద్రద్వీపంబుండు. పారియాత్ర పర్వతమునకు క్రిందనుండు ఖండంబు కౌమారికంబనంబడు.

కౌమారికా ఖండము. తృ. అ. ప. 193-195.

## భరతఖండము—కులపర్వతములు

మహేంద్రపర్వతము నేటి ఉత్కలరాష్ట్రములో నున్న గంజాము మండలములో గల మహేంద్రగిరియే. కాని యీ మహేంద్రపర్వతములు తూర్పు సముద్రతీరమున గంజాము మండలమునుండి, తిరునవేల్లి జిల్లావరకు వ్యాపించియున్న కనుమలకు మహేంద్రగిరులను నామము సార్థకమైయున్నవి. మలయ పర్వతములు పశ్చిమతీరమున నీలగిరి కొండలు మొదలు, కుమారికాగ్రమునకు వ్యాపించియున్న పర్వతశ్రేణియై యున్నది. సహ్యపర్వతములు, పశ్చిమతీరమున నీలగిరి కొండల కుత్తరమునను, తపతీనదీ దక్షిణమునను వ్యాపించియున్న భూధరశ్రేణి. శుక్తిమత పర్వతములు, మధ్య పరగణాలలో రాయఘుర్ మండములో వ్యాపించియున్న కొండలని తెలియుచున్నది. ఋక్షపర్వతములు వింధ్యపర్వతములలో నర్మదానదీ మధ్యమమున వ్యాపించిన గిరులనియు, వింధ్యపర్వతములు నేటి యీ నామమున నే పిలువబడు వింధ్యపర్వతములే ననియు, పారియాత్రములు వింధ్యపర్వత ప్రాంతములలోని ఆరావళీ కొండలనియు తెలియుచున్నది.

## జంబూ ద్వీపము-కుమారికాఖండము

జంబూ ద్వీపములోని మొదటిపదము నేటి జమ్ము - కాశ్మీరము రాష్ట్రములో జమ్ము విభాగములో శేషించియున్నది. కుమారికా ఖండములోని కుమారికా పదము, హిందూదేశములోని దక్షిణకొన నున్న కుమారికాగ్రములో నిమిడియున్నది.

## భరతవర్షము - దేశవిభాగము.

పురాణంబులందును, మహాభారతమునందును, భరతవర్షము ఏడు జనపదంబులుగ విభజింపబడినది. అవి యేవనగా, మధ్య, ఉదీచ్య, ప్రాచ్య, దక్షిణాపథ, అపరాజిత, వింధ్య, హిమాలయ దేశములు. మార్కండేయ పురాణములో

తే. మత్స్యమశ్వంబు కూటంబు మమతియుఁగుల్య
కుంతలంబులు గాశియుఁగోసలంబు
నాదిగా మధ్యదేశంబునందుఁ బొలుచు
జనపదంబులు సతతంబు జనవరేణ్య.




వ. ఆ మధ్యదేశంబున కుదీచ్యంబులై భార్గవ పురంబును, బాహ్లీక వాట ఆభీర గాంధార సింధు సౌవీర మద్ర కేకయ కాంభోజదరద బర్బరచీన కాశ్మీర మహాకాదులును, ప్రాచ్యంబులై యంతర్గిరి మలదమలవర్తిక ప్రాగ్జ్యోతిష విదేహ తామ్రలిప్తక మల్లి మాగధాదులును, దాక్షిణాత్యంబులై పాండ్యకేరళ చోళ కుల్య మహారాష్ట్రమహిష, కళింగ, విదర్భ కుంతలాంధ్రాదులును, ప్రతీచ్యంబులై సూర్యారక, పుళింద, సారస్వత, సౌరాష్ట్రవంతాది జనపదంబు లభిరమ్యంబగు. మఱియువింధ్యాది పర్వతాశ్రయంబులందుఁ గురుష్మమేల కోత్తమార్ణ దశార్ణభోజ కిష్కింధక కోసల నూపుర తుంబురనైషధ వీరహోత్ర నీహారత్రిగర్తాది దేశంబులును సమస్త వస్తుసంభరితంబులై యుండు జలనిధి వలయ వలయితపూర్వ దక్షిణాపరంబైన యిట్టి భారతవర్షంబునకు నుత్తరంబున హిమవంతంబు కార్ముకంబునకు గొనయంబును బోలె శోభిల్లు.

మార్కండేయ పురాణము.
చ. అ. 180-181.

## కూర్మసంస్థాన వర్ణనము

మార్కండేయ పురాణములో ఆంధ్రదేశము దాక్షిణాత్య దేశములలో నొకటిగా జెప్పబడినది. ఆ మార్కండేయ పురాణములోనే శ్రీ మహావిష్ణువు కూర్మరూపముల ధరించి భారత వర్షవ్యాప్తి నొందినట్లును, అతడు ప్రాగ్వదనుండును,అపరపుచ్ఛుడును,

దక్షిణోత్తర పార్శ్వములై యుండునని యు వర్ణింపబడినది. భారత వర్షమొక కూర్మరూపముగ వ్యాపించియున్న విధమును, తన్న వాంగము ననుసరించి దేశస్థితులు గలవనియు, ఆ కూర్మ దక్షిణ కుక్షియందలి దేశవిభాగములో తెలంగులు, లేక తెలుగువారు నివసించి యున్నారనియు గలదు.

తిలింగో కుంజర దరీ కచ్ఛవాసాశ్చయే జనాః
తామ్రపర్ణీతథా కుక్షిరితి కూర్మస్య దక్షిణః

మార్కండేయ పురాణమును బరిష్కరించి, ప్రచురించిన పర్గిటార్ దొరవారు (Pargiter) పై శ్లోకములోని తిలంగులను వారు నేటి తెలుగువారనియు, వారు నివసించు దేశమే తెలుగు దేశమనియు, దీని ప్రసక్తి ననుసరించి ప్రాచీనాంధ్ర జనపదమునకు సరివచ్చుననియు వ్రాసియున్నారు. *

కాని తెలుగు లిపిలో క్రీ. శ. 1876 సంవత్సరములో ముద్రింపబడిన సంస్కృత మార్కండేయ పురాణములో నీ తిలింగ పదము త్రిలింగ పదముగా దిద్దబడినది. పుట 152.

త్రిలిఙ్గాః కుఞ్జర దరీ కచ్ఛవాసాశ్చయే జనాః
తామ్రపర్ణీతథా కుక్షిరితి కూర్మస్య దక్షిణః

కాని తిలింగ పదమే ప్రాచీన పదము. త్రిలింగ పదము తర్వాతిది. ఆంధ్రదేశములో శైవమత వ్యాప్తి కాకతీయుల కాలమున కలిగినపుడు తిలింగ పదమును త్రిలింగ పదముగా మార్చి దాని కనువగునట్లుగా నర్థమును గల్పించిరి.

## ఆంధ్రదేశములోని నదులు

విష్ణు పురాణములో ఆంధ్ర దేశములో నున్న నదుల గూర్చిన ప్రశంస యీ విధమున గలదు.

గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాది కాస్తథా
సహ్యపాదోద్భవా నద్యః స్మృతా పాపభయాపహాః

మార్కండేయ పురాణములో గోదావరీ నదీ ప్రదేశము పవిత్రమని యిట్లు వర్ణింపబడినది

కం. సురుచిరమగు సహ్యనగో
త్తరమున విలసిల్లుచుండు దద్దయు గోదా
వరి తత్ప్రదేశము మనో
హరము పవిత్రము మునీంద్ర యఖిల ధరిత్రిన్. †

చ. ఆ. ప 179.

* Markandeya Purana - Biblotheca - Indica Edition 1869. Page 327.

'Tilanga' This form is not found in the Dictionary, but it is no doubt the same as Tailinga or Trilinga, Telugu, the moderen Telugu Country. It Coincides more or less with the ancient Kingdom of Andhra."

## కృతజ్ఞత

† పై వ్యాసమును రచించుట యందు ఈ గ్రంథముల పరిశీలించుట చేత తద్గ్రంథ కర్తలకు కృతజ్ఞత చెప్పవలసి యున్నది.

1. *Studies in Indian Antiquities - Rayachaudari*
2. *Geographical Essays - Bimala Churn Law*
3. *Aucient Geography of India - Cunnigham*
4. ఆంధ్రీకృత మార్కండేయ పురాణము - మారయ.
5 ఆంధ్రీకృత విష్ణు పురాణము - సూరన.
6. ఆంధ్రీకృత బ్రహ్మాండ పురాణము - శేషాద్రిశర్మ.
   ఆంధ్రీకృత కౌమారికా ఖండము - శేషాద్రిశర్మ.
7. సప్తద్వీపాపృథివీ - *Sri Mankad - Annals of Bhandarkar Oriental Institute. Vol XVIII. Para III.*
   ఈ వ్యాసములో ప్రచురింపబడిన పటములు దీని నుండియే యెత్తబడినవి.
౮. *Markandeya Purana - Edited by Mr. Pargiter.*

# స్త్రీ

"హితశ్రీ"

రాత్రి ఏడుగంటల పదినిమిషాలయింది. శేషాద్రి 'హోటల్ విలాస్'లో మూడో అంతస్తుమీదికి చేరుకున్నాడు. ఆ అంతస్తులో రెండే గదులున్నాయి. ఓ తలుపు గడియవేసుంది. రెండో గదిలో ఎవరో స్త్రీ టైపు చేసుకుంటోంది. ఆమెని పలకరించటానికి సాహసంలేక అతను ఆ గది ముందుగా రెండు మూడు సార్లు పచార్లు చేశాడు. టైప్‌రైటర్ లోంచి కాగితాలు తీసేసి, సర్దుతూ ఆమె యథాలాపంగా తలుపువైపు చూసింది.

"ఎవరు?"

శేషాద్రి ఆమెవైపు చూడటానికి బిడియపడి నేలమీద చూస్తూ అన్నాడు.

"నేను టాక్సీ డ్రైవర్ నండి. చంద్రారెడ్డిగారిక్కడేనా ఉండేది?"

అతని ఆకృతివైపు వింతగా చూస్తూ ఆమె తల నిలువుగా ఆడించింది.

"టాక్సీ తెచ్చానండి."

"ఇప్పుడు టైమెంతయింది?" ఆమె మాటల్లో విసుగుదల స్పష్టంగా కనిపిస్తోంది.

"ఏడూ పది"

"ఎన్నింటికి రమ్మన్నారు?"

"ఏడున్నరకి"

"మరి అప్పుడే ఎందుకొచ్చావు?" అతను కొంచెం తడుముకుని:

"ఈ రోడ్డు జనసమ్మర్దంగా ఉంటుందని టాక్సీ పక్కవీధిలో ఆపి, ఆ సంగతి చెబుదామని వొచ్చాను...బాబుగారు లేరా?" అన్నాడు.

"కనిపించటం లేదా?"

శేషాద్రి చిన్నబుచ్చుకున్నాడు. అతనలా తలదించుకోటం చూసి ఆమెకి జాలివేసి అంది.

"ఎవరో పిలిస్తే వెళ్లారు. టైంకే వొస్తార్లే."

"సరేనండి." అనేసి అతను వెనక్కి తిరిగాడు.

ఆమె టైప్‌రైటర్ మూతవేసి, ఓసారి ఆవులించి, టైం చూసుకుని, చెయ్యాలిసిన పనేమీ లేకపోవటంవల్ల, కాలక్షేపం ఎలా చెయ్యటమా అని ఆలోచించి, వెడుతున్న శేషాద్రిని కేకేసింది.

"చూడు. నీ పేరేమిటి?"

"శేషాద్రండి."

ఆమెకి నవ్వొచ్చింది. ఇంకా ఇరవైఏళ్ళు నిండని ఆమెకి బాల్యచాపల్యం వొదలక పైకి నవ్వేసింది.

"అదేదో కొండపేరు కదూ?"

"ఊఁ"

"చూస్తే, నువ్వు కొండలతో పోటీ చేసేట్టున్నావే!"

శేషాద్రికి వొళ్లు మండింది. తనని చూస్తే ప్రతివాళ్లకీ ఇలా ఏడిపించాలనే బుద్ధి ఎందుకు పుడుతుంది? తన రూపానికి తను కర్తా? కొంచెం లావుగా, అసహ్యంగా ఉంటే ఉండవచ్చు. కాని తనేం చేస్తాడు? ఆమాత్రం ఎదుటివాళ్లు గ్రహించరేం? తను ఎంత బాధపడేదీ వాళ్లకి తెలియదా? కాని...కాని...తను తొందరపడకూడదు.

మాట మారుస్తూ అన్నాడతను. "బాబుగారు మీ కేసువుతారు?"

ఆమె ఏ కళనుందో గాని వెంటనే సూటిగా జవాబిచ్చింది.

"యజమాని. నేనాయన ఆంతరంగిక కార్యదర్శినిని."

"అలాగా! తమరి పేరు?..."

"విశాల."

"చాలా బావుంది."

"థాంక్స్. నీక్కూడా బావుందన్నమాట."

"నాకుమటుకు ఎందుకు బావుండదు?"

"నీకు కొండలపేర్లు తప్ప ఇంకేవీ ఇష్టం ఉండదేమో అనుకున్నాన్లే."

అతనికి కొంచెం రోషం వొచ్చింది.

"ఇది కొండలపట్టణమేనండి."

"అందుకే ఇక్కడినించి వెళ్లిపోతున్నాంగా."

"మీకు తెలియదేమో గాని, మాది చాలా అందమైన పట్నంగా మారుమోగింది."

---

✱ ఈ సంవత్సరం ప్రపంచ కథానికల పోటీకి పంపిన తెలుగు కథ.

"అవునవును. పాపం, రెడ్డిగారుకూడా తెగమెచ్చుకునే వారులే."

"ఆయన కీ ఊరు తెలుసా?" కొంచెం కౌతుకంతో అడిగాడు, శేషాద్రి.

"ఆయనకి తెలీకపోవట మేమిటి? ఇక్కడ మూడేళ్లుద్యోగం చేశారుగా."

"ఏం ఉద్యోగం?"

"ఏదో పోలీస్ ఆఫీసర్. పాపం, సాయంత్రం పాతబంగళా మీదికి మనసు మళ్లి చూసివొస్తానని వెళ్లారు. వెనకటి జీవితంఅంతా జ్ఞాపకం వొచ్చింది గావును అక్కడికి వెళ్లేసరికి; తిరిగొచ్చినప్పటి నించీ అదోరకంగా ఉన్నారు."

శేషాద్రి ముఖకవళికలు మారాయి.

"అవును. నాకు తెలుసు" అన్నా డతను.

"ఎలా తెలుసు?" ఆమె ఆశ్చర్యంగా అడిగింది.

"బంగళానించి నా టాక్సీలోనే ఆయన ఇక్కడికి వొచ్చారు. ఆ బంగాళాపక్కన ఉన్న పెంకుటిల్లేలెండి, మాది."

"ఓహో" అందామె.

"వారు ఇప్పు డుద్యోగంలో లేరా?"

"రిటైరయారుగా. అందుకే ఈ మిలిటరీ కంట్రాక్టుల వ్యవహారాలు."

"ఓహో" అన్నాడు శేషాద్రి, ముభావంగా. కాసేపాగి, చేతిగడియారం చూసుకొని "పదిహేను నిమిషాలు" అనుకుంది బయటికే, విశాల.

"పదిహేను నిమిషాలు!" గొణుక్కున్నాడు, శేషాద్రి.

"నీకు విసుగు పుడుతున్నట్టుంది."

"లేదండి."

ఆమెకో చిలిపి ఊహ తట్టింది.

"ఊరికే ఎంతసేపు కూచుంటావు? కాసేపు ఈ పత్రిక చదువుకుంటూ, కూర్చో," ఓ ఇంగ్లీషు పత్రిక అతనిమీదికి గిరవాటేసింది. అతను అది అందుకుని పేజీలు తిప్పసాగాడు. ఆమె ఓనవ్వు నవ్వి అంది.

"బొమ్మలు చూస్తున్నావా?"

"చదువుతున్నాను." నిర్లక్ష్యంగా అన్నా డతను.

"చూస్తే, నువ్వు బాగా చదువుకున్నట్టున్నావే!"

ఆ అనటంలోని ఎత్తిపొడుపుని గ్రహించా డతను. అతనికి వెనకటి స్కూలుజీవితం జ్ఞప్తికొచ్చింది. అందరూ తనని చీదరపురుగునిగా చూసేవాళ్ళు. తనకి దగ్గిరగా ఎవరూ కూర్చునేవాళ్లుకాదు. వ్యంగ్యంగా ఆ మాటా, ఈ మాటా అని ఏడిపించేవాళ్లు. పోనీ, కుర్రాళ్లు ఎలా ప్రవర్తించినా, ఆడపిల్లలు తనని చూసి అపహాస్యంగా నవ్వకపోతే తనంతగా బాధపడేవాడు కాదు. తను చేసిన నేరమేమిటి? ఎందుకు తన కా శిక్ష? వాళ్లంతా చేరి బలవంతంగా తనని స్కూల్ మానిపించారు. స్కూల్‌కి వెళ్ళటమంటేనే తనికి భయంగా ఉండేది. ఎలాగో ఇంట్లోనే చదివి మెట్రిక్యులేషన్‌కి కూర్చున్నాడు. కాని మొదటినించీ సొంత చదువే ఐతే ఏం ప్యాసవుతాడు.?

"ఏం?" ఆమె మళ్ళీ అడిగింది, జవాబు లేకపోవటంవల్ల.

"లేదండి." అతను తేరుకుని అన్నాడు.

"ఏం, పాపం?"

అతనికి వొళ్లుమండింది. ఆమె కా ఎత్తిపొడుపెందుకు?

"ఎంతవరకు చదివా వేమిటి?"

"మెట్రిక్యులేషన్."

"ప్యాసయావా?" ఆమె విస్మయపూర్వకంగా అడిగింది.

"లేదు."

పైకప్పు లేచేట్లు నవ్విందామె. తన తప్పు అతని కర్థమైంది. మెట్రిక్యులేషన్ పరీక్ష కెవరైనా వెళ్ళొచ్చు. డబ్బుకడితే సరి. ప్యాసవకుండా ఆ మాటన్నందుకు అతను కొంచెం చింతించాడు.

"ఎందుకు ప్యాసవలేదు?" అర్థంలేని ప్రశ్న అడిగింది.

"మార్కులు రాలేదు." అన్నాడు కసిగా.

"ఎందుకు రాలేదు. పెళ్ళిగాని చేసుకోలేదు గదా!" పకపక నవ్వుతూ అంది.

మళ్ళీ ఎత్తిపొడుస్తోంది! తనని చూడటానికే అంతా అసహ్యపడుతుంటే పెళ్ళేలా అవుతుందనుకుంది!

"నన్నెవరూ చేసుకోరని నాకు తెలుసు." అన్నాడు కటువుగా.

"అదేమిటి? నీకేం తక్కువ? నిక్షేపంగా సంపాదిస్తున్నావుగా" ఆమె నవ్వుతూ అంది.

"నాసంగతి నాకు తెలుసు."

"నిన్నెవరూ ప్రేమించలేదా?"

ఈసారి అతను జవాబు చెప్పలేదు. అతని సహనం చచ్చిపోతోంది. ఆమెకి ఆటగానే ఉంది, కాని తనకి...

"పోనీ, నువ్వెవరినైనా ప్రేమించావా?"

అత నామెవైపు చూశాడు. ఆమె అందంగా, సుకుమారంగా ఉంది. తను...! దేవు డిలాంటి తేడాలతో మనుష్యుల్ని ఎందుకు సృష్టిస్తాడు? అందంగా ఉన్నవాళ్ళనందరూ ప్రేమిస్తారు. అసహ్యంగా ఉంటే అందరూ అసహ్యించుకుంటారు. మనుషుల మనసుల పరిధు లింతేనా?

అతను ఆలోచిస్తూ పత్రిక పేజీలు తిప్పుతున్నాడు. ఏదో బొమ్మ కనిపించింది. అలాగే చూస్తూ ఉండిపోయాడు. అతను జవాబివ్వకపోవటం చూసి అందామె.

"తీక్ష్ణంగా చదువుతున్నట్టున్నావు!"

"లేదు. బొమ్మ చూస్తున్నాను." ఉద్రేకంగా అన్నాడు.

"ఏమిటా బొమ్మ?"

అతను పత్రిక ఆమెవైపు తిప్పి చూపటానికి సాహసించగలిగాడు. స్త్రీ పురుషులు ముద్దు పెట్టుకుంటున్న వర్ణచిత్రం అది. ఆమె తారాపథానికి లేచింది.

"బుద్ధిలేదూ? మర్యాదగా మసలుకో."

మొట్టమొదటిసారిగా అతనామెకళ్ళలోకి తీక్ష్ణంగా చూశాడు. ఆకళ్ళు...! ఆమె చలించింది. క్రౌర్యం తాండవించే ఆకళ్లు!

అతను వికటంగా నవ్వి, పత్రిక నేలకేసి విసిరికొట్టాడు. ఆమె లోలోపల బెదిరిపోయినా, ధైర్యం నటిస్తూ అరిచింది.

"గెటౌట్."

"నువ్వు అందంగా ఉన్నావని అహంకారంకదూ? హు! అందం. అంత అందంగా ఉన్నందుకు ఇదే శిక్ష...శిక్ష."

తటాలున శేషాద్రి ఆమెమీదికి ఉరికి గట్టిగా కౌగిలించుకుని ఆమె పెదవుల్ని చుంబిచాడు. ఆమె అనుకోని ఈ సంఘటనకి బిత్తరపోయింది. నోట మాట రాలేదు. ఏం జరిగేదీ ఆమె గ్రహించేలోపుగానే అతనామెని వశపర్చుకున్నాడు. అసహాయంగా హీనస్వరంతో కేకేసింది. కాని, కింద హోటల్ ప్లేట్ల చప్పుడులో, బయట బజారురొదలో ఆ కేక గది గోడలు దాటలేదు. అతను మరోసారి ఆమె పెదవుల్ని చుంబించి వొదిలేశాడు. ఆమె ఉక్రోషంతో, అవమానంతో, దుఃఖంతో రొప్పుతూ అతనివైపు నిప్పులు కక్కే కళ్ళతో చూస్తూ "దుర్మార్గుడా!" అంది.

ఆమెవైపు నఖశిఖపర్యంతం చూశాడు శేషాద్రి.

అతని మనసు వశం తప్పుతోంది. "ఈ శిక్ష చాలు" అనుకుని వొదిలాడు. కాని...కాని అతనిలోని పురుషత్వం తిరగబడ్డది. తలుపు మూసేశాడు. ఆమె భీతహరిణంలా చూసింది. జాలిగా ముఖం పెట్టింది. వేడుకుంది, ప్రాధేయపడ్డది, క్షమించమంది, చేతులు జోడించింది. కాని అతను లక్ష్యపెట్టలేదు. ఆమె నిస్సహాయంగా కన్నీరు కార్చింది. అతను లెక్క చెయ్యలేదు. అందమైన వాళ్లందరిమీదా కసితీర్చుకుంటున్నట్టుగా అతను అనుభూతి పొందాడు. ఆమెని బలవంతంగా ఆక్రమించుకుంటున్నకొద్దీ, ఇన్నాళ్ళూ బలవంతాన మనసులోనే అణిచిపెట్టుకుంటున్న పరాభవాగ్ని చల్లారుతున్నట్టుగా అనుభూతి పొందాడు...

ఆ ఆవేశం, ఆ ఉద్రేకం, ఆ కోపం అన్నీ చల్లారాయి. శేషాద్రి గదిమధ్యన చేష్టారహితంగా నుంచుని తన అన్యాయానికి గురైన విశాలవైపు చూస్తున్నాడు. ఆమె ఏడుస్తోంది. ఆమె పూర్వపురూపం స్ఫురణకి వొచ్చిందతనికి. ఆ కొంటెతనం, ఆ చిలిపినవ్వు, ఆ వయ్యారపు ఆంగికవిన్యాసం, తళుకు బెళుకు లొలికే ఆ అమాయకపు కులుకుచూపులు, ఆ తియ్యనికంఠం, ఆ యవ్వన గర్వం, పడుచుదనపుబింకం పలికించే ఆ అహంభావోక్తులు, ఆబిరుసు మాటలు, ఆ తారుణ్యపు లావణ్యం—అవన్నీ ఏమయాయి? సర్వస్వం కోల్పోయి మూర్తీభవించిన శోకదేవతలా ఆమె పడి ఉంది. కన్నీటికెరటాలు ఆమె చెంపలమీదనించి జారుతున్నాయి. శేషాద్రి హృదయం ద్రవించింది. అతని మనసు చలించింది. కేవలం కొన్ని నిమిషాల వ్యవధిలోనే ఆమె ఏ స్థితినించి ఏ స్థితికి మారిపోయింది! కొన్ని నిమిషాలు, అంతే! శేషాద్రికి కన్నీళ్లు తిరిగాయి. ఎంత ఘోరకృత్యంచేశాడు! అంత ఘాతుకం ఎలా చెయ్యగలిగాడు? తను మనిషేనా? అయితే, అంత త్వరలో జ్ఞానం ఎలా పోగొట్టుకోగలిగాడు?

ఏం లాభం? ఇప్పుడు తనెంత విచారిస్తే ఏం ప్రయోజనం? ఏవిధంగా ప్రవర్తిస్తే తన తప్పుని సరిదిద్దగలడు? తనేమీ చెయ్యలేడు. జరిగిన క్షణాలు తిరిగిరావు. తిరిగిరావు! శేషాద్రి తల పట్టుకున్నాడు. అదేస్థితిలో కొంచెంసేపుండి గద్గదస్వరంతో అన్నాడు.

"మిమ్మల్ని క్షమించమని కోరలేను. నా నేరం—కాదు—ఘోరం అటువంటిది. నరకం అనేది ఉంటే నే నక్కడికి పోతాను. పోయేముందు ఒక్క కోరిక. శేషాద్రి అనే ఈ మూర్ఖుణ్ణి జీవితంలో ఎప్పుడూ ఒక్కసారికూడా జ్ఞాపకం చేసుకోకండి."

ఆ కంఠంలోని ఆవేదన విశాల గమనించకపోలేదు. కాని ఆమె ఏమీ ఆలోచించే స్థితిలో లేదు. ముఖం చేతుల్లో కప్పుకుని ఏడుస్తూనే ఉంది.

శేషాద్రి తలుపువైపు రెండడుగులు వేశాడు. బయటనించి ఎవరో తలుపుతట్టటం వినిపించింది.

"ట్రెయిన్ అరగంట లేటుట. ఫోను చేసి కనుక్కున్నాను. అందువల్లే ఆలస్యంగా వొచ్చాను. రెడీగా ఉండండి, పోదాం. అన్నట్టు టాక్సీ డ్రైవర్ ఇంకా రాలేదా?"

ఆ కంఠం గుర్తుపట్టాడు శేషాద్రి. చంద్రారెడ్డి! అతని గుండె అతివేగంగా కొట్టుకుంది. తలుపు తీశాడు. లోపలికి ప్రవేశించీ ప్రవేశించగానే కంటబడిన ఆ దృశ్యం చంద్రారెడ్డిని స్తంభీభూతుడిని చేసింది. గది భీభత్సంగా ఉంది. ఆ స్థితిలో ఉన్న విశాలనీ శేషాద్రినీ చూడగానే అతనికి పరిస్థితి అర్థమైంది.

"ఏంచేశావు?" భీకరంగా శేషాద్రివైపు చూసి దబాయించాడు రెడ్డి.

శేషాద్రి ముఖం జేవురించింది. అతను తటాలున కత్తితీశాడు. తీక్ష్ణంగా అన్నాడు. "రెడ్డిగారూ!"

అకస్మాత్తుగా అతను కత్తితియ్యటంచూసి, నిరాయుధుడైన రెడ్డి కొంచెం వెనక్కి తగ్గాడు. కాని మరుక్షణంలోనే శేషాద్రి ముఖం నల్లబడ్డది. రెడ్డి అడిగిన ప్రశ్న అతని మనసులో బాణంలా గుచ్చుకుంది. ఏంచేశాడు? తను ఏం చెయ్యదలుచుకుని అక్కడికి వొచ్చాడు? ఏంచేశాడు? అయ్యో...అయ్యో...ఇహ తను ఏమీ చెయ్యలేడు...ఏమీ చెయ్యలేడు. అతని చేతిలోంచి కత్తి జారి పడ్డది.

రెడ్డి ధైర్యం తెచ్చుకొని "ఏమిటిదంతా?" అని రెట్టించి అడిగాడు. అతని కళ్ళలోకి కొన్ని క్షణాలు స్థిరంగా చూశాడు, శేషాద్రి. అతని మనసులో ఏవేవో భావాలు ముప్పిరిగొన్నాయి. దీర్ఘంగా నిట్టూర్చాడు. రెడ్డి ముఖం చిట్లించి శేషాద్రివైపు అర్థంకాని చూపులు చూశాడు. అదే పరిస్థితిలో కొంతసేపు గడిచాక

అకస్మాత్తుగా శేషాద్రి జేబులోంచి ఓ ఫోటో తీసి రెడ్డి ముఖానికి ఎదురుగుండా, దగ్గరగా పెట్టి కర్కశంగా అడిగాడు.

"ఈ ఫోటో ఎవరిది?"

రెడ్డి ముఖం తెల్లబోయింది.

"ఇది నీ కెక్కడిది?" నెమ్మదిగా అడిగాడు.

"ఫోటోలో ఉన్న దెవరు? మీరేనా?" మళ్లీ అడిగాడు శేషాద్రి. రెడ్డి తలూపాడు.

"పాతికేళ్లకిందటి ఫోటో గుర్తుపట్టగలిగినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను. ఈ అక్షరాలు కూడా గుర్తుపట్టగలరేమో, చూడండి." ఫోటో అడుగున రాసున్న అక్షరాలమీదనుంచి అతను చెయ్యి తీశాడు. రెడ్డి వాటివైపు క్షణమాత్రం చూసి తల దించుకున్నాడు.

"సరిగా కనపడటంలేదా? పోనీ నేను చదువుతాను, వినండి. 'శ్రీమతి రాజమ్మకి, ప్రేమపురస్సరంగా, చంద్రారెడ్డి.'" చివరి అక్షరాలు గట్టిగా నొక్కి పలికాడు, శేషాద్రి.

విశాల కిదంతా అగమ్యగోచరంగా ఉంది. ఆమె చంద్రా రెడ్డివైపు ఆశ్చర్యంగా చూడసాగింది.

రెడ్డి తల దించుకున్నాడు.

"ఆమె ఎవరో జ్ఞాపకం రావటంలేదు కాబోలు. ఈ ఊళ్లో మీ పాతబంగళాపక్కన ఉన్న పెంకుటింటిని జ్ఞాపకం తెచ్చుకోండి. అందులో ఏకాకిగా నివసించే వితంతువుని, నిస్సహాయురాలిని, చతుర్విధోపాయాలలో, మొదటిది సామం ఉపయోగించి, వశపరచుకోవాలని మీరు చేసిన ప్రయత్నానికి నిదర్శనమే ఈ చిహ్నం. మిమ్మల్ని గుర్తుపట్టటానికీ ఆధారంతో ఎంతో గాలించాను. రిటైరై ఎక్కడో ఉంటున్నారన్నారు. చివరికి, ఈ ఊళ్లోనే, ఈ ఫోటో సహాయం లేకుండానే, మిమ్మల్ని చూశాను. లేదు. ఆమే మిమ్మల్ని అల్లంతదూరంలో చూసి గుర్తు పట్టింది. 'ఆయనే, ఆయనే' అని నన్ను పిల్చి చూపించింది. ఆమె ముఖంలో నెత్తురు చిమ్మింది. ఏదో పిచ్చిసంతోషం ఉప్పొంగింది. ఆవేశంతో పెదవులు వొణికాయి. నేను తలుపు తీసుకుని బయటికి వొచ్చేశాను. రోడ్డుమీద నుంచుని, ఆ ఇంటివైపు గతానుభవ స్మరణతో చూస్తున్నారని మీ ముఖంలోచూస్తే స్పష్టంగా తెలిసింది. ఎలా పలకరించాలో తెలీక తికమక పడ్డారు. టాక్సీవంక దొరికింది. పాపం ఆమెనిగురించి తెలుసుకోవాలనిపించిందా? హుఁ...

రెడ్డి అతనిమాటలకి అడ్డొచ్చి అడిగాడు.

"నువ్వామెకి..." అతను పూర్తిచేయలేదు.

"ఆమెకి...ఆమెకి." వెకిలిగా నవ్వాడు శేషాద్రి.

మళ్లీ వెంటనే ముఖం గంభీరంగా పెట్టి అన్నాడు. "బలం, అధికారం ఉపయోగించి మీరు చేసిన దౌర్జన్యానికి ప్రతిఫలం— ప్రతిబింబం."

రెడ్డిముఖం వివర్ణమైంది. విశాలకి విద్యుద్ఘాతం తగిలినట్టయింది.

"గుర్తుపట్టలేకపోతున్నారా? సరిగా చూడండి. హేయంగా అసహ్యంగా, క్రూరంగా కనిపిస్తున్నాను కదూ? కాని...కాని... పరీక్షగా చూడండి. ఈ దుస్సహరూపం వెనకాల అస్పష్టంగా అణిగి తొంగిచూస్తున్న ఆ పోలిక లెవరివి? ఎవరివి?"

రెడ్డి ముఖంలో కత్తిదెబ్బకి కూడా నెత్తురులేదు. కొంచెం సేపాగి శేషాద్రి అన్నాడు.

నాకీ రూపం ఎలా వొచ్చిందా అని ఆశ్చర్యపోతున్నారా? ఎలా వొచ్చిందో ఆలోచించండి. కాని....కాని... నేనేం నేరం చేశాను? నాకెందుకీ శిక్ష? నన్ను చూసినప్పుడల్లా మా అమ్మకి ఆమె పరాభవమే జ్ఞాపకం వొచ్చేది. ఎప్పుడైనా ప్రేమగా ఒక్క మాట అనబోయి మళ్ళీ బాధగా ఆపుకునేది. నన్ను చూడటానికే ఇష్టపడేదికాదు. ఎదురుగా ఉంటే కసురుకునేది. చాటుగా పోతే ఏడిచేది. ఆమె నవ్వగా నేను ఒక్కసారికూడా చూడలేదు. నా జీవితంలో ఒక్క మంచి నిమిషం ఇంతవరకు చూడలేదు. ఒక్క మంచిమాట వినలేదు. ఒక్క మంచి పని చెయ్యలేదు."

అతనికి కన్నీళ్ళు తిరిగాయి. విశాల కాసేపు తన స్థితిని మర్చిపోయి అతనిమాటలు వింటోంది.

"ఒక్క మంచిపనిచేసి జీవితం ముగించేయాలనుకున్నాను. కాని ఇహ ఆపని చెయ్యలేను. ఎలా చెయ్యగలను? అయ్యో! ఎంత పొరపాటు జరిగింది! ఎంత అనాలోచితంగా ప్రవర్తించాను. నేనిక్కడికి అంత త్వరగా ఎందుకు రావాలి? ఆమె అంత అందంగా ఎందుకుండాలి? ఉన్నా, అందరిలాగే నన్నలా ఎందుకు బాధించాలి? కాని, ఆమెనని ప్రయోజనమేముంది? వొట్టిమూర్ఖుణ్ణి. ఎనిమిదింటికల్లా వొచ్చి తనని పాతికేళ్ళనించీ దహిస్తున్న పరాభవాగ్ని చల్లార్చేవార్త చెబుతానన్నాను, మా అమ్మతో. ఆమె నిరీక్షిస్తూఉంటుంది. అందుకోసమే, ఆ క్షణంకోసమే జీవచ్ఛవంలా బతుకుతోంది. చివరికి...చివరికి ఆక్షణం ఎప్పుడూ రాకుండా చేశాను. ఆమెకి గుండె పగులుతుంది. ఇన్నేళ్ళ ఆశా నిష్ఫలం. మళ్ళీ ఆమె ముఖం ఎలా చూడగలను? ఇహ ఆమెకి మనశ్శాంతి లభించదు. మనోవేదనతోనే ఆమె చచ్చిపోవాలి. తీరని అవమానంతో ప్రతీకారం లేకుండా, నిస్సహాయంగా, అలాగే చచ్చిపోవాలి. నేనూ అంతే. బతికినంతకాలం మనశ్శాంతిలేకపోయినా, చచ్చిపోయేముందయినా, హాయిగా పోవాలనుకున్నాను, ఇహ అది గగనకుసుమం. కేవలం గగనకుసుమం. దేవుడా!"

శేషాద్రి తల పట్టుకుని విచారంగా గది గుమ్మందాటి వెళ్ళిపోతూ, ఓసారి ఆగి, వెనక్కితిరిగి విశాలవైపు వేదనతో, జాలిగా చూస్తూ, "ఒక్క మంచిపని చెయ్యగలనని ఇప్పుడు తడుతోంది." అనేసి చరచర వెళ్ళిపోయాడు.

ఆ తరవాత రెడ్డి బరువుగా ఓ నిట్టూర్పు విడిచాడు. చాలా క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఆ నిశ్శబ్దం భరించలేకపోయాడు, రెడ్డి. విశాలవైపు చూడటానికి అతనికి ధైర్యం చాలలేదు. తలుపు వైపు చూస్తూ అన్నాడు.

"అతను పగతీర్చుకోలేదనుకున్నాడు. కాని, తీర్చుకొన్నాడు."

"ఎలా?..." అంది విశాల, హీనస్వరంతో.

వెంటనే రెడ్డి జవాబు చెప్పలేదు. కాసేపాగి, అర్ధస్వగతంగా గొణిగాడు. "ఆ రూపం..." మళ్ళీ రెడ్డి బాధగా నిట్టూర్చాడు. విశాల ఏమీ అనలేదు. కాసేపాగి, సాహసంచేసి అతను ఆమెవైపు చూసి అడిగాడు, కొంచెం సందేహిస్తూ.

"నువ్వతన్ని క్షమించగలవా?"

విశాల తలవంచుకుని కూర్చుంది. ఆమె జవాబేమీ చెప్పలేదు. జరిగిందంతా ఓ దుస్స్వప్నంలా కనిపించ సాగిందామెకి.

"నేనుమటుకు అతన్ని క్షమించలేను. ఆ కత్తితో నన్నతను పొడిచిఉంటే, ఎంతో సంతోషించే వాడిని."

విశాల కర్థమైంది. ఇంతలో బజారుల్లో ఏదో కలకలం వినిపించింది. ఏదో హడావిడి జరుగుతోంది. విశాల కిటికీదగ్గిరికి ఒక్క ఉదుటులో వెళ్ళి తెర తొలగించి చూసింది. హోటల్‌కి దగ్గిరలో జనసమూహం కనిపించింది.

"ఏమిటో కిందికివెళ్ళి కనుక్కుంటారా?" కొంచెం కాతర స్వరంతో అడిగిందామె. చంద్రారెడ్డి హోటల్‌కిందికి వెళ్ళి, మ్లాన వదనంతో తిరిగొచ్చాడు.

"అతను కారుకింద పడ్డాడుట. హాస్పిటల్‌కి తీసికెళ్ళారు. చాలా బలంగా గాయాలు తగిలాయట." ఓచేత్తో నుదురు పట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు రెడ్డి. విశాల కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

"నాకు తెలుసు."

ఆమె కంఠంలోని కంపనం విని అతనాశ్చర్యపోయి ఆమెవైపు చూశాడు.

విశాల గబగబ డ్రెస్ సరిచేసుకుని "పదండి." అంది.

"ఎక్కడికి?" రెడ్డి విస్మయంతో ప్రశ్నించాడు.

"ఎక్కడికేమిటి? హాస్పిటల్‌కి."

"ఎందుకు?"

ఈసారి ఆశ్చర్యపడటం విశాలవంతయింది.

"ఎందుకేమిటి?" ఆమె కంతకంటే ఏమనాలో తెలీలేదు.

"అతను బతకడు."

ఆమె నిశ్చలంగా అతనిముఖంలోకి చూసింది. ఆ ముఖంలో దుఃఖచ్ఛాయలు లేకపోలేదు. కాని ఆ ఛాయల్లో ఏదో ఉపశమనం —ఏదో విమోచన అణగిఉన్నట్టు ఆమెకి తోచింది.

"మరి ఇంకా అలా కూర్చుంటారేం?"

"నేనేం చెయ్యగలను?"

"అక్కడికి వెళ్ళింతరవాత ఆలోచించుకోవొచ్చు."

"నేనతణ్ణి నావాడని ఎలా చెప్పుకోగలను, విశాలా?" రెడ్డి భయపడుతూ అన్నాడు.

అతనివైపు పిరికిపందని చూసినట్టుగా చూసింది విశాల. చెప్పలేనంత అసహ్యం వేసిందామెకి.

"పోనీ నేను చెప్పకుంటాన్లెండి."

రెడ్డి దిమ్మరపోయాడు. కాని కదలలేదు. అతని మాటలకి ఎదురుచూడకుండానే ఆమె వెళ్ళిపోబోయింది. రెడ్డి పరిస్థితి గ్రహించి తటాలున తలుపుకి అడ్డంగా నిలబడ్డాడు. అతనివైపు విహ్వాభావంతో, కోపంతో చూసిందామె. అతను బతిమాలుతున్నట్టుగా అన్నాడు.

"నువ్విడితే నేను బయటపడిపోతాను, విశాలా. మనం వెంటనే ఇక్కడినించి వెళ్ళిపోవటం మంచిది."

అతని తొపత్రయం చూసి ఆమెకి చీదరింపు కలిగింది. శేషాద్రి నిస్సహాయంగా చచ్చిపోతున్న దృశ్యం ఆమెకి కనిపించింది. ఆమె అనుకుంటూనే ఉంది. ఆ ఒక్కపనీ అదే. ఆ 'ఒక్క మంచిపనీ' అంతకంటే ఇంకేమిటి? మంచిపని! విశాలకి కన్నీళ్లు తిరిగాయి. శేషాద్రి పశ్చాత్తాప పడుతున్న దృశ్యం ఆమెకి కనిపించింది. పాపం, చివరి నిమిషంలో కూడా మనశ్శాంతి లేకుండా చచ్చిపోతున్నాడు. తను అతనితో ఒక్కమాట చెప్పాలి.

"నేను వెళ్ళితీరాలి. వెళ్ళనియ్యండి."

ఆక్షణంలో రెడ్డికి తటాలున ఓ విషయం జ్ఞాపకంవొచ్చింది. తనఫోటో—తన సంతకంతో ఉన్న తనఫోటో శేషాద్రిదగ్గర ఉంది. అది బయటపడితే!

అతనికి ముచ్చెమటలు పోశాయి.

"నువ్వు వెళ్లొచ్చు, విశాలా."

"అక్కర్లేదండి."

"కాని ఓ చిన్న ప్రార్థన. అతని జేబులోని ఫోటో ఎలాగైనా సరే సంపాదించి తేవాలి. ఆమాత్రం సహాయం చెయ్యవా?" అతను జాలిగా, ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

ఆమాటలు వినీ వినటంతోనే విశాల కేదో పిచ్చి ఆవేశం కలిగింది. ఏదో భావం ఉత్తేజితమైంది. ఆక్షణంలో ఆమె తనని తానే మర్చిపోయింది. రెడ్డి, శేషాద్రి ఆమె మనసులో ఒకరి తరవాత ఒకరు మెదిలారు. చివరి నిమిషాల్లో ఉన్న శేషాద్రి దీనంగా చూస్తున్నాడు—తనవైపే!

కన్నుమూసి తెరిచేలోగా ఆమె నేలమీద పడిఉన్న కత్తితీసి రెడ్డిని పొడిచింది. రక్తంచిమ్మింది. కొద్దిగా మీదికికూడా చిందింది. ఓక్షణం ఆమెకి మతిపోయింది. కాని, వెంటనే తేరుకుని ఓ దుప్పటి కప్పుకుని బాణంలా బయటికి దూసుకుపోయింది.

* * * *

శేషాద్రి బతకడని చెప్పేశాడు డాక్టర్, కాని చచ్చిపోయేలోపుగా ఓ అయిదునిమిషాలు స్పృహలోకి రావటానికి వీలుందన్నాడు. గంటనించీ కనిపెట్టుకు కూచుంది విశాల. అడుగుల చప్పుడు వినిపించినప్పుడల్లా ఆమె భయపడిచూసేది, పోలీసులేమోనని. తను శేషాద్రితో మాట్లాడేదాకా పోలీసులు రాకపోతే...తరవాత ఏమైనా పరవాలేదు.

ఆమె ఎదురుచూసిన నిమిషం వొచ్చింది. శేషాద్రి కళ్లు కొద్దికొద్దిగా తెరిచాడు.

"నేను... నేను...విశాలని" ఆత్రుతగా అందామె.

అతను గ్రహించినట్టుగా కళ్లార్పాడు. ఆమె కాలం వృథా పోనీయకుండా, అతని చెవిదగ్గరగా నోరుపెట్టి అంది.

"మీ అమ్మకి జరిగిన పరాభవానికి నేను ప్రతిక్రియ చేశాను. రెడ్డిగారిని కత్తితో పొడిచాను." ఆమె ఆదుర్దాగా అతని కళ్లలోకి చూసింది. అతని పెదవులు వొణకటం మొదలుపెట్టాయి. కళ్ళలోకి ఎర్రజీర వొచ్చింది. అతి కష్టంమీద మాట్లాడటానికి ప్రయత్నించాడు. విశాల అతనివైపు జాలిగా చూస్తోంది. పాపం, కృతజ్ఞత చెప్పాలని ప్రయత్నిస్తున్నట్టున్నాడు ఆమె అతని నోటిదగ్గిర చెవిపెట్టింది.

"హం...త...కీ"

విశాల అదిరిపడ్డది. ఎవరో ఫెళ్లున చెంపదెబ్బ కొట్టినట్టయింది. ఆమెకళ్లు చీకట్లు కమ్మాయి. ఆమె ఏం ఆశించింది? ఏం జరిగింది?

శేషాద్రి ఆమెముఖం చూడటాని కిష్టంలేనట్టుగా కళ్ళు మూసుకున్నాడు.

ఇంతేనా శేషాద్రి ఆలోచనాశక్తి! ఇదేనా అతను గ్రహించింది! ఈ తండ్రీకొడుకుల వ్యవహారంలో తనెందుకు అనవసరంగా జోక్యం కలిగించుకుంది? తనకి వాళ్లతో ఏంసంబంధం? అంత అనాలోచితంగా, మూర్ఖంగా ఎలా ప్రవర్తించింది!

కళ్లకి చీర అడ్డంపెట్టుకుని వలవల ఏడ్చిందామె.

"విశాలగారంటే మీరేనా?"

"ఆమె తలెత్తి చూసింది. హాస్పిటల్ నర్స్. విశాల తలూపింది. తనవెంట రమ్మన్నట్టుగా నర్స్ సంజ్ఞచేసింది. విశాల ఆమె ననుసరించి వెడుతూ అడిగింది.

"ఎందుకు? ఏం కావాలి?"

"మిమ్మల్ని పిలుస్తున్నారు."

"ఎవరు?"

నర్స్, జ్ఞాపకం చేసుకుంటున్నట్టు ఓక్షణం ఆగి అంది.

"చంద్రారెడ్డిగారు"

"ఇక్కడి కెలా వొచ్చారు?"

"ఆయన్ని ఎవరో కత్తితో పొడిచారు. హాస్పిటల్ కి తీసుకొచ్చారు. ఆయనకి తెలివిరాగానే తన సెక్రెటరీ విశాల అనే ఆమె ఇక్కడే ఉంటారు. కబురు చెయ్యమన్నారు."

"ఎక్కడున్నారు?"

"స్పెషల్ రూమ్‌లో...అదిగో, అదే."

రూమ్‌లో రెడ్డి కళ్లుమూసుకుని పడుకుని ఉన్నాడు. పక్కన ఎవరూ లేరు. అలికిడి విని కళ్లు తెరిచాడు. అతనిని ఆస్థితిలో చూడగానే విశాలకి కొంచెం జాలికలిగింది. దగ్గరగా రమ్మని రెడ్డి సరజ్ఞ చేశాడు. వెళ్లింది.

"నేను బతుకుతానని డాక్టర్ చెప్పాడు, విశాలా."

హీనస్వరంతో అన్నాడు రెడ్డి.

"మంచిదే." కొంచెం నిర్లక్ష్యంగానే అందామె.

"కాని నువ్విలా ఎందుకు చేశావో నే నిప్పటికీ అర్థంచేసుకో లేకుండా ఉన్నాను."

విశాల మాటతప్పించి అంది.

"నన్నెందుకు పిలిపించారు?"

"శేషాద్రి కెలా ఉంది?"

"లాభంలేదు." నిర్వికారంగా జవాబిచ్చింది.

రెడ్డి కొన్ని క్షణాలాగి అన్నాడు.

"నన్ను పొడిచింది నువ్వేనని, నే నెవరితో చెప్పలేదు, విశాలా."

ఆమె తలవొంచుకుంది.

"ఇకాముందు ఎవరితో చెప్పదలుచుకోలేదు, కూడా."

విశాల అతని కళ్లలోకి ఓసారి చూసి, పొడిగా నవ్వింది.

"ఆ ఫొటో కావాలి, అంతేనా?"

"అవును, విశాలా, ఈ సహాయం చెయ్యలేవా?"

కొంచెం విసుగ్గా ముఖం చిట్లించి "అలాగే" అంది విశాల.

రెడ్డి లోలోపల ముసిముసిగా నవ్వుకున్నాడు.

"తరవాత, ఈ కథంతా నువ్వు ఎవరితో చెప్పవుకదూ?"

"సరే."

ఆమె ఒప్పుకుంటుందని తనికి తెలుసు. రెడ్డి మళ్ళీ లోలోపల నవ్వుకున్నాడు.

విశాల లేచిపోబోతూ, అంది.

"రహస్యానికి బదులు రహస్యం అనే దృష్టితో ఈ షరతులకి నేను ఒప్పుకుంటున్నానని మీ రనుకుంటున్నారు. నాకు తెలుసు. కాని అటువంటి పొరపాటేమీ పడకండి."

రెడ్డి చకితుడై ఆమె పోయినవైపే అలాగే చూడసాగాడు. విశాల సరాసరి శేషాద్రి దగ్గిరికెళ్ళింది. అతని ట్రౌజర్ జేబులో ఆ ఫొటో ఉంది. తీసి దాచింది. తరవాత అతని తలదగ్గిర నిలబడి, శ్వాసచూసింది. ఇంకా శ్వాస ఆడుతూనే ఉంది. అతని చెవిదగ్గిర నోరుపెట్టి నెమ్మదిగా అంది.

"రెడ్డిగారు చచ్చిపోలేదు. బతుకుతారు."

శేషాద్రి నెమ్మదిగా కళ్లు విప్పాడు. విశాలముఖం వికసించింది.

"అవును. రెడ్డిగారు చచ్చిపోలేదు. బతుకుతారు, డాక్టర్ చెప్పాడు."

అతను మళ్ళీ ఆవేదన పడుతున్నాడు. ఏదో అనాలని నోరు కదుపుతున్నాడు. అతని నోటిదగ్గిర చెవిపెట్టింది.

"అ...బ...ద్ధా...ల...కో...రు"

అతను కష్టంగా అనేసి, బాధగా కళ్లు మూసుకున్నాడు.

ఈసారి విశాల కళ్లకి చీరచెంగు అడ్డం పెట్టుకుని ఏడవలేదు. విషాదంగా అతని ముఖంవైపు చూసింది. మరే భావమూ ఆమె ముఖంలో ప్రస్ఫుటం కాలేదు. కొంచెంసేపయాక డాక్టర్ వొచ్చి శేషాద్రిని పరీక్షించాడు. విశాలవైపు చూసి, పెదవి విరిచి కొంచెం జాలిగా అన్నాడు.

"ఎక్కువ వ్యవధి లేదమ్మా."

"క్షమించండి, డాక్టర్ గారూ, నే నిందాకటినించీ పొరబడ్డాను. ఇతను మా సంబంధం కాదు."

అలా అని విశాల వెళ్లిపోయింది. ఆమెవైపు కొంచెం ఆశ్చర్యంగా చూసి డాక్టర్ అన్నాడు.

"పోనీ, ఇతనివాళ్లెవరైనా మీకు తెలుసా?"

"తెలియదు."

విశాల గబగబా రెడ్డిదగ్గిరికెళ్ళి అతనిమంచంమీదకి ఫొటో గిరవాటువేసి హాస్పిటల్ బయటికి వొచ్చింది. హాస్పిటల్ ఆవరణ దాటి పోబోతుండగా ఓ నడివయసులోఉన్న స్త్రీ ఆమెని ఆపింది.

"చూడండి. మీరే హాస్పిటల్ తాలూకా?"

"కాదు. ఎందుకు?"

ఆమె ఓ క్షణం తటపటాయించి అంది.

"మీకు తెలుసా? ఇందాక ఎవరినో కత్తితో పొడిచారుట. హాస్పిటలుకి తీసుకొచ్చారన్నారు."

"చంద్రారెడ్డిగారి సంగతేనా?"

"ఆఁ...ఆఁ. అవును. ఆయన ఇప్పుడెలా ఉన్నారు?"

ఆమె ఆదుర్దాగా అడిగింది.

విశాల ఆమెని పరకాయించి చూసింది.

"పరవాలేదు. ప్రాణభయం లేదని డాక్టర్ చెప్పాడు."

ఆ స్త్రీ ఏమీ అనలేదు.

"ఆయన మీ బంధువా?"

ఆమె జవాబివ్వలేదు. మళ్ళీ విశాలే అడిగింది.

"లోపలికి వెళ్లాలా?"

ఆమె తల అడ్డంగా తిప్పింది.

"మీ పేరు..."

"రాజమ్మ."

విశాల ఆమెవైపు జాలిగా చూసింది.

"ఆయనని పొడిచినవాళ్లని పట్టుకున్నారా?"

"లేదు."

"ఎవరో తెలియదా?"

"రెడ్డిగారికీ, పొడిచినవాళ్లకీ తప్ప ఇంకెవరికీ తెలియదు."

ఆమె విషాదంగా, మూఢాంగా, పొడిగా నవ్వింది. అది గ్రహించి అంది విశాల.

"నిజంగా తెలియదు."

"అత నెవరో తనకి తెలుసని రెడ్డిగారు చెప్పారా?"

"అతను కాదు—ఆమె."

ఆవిడ ఉలిక్కి పడ్డది.

"ఏమిటి...ఏమిటి?"

"అవును, ఆమె!"

"ఎవరు? ఎవరామె?"

ఆమె కళ్లలోకి చూసింది విశాల. తరవాత ఉద్రేకాన్ని అపుకుంటూ దృఢంగా, నెమ్మదిగా అంది.

"ఎవరో కాదు. నేనే. నేనే రెడ్డిగారిని పొడిచాను."

"నువ్వా? నువ్వా? ఎందుకు?"

ఎందుకు?

ఎందుకు?

తుపానులా విశాలమనసులో భావసంచలనం రేగింది. ఎందుకు, ఎలా సాహసించగలిగింది? తనలో అణగిఉన్న ఏ శక్తి, ఎందుకు విజృంభించింది? తనలోని ఏభావం, ఏ ప్రేరేపణకి ఉద్రిక్తమైంది?

కేవలం రెడ్డి ప్రవర్తనకి అసహ్యించుకుని ఆ క్షణికోద్రేకానికి వశమై అలా ప్రవర్తించటం దుస్సాధ్యం.

రాజమ్మ నైరాశ్యం తలుచుకుని తను చలించిందా? కాని రాజమ్మ ఎవరు? తనెవరు?

తనెందుకు లేనిపోనివాటిని గురించి ఆలోచిస్తోంది. సందేహంలేదు. ఆ క్షణాన తనంతగా ఉత్తేజితురాలు కావటానికి కారణం—మూర్తీభవించిన నిస్పృహలా అయిపోయిన శేషాద్రి; తను చేయదలుచుకుంది చెయ్యగలిగే, చెయ్యలేని నిస్సహాయ స్థితిలో మానసిక సంక్షోభం పొందుతున్న శేషాద్రి; పశ్చాత్తప్తుడై ప్రాణత్యాగానికి సిద్ధపడ్డ శేషాద్రి; మనోవేదనతో మరణిస్తున్న శేషాద్రి. ఆ సానుభూతితోనే తను...కాని...కాని...

విశాల మనసులో ఏదో వెలితిగానే ఉంది. హఠాత్తుగా ఆమె విద్యుద్ఘాతం తగిలినట్టుగా నిలువునా వొణికింది. కాని మరుక్షణంలో తననిచూసి తనే నవ్వుకుంది. తను అంత మూర్ఖురాలవుతోందేం? ఈ ఆలోచనల వేడికి తన బుర్ర చెడిపోతోంది. ఆమె కళ్ళముందు హేయమైన, దుర్భరమైన, క్రూరమైన ఆకృతితో శేషాద్రి తాండవించాడు. ఆమె వొళ్లు జలదరించింది. ఆక్షణంలో ఆమెకి శేషాద్రిమీద అసహ్యంతోపాటు తీవ్రమైన క్రోధం కలిగింది. జరిగిందంతా మళ్ళీ ఆమె కళ్ళముందు కనిపిస్తోంది. ఆమె కళ్ళలో నీళ్లు తిరిగాయి. ప్రాణప్రదంగా, పదిలంగా, మురిపెంగా, సుకుమారంగా పోషించుకుంటూ రక్షించుకుంటున్న తన ఇరవై ఏళ్ళ యవ్వనాన్ని—పాలపొంగులాంటి ఏ యవ్వన సౌందర్యాన్ని చూసుకుని తను మురిసిపోతూ, గర్విస్తోందో ఆ యవ్వనాన్ని—తన యావదాస్తి అయిన కన్యాత్వాన్ని...ఒక్కత్రుటిలో కొల్లగొన్నాడు శేషాద్రి, బలవంతంగా, దౌర్జన్యంగా. తానిక అనాఘ్రాతపుష్పం కాదు. యవ్వన మధువు నాస్వాదించిన మొరటుతుమ్మెదలా శేషాద్రి ఆమెముందు తాండవించాడు. తానిక అనాఘ్రాత పుష్పంకాదు. తననించి ఏదో వేరయిపోయింది. ఆమె గుండె గతుక్కుమంది. శేషాద్రి తననించి ఏదో...ఏదో దొంగిలించుకు పారిపోతున్నాడు. తటాలున ఏదో అనిర్వచనీయమైన అనుభూతి ఆమెహృదయంలో అస్పష్టంగా మారుమూల చిన్న మెరుపులా మెరిసి తటాలున అదృశ్యమైంది. ఏమిటి... ఏమిటది? ఆమె ఆతృతగా తనని ప్రశ్నించుకుంది. కాని సమాధానంలేదు. ఆమె నిట్టూర్చింది.

శేషాద్రి! ఈ రెండు మూడు గంటలలో తన జీవితంమీద అతనెంత ప్రభావం చూపించాడు. ఎంతగా తన భావాల్ని కదిపాడు! తృణప్రాయంగా చూసి ఏడిపించింది; నవ్వుకుంది; కసురుకుంది; చీదరించుకుంది; ఏవగించుకుంది; భయపడ్డది; బతిమాలుకుంది; జాలిపడ్డది; నివ్వెరపడ్డది; తృణీకరించింది.

తనలో ఏ దౌర్బల్యంవల్లో ప్రేరేపించబడి ఆ అపాత్రుడికోసం, ఆ అనర్హుడికోసం, అనాలోచితంగా, అనవసరంగా తనకి ప్రమాదం తెచ్చిపెట్టుకోటానికి కూడా సాహసించింది. ఇదంతా ఆ స్వార్థపరుడికోసం, తననిగురించి ఆలోచించటానికి కూడా తాహతులేని ఆ కృతఘ్నుడికోసం, అర్థంచేసుకోగల పటిమలేని ఆ సామాన్య మానవుడికోసం, తన కన్యాత్వాన్ని అపహరించిన ఆ దుర్మార్గుడికోసం...విశాల మనసులో అస్పష్టభావం ఏదో మళ్ళీ మెరుపులా మెరిసి అదృశ్యమైంది.

శేషాద్రి దౌర్జన్యం, కృతఘ్నతా, సంకుచితత్వం విశ్వరూపాలు ధరించి విశాల మనసులో భీకరనృత్యం చేస్తున్నాయి. ఆమె హృదయాన్నీ, అహాన్నీ గాయపరుస్తున్నాయి. హృదయంలో మినుకు మినుకుమనే అస్పష్టకాంతితో ఏదో గుర్తించటానికి ప్రయత్నిస్తున్న విశాల మనోనేత్రాల్ని ఆ నల్లటి ఆకృతుల నీడలు అడ్డగిస్తున్నాయి.

అలా ఆలోచనల్లో తేలిపోతున్న విశాల మనసుని అకస్మాత్తుగా, భయంకరమైన ఓ కొత్త ఆలోచన బాకుపోటులా పొడిచింది. "తనకి శేషాద్రిలాంటి కొడుకు పుడితే...!" ఆమె నిలువునా వొణికింది. ఆమె కళ్లముందు మనుషుల ప్రపంచం గిరగిర తిరగసాగింది. పడిపోతున్న విశాలని రాజమ్మ గభాలున పట్టుకుని కౌగలించుకుంది.

గిరగిర తిరిగే ఆ మనుషుల ప్రపంచంలో ఎవరో వ్యక్తి తనవైపు చూస్తున్నాడు. ఎవరు? ఎక్కడ చూసిందతన్ని? ఓ శేషాద్రి! శేషాద్రి! అతనే! అదేమిటి, అలా ఉన్నాడేం? ఆ అసహ్యాకరమైన రూపం ఏదీ? ఆ క్రౌర్యమైన చూపు, ఆ స్వార్థం, ఆ దుర్మార్గం, అవన్నీ ఏమయాయి? తనవైపు చూస్తున్నాడు. మందహాసం చేస్తున్నాడు, తననించి ఏదో దొంగిలించుకుపోయిన శేషాద్రి! ఏమిటి? ఏమిటది? ఓ! తనకంతా తెలిసిపోతోంది.

ఆ అవ్యక్తావస్థలో విశాల పెదవులు మందమందంగా హసించాయి.

ఇంతసేపటినించీ ఏ చీకటి తెరలు ఆ నిజాన్ని తననించి దాయగుపరిచాయి? అయ్యో, అదేమిటి? ఆ నల్లటి ఆకృతులేవో అతన్ని చుట్టుకుంటున్నాయి. అలా అయిపోతున్నాడేం శేషాద్రి?

అదే క్షణాన ఆమె కళ్ళముందు గిరగిర తిరిగే ఆ మనుషుల ప్రపంచం అదృశ్యమైంది. విశాల గభాలున కళ్లు తెరిచింది. తను రాజమ్మ కౌగిటిలో ఉంది. తనలా ఎందుకుందో వెంటనే ఆమెకి అర్థం కాలేదు. నెమ్మదిగా విడిపించుకుంది, ఆమె కౌగిలినించి. క్షణంక్రితం తనకి కలిగిన అనుభూతి ఆమెకి అస్పష్టంగా జ్ఞాపకం రాసాగింది. ఆలోచించే కళ్ళతో ఆమె యథాలాపంగా రాజమ్మ వైపు చూసింది. ఏదో జవాబుకోసం నిరీక్షిస్తున్నట్టుగా ఉన్న ఆమెముఖం చూడగానే విశాలకి ఆమె ప్రశ్న జ్ఞాపకంవొచ్చింది, అకస్మాత్తుగా.

"ఎందుకు...?"

క్షణం క్రితంతనకి కలిగిన అనుభూతి అస్పష్టంగా జ్ఞాపకం రాసాగిం దామెకి. ఏదో సూచన చటుక్కున మనసుకి తట్టింది. అలా తట్టీ తట్టగానే చప్పున ఆలోచించటం మానేసిందామె. వెర్రి మొర్రి ఆలోచనలు! ఇలా తన మనసు తన నెందుకుమోసం చేస్తోంది? అన్నీ వొట్టిది. ఎవరో పకాలున నవ్వినట్టనిపించిం దామెకి. దొంగతనంగా రాజమ్మవైపు ఓసారిచూసి, చివాలున అక్కణ్ణించి కదిలి చకచక హాస్పిటల్ బయటికి నడిచిపోయింది, విశాల.

రాజమ్మ నిర్ఘాంతపోయింది.

---

# దంపతీనవకము

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ

ఓసి! కురంగి! యొందుఁ దపమొండు చరించి రచించి తివు? నీ
వాస సుఖంబు భోజన మవారితరీతి లభించు చుండ ని
ద్రా సతి తోడ స్వేచ్ఛగ యథాతథ భోగము లంది జన్మమున్
త్రాసము లేక శుద్ధముగ ధర్మపథంబునఁ బెట్టుచుందువే!

తృణములు మేసి తృప్తి గని తీరని కోరికలెల్ల తీర్చి కొం
చణువుగ జీవనాళముల నాయువు పోయుచు చెంగుచెంగులన్
దోణికినలాడు నందములతో విహరింతువు నన్నుఁ గూడినన్
ప్రణవము నేర్పు చుందువు ప్రభాత పునీత పరీత కర్మలన్.

ఈ భయ విహ్వలార్ద్రిరస దృక్కలికాగ్ర తలాశ్రుణంబులో
శోభిలు సత్త్వమున్ దవిలి శోక దవానలకీలలన్ మదీ
యాభయ దానముద్రిక రయంబున భస్మము చేయు దీవు వి
ద్యాభృతి కిద్ది యోగ్య మని యవ్యయ భక్తి చరించితే సఖా!

నీదు శరీరకాంతి నవనీత మధుచ్యుత వాహినీ గతిన్
ప్రోదిగఁ జేసి నే నవయఁ బువ్వదళంబుల నుల్లి ముంచుచున్
స్వాదురసంబు గ్రోలఁ గల శ్వానము నాడఁగ నీయవైతి గా
వాదు కృతార్థతా ఫలము నారల చేతఁ జేతు తొడ్డుకా,

చూచిన చూపు చూడక ప్రసూన మరంద విశాల పాత్రికా
సూచిత నర్మ గర్భ రసశోభిత నాట్యవిరాజితార్ద్రి) సం
కోచ దృగంచలాహతులఁ గోవిదకోటి యెడందఁ జీల్చి నీ
నోచిన నోములన్ జెలఁగి నూత్నత నిచ్చలు గూర్చుకొందువే!

ఓయి! కురంగ! హృత్కమల జోద్భవ మన్మథ మన్మథాంక రా
గాయత పంచ బాణ పరిహాస చణోత్తమ మూర్తి! నాకు నీ
సాయముతోడఁ గావలయు సాహస కృత్య మపేక్ష సేసి నా
ప్రాయము ధారవోసి నిను భావములోపల మెచ్చితిన్ సఖా!

చిరువన్నెల్ కురువన్నెలున్ గళమునన్ జెన్నార శృంగంబు లో
వరుసల్ వంకలు దిద్ది ముద్దు లొలుకన్ వాల్లభ్యలభ్యంబు లౌ
సిరులవ్వారిగఁ జిందు లాడఁగనులన్ జెంగల్వ పుష్పాల్లు వా
నరతే జోవహ వైభవాభిరతి నస్రాంతమ్ము మమ్మేలుతన్.

మునికన్యల్ లలితేందు బింబముఖ జాంబూద్వీపసౌగంధ్య సం
జనితాఖండల మానసాహరణ చంచచ్చంచరీక ప్రభా
వ, నినాదాంచిత మన్మథప్రణవ, శబ్ద ప్రాభవోపేత నే
త్ర నవాంభఃప్రద విద్యు దున్మిళిత సంతానంబులం గాంత్రుగా.

తెలి నులి చల్ల వెన్నెలల తేరున తీరులు తీర్చి మైదు గా
లుల ముడివెట్టి బొమ్మకయి లోతులచేఁ తల నేర్చు చూపు తీ
వులగమి నీదు కన్నులది పుష్పొడి సోనల ముంచి యెత్తి జీ
వుల యెడదన్ గవిత్వపరిపూర్ణకథా జయలక్ష్మి నిల్పెడిన్.



# రాజ్యతంత్ర పరిణామము తారతమ్యదృక్పథము: భవితవ్యము

శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు

* రాజ్యతంత్రమునకు మూలాధారము శాస్త్రబద్ధమగు రాజనీతి. రాజనీతి, ధర్మశాస్త్రము ఆదినుండియు భారతీయుల నాకర్షించినవి. ఇందుకు పునాదులు ధర్మశాస్త్రము, కౌటిల్యుని అర్థశాస్త్రము. ప్రముఖన్యాయశాస్త్రకోవిదుడగు మార్గన్ పండితుడు భారతీయులకు న్యాయశాస్త్రమునెడగల అభిరుచిని బాతులకు నీటి ఎడగల ప్రీతితో పోల్చెను. న్యాయశాస్త్రమును, రాజకీయములను సాంఘిక పరిస్థితులనుండి వేరుచేయుట సాధ్యముకాదు. రాజ్యతంత్ర ప్రవీణులగు డాక్టరు అల్లాడి కృష్ణస్వామిగారు సెలవిచ్చినట్లు, "వివిధ దేశములందలి ఉద్యమములయొక్క చరిత్రను, ఆర్థిక సాంఘిక పరిణామములను, ప్రభుత్వముయొక్కయు ప్రజలయొక్కయు వైఖరిని పూర్తిగ అవగాహనచేసుకున్నతదుపరి మాత్రమే, న్యాయవాదులు, న్యాయమూర్తులు రాజ్యాంగసూత్రములను సక్రమముగను సవ్యముగను నిర్వచింపగలరు."

రాజ్యతంత్రము చట్టబద్ధముగ రూపొందవలెను. చట్టబద్ధమగు ప్రభుత్వము వ్యక్తిస్వాతంత్ర్యమును ప్రజాహితమున కనువగునట్లు సంరక్షింపవలెనని చరితార్థుడగు అమెరికను అధ్యక్షుడు వుడ్రో విల్సను, చెప్పియుండెను. ప్రభుత్వముయొక్క కార్యకలాపములను కట్టుబాటునందుంచుటయే రాజ్యతంత్రమని శ్రీ. సి. జె. ఫ్రైడిచ్చి, వక్కాణించియున్నాడు. హైందవ రాజ్యతంత్రము ఆదినుండియు ధర్మబద్ధమైనది. అందు ధర్మమే అధినేత, పాలకులు ధర్మమును నెరవేర్చు తాబేదార్లు మాత్రమే. ధర్మమును సంరక్షించుటవల్లనే రాజు, రాజ్యాధినేత యగుచున్నాడని కౌటిల్యుడు అర్థశాస్త్రమందు నిర్వచించెను. ధర్మమే రాజాధిరాజని, బృహదారణ్యకోపనిషత్తు నొక్కి వక్కాణించుచున్నది. ప్రజాస్వామిక వ్యవస్థ, ఆదర్శములందు, ఆచరణలోను ఇటీవల వివిధగతుల మార్పు చెందుటచే నేటి వ్యవస్థ ప్రాచీన భారతమందలి వ్యవస్థయొక్క ప్రతిమయని చెప్పుట సాహసము. కాని ప్రాచీనులు పరిపాలనా వ్యవస్థయందలి నిరంకుశత్వమును ప్రజాహితమున కనువగురీతిని అరికట్టెడువారని నిర్భయముగ చెప్పవచ్చును. ఆధునిక ప్రజాతంత్రమందు పాలకుల స్థాన మాక్రమింప ప్రయత్నించువారి కర్హత లవసరములేదు. కాని అట్టి అజ్ఞానులగు పాలకులు సృష్టించెడు చట్టములను ప్రముఖన్యాయవాదులు తర్కించిన తదుపరి ఉన్నత న్యాయస్థానమందలి న్యాయమూర్తులు నిర్వచింపవలసియున్నది. వయోజనవోటింగుహక్కు మామూలు మనిషిస్థాయికి పునాది. కాని వివేకవంతులే చట్టనిర్మాణము చేయవలెనని మహాభారతమందిట్లు చెప్పబడియున్నది :—

> సర్వేషాం యః సుహృన్నిత్యం
> సర్వేషాం చ హితే రతః
> కర్మణా మనసా వాచా
> స ధర్మమ్ వక్తు మర్హతి.

తాత్పర్యము :—అందరియొక్క మేలునుకోరువాడు ప్రతి వ్యక్తిపురోభివృద్ధికి ఏది శ్రేయోదాయకమో యెరిగినవాడు, మనోవాక్కాయ కర్మలందు పరోపకార బుద్ధికలవాడు, తనంతట తాను సత్పురుషుడు అయినవాడు మాత్రమే ఉత్తమధర్మమును నిర్ణయింపగలడు. మహాభారతములోని 'విదురనీతి' యందు ఉత్తమ పురుషుని లక్షణము ఈ విధముగ నిర్వచింపబడినవి.

> ప్రయోజనేషు యే సక్తాః
> నవిశేషేషు భారత
> తాన్ అహమ్ పండితాన్ మన్యే
> విశేషాస్తు ప్రసంగినః

తాత్పర్యము :—"మూలసూత్రములపై తమ దృష్టిని కేంద్రీకరించువారే వివేకులు. మూలసూత్రములను గురించి శ్రద్ధవహించుచో అందుకు సంబంధించిన అనుబంధవిషయములు తమంత తామే సక్రమగతిని సాగిపోవును." రాజ్యతంత్రమునకు రాజ్యాంగమునకు గల తారతమ్యమును చతురుడగు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు సూత్రప్రాయముగ ఇట్లు

---

* మదరాసు బారుకౌన్సిలువారి ప్రత్యేకాహ్వానముపై రచయిత (శ్రీపంద్రంగి రాజేశ్వరరావు, అడ్వకేటు, ఏలూరు) ఫెడరల్ కోర్టు మాజీ న్యాయమూర్తియగు శ్రీ. సర్. యస్. వరదాచారిగారి అధ్యక్షతక్రింద హైకోర్టు న్యాయవాదుల సమక్షమున ఆంగ్లమున ఇచ్చిన "ఎర్డ్ లీ నార్టను స్మారక వుపన్యాసము" (Eardley Norton Memorial Endowment Lecture) నకు అనువాదము.

క్రోడీకరించినారు :—"రాజ్యతంత్రము పురుషుడు. రాజ్యాంగము ప్రకృతి. రెంటిని సమన్వయపరచి సంపుటీకరించినపుడే రాజనీతి రక్తి కట్టును." ఇది ఒకతరమునకు దేశమునకు సంబంధించినది కాదు. అంతర్వాహినిగ సదా చలించెడు తత్వము. ఆయా దేశములందు కాలపాత్రానుసారము ఫలితములు చేకూరును. దీనిస్థితి, గతి, గమనములు సతతము మారుచుండును. ఒక నమూనా తప్ప వేరొక తరహా ఒప్పు అని నిర్వచించుట కష్టమేగాక సాహసమనిపించుకొనును. తారతమ్యమును మాత్రమే గుర్తింపవలసి యున్నది.

సజీవమగు రాజ్యాంగముయొక్క రహస్యములు అచ్చునందు గోచరింపవు. డైసీ ఆచార్యుని సిద్ధాంతానుసారము న్యాయశాస్త్ర దృష్టియందు, అందరునుసమానులే అను మూలసూత్రమును గుర్తించి తదనుగుణముగ అందరకురక్షణ కల్పించుచు రాజ్యాంగము సవ్యముగను సక్రమముగను పనిచేయుటకు న్యాయశాఖకు ప్రముఖస్థానముండవలెను. న్యాయమూర్తులు వ్యక్తి స్వాతంత్ర్యమును, సంఘాభ్యుదయముతో సమన్వయపరుపవలెను. ఇందులకు న్యాయవాదులు కూడ ఇతోధికముగ తోడ్పడవలసి యున్నది. తమతమ అంతస్థును, హోదాను, వివేకయుతమగు ధైర్యసాహసములతో నిలబెట్టుకోవలెను. ప్రభుత్వాధికారమునకు గల హద్దులను నిర్ణయించుట సులభసాధ్యముకాదు. అమెరికా సంయుక్తరాష్ట్రములందలి సుప్రీము కోర్టు న్యాయమూర్తియగు, ఫ్రంకుఫర్టరు చెప్పినట్లు, "రాజ్యాంగమనగా కేవలము అచ్చులోగల ప్రతికాదు; గమనముగల సజీవమగు సంస్థ. రాజ్యాంగమునకు నిత్యజీవనమందలి కార్యకలాపములకు గల సంబంధమును సృష్టించుటయే ఉత్తమ రాజనీతి," ఈసందర్భమున శ్రీ ఈటన్‌డ్రోన్‌యొక్క అభిప్రాయమును గుర్తించవలెను. "న్యాయస్థానములకు వచ్చు కక్షులను మాత్రమే విమర్శించి తీర్పు చేయుట సాధ్యము. కాని అధ్యక్షుడు, కాంగ్రెసు, రాష్ట్రములు తమకులేని అధికారములు ఉపయోగించినను, తమకుగల అధికారములను దుర్వినియోగముచేసినను న్యాయమూర్తులు తమంతట తాము ఏమియుచేయజాలరు." కాని వీత్రోవనో, ఒక త్రోవను న్యాయస్థానమునకు అర్జీవచ్చినపుడు అశాస్త్రీయముగ పౌరుల హక్కులకు భంగముకలుగకుండ జూచుట న్యాయమూర్తుల విధ్యుక్తధర్మము.

రాజ్యాంగము చట్టరూపముగ నున్నను దానికి నైతికాధికారముకూడ కలదు. భూత వర్తమాన, భవిష్యత్తుల సముచ్చయమే దాని స్వరూపము. వ్యక్తులవలెనే వయస్సుతో దీని గౌరవప్రతిపత్తులు వృద్ధియగును. ప్రజాప్రభుత్వమును శాస్త్రసమ్మతముగ నుండునట్లు చూచుటయే ప్రధానసమస్య. సమదృష్టితో అధికారమును, స్వాతంత్ర్యమును పటిష్ఠముచేసినపుడే స్థిరత్వ మేర్పడును. స్వాతంత్ర్యముగల దేశములందలి పౌరులు అచట అధికారము చలాయించువారు తమ ప్రతినిధులని, వారిని మార్పుచేయు అధికారము తమకుకలదని భావించెదరు. క్లిష్ట పరిస్థితులందు దేశస్వాతంత్ర్యమును, భద్రతను, వ్యక్తుల పౌరసత్వపు హక్కులను సమన్వయపరచుట సాధ్యముకాదు. మూడింటికి సమానమగు ప్రాధాన్యముకలదు. సాధారణముగ ఏదిముందు ఏదివెనుక అను ప్రశ్న లేదు. ఈసందర్భమున అమెరికా సుప్రీము కోర్టువారి అభిప్రాయము గమనార్హమైనది :—"అత్యవసర పరిస్థితులు అధికారమును సృష్టింపజాలవు; తత్రాపి ఉన్న అధికారములు వృద్ధికావు. అట్టి పరిస్థితులవల్లఉండుకున్న అధికారములను మాత్రమే అసాధారణముగ వుపయోగించుట యుక్తియుక్తముగ పరిగణింపబడును." "ప్రభుత్వము పౌరుల స్వాతంత్ర్యమున కతీతమగు రీతిని బలపడవలెనా లేక తన్ను తాను సంరక్షించుకోలేనంతగా బలహీనత నొందవలెనా ?" అని అబ్రహాము లింకను వేసిన నాటి ప్రశ్నకు సంతృప్తికరమగు సమాధానమావశ్యకము. ఎవరు దీనిని నిర్ణయింపవలెను ?, అనెడు ప్రశ్న యింతకన్న ముఖ్యము. సర్వసాధారణముగ అధికారమందున్నవారే దీనిని నిర్ణయింతురు. అందుచేత నామమాత్రమగు ప్రజాస్వామికము స్వాతంత్ర్యమును రక్షింపజాలదు. ఐరోపాయందు ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము వెర్సెలీసు సంధిజరిగిన పిమ్మట ఏర్పడిన ఉద్రేకపూరితమగు అసాధారణ పరిస్థితులవల్ల నుత్పన్నమైన భయము వలన నియంతృత్వ మేర్పడినది. భయభ్రాంతులగు ప్రజానీకము ఏకైక నాయకుని యెడ గ్రుడ్డిగ భక్తిని ప్రకటించుటయే తరుణోపాయమనిఎంచిరి. ఇరువది యవశతాబ్దపు యూరపుచరిత్రను పరికించుచో ప్రజానీకము భద్రతకొరకై స్వాతంత్ర్యమును బలివేసినట్లు ధ్రువపడును. ప్రజాతంత్రమువలెనే జాతీయభద్రతకూడ వివిధదేశములందు తరుచు తప్పుత్రోవలను త్రొక్కినది. భద్రతయను సాకుతో దారుణములకు పాల్పడిరి. జర్మను జాతీయరక్షణ అనుమిషతో హిట్లరు ఆష్ట్రియా, జెకోస్లేవేకియాలను కబళించి పోలెండుపై దండెత్తెను. స్టాలిను ఉపగ్రహకూటమును సమకూర్చుకుని భద్రత పేరిట గిరి గీసినాడు. రెండవ ప్రపంచయుద్ధపు ప్రథమయామములో భద్రతకొరకని తూర్పు యూరపు రాజ్యములను ఇష్టము వచ్చినట్లు పంచుకొనిరి. భయమువలన నిరంకుశత్వము, నిరంకుశత్వమువలన క్రూరత్వమును ఉద్భవించునని, మాంటెస్క్యూ చెప్పియున్నాడు. భయమువలన సహనము నశించును. అసహనము నిర్బంధమునకు త్రోవతీయును. అపుడు అధికారయుతమగు అహంభావమునకు విమర్శ బలియగును. ప్రొఫెసరు. హెరాల్డు జె. లాస్కీ చెప్పినట్లు,నిర్బంధమునకు గురియగు వానియందు టక్కరితనము,బానిసత్వము, నిర్బంధించు వానియందు క్రూరత్వము, అహంభావము ప్రకోపించును. దండనీతి చివరకు ప్రమాదభరితమగు పరిణామములను కల్గించునని వివిధ విప్లవముల చరిత్ర ఘోషించుచున్నది. ప్రతిఘటన నిర్బంధమువలన తాత్కాలికముగ అణగునుగాని అంతరింపదు; తరుణము చిక్కగనే విజృంభించును. కనుక ప్రతి ఘటనను స్వతంత్ర వాతావరణమందు ఎదుర్కొనుట శ్రేయస్కరము. విమర్శయెడ సహనములేకపోవుటయే నియంతృత్వ చిహ్నము. "నీవు చెప్పెడు మాటలను నేను ఎంతమాత్రము అంగీకరించను. కాని నీ అభిప్రాయములను నిర్భయముగను బాహాటముగను వెలిబుచ్చుటకు గల హక్కును నేను జీవించియున్నంతవరకు సంరక్షించెదను" అను మాటలతో వాల్టైరు ప్రజాతంత్రవాదము నుద్ఘాటించెదను.

విమర్శ ప్రజాహిత జీవితమునకు ప్రాణవాయువువంటిది. నిజాయితీగల పౌరుడు అవసరమగునపుడెల్ల ప్రభుత్వమును హేతుబద్ధ

సుగ విమర్శించును. కాని శ్రేయోరాజ్యమందే అట్టి నిజాయితీ గుర్తింపబడును. ఆప్యాయత చట్టరీత్యా ఉత్పన్నము కాదు. ఎవరికైనను ఒకానొక వ్యక్తియెడగాని సంస్థయెడగాని యిష్టము లేనిచో వారివారి అయిష్టతను శాంతియుతముగను నిర్భయముగను వెలిబుచ్చు అధికారముండవలెను. ప్రభుత్వయంత్రము నిర్దుష్టముగ నుండగలదని ఎవ్వరు వాదింపరు. వ్యక్తికి ప్రభుత్వమునకు గల అవినాభావ సంబంధము మంచిచెడ్డల తారతమ్యమును బట్టియుండును. వ్యక్తి స్వాతంత్ర్యమునకు, స్వైరవిహారమునకుగల భేదమును గుర్తింపవలెను. తమకుగల అభిప్రాయములను ప్రజానీకమునకు నచ్చచెప్పి తమవైపునకు త్రిప్పుకొనుట వ్యక్తి స్వాతంత్ర్య మనిపించుకొనును. ఈపనినే దౌర్జన్యముతో సాధించుట స్వైరవిహార మనిపించుకొనును. జితేంద్రియులే వ్యక్తి స్వాతంత్ర్యమున కర్హులని ఎడ్మండుబర్కు సూత్రప్రాయముగ చెప్పియున్నాడు. నియంతృత్వముక్రింద స్వాతంత్ర్యము వ్యక్తులనుండి సంఘమునకు దానినుండి ప్రభుత్వమునకు సంక్రమించునని చరిత్రచాటుచున్నది. అట్టి ప్రభుత్వము ప్రజాభిప్రాయమునకు కట్టుబడదు. ప్రభుత్వయంత్రమందు యావదధికారమును కేంద్రీకరించుటయే నియంతృత్వమునకు కొండగుర్తు. "అధికారమునకు వ్యక్తిని చెరచు స్వభావముకలదు. అధికారమును పూర్తిగ హస్తగతము చేసుకున్న వ్యక్తి మొదలంట చెడునని" యాక్టను ప్రభువు నుడివియున్నాడు. అధికారములోనికి రాగనే సన్మార్గానురక్తులగు సర్వజ్ఞుల మనెడు భావముదయించునని తత్వవేత్తయగు డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ సిద్ధాంతీకరించిరి. అంతటితో ఆగక అట్టి భావము దశదిశల విజృంభించును.

ప్రజాభిమతమును చూరగొనని ఏ ప్రభుత్వమునకు భద్రతలేదు. నియంతృత్వమందు సద్భావము సంస్కారము ఉండవచ్చును. అది ప్రజల శ్రేయోభివృద్ధికి పాటుబడవచ్చును. కాని అది ఎన్నటికి ప్రజాతంత్రము కాజాలదు. మరియు నియంతృత్వమందు మొదట పొడగట్టెడు సద్భావము సంస్కారము అచిరకాలములోనే నశించును. అధికారతృష్ణ ఆనాటికానాడు పెచ్చుపెరుగును. కట్టుదిట్టమగు పోలీసు రాజ్యమందును, జిగిబిగిగల శ్రేయోరాజ్యమందును వ్యక్తి స్వాతంత్ర్యమునకు గల అంతస్థును ఇదమిత్థమని తేల్చుట కష్టతరము. ఆధునిక ప్రపంచమందు నడవడికితోడు భావనా స్వాతంత్ర్యము సహితము కుంటువడినది. ఇట్టి కుదింపులను ఒప్పుకోక తప్పని పరిస్థితు లేర్పడినవి. ఇందలి కీలకమును గ్రహించుటయే రాజనీతి.

పార్టీప్రభుత్వమునకు, రాష్ట్రమునకు, జాతీయతకు గల తారతమ్యమును గుర్తునందుంచుకొనినచో ప్రమాదము సంభవించును. ఇట్టి పరిణామములను గ్రహించియే రాజకీయవేత్తలు వ్యక్తి స్వాతంత్ర్యమునకు ప్రముఖస్థానమిచ్చిరి. బ్రిటిషు రాజ్యాంగమందు వ్యక్తి స్వాతంత్ర్యము, సౌష్ఠవము సుస్థిరముగనుండుటచేత సోవియట్ రష్యాను సదా స్తోత్రముచేయు కేంటర్ బరీ మతగురువగు డాక్టరు హ్యూలెట్ జాన్సన్ బ్రిటిషు ప్రభుత్వమిచ్చు వేతనముతో జీవితయాత్రను గడపుచున్నాడు. ప్రముఖ పాశ్చాత్యతత్వవేత్తయగు బెర్ట్రాండు రస్సెలు చెప్పినట్లు, "మనకు ప్రేమపాత్రులగు వారియెడ మనము సహజముగ ప్రవర్తింపవచ్చును. మనకు అయిష్టతగల వ్యక్తుల విషయములఎడ తప్పక నిష్పక్షపాతముగను హేతుబద్ధముగను ప్రవర్తింపవలెను. వ్యక్తి స్వాతంత్ర్యమును వర్జించి సంఘనిర్మాణమును చేయుట తగని పనియని గాంధీజీ అభిప్రాయము. స్వాతంత్ర్యము లేనపుడు వ్యక్తిత్వము నశించును. ప్రజాస్వామికము ఆత్మరక్షణకై వ్యక్తి స్వాతంత్ర్యమును బలినివ్వరాదు. అందుచేత ప్రాథమిక హక్కులులేని జాతీయ స్వాతంత్ర్యము నిరర్థకము. పౌరులను గదమాయించి, భయపెట్టి, అకట్టుటగాక, వారు నిర్భయముగను స్వేచ్ఛగను తమ జీవితములను ఒరులకు యిబ్బందిలేనట్లు గడపునట్లు చేయుటయే రాజ్యతంత్రముయొక్క పరమావధి.

ఆధునిక పరిస్థితులలో యథార్థమగు ప్రజాస్వామికమును నిర్మించుట కష్టతరమని ఏదోవొక విధముగ పార్టీ అధ్వర్యము అనివార్యమని వాదించువారు కలరు. జాతీయాధికారము రాజ్యతంత్రమును వర్జించి ప్రభుత్వపు మనుగడలలో అంతర్భాగమైనదని అమెరికన్ రచయిత డాడ్ చెప్పియున్నాడు. "దేశక్షేమము ముఖ్యమా లేక రాజ్యాంగ సంరక్షణ ముఖ్యమా" అను ప్రశ్నకు అబ్రహాము లింకను యిచ్చిన సమాధానము గమనార్హమైనది. "స్థూలముగ ప్రాణముతోపాటు సకలావయవములను కాపాడవలయును. కాని ప్రాణాపాయ పరిస్థితులందు కొన్ని అవయవములను శస్త్రము చేయుట అనివార్యము కావచ్చును. లేనిచో ప్రాణములేనపుడు అవయవములు నిరర్థకము." సూక్ష్మదృష్టితో పరిశీలించినపుడు, రాజ్యమునకు, స్వాతంత్ర్యమునకు ఎట్టి విరుద్ధములేదు. సర్వాంగసౌష్ఠవము, పుష్టి, దూరదృష్టిగల రాష్ట్రమే వ్యక్తి స్వాతంత్ర్యమును, సంఘస్వాతంత్ర్యమును సంరక్షింపగలదు. భద్రతలేని రాజ్యమందు స్వాతంత్ర్యమునకు తావులేదు. క్రమభద్రమగు స్వాతంత్ర్యము కావలెనన్న అధికారమున్న చలాయించగల రాష్ట్రముండవలెను. రాష్ట్రమునకెంత అధికారముండవలెననునదియే ముఖ్యమగు ప్రశ్న. అధికారమందుండదలచిన ప్రభుత్వము అస్త్రసన్యాసము చేయజాలదని సిద్ధాంతీకరించినను, ప్రభుత్వాధికారము ప్రజాభిమతమునకు విరుద్ధముగ నుండరాదు. ధర్మము, అధికారముయొక్క చాటున దాగినపుడు అనుమాన మేర్పడి పెనుభూతముగ పరిణమించును. సంఘవిద్రోహము నరికట్టుట ప్రభుత్వముయొక్క ప్రధానవిధి. కాని అట్టి కార్యక్రమమందు సంస్కారమును ప్రతిఘటించుట పతనహేతువగును. ప్రజానీకమును దుర్బలులుగను నిర్వీర్యులగను చేసి శాంతిభద్రతలను ప్రతిష్ఠింప బూనుట కూడనిపని. సక్రమమగు విమర్శకు రాజద్రోహమునకు గల తారతమ్యము సూక్ష్మతరమైనప్పటికిని అధికారమందున్న పార్టీని ప్రతిఘటించుట రాజద్రోహముగ పరిగణింపరాదు. యాక్టను ప్రభువుచెప్పినట్లు "స్వాతంత్ర్య, సురాజ్యముల నడుమ ఎట్టి వ్యతిరేకతలేదు. రెండును మైత్రితో పురోగమింపవచ్చును."

రెండవ ప్రపంచ యుద్ధానంతరము రాజ్యతంత్రము వికసించుట శుభసూచకము. ఫ్రాన్సు జపాను ప్రజలు, వెనిజులా, బర్మా, ఇండియా, లిబియా వగైరా దేశములందు నూతనరాజ్యాంగప్రణాళికలు అమలులోనికి వచ్చినవి. నవచైనా రాజ్యాంగము నీ శ్రేణియందు

చేర్చుటకువీలులేదు. ఎందుచేతనంటే అందలిప్రథమసూత్రములో ఆ ప్రభుత్వము ప్రజాస్వామిక నియంతృత్వమని అందలి అధినేతలు కార్మికులని వారు దేశమందలి వివిధ ప్రజాస్వామికవర్గముల బలముతో పనిచేయుదురని నిర్వచింపబడినది. ఈసూత్రమందలి పద ప్రయోగము తిలతండుల న్యాయముగ నున్నది. పరస్పర విరుద్ధము గల ప్రజాస్వామికశక్తులకు, నియంతృత్వమునకు పొందిక ఎట్లు చేకూరును? ప్రజాస్వామికమం దేకైకవర్గమున కధికారముండదు. ప్రతికూలపక్షమునెడ సహనము కనపరచుటద్వారా ప్రజాస్వామికము స్థిరపడును. ఇందుకుతోడు రాజ్యాంగసూత్రములను వ్యాఖ్యానించు అధికారము ఉన్నత న్యాయస్థానమునకు లేదు. కేంద్ర ప్రభుత్వరాజ్యసభకే అట్టి అధికారము కలదు. 29-9-1949 వ తేదీని, పెకింగులో ఆమోదింపబడిన రాజ్యాంగపీఠిక, నవచైనా ప్రజాస్వామిక నియంతృత్వాధికారము ఐక్యసంఘటనకు చెంది యున్నదని ఘోషించుచున్నది. ఐక్యసంఘటనకై ఏర్పడు కూటములు పోరునకు పనికివచ్చును గాని పరిపాలనను నిర్వహింపజాలవు. ఈవిషయము నింతటితో విడిచిపుచ్చుటమంచిది. రాజ్యము ధర్మమును, ధర్మము నైతికప్రతిపత్తిని సూచించును. రాజ్యతంత్ర పరిణామమందు, ధర్మము, పౌరునకుగల హోదా స్వతంత్రము, ముఖ్యమగు మజిలీలు. రాజ్యాంగముల బాహ్యరూపము దేశకాలమాన పరిస్థితులను బట్టియుండును. కొన్ని సందర్భములలో ధర్మము ధారాళముగ నున్నను జీవితము అభివృద్ధినిరోధకముగ నుండును. బుద్ధులు నీచస్థాయిలోనున్నపుడు కుయుక్తులవలనను రాజకీయపు టెత్తులవలనను స్వర్ణయుగమును సాధింపబూనుట కుందేటికి కొమ్ములను సృష్టింప ప్రయత్నించుటవంటిది. రాజ్యాంగ నిర్మాతలు మానవ స్వభావమున కతీతముగ ప్రణాళికలను సృజింపుచో ప్రజలందుల కనుగుణముగ ప్రవర్తింపజాలరు.

విజ్ఞానము, నీతి, నిజాయితీగల ప్రజ, బాధ్యతగల ప్రతిపక్షము, నిర్దుష్టమగు వాక్, ప్రకటనా, సమాజస్వాతంత్ర్యములు, రాజ్యతంత్రమును పెంపొందించును. రష్యాయందలి కమ్యూనిస్టుల నడవడి జర్మనీ నాజీల ప్రవర్తన, జనసామాన్యము చదువరులైనను, రాజ్యతంత్రము సవ్యముగ నడచుననను భావము నశింపజేసినవి. రాజ్యాంగము అస్థిపంజరమువంటిది. ప్రజ లందు ప్రాణముపోసి ఆత్మను ప్రతిష్ఠ చేయవలెను. రాజ్యాంగము మతమువలె సొంపగు ప్రణాళికలందు గాక ప్రజలయందే సజీవముగ నుండును. జేమ్సుబ్రైసు, చెప్పినట్లు "రాజ్యాంగము వ్యాఖ్యాన, ఆచార, సాంప్రదాయములవలన మార్పుచెందును. రాజ్యాంగమనగా సామాన్యధర్మాచార సాంప్రదాయముల సంగమమని చెప్పవచ్చును."

అభివృద్ధి నిరోధకులగు పాలకుల స్వార్థమునకై ధారాళమగు ప్రజాస్వామిక ప్రభుత్వములనేకములు ప్రజాపీడనచేసినట్లు చరిత్ర ధ్రువపరచుచున్నది. మొదటి, రెండవ ఫ్రెంచి రిపబ్లిక్కులకు, ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము జర్మనీలో ఏర్పడిన వైమరు రాజ్యాంగమునకు పట్టిన గతి లోకవిదితము. అధికారము సంకుచిత దృష్టిగల వారి పరమైనపుడు మానవ జాతిభవితవ్యము ప్రమాద భరితమగును. పరిపాలనావిధానము రాజ్యాంగము ననుసరించి యుండును. రాజనీతిని చెరచు సంఘటనలు తరుచు పొడగట్టును.

రాజనీతి స్వభావసిద్ధమైనది కాదు. కృషిచేసి దీనివలవరచుకొనవలెను. ప్రజానీకమున కిట్టి తరిఫీజు అత్యవసరము. విద్య, సంస్కృతి, వైఖరి, నడవడులవలన, వ్యక్తులందు సంఘమునందు ఏర్పడు పరివర్తన కనుగుణముగనే రాజ్యతంత్ర పరిణామముండును. మామూలు వ్యక్తియొక్క చాకచక్యము, నిజాయితీ, నడవడి అంతకును పునాది. సద్వర్తనగలవారు పేరు ప్రఖ్యాతులు సంపాదింపనప్పటికి వారి జీవితము నిరర్థకముకాదు. అట్టివారు తరతరములకు మార్గదర్శకులయ్యెదరు. ప్రతితరము తదుపరివచ్చు తరముల పురోభివృద్ధికి ధర్మకర్తలు. సంస్థలయందలి కట్టుబాట్లు కొంతవరకు మాత్రమే పనిచేయును. "అశాస్త్రీయము" అనుపదమునకు పలువిధములగు వ్యాఖ్యానములు కలవు. ఇంగ్లండునందు దీనిని ఉద్దేశింపబడిన అర్థమునకు వ్యతిరేకముగా ఎంచెదరు. ఫ్రాన్సునందిది ఆక్షేపణీయమగు పని, ఆస్ట్రేలియాయందిది అధికారమును మీరిన ప్రవర్తన. ఇండియాలోను అమెరికా సంయుక్తరాష్ట్రములందు చెల్లనటువంటి అధర్మము అని దీనితాత్పర్యము. రాజ్యాంగము పుస్తక ప్రాయముగ నుండక ప్రజానీకమునకు జీర్ణించినపుడే సఫలమగును. జీవితమును సాధ్యముచేయుటకు రాజ్యమేర్పడును, మంచిజీవితమును పెంపొందించుట దాని పరమావధి. ఎట్టి రాజ్యాంగము ఏదేశమునకు ఏసందర్భమున సరిపడుననునదియే ప్రధానసమస్య. ప్రభుత్వమునకు పాలకులకు, పాలితులకన్న యెక్కువరక్షణ యిచ్చినపుడు రాజ్యతంత్రము అర్థరహితమగును. అధికారమును స్వల్పముగ చలాయించుటయే సురాజ్యలక్షణమను వాదనకలదు. కాని శ్రేయోరాజ్యమందిట్టి భావమునకు తావులేదు. ప్రభుత్వయంత్రము సముద్రమందు తేలుచుండెడు మంచుగడ్డవలె నుండును. దీని స్వరూపము బహు స్వల్పముగ బహిర్గతమగుచుండును.

ప్రజాతంత్రమనగా ప్రజలచేత ప్రజలకొరకై ప్రజలునడుపు ప్రభుత్వమను నిర్వచనము కలదు. కాని ఎన్నికలతో ప్రజలపాత్ర పూర్తియగును. తదుపరి వారికిగల శ్రద్ధాసక్తులు మందగించును. ప్రజాతంత్రమందు మామూలు మనుష్యులు అధికారములోనికి వచ్చెదరు. అధికారమును చేపట్టుటకు కొన్ని అర్హతలు ప్రమాణములు ఉన్న కాని యిట్టి పరిణామము నరికట్ట సాధ్యముకాదు. సంఖ్యాబలమువల్ల వివేకము వృద్ధికాదు. సంఖ్యాబలమును సమీకరించువారియొక్క సహాయసానుభూతులు వందిమాగధులకు, వైతాళికులకు మాత్రమే లభించును. హేతువాదముకన్న ఉద్రేకమునకే ఉన్నత స్థానము లభించును. చివరకు నోరుగలవానిదే రాజ్యమగును. అందుచేత సంస్కారముగల విజ్ఞానవంతులు దిగువ స్థాయియందుగల వ్యక్తులతో పోటీపడ నిచ్చగింపరు. ఆఖరికి చాకచక్యము గలవారు అల్పసంఖ్యాకులైనను ప్రభుత్వసంస్థపై తిరుగుబాటు చేయుదురు. తత్రాపి ప్రజాప్రభుత్వము, నియమిత ప్రభుత్వముగాను, చివరికి రాజరికముగాను మార్పుచెందును. అరాజకమా లేక నియంతృత్వమా ? యను సమస్య ఏర్పడినపుడు ప్రజలు నియంతృత్వమువైపు మొగ్గుట కానవగును. డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు చెప్పినట్లు, "ప్రజాతంత్రమనగా రహదారి కాని గమ్యస్థానముకాదు, వైఖరిగాని సంపాదితమగు నిక్షేపముకాదు, సదా పురోగమించుచుండును గాని గమ్యస్థానముచేరి నిశ్చలముగ నుండదు.

దీనికి మొదలేగాని తుదలేదు. ఇది ఒక జీవిత విధానముగాని కర్మకాండకాదు. సాంప్రదాయములు, మార్గమధ్యమందలి మజిలీలు మాత్రమే." స్వాతంత్ర్యయుతమగు సహకారము, సహనము, సౌశీల్యముగల సంఘమందే రాజ్యతంత్రము శోభిల్లును. జ్ఞానులు రాజకీయములను విసర్జించుచో తమ కంటె హీనులకు లొంగియుండవలసి యుండునని ప్లేటో చెప్పియున్నాడు.

చేతకానితనము, లంచగొండితనము బంధుప్రియత్వము, పక్షపాతము ప్రజాతంత్రమును నిర్జీవ మొనరించును. చెడ్డశాసనములకన్న దుష్టులగు పరిపాలకులవల్లనే తరుచు కీడుమూడును. యుగసంధిలో పరిపాలకులు ప్రముఖపాత్రను నిర్వహింపవలసియున్నది. పరిపాలన జయప్రదము కావలెనన్న వారు చాకచక్యమును కార్యదక్షతను రాజభక్తిని ప్రదర్శింపవలెను. సర్వకాల సర్వావస్థలయందు వారు తటస్థులుగ నుందురని నమ్మరాదు. వారిలో కొందరు కేవలము స్వార్థమునే జ్ఞప్తియందుంచుకొని పనిచేయవచ్చును. ఇందువలన ప్రభుత్వమునకు కావలసిన శక్తిసామర్థ్యములు సౌశీల్యము లోపించును. సౌశీల్యములేని వ్యక్తి ఎట్లు నిరర్థకమో అట్లే ప్రజాహితము లోపించిన పరిపాలనకూడ నిరర్థకము. ఇందుకుతోడు ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు సూచించినట్లు, "రాజకీయవేత్తలు శాసనసభల సభ్యులు తమ విన్యుక్తధర్మమును వీడి ప్రభుత్వసిబ్బందియొక్క దైనందిన చర్యలలో కలుగచేసుకొనుటవల్ల నూతన సమస్య ఏర్పడినది. శాసనసభ్యులు మంత్రులు తప్పుత్రోవలు త్రొక్కుచున్నట్లు ఫిర్యాదులు పొడకట్టుచున్నవి. ఇందువల్ల ప్రభుత్వోద్యోగులు తమ ధర్మమును వీడి వందిమాగధులుగను వైతాళికులుగను తయారగుదురు." శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారు రెండవసారి మద్రాసు ముఖ్యమంత్రిత్వమును స్వీకరింపగనే కార్యనిర్వాహక వర్గమును శాసననిర్మాణవర్గమునుండి విడిపరచి ప్రభుత్వోద్యోగులు ఎట్టి జోక్యము లేకుండ స్వతంత్రముగ వ్యవహరించుట కనువగు వాతావరణమును సృజించిరి.

దౌర్జన్యము పునాదిగ గల విధానము ప్రజాస్వామికమునకు విరుద్ధము. ప్రజాతంత్రము ఆర్థికసాంఘిక రంగములందు విజయవంతమైనపుడే సఫలీకృతమగును. వ్యక్తిస్వాతంత్ర్యము, హేతువాదము ఎంత ప్రధానమో సాంఘికన్యాయ మంత ప్రధానము. సమానావకాశము సూత్రప్రాయముగ గాక ఆచరణయోగ్యముగ నుండవలెను. విప్లవయుగమందు పెద్ద పెట్టున మార్పులు త్రోసుకువచ్చుచుండును. ప్రథమప్రపంచ యుద్ధము ముగిసిన పిదప ప్రజాతంత్రము సుస్థిరమగునని ఆశించిరి. కాని అందుకు బదులు ప్రజాతంత్రమునకు రక్షణ నశించినది. ప్రజాస్వామికములు రెండవ ప్రపంచ యుద్ధమందు జయముసాధించినవి. కాని శాంతిని కోల్పోయినవి. భయానకమగు ఉద్రిక్త పరిస్థితులందు మసలవలసివచ్చినది. మందుగుండు సామాను గిడ్డంగిపై తిష్ఠవేసి చుట్టకాల్చుచు ధర్మపన్నములు చెప్పుట శ్రేయస్కరము కాదు. ఎటుచూచినను స్వాతంత్ర్యము ప్రతిఘటన నెదుర్కొనవలసిన పరిస్థితి ఏర్పడినది. స్వేచ్ఛను బహుపదిలముగ కాపాడుచుండవలెను. అన్యాయమును అకార్యకరణములను సదా ప్రతిఘటింపవలెను. "సంఘవ్యవస్థలో అన్యాయము అక్రమము అబద్ధము గడ్డకట్టినపుడు విచ్ఛేదమే ధర్మస్థాపన యనిపించుకొనునని," థామస్ కార్లైలు తాను రచించిన "ఫ్రెంచి విప్లవము" అనెడు ఉత్కృష్ట గ్రంథమందు నిర్వచించియున్నాడు.

విప్లవ వాతావరణమును, సాధకబాధకములను జాగరూకతతో పరిశీలింపవలెను. విప్లవమనగా పాతవిలువలను నూతన శకమున కనుగుణముగ రూపొందించుటయే. మనస్సులో కల్గిన మార్పులే కొంత కాలమునకు చరిత్రయందు ప్రతిబింబించును. ఆదర్శములు జాతీయముగ గల హద్దుల నతిక్రమించును. పురోభివృద్ధియొక్క మందగమనమే విప్లవమునకు మూలకారణము. పాలకులు ప్రజల సమస్యలను సంతృప్తికరముగను, సవ్యముగను దూరదృష్టితోను పరిష్కరింపలేనపుడే విప్లవమువచ్చును. గతమును విస్మరించి లెక్కలేకుండ ముందుకు సాగుటయే విప్లవము. ఇది నూతన శకమునకు నాంది. కాని విప్లవకారులు చివరకు విప్లవాగ్నియందే దగ్ధమగుట పరిపాటి. అయినప్పటికి విప్లవముద్వారా నూతన శక్తులు బయల్పడును. మానవ చరిత్రయందపుడపుడిట్టి మార్పులువచ్చుట సహజము. ఒక విధముగ చూచిన మానవజాతి పురోగమనమున కిట్టిమార్పు లావశ్యకము. శాంతియుతమగు విప్లవమే చరితార్థమైనది. రానున్న విప్లవముయొక్క సూచనలను గ్రహించి తదనుగుణముగ ప్రవర్తించుటయే బుద్ధిమంతుల లక్షణము.

కోట్లాది ప్రజానీకము తినుటకు తిండి కట్టుటకు బట్టలేక బాధపడునపుడు ప్రజాతంత్రముయొక్క భవిష్యత్తు అంధకారబంధురముగ నుండును. కొద్దిమంది మాత్రమే సుభిక్షముగనుండి అసంఖ్యాకులు జీవనభారముచే క్రుంగునట్టి వ్యవస్థకు రక్షణ, భవిష్యత్తు శూన్యము. ఆర్థిక సమత, సాంఘిక న్యాయము సుస్థిరమగు వ్యవస్థకు పునాదులు ఇట్టి పునాదులు లేనపుడు సుస్థిరమగు రాజకీయ సౌధమును నిర్మింప శక్యముకాదు. ఉదాసీనత సంకులస్థితికి త్రోవతీయును. దారిద్ర్యము, నిరుద్యోగము ప్రజానీకమును అశాస్త్రీయ పద్ధతులవైపు పురికొల్పును. తత్రాపి "తిండి బట్ట యివ్వనిచో కమ్యూనిజమును కౌగలింతు" మనుని నాదము బయలుదేరును. స్వాభావికముగ విప్లవకారుడు కాకపోయినను కాలమాన పరిస్థితులనుబట్టి వ్యక్తిమారుచుండును ఇరుగుపొరుగున కలుగు పరిణామము లిందుకు దోహదమిచ్చును. అందుచేత కమ్యూనిజము దారిద్ర్యముతో బాధపడు విజ్ఞానవిహీనులను సులువుగ ఆకర్షించును. వారు ఆర్థిక సమతను సాంఘిక న్యాయమును నిర్దాక్షిణ్యముగ సాధించుటకు ప్రయత్నించెదరు. ప్రజాస్వామికమందు వోట్లు వృద్ధిఅయినంత మాత్రమున ఆకలితీరదు. అందువల్ల ఎక్కువ జనసంఖ్యగల వెనుకబడిన దేశములందు కమ్యూనిజము సులువుగా వ్యాపించినది. నేడు అమెరికా సంయుక్తరాష్ట్రములందు అధ్యక్షుడుగా నున్న జనరల్ ఐసెన్‌హోవరు చెప్పినట్లు ప్రజాస్వామికమును బలపరచువారు ఆకలిని, దరిద్రమును, నిరుద్యోగమును నిర్మూలింపవలెను.

కమ్యూనిజముయొక్క ఆదర్శములు పైకి ఆకర్షణీయముగ నుండవచ్చును. జాగ్రత్తగ పరిశీలించుచో యీ ఆదర్శములు ప్రొఫెసరు మేకొనిలెడిక్సను తన గిఫ్ఫర్డు ఉపన్యాసములలో చెప్పినట్లు మేకతోలుకప్పిన పులివంటిదని ధ్రువపడును. కమ్యూనిష్టుల కార్యా

చరణ ఎంతమాత్రము క్షంతవ్యము కాదు. ప్రతి విషయమందును రష్యాను గ్రుడ్డిగ అనుకరించుట, జాతీయతకు ఆత్మగౌరవమునకు శక్తి సామర్థ్యములకు అవమానకరము. ఇట్టి పని ప్రజాస్వామిక పద్ధతులకు విరుద్ధము. యథార్థమును గుర్తింపనివాదము, అవినీతికరమగు సంఘవిద్రోహచర్యలు పతనమునకు హేతువగును. మంచికైనను చెడ్డకైనను దేశభక్తిని సమర్థింపవచ్చును. కాని జాతీయతలేని పార్టీభక్తి ప్రమాదకరము. వ్యక్తికి, ఆస్తికి రక్షణలేనపుడు స్వాతంత్ర్యము నిష్ప్రయోజనము. భయమువలన పౌరుల అంతస్థుతగ్గును. దౌర్జన్యము వలన దౌర్జన్యమే పెంపొందును. ఓటుయొక్క స్థానమును బాంబు ఎన్నడును ఆక్రమింపజాలదు. ప్రతికక్షులను పశుబలముతో భయపెట్టుట ప్రజాస్వామిక లక్షణముగాక సైనిక నియంతృత్వలక్షణమనిపించుకొనును. మానవుని హోదాకు స్వాతంత్ర్యమునకు నష్టపరిహారమనునది లేదు. అస్థిరమగు ఒడిదుడుకు పరిస్థితుల నడుమ ధనికవర్గమువారు ప్రజాస్వామిక సంరక్షణమను మిషతో అధికారమును హస్తగతము చేసుకొనుటకై ప్రయత్నింతురు. అట్లు అధికారము చేజిక్కిన పిమ్మట తమ అధ్వర్యమును చిరస్థాయిగ యుంచుటకై పథకము వేయుదురు. అట్టి క్లిష్ట పరిస్థితులందు ప్రొఫెసరు హెరాల్డు జె. లాస్కి చెప్పినట్లు వామపక్షమును నిర్మూలించుటకై ప్రయత్నించువారివల్లనే ప్రజాతంత్రమునకు ముప్పువాటిల్లును. ఇట్లు తరచిచూచిన రాజ్యతంత్రము, నియంతృత్వము తమ బలాబలములతో పోటీపడుచుండునట్లు తేటతెల్లమగును. అందువలన ఆర్థిక బాంధవ్యములను రాజకీయ సంబంధములను, సాంఘికవిధులను, లౌకికశక్తిని నైతిక ప్రతిపత్తిని సమన్వయపరచి పెట్టుబడిదారీ విధానమందలి అన్యాయమును, ప్రజాతంత్రమందలి లోపములను, కమ్యూనిజమందలి హింసను, నియంతృత్వ పంథాను సవరించి సుస్థిరమగు నవ్యనాగరకతను పెంపొందించవలసిన గురుతరమగు బాధ్యతను అందరు సమిష్టిగ గుర్తింపవలెను.

అనువగు సుఖసౌఖ్యములకు కొరతలేక నీతి నియమములను పాటించెడు మధ్యతరగతి వారే తమ సునిశితమగు బుద్ధిచేత జాతీయ, అంతర్జాతీయ సమస్యలను సాకల్యముగ అవగాహన చేసుకుని ప్రజాభిప్రాయమును సభ్యమగు రీతిని తీర్చిదిద్ది పరిపాలనను విజయవంతముగ నిర్వహింప కల్గుదురు. విజ్ఞానఖనియగు, క్రోపాట్కిన్, చెప్పినట్లు ప్రజాతంత్రమనగా మధ్యతరగతి ప్రభుత్వము. కాని నేడు మధ్యతరగతి దూరదృష్టిలేని స్వార్థపరులగు భాగ్యవంతులయొక్కయు ఉద్రేకపూరితులై పేట్రేగిన బీదలయొక్కయు తాకిడి వలన కృశించిపోవుచున్నది. దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించి యింతవరకు జాతీయ సంప్రదాయమునకు, సంస్కృతికి, సంస్కారమునకు, ఆటపట్టయిన నిస్వార్థులైన మధ్యతరగతివారు స్వాతంత్ర్యము లభించిన పిమ్మట యిట్లు పతనమగుట శోచనీయము. నేడో రేపో మధ్యతరగతి యనునది పూర్తిగ నమసిపోవు చిహ్నములు స్పష్టముగ కనిపించుచున్నవి. ఈవిషయమై ప్రభుత్వము తగురీతిని పట్టించుకొనకపోవుట క్షంతవ్యము కాదు. ఇట్టి సందర్భమున ఎట్లును పాలోప్పిక మధ్యతరగతి సాంప్రదాయ విరుద్ధముగ నిషిద్ధమగువైపు మ్రొగ్గుట అనివార్యమగుచున్నది. ఇందువలన బీదలకు చక్కని నాయకత్వము దఖలుపడుచున్నది. సాంఘిక సమత్వవాదము శాస్త్రప్రాయమైనది కనుక దానిని పరిపూర్ణముగ అవగాహనచేసుకొని మధ్యతరగతి మేధావులే ఆదరణయోగ్యమొనరించి కార్మికులకు ఆదర్శప్రాయులయ్యెదరను కౌట్స్కీయొక్క వాదమును, లెనిను, ఎంజల్సు, కూడ అంగీకరించిరి. స్వతస్సిద్ధముగ మధ్యతరగతి మనిషియే పీడిత ప్రజానీకము యెడ సానుభూతిని కనపరచి రక్తసిక్తమగు హృదయముతో పరితపించును. ప్రపంచమందలి వివిధపోకడల పరిణామమును నిష్పక్షపాతముగ సమదృష్టితో పరిశీలింపగల శక్తి మధ్యతరగతివారి సొమ్ము. ఆత్మశక్తి నశించి నైతిక సంపత్తి కృశించియున్న నేటి క్లిష్ట పరిస్థితులందు పాత విలువలకు మెరుగుపెట్టి నూతన దృక్పథముతో సమన్వయపరచి భౌతిక సంపత్తిని, నైతికప్రతిపత్తిని పెంపొందించవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు.

మానవ విముక్తికి జాతీయస్వాతంత్ర్యమునకు అనువగు నూతన దృక్పథముద్వారా శాంతిని సౌష్ఠవమును, సౌభ్రాత్రమును సామరస్యమును సాధింపవలసి యున్నది. ఫ్రెంచివారి స్వాతంత్రతృష్ణను, బ్రిటిషువారి సమవర్తిత్వమును, అమెరికనుల చట్టనియమములను, సమన్వయపరచవలసి యున్నది. ఇట్టి పరిస్థితులందు భారతీయుల విధిఏమిటి? సచివోత్తములైన సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారు వచించినట్లు, "ఇసుమంతైనను తొట్రుపడక సమరసత్వముతో ధర్మబద్ధముగ కర్మచేయుటయే ప్రాచ్యసంస్కృతి ప్రపంచమునకు పెట్టిన వరవడి." పురాతత్వ విశారదుడైన డాక్టరు ఆనందకుమారస్వామి తాను రచించిన "భారత రాజ్యతంత్రమందలి నైతికశక్తి" అను గ్రంథమందు, "శాంతి పరిపూర్ణమగు సుఖసౌఖ్యములు భౌతికసంపత్తిని నైతికశక్తితో సమన్వయపరచినపుడే లభ్యమగు" నని విశదీకరించిరి.

కేవలము భౌతికదృష్టితో నడచు ప్రభుత్వము చిరస్థాయిగ నుండజాలదు. స్పార్టా, ప్రష్యా, రాజ్యములందు భౌతికసంపత్తినే పరమావధిగ నెంచిరి. అందుచేత అచట విజ్ఞానము నైతిక ప్రతిపత్తి సన్నగిలినవి. తత్రాపి ఆరాజ్యములు అచిరకాలములోనే నమసిపోయినవి. మరి గ్రీసునందలి ఏథెన్సును పరికించిన దాని వాణి నేటికి కూడ దశదిశలందు వినిపించుచున్నది. అచట నుద్భవించిన మహాపురుషులగు, సోక్రటీసు, ప్లేటో, ఐసోక్రటీసు అరిస్టోటల్ చరితార్థులైరి. మానవ ప్రపంచమునకు వారు సదా వందనీయులు. గ్రీకు సంస్కృతి, విజ్ఞానము, అచిరకాలములోనే యూరపుఖండమునావరించి భవిష్యత్తును తీర్చిదిద్దినవి. అటులనే ప్రాచీన భారతమందలి ఆశ్రమములు తపోనిలయములవలెనే గాక విజ్ఞానకేంద్రములుగ వర్ధిల్లినవి. మహర్షులు ధర్మనిర్ణయమందు పాలకులను లెక్కచేయక తమ విధ్యుక్తధర్మమును నిర్భయముగను నిష్పక్షపాతముగను నెరవేర్చిరి. వారి నిర్ణయమునకు తిరుగుండెడిది కాదు. తదుపరి గుప్త సామ్రాజ్యమందు భారత సంస్కృతి అన్ని రంగములందు వికసించి ఆకాలమునకు స్వర్ణయుగమను ఖ్యాతిని సంపాదించినది. నైతికశక్తివలననే అశోకుని సామ్రాజ్యము విస్తరించి సుస్థిరముగ వర్ధిల్లినది. ప్రపంచ సామ్రాట్టులందు దాయనకు గల స్థానము

అద్వితీయమని హెచ్. జి. వెల్సుపండితుడు తన ప్రపంచ చరిత్ర యందుద్ఘాటించి యున్నాడు. అగ్బరు చక్రవర్తి సర్వమత సమత్వమును గుర్తించుటద్వారా ప్రజానురంజకుడయ్యెను. విజయ నగర సామ్రాజ్యమును పునాదివేసినది విద్యారణ్యస్వామి. ఛత్రపతి శివాజీని సక్రమముగ నడిపించినది అతని గురువగు రామదాసు. సిక్కు గురువులు, ముఖ్యముగ గురుగోవిందు సింగ్ పరిపాలనా తంత్రమునకు రాజబాట వేసిరి. అపుడపుడు తొట్రుపడినను భారతదేశము సదా గాంధి మహాత్ముని అడుగుజాడలలో పురోగమించుటకు ప్రయత్నించుచున్నది.

చట్టబద్ధమగు రాజ్యతంత్రము ఒడుదుడుకులేకుండ సాగిపోవును. ప్రజాతంత్రమందు అభిప్రాయములు అచారములు సాంప్రదాయములు మారవచ్చును. కాని చట్టబద్ధమగు పరిపాలన మాత్రము యథాతథముగ నుండవలెను. చట్టబద్ధమగు రాజ్యతంత్రము మార్పును ప్రతిఘటించునని అడ్డు సవాలు చేయువారు కలరు. అందుకు సమాధానము లేకపోలేదు. చట్టబద్ధమగు రాజ్యతంత్రము పురాతన ప్రజాతంత్రవ్యవస్థయందలిమంచిని జాగ్రత్తపెట్టుటకై మాత్రమే మార్పును ప్రతిఘటించును. రాజ్యతంత్రము హిందూమతమువలె దినదిన ప్రవర్ధమానమగుచుండును. దీనికి ఆదియే గాని అంతములేదు; ఇది నశకగాని ఫలము కాదు; పురోగమించు సాంప్రదాయముగాని, కుదించిన పరిణామము కాదు. సహకారయుతమగు ప్రపంచవ్యవస్థ యున్నపుడే రాజ్యతంత్రము సఫలత చెందును. ఆయా దేశములందలి కాలమానపరిస్థితుల ననుసరించి రాజ్యతంత్రమందు అనువగు మార్పులు చేయవచ్చును. ఇందులకై నాయకత్వము స్థిరచిత్తముతో చిత్తశుద్ధికల్గి దూరదృష్టితో ప్రవర్తింపవలెను. క్లిష్ట పరిస్థితులను ధైర్యముతో నెదుర్కొనవలెను. తాత్కాలికమగు పరాజయములను లెక్కచేయరాదు. స్వశక్తితో గమ్యస్థానమును చేరుటకై ప్రయత్నము చేయవలెను. ప్రముఖ బ్రిటిషు రాజ్యతంత్ర ప్రవీణుడగు, లాయిడుజార్జి చెప్పినట్లు "రాజ్యాంగ విషయములందు జోస్యము చెప్పుట సాహసము. అట్టి జోస్యము యధార్థమైనను దాని పరిమితి పక్షము మాత్రమే." విశ్వపరిణామము, వలయముగ పురోగమించు ననువాదముకలదు. అట్లగుచో ప్రజాస్వామిక వాదము రాజ్యతంత్రము ప్రప్రథమముగ భారతదేశమందే మొలకెత్తి దినదిన ప్రవర్ధమానమై క్రమేపీ దశదిశలకు వ్యాపించినదను విషయమును జ్ఞప్తి యందుంచుకొనవలెను. తిరిగి చట్టబద్ధమగు రాజ్యతంత్రముద్వారా ప్రజాస్వామికము భారతదేశమందు సఫలత నొందుగాక. తత్రాపి సర్వప్రపంచమునకు ఆదర్శప్రాయము కాగలదు. రాజ్యతంత్ర పరిణామముయొక్క వివిధఘట్టములను సుదీర్ఘముగ చర్చించుట కిచట సావకాశములేదు. ఇందలి పరిణామఫలితము లనంతములు. ఈసందర్భమందు మహాభారతమందలి 'ఉత్తరగీత' లోని దిగువ శ్లోకము స్ఫురించుచున్నది :—

> అనంత శాస్త్రం, బహు వేదితవ్యం
> అల్పశ్చ కాలో, బహువశ్చ విఘ్నాః
> యత్ సార భూతం, తదుపాశితవ్యమ్
> హంసోయథా, క్షీరమివాంబుమిశ్రమ్.

తాత్పర్యము :— తెలుసుకోవలసిన విషయములనంతములు, వ్యవధి తక్కువ, అడ్డంకులు ఎక్కువ. అందుచేత పాలనుత్రాగి నీటిని విసర్జించు హంసవలె అవశ్యకమగు విషయములను మాత్రమే తెలుసుకొనవలెను.



కాగితం కత్తిరింపు

బావినీరు

శ్రీ ఎ. ఐ. యస్. ఆర్. జోస్యులు.

# నవ్యరాష్ట్రగానము

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

తేతలికామిరెడ్డి మన తెల్గులపాలి బళారిగడ్డకున్
నేతలు చెట్టసేయఁ దననెట్టికనీలతనమ్ము తెల్లమా
రీతిని జాతికై యవధరించె నుదగ్రతపస్సు తాదృశ
భ్రాత లపేతకల్మషులు పండినప్రన్ననిపంట లమ్మకున్.

ఒప్పము కన్నతల్లియొడి నుబ్బెడిపాపల నేకెపంచకో
రొప్పుట సైఁప మాప్రళయరుద్రుఁ డెదిర్చిన వీరతాయెతుల్
విప్ప మటంచు బొబ్బిలిడువీరుల దొడ్డబసప్పనీఁడు గం
గప్పల రాష్ట్రభక్తి గొనియాడెదఁ బాడెద మేనుసొక్కఁగన్.

తెలువుల్ నేర్చిన ద్రావిడుల్ మనధరిత్రిన్ జిత్పరాంతర్గతన్
గల వైదా ర్తమపల్లెలంచుఁ బాలికేకల్ వైతు; రీ ధర్మమూ
ర్తు లహో! చెంగలపట్టు సేలముల నాంధ్రుల్ నిండుకొన్నాళ్లు వం
దలు వే లుంట కదల్పరేమి తమసూత్రం బొప్పదా దీనికిన్ ?

వెనుకటిసుద్దు లెల్ల నడివీధిని బెట్టను మీరు మే మికన్
మనవలె నెయ్యతియ్యముల మచ్చలు వెచ్చలు లేనిచూపులన్
మన కొక రచ్చయేల పదిమందికిఁ జెప్పఁగలార మోర్మిఁ బో
యని పెదపెద్దలై తమిళులార! కడంగుఁడు పంపిణీలకున్.

మీరును మేముఁ గన్నడులు మీననులున్ దొలునాళ్ల నొక్క సం
సారమునంద యుంట యొకసంతతిగా మనియుంట నిక్క; మీ
కూరిమి నెంచి చెట్టునకు గుట్టకు మూరకు బారకున్ వృథా
పోరకుఁడయ్య! రేపు మొగముల్ మొగముల్ తిలకించుకోవలెన్.

తడికలుపెట్టి ప్రొయ్యి నొకదానిని బెంచినమాత్ర నన్న త
మ్ముఁడు సెడఁ దమ్ముఁ డన్న సెడ ముచ్చటఁ జూపునె? మీకు నూళ లె
ద్దడికద! కొక లెద్దడికదా మఱిమాకుఁ, బరస్పరాదరం
బడఁగిననాఁడు లగ్గుకలదా మన; కన్నలు! పాఱఁజూడుఁడీ!

# ఆంధ్రసీమ అదృష్టతార

### శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఈ విజయ సంవత్సర భాద్రపద కృష్ణనవమీ పునర్వసూ నక్షత్ర యుక్త గురువారము—1953 వ సంవత్సరమున, అక్టోబరు నెలలో 1 వ తేది ఆంధ్రుల చరిత్రలో ప్రసిద్ధమైన ఘట్టము. చాలకాలముగా ఆంధ్రులు కోరుచు కలలు కాంచుచున్న ఆంధ్ర రాష్ట్రము ఆ శుభదినమున అవతరించినది. తన "రంగత్తుంగ తరంగ హస్తములతో" తుంగభద్రా స్రవంతి ఆంధ్ర లక్ష్మికి మంగళహారతు లెత్తిన దినమది.

భరతఖండమునందలి నానాదేశములలో ఒక్కొక్క దేశమునకు ఒక్కొక్క నక్షత్రమని మన ప్రాచీనజ్యోతిశ్శాస్త్ర వేత్తలు నిర్ణయించినారు. ఆసంప్రదాయములో ఆంధ్రుల నక్షత్రము 'రేవతి' అట! ఈనక్షత్రప్రదేశము నిరయన మీనరాశిలో 16°—40' నుండి 30°—0' వరకు వ్యాపించు భచక్రభాగమని ఎరుగుదుము. ఈప్రదేశములో ప్రముఖమైన ఒక ప్రత్యేక తార కలదు. ఇది ఆరాశిలో 28°—8' లో నున్నది. దీనిని పాశ్చాత్యులు 'బేటన్ కైటాస్' (*Baten Kaitas*) అందురు. ఇదే "ఆంధ్ర తార." సదా మార్పును కోరు మనస్తత్వము, ప్రయాణములపై అభిలాష, దురదృష్టవశమున ఆకస్మికముగా దెబ్బతిని కడకు గట్టెక్కు స్వభావము, ఇవి ఈతారకు సహజధర్మములని పాశ్చాత్యుల మతము.

మన గ్రంథములలో ఈతారకు ప్రత్యేకముగా ఫలము చెప్పినట్లు కానరాదు. రేవతీ నక్షత్రమునకు చెప్పబడిన ఫలమిది:—

"సంపూర్ణాయు, స్సుభగో.
వశగః స్త్రీణాం, స్వమాన దర్పయుతః,
మనసి ప్రతాపబహుళో,
మాత్సర్యయుతో, భవేత్ పౌష్ణే."

(హోరా సారము)

స్త్రీ వశవర్తిత్వము, స్వాభిమానము, దర్పము, ప్రతాపము, మాత్సర్యము, సుభగత్వము, దీర్ఘాయుస్సు, ఇవి రేవతి ధర్మములట? ఈసామాన్య గుణమునకు పాశ్చాత్యులు చెప్పిన విశేషధర్మమును జోడించినచో ఆంధ్రతార స్వభావము వ్యక్తమగును కాబోలు?

ఈతార ఇప్పుడు (1954) సాయన మేషరాశిలో 21°—20' లోనున్నది. దీనికి చతుర్థ కేంద్రములో (కర్కాటక రాశి 23°—6' లో) పునర్వసు నక్షత్రపు యోగతార (*Polluse*) కలదు. ఆత్రము ధైర్యము, ఉద్రిక్త చిత్తవృత్తి, తంత్రనిపుణత, కలహకాంక్ష, కఠిన స్వభావము,—ఈగుణములు సూచించు ప్రసిద్ధ తార ఇది. చతుర్థ కేంద్రమునందున్న ఈతార సామాన్య మనోధర్మమును తెలుపజాలును. ఆంధ్రతారకు సప్తమ కేంద్రములో (తులారాశి 23°—42' లో) చిత్రా నక్షత్రపు యోగతార (*Spica*) యున్నది. రమ్యమగు స్వభావము, లలితకళాసక్తి, విజ్ఞాన శాస్త్ర ప్రీతి, సమయానుకూల వ్యాపారపారీణత, ఆర్థిక పటుత్వము, కార్య నిపుణత, ఆధ్యాత్మికమైన, అథవా అమాయకమైన, చిత్తవృత్తి, ఇవి ఈతారధర్మములట! ఇది సప్తమ కేంద్రములో నుండుటచే, ఇతరులతోటి వ్యవహారములలో ఈస్వభావము వ్యక్తము కావచ్చునేమో! పైధర్మముల సమ్మేళనము ఆంధ్రతారలో కానరావచ్చును. అనగా, ప్రతి ఆంధ్రునియందును పైగుణములన్నియు కానరావలయునని కాదు. ఇతరుల దృష్టిలో ఆంధ్రులు మొత్తము మీద ఈ సామాన్యస్వభావము కలవారుగా పొడగట్టవచ్చును. అది యట్లుండె.

ఈ తారతో ఆంధ్రభూమికిగల సంబంధమును ప్రాచీన జ్యోతిశ్శాస్త్రవేత్త లెట్లు కనిపెట్టిరో కాని, ఇటీవల ఖగోళములో గోచారగ్రహములనుండి ఈతారకు వచ్చిన ఉత్తేజనమును గమనించితిమేని, ఆంధ్రరాష్ట్ర ప్రాదుర్భావమునకు ఈతారతోగల అనన్య సామాన్య సంబంధము మనకు స్పష్టమగును. కొంతకాలముగా ఇంద్ర శనులు తులారాశిలో, వరుణుడు కర్కాటక రాశిలో, సంచరించుచుండుట పాఠకమహాశయులకు విదితమే. మేషరాశి 21°—20' లోనున్న ఆంధ్రతారకు సప్తమకేంద్రములో ఇంద్ర శనులు, చతుర్థకేంద్రములో వరుణుడు, సంచరించగల్గుటచే, ఈ తారకు ఇది గొప్ప వేధాకాలమనుట! గగనసీమలో గాలిమేడలు నిర్మించుటకై ఉవ్విళ్లూరు మాయావి ఇంద్రుడు ఎదురుగా నిలిచి ఆంధ్రతారను ఆకర్షించుచుండగా, వ్యధికరణశాలియగు వరుణుడు సమకోణముగా కర్కాటములో నిలిచి ప్రక్కలు పొడుచుచు,

"ఉన్నదంతా మొదట
ఊడిపోనిమ్మ;
ఊపిరుంటే, కొత్త
ఊరు రానిమ్మ."

అను భావగీతము పాడుచు భుజములుతట్టి పురిగొల్పుచున్నాడు. నీతినియమములో, ప్రతిబంధకసామగ్రియో, కల్పించి పురోగమనము నరికట్టు స్వభావముగల శని తులారాశిలోనే ఆంధ్రతారకు ఎదుటనిలిచి "వలదు; ఆత్రము వలదు; జాగ్రత్త." అని నిరోధించుచున్నాడు. ఈగ్రహత్రయముయొక్క వేధకు చిక్కి ఆంధ్రతార ఉక్కిరిబిక్కిరి యగుటలో నాశ్చర్యమేమున్నది? కాని, అతి ప్రబలమయిన ఈయుత్తేజనము దానిని ఊరకే యుండనిచ్చునా? అసాధారణములకు ఆదర్శములు, బంధములు త్రెంపుకొని బైటపడు

టకై ఉత్కంఠ, చుట్టునున్న ప్రతిబంధక సామగ్రితో ఘర్షణము, ఇష్టార్థభంగమువలని అశాంతి, ఇవి ఈ వేధాఫలము. దీనితో ఆంధ్ర జాతి అల్లాడిపోయినది; కాని, తన ఆదర్శమును కాని ఆందోళన మును కాని మానుకొనలేదు. ఆంధ్రుల ఆర్తమును, అసంప్రేక్ష్య కారిత్వమును, గమనించిన చుట్టుప్రక్కల వారు తమకు ఓపినంత, వీలుపడినంత, సమయమును ఉపయోగపరచుకొనిరి.

ఆంధ్రతారకు ఇప్పటికాలములో వచ్చిన ప్రచండ గ్రహ వేధాఫలమే ఆంధ్రోద్యమునకు ఈ పరిణామమును సంపాదించి ఇచ్చిన దనుట నిర్వివాదాంశము. ఈ కార్యకారణ సమన్వయమును సందేహించువారు కొన్ని సాక్ష్యములను చిత్తగించవచ్చును.

ఇంద్రగ్రహము కటకరాశిలో 21° కి వచ్చినపుడే, 1912—13 ప్రాంతములో మొట్టమొదట ఆంధ్రరాష్ట్రోద్యమము, బయలుదేరుట! కాని, ఇతరగ్రహములు అపుడు సహాయపడలేదు. కనుక ఆందోళనము మాత్రమే ఫలమైనది. స్వతంత్ర భారత ప్రభుత్వము స్థాపించబడిన తరువాత భారత మహాప్రధానికి ఈ ఉద్యమము పైన సానుభూతి లేకపోవుటకు కారణము అతని జాతకములో చలిత గురువు ఆంధ్రతారకు కేంద్రవేధాస్థానములో (మకరరాశి 21°-42') ఉండుటయే! ఇట్లుండగా 1952 అక్టోబరు నెలలో, ఇంద్రుడు తులా రాశిలో 21° కి రాగానే, ఆంధ్రవీరుడు పొట్టిశ్రీరాములు నిరశన దీక్ష నారంభించుట! అనవంబరులో శని సయితము అదే భాగమువచ్చి అతని దీక్షకు స్థైర్యము కల్పించినాడు. 15-12-1952 నాడు అతని దీక్ష ఫలించునప్పటికి, కటక వరుణునియొక్కయు, తులా శని యొక్కయు, సమష్టి వేధ మేషరాశి 21°—15' పైననే పడినదని గమనించితిమేని, ఈ వేధకు ఆంధ్రతార ఎంత తల్లడిల్లినదో, మన మూహించుకొగలము. ఆంధ్రరాష్ట్రము వచ్చునని భారత కేంద్ర ప్రభుత్వము వాగ్దానము చేసిననాడు (25-3-1953) ఇంద్ర వరుణ శనుల సమష్టి వేధ స్పష్టముగా మేష రాశి 21°—18' పైననే యుండినది. 23-5-1953 నాడు శని ఆంధ్రతారకు ఎదురుగావచ్చి నిలువగా, ఆంధ్రరాష్ట్రమునుగూర్చి మిశ్రాగారు పంపిన నివేదికవలన అసంతృప్తి ఫలమైనది. కర్నూలు నగరములో ఆంధ్రరాజధాని నెలకొల్పవలయుననుతీర్మానము ఆమో దించబడిన 5-6-1953 నాడు ఇంద్రుడు, తులారాశి 21°—18'లో ఆంధ్రతారకు ఎదురుగా నిలిచియుండెను. తలవని తలంపుగా, అత్యాశ్చర్యకరముగా, కర్నూలును రాజధానిగా ఎన్నుకొనుటలో ఇంద్రజాల ప్రభావము చూపట్టుచున్న దనవచ్చును. ఆ నిర్ణయము వలన ఆంధ్రనాయకులలో కలిగిన ఆపోహలు, అపవాదులు, కుతర్కములు, అన్నియు ఇంద్రవేధా ప్రభావమే. వరుణుడు మరల ఆంధ్రతారకు కేంద్రమునకు వచ్చినపుడే (27-8-1953) ఆంధ్ర రాష్ట్ర నిర్మాణశాసనము భారతప్రజాప్రతినిధి సభలో ఆమోదించ బడినది. అరవవారితో ఆంధ్రులు భాగ పరిష్కారముచేసుకొనుటకు దారిచూపిన దీ వరుణవేధయే. ఇంతేకాదు! 1-10-1953 నాడు శ్రీయుత చందూలాలు త్రివేదీగారు ఆంధ్రరాష్ట్రపు గవర్నరుగా కర్నూలు నగరములో ప్రమాణముచేయుచున్న వేళలో, ఆంధ్రతార పశ్చిమదిశలో చేరుగా నిలచి ఆమహోత్సవమును ప్రత్యక్షముగా చూచుచుండినది! కొన్ని దినములకే (4-1-1954) వరుణుడు వక్రించి ఆంధ్రతారతో కేంద్రవేధకు (కటకరాశి 21°—19) రాగా, రాజధానీ సమస్య అవకతవకలుగా ఏర్పడి, తత్ఫలముగా శ్రీ గౌతు లచ్చన్నగారు తమ మంత్రిపదవికి స్వస్తిచెప్పి ప్రతి పక్షకూటములో చేరుకొనుట!

ఈ నిదర్శనములు చాలుననుకొందును. ఇది అంతయు కాకతాళీయ న్యాయముగాజరిగినదని వాదించుట పరిహాసహేతువు. సూర్యోదయమున పగలు, సూర్యాస్తమానమున రాత్రి, సంభవించుట ఎంత కాకతాళీయ న్యాయమో, ఇదియును అంతే! ఆంధ్ర తార రేవతియని చెప్పిన మన ప్రాచీనుల దివ్యదృష్టి, అథవాశాస్త్ర జ్ఞానము, ఎంత అసాధారణమైనదో, మనమిపు డూహించగలము. అద్భుతమయిన ఏ తపశ్శక్తియో, ఎన్ని శతాబ్దముల అనుభవమో, ఆ మహనీయులది?

ప్రకృతమనుసరింతము.

ఆంధ్రరాష్ట్రము ఆరంభమైన ముహూర్తపు విలువ ఎట్టిదో, అప్పటికి గ్రహ సౌకర్య మెట్లుండెనో, ఇంచుక పరిశీలింతము గాక.

1953 అక్టోబరు 1 వ తేదిన కర్నూలు నగరములో గవర్నరు గారి ప్రమాణ స్వీకారముతో ఆంధ్రరాష్ట మవతరించినది కదా? నాటి ఉదయము 7-5 గంటలకు శ్రీయుత త్రివేదిగారు రాజమర్యాదలతో సభాభవనమునకు విచ్చేయుటయు, వారినియామకమును గూర్చి భారత ప్రభుత్వాధ్యక్షుడు పంపిన అధికారపత్రిక ప్రధాన కార్యదర్శిగారు సభలో చదివి వినిపించుటయు, తరువాత ప్రధాన న్యాయమూర్తిగారు వారితో ప్రమాణ స్వీకారము చేయించుటయు, సుప్రసిద్ధవిషయములు. ఈమహోత్సవ కార్యకలాపమంతయు 7-15 లోగా పూర్తి అయినదని వింటిమి. పశ్చిమ దిశాహారిజరేఖకు అతి సన్నిహితముగా ఆంధ్రతార యుండిన సమయమది; దశమకేంద్ర మధ్యబిందు సమీపమందే రాజ్యాధిపతి చంద్రుడు వరుణునితో చేరి యుండగలదుకూడ.

> సంపూర్ణ దృష్ట్యా తు దిశే ఫలంస్యా
> ద్యోగ స్తథైకాంశసమాగమోక్తిః"
>
> (యాదవసూరి)

> యోగాయథోక్త ఫలదాః
> కలార్థభాగైక సంస్థితానాంచ,
> అప్రాప్తానాం,
> ఇచ్ఛామాత్రం ఫలం భవతి."
>
> (రల్లుడు)

అను ప్రాచీన సూత్రముల ననుసరించి సమన్వయపరచ్ఛితి మేని, తులారాశి 21°—20' లగ్నముగా నున్నక్షణములో ఆరంభమై, చంద్రుడు దశమకేంద్రబిందువు (రాజ్యస్థానము) నకు వచ్చు క్షణమునకు ఈమహోత్సవము ముగిసియుండగలదని మనము విశ్వసించుట తప్పుకాదు. జ్యోతిశ్శాస్త్ర ధర్మమును పాటించినచో, అట్లు జరిగియుండుటకే న్యాయ్యమనుటకు సందేహము లేదు.

ఈ ఉపపత్తితో, ఆనాడు 7-7-44 కాలములో ఆరంభమై, 7-10-50 గంటలకు ఆంధ్రరాష్ట్రావతరణము జరిగినదని మనము నిర్ణయించవచ్చును. ఈకాలమునకు నిరయనరాశి చక్రము క్రిందచూపబడినది.

| | | | చ<br>గు |
|---|---|---|---|
| | రాశి<br>కుండలి | | కే |
| రా | | | కు<br>శు |
| | | శ<br>బు | లగ్న<br>రవి |

ఈ ముహూర్తమునుగూర్చి పలువురు దైవజ్ఞులు తమ అభిప్రాయములను వెల్లడించినారు. విజయ సంవత్సరము ఆంధ్రులకు విజయమును సూచించినదనియు, భద్రకరమైన భాద్రపదమాసము క్షేమకారి అనియు, కొందరు పొగడిరి. శ్రీరామచంద్రమూర్తి అవతరించిన పునర్వసు నక్షత్రమునందే ఆంధ్రరాష్ట్రము ఆవిర్భవించుట ఆంధ్రులకు భాగ్యసూచకమని కొందరు ఉప్పొంగిరి. మంచిదేకాని, మంథరకుట్రలు, మారీచుని మాయలు, దానవుల దౌష్ట్యము తొంగిచూచునేమో యని భయము. గురు చంద్రులు దశమరాశిలో నుండుటచే ప్రబలమైన 'గజకేసరీ' యోగముపట్టినదని సంతోషించిన వారున్నారు. అప్రతిమాన శౌర్య ప్రభావముల 'ఆంధ్రకేసరి' మన కర్థమగును. మరి, గజమెచ్చట నున్నదో? అది యట్లుండె, చంద్రునికి వెనుక 25° దూరములో కూర్చున్న బృహస్పతి ఈయోగము నెట్లు తేగలడో, దైవమునకెరుక. చనిపోయినవారికి తిలోదకప్రదానము చేయుటకు మాత్రము తగిన భాద్రపద మాసపు కృష్ణపక్షము—(పితృపక్షమని దీనికి వ్యవహారము)—అందులో, రిక్తతిథి (నవమి) నాడా రాష్ట్రావిర్భావమని వేరు కొందరు తల్లడపడినవారున్నారు. సూర్యునికి పాపకర్తరి, చంద్రునికి కేతు సంయోగము మాత్రమే కాక శనిదృష్టి దాపరించినదని తలచి, ఈముహూర్తము అశుభంకరమని చెప్పిన శాస్త్రజ్ఞులు కలరు. భారతదేశపు లగ్నము కన్య అను సంప్రదాయము ననుసరించి, ఆ లగ్నమందే ఈశుభకార్యము జరుగుటచే, ఆంధ్రరాష్ట్రము భారతప్రభుత్వమునకు ప్రీతిపాత్రమగునని ఆనందించిన అమాయకులుసయితము లేకపోలేదు. వీరి శుభాకాంక్షలు సఫలమగు గాక !

ఇవి ఇట్లుంచి, సాయన గ్రహకుండలి ఏమనుచున్నదో, ఇంచుక పరిశీలింతము. దృక్పథములో భేదమును చూపుటే నా ఉద్దేశముకాని, ఫలాదేశము చేయుట కాదని నామనవి.

ఇదే సాయనకుండలి :—

| | ఆంధ్రతార<br>21-20 | | గు 26-9 |
|---|---|---|---|
| | [సాయనము]<br>—<br>ఆంధ్రరాష్ట్రావతరణ<br>ముహూర్తము | | X 21-8<br>చ 21-8<br>వ 22 45<br>కే 29 37 |
| రా 29-37 | | | పున్య 5.37<br>యమ 24-16 |
| | | ర 7-35<br>I 22-4<br>ఇ 23-2<br>బు 24-37<br>శ 27-26 | శు 8-15<br>కు 10-19 |

లగ్నములో ఇంద్ర, బుధ, శనులున్నారు. వీరిలో చతుర్థ పంచమాధిపతి యగుటచే రాజయోగకారకుడైన, అతిరథశ్రేష్ఠుడు, శని ఉచ్చగ్రహము. ఈశనికి భాగ్యాధిపతియగు బుధుడు, అఘటనఘటనా ధురంధరుడగు ఇంద్రుడును, తోడు. ఈగ్రహసంయోగము మహాబలిష్ఠమైనది. బుధుని తెలివితేటలు, ఇంద్రుని అప్రతిమాత్మశక్తి, శని కార్యదీక్ష, ఇవి మేళవించి ఆంధ్రరాష్ట్రావిర్భావకాలములో తూర్పు దిక్కున తళతళ మెరయుచుండిన వనుట! ఎంతటి క్లిష్ట సమస్యలనైనా ఎదుర్కొనగల ప్రతిభాశక్తి, ఇతరుల ఊహలకు అందకుండునట్లుగా మబ్బులలో తేలిపోవు నిగూఢ మంత్రశక్తి, ప్రతిబంధకము లెన్ని చూపట్టినా, పట్టినపట్టు వదలక డీకొను ప్రచండ సంకల్పశక్తి, ఈమూడును ఆంధ్రరాష్ట్ర నిర్వాహములో ప్రధానముగా పొడగట్టగలవని లగ్నమందలి ఈ గ్రహసంయోగము ఘంటాఘోషముగా చాటుచున్నది. భిన్నదృక్పథములుగల రాజకీయ పక్షములు మూడింటినుండి మంత్రివర్గము నిర్మింపబడునని సయితము దీని సూచన. మొత్తముమీద, పైగ్రహ ధర్మములు ప్రధానముగా కల ముగ్గురు వ్యక్తుల సామర్థ్యముపైననే—ఏమంత్రివర్గమైనా సరే—ఈరాష్ట్రపు అభ్యుదయము ఆధారపడి యుండగలదనుటకు సందేహము లేదు. ఇది అంతయు బాగుగనే యున్నది. కాని, అతిబుద్ధి యని అవ్యవస్థయని భల్లూకపుపట్టని చుట్టుప్రక్కలవారు అపోహపడుటకు ఆంధ్రరాష్ట్రపు రాజ్యాంగనీతి అవకాశమిచ్చునేమో ?

అయిననేమి, భాగ్యస్థానమందలి బృహస్పతియొక్క త్రికోణ శుభదృష్టి లగ్నముపై, అందలి గ్రహకూటముపై సమృద్ధిగానుండుటచే ఎవ్వరేరీతి భావించినా ఆంధ్రరాష్ట్ర నిర్మాతలు ఆంధ్రుల క్షేమముకొరకై సదుద్దేశముతో ఈకార్యమునకు పూనుకొన్నారనియు భోగపరాయణత్వముతో దేశాభివృద్ధిని నిరాదరించువారు కాక, దేశహితమునే ప్రధానముగా కోరి, నిరాడంబర జీవితములతో, ప్రజాహితకార్యములను కొనసాగించెదరనియు, రాష్ట్రముయొక్కయు, ప్రజాసామాన్యముయొక్కయు, ఆర్థిక స్థితిని అభివృద్ధిపరచగల అభ్యుదయ ప్రణాళికలకై నిర్నిద్రముగా పాటుపడగలరనియు- విశ్వసించుటకు ఎంతో అవకాశమున్నది.

ఈ గ్రహకూటములో యోగప్రదమగు బుధ శని సంయోగము లగ్నములోనే యుండుట ఆంధ్రుల భాగ్యఫలము. వరాహమిహిరుని పుత్రుడు పృథుయశస్సు చెప్పిన సూత్రమిది :—

"బుధ మందయోస్తు యోగే,
దశమే, లగ్నే ధవా, ధర్మే,
ధనదార పుత్ర మిత్రై),
స్సమన్వితో, ఒన్యత్ర, కష్టఫలం"

[హోరాసారము.]

రాష్ట్రపరముగా దీనిని అన్వయించినచో, ఆర్థికముగా, సాంఘికముగా, నైతికముగా, రాజకీయముగా, రాష్ట్రము అభివృద్ధికి రాగలదని అర్థము.

ఇక, ముహూర్తకాలములో ఆకాశమధ్యమునందు చంద్ర వరుణులు ప్రకాశించుచున్నారు. వారిలో చంద్రుడు, రాజ్యాధిపతి, స్వక్షేత్రములో ప్రబలుడై రాజ్యమేలుచుండుట హృదయంగమముగా నున్నది.

అవిషాదీ, కర్మపరః,
సిద్ధారంభిశ్చ, ధనసమృద్ధశ్చ,
శుచి, రతిబలోధ, దశమే,
శూరో, దాతా, భవేత్, శశిని.

(సారావళి)

ఆశాజనకమైన ఈవర్ణనము విన్నచో, ఆనందపడని ఆంధ్రుడుండడు. ఇచ్చట చంద్రునికి వరుణుడు సహాయము! ఖగోళములో గ్రహరాజు రవి మూల విగ్రహమైనచో, వరుణుడు ఉత్సవ విగ్రహము. రవికి ప్రతినిధి వరుణుడు. సాయంసంధ్యా కాలములో వరుణస్వరూపుడుగనే రవిని ధ్యానించుట మనకు ప్రాచీన సంప్రదాయమునుండివచ్చినదే. ఇట్టి వరుణుడు దశమాధిపతికి తోడై దశమ కేంద్రమందే యుండుట అధికార నిర్వహణమునకు తగినదే. కాని, చండశాసనుడు వరుణుడు. ఇతరులకు లోబడువాడు కాడు. చంద్రుడో, మృదుమధుర స్వభావముకల గ్రహము. ప్రజానురాగము, సౌజన్యము, కీర్తిశ్రద్ధ, జనరంజకత్వము ప్రధానస్వభావములు. ఈగ్రహద్వయసమ్మేళనము రాజ్యస్థానమునందుండుట వలన, అతిమాత్రపురోగమన కాంక్ష, అపారమైన ఉద్రేకము, అసాధారణమగు పట్టుదల, అంతో, ఇంతో, 'మురారి మార్గము', ఈధర్మము లనవచ్చును. పదుగురు పాటించుమార్గముపై అరుచి, సంప్రదాయములను సంస్కరించవలెననెడి అభిలాష, ఇతరుల బుద్ధినిగాని, ఉపదేశమునుగాని, సరకుచేయని స్వాతంత్ర్య ప్రీతి, అందరాని ఆదర్శములనుగూర్చి ఆశ, ఇవి ఈయోగఫల పరిణామము. ఇంతేకాదు. ఆంధ్రనాయకుల పురోగమనము చూచి పరివారు అసూయాగ్రస్తులగుటకును, ఆంధ్రులలో ఐకమత్యము శూన్యమగుటచే అంతఃకలహములు తలచూపుటకును, పరిపాలనా పద్ధతులలో ప్రతిబంధకము లేర్పడుటచే నిరంకుశాధికార ప్రయోగమునకు దారితీయుటకును ఈచంద్రవరుణ సంయోగములో సూచనలున్నవి. దశమకేంద్రమందలి వరుణుడు తన ఆదర్శము తాను వదలడు; ఇతరుల అధికారము నోర్వడు; నిర్లక్ష్యముగా, నిరంకుశముగా, ప్రవర్తించగలడు; నిర్వహించలేని క్లిష్టపరిస్థితులు వచ్చినా, ఎట్టి త్యాగమునకైనా తెగించగలడు. అట్టి పరిస్థితి వచ్చినప్పుడు, ఇతడే విధముగా ప్రవర్తించగలడని, ముందుగా అంచనా వేయుట సాధ్యముకానిపని. అగుటచే, ఈయోగము ఎంతశక్తివంతమో, అంతప్రమాదకరమయిన దనవచ్చును.

ఈదశమ కేంద్రములోనే కేతువున్నాడు. కేతువున్నచోట, ప్రాపంచికముగా, సామర్థ్యమునకు కొరతలేదు కాని, గౌరవము మట్టమని పాశ్చాత్యుల మతము. తలలేని మొండెమని కేతువును మనవారు వర్ణించుటలో ఇదే అర్థమే ఇమిడి యున్నదనవచ్చును గదా!

ఇక, లగ్నాధిపతిని చూతము ఇతడు (శుక్రుడు) నీచపడి, ధనాధిపతియగు కుజునితో చేరి, వ్యయభావములో నుండుట విషాదకరము. ఆర్థికస్థితి ఎట్లు బాగుగానుండగలదు? ఇంత చాలక, లగ్న వ్యయాధిపతులగు శుక్ర బుధులకు పరివర్తన యోగమున్నది. దీనిని 'దైన్యయోగ'మందురు. సర్వసమృద్ధమయిన రాజధానీనగరమును కృష్ణార్పణ' మని వదలిపెట్టి, కేంద్రప్రభుత్వపు కినుకకు జంకుచు, తమిళసోదరులు పెట్టిన పిడికెడు భిక్షముతో బైటపడి, నిలువనీడ లేక, కర్నూలు వీటిగట్టున పటకుటీరములు నిర్మించుకొని, ఆంధ్ర రాజ్యలక్ష్మి ప్రభుత్వము చేయసాగినపుడు, దైన్యయోగము కాక మరియేమి? లగ్నాధిపతి నీచపడి వ్యయస్థానములో నుండక మరియెందుండగలడు? ఉన్నచో, జ్యోతిషశాస్త్రమునకు విలువ ఏమి?

ఇంతటితో పోలేదు శుక్రుని అవస్థ! ఒకవైపున వరుణుడు, మరియొకవైపున ఇంద్రుడు, అర్ధకేంద్రవేధతో పొడుచుచున్నారీ లగ్నాధిపతిని! పాపము! ఆదర్శహాని నోర్వలేక, అవ్యవస్థా పరిస్థితులను చక్కబరచుకోజాలక, చిక్కులపాలైయున్న యీ శుక్రుడు ప్రకృతము ఆంధ్రరాష్ట్రమునకు దాపరించిన అవస్థను స్పష్టముగా తెలుపుచున్నాడు. ఈ ఇంద్ర వరుణ వేధలలో, శాంతితో పనులు జరుగవు; సమాధానము కుదురదు; కోరికలు తలకు మించును; ఉద్దేశములన్నియు గొప్పవే; కాలమునకు కాచుకొను ఓపిక రాదు; అన్నిటిలో ఉద్రేకపూరితమైన ఆత్రము; ఆలోచనల కవకాశముండదు: "అతి సర్వత్ర వర్జయేత్," అనుమాట జ్ఞప్తిలో నుంచరు, మంచికైనా, చెడ్డకైనా, సరే!

ఈప్రణాళికతో పనులు జరుగుచున్నచో, శుక్రునికి శాంతి ఏది?

మద్యపాన నిషేధమును గూర్చిన ప్రకృతఘర్షణ ఇంద్ర వరుణ స్పర్ధకు తార్కాణము. నీతి నశించునని యొకడు, ఆర్థికస్థితి నశించునని మరియొకడు, వాదమునకు దిగినారు. ఏదోరీతిగా ఈ సమస్యలో సమాధానము కుదిరినా, అప్పటికి మరియొక సమస్యను వీరు చేరి యొకవైపుపట్టి లాగుదురు. వాదము బాగున్నచో చాలు, సమస్య తెగినాసరే!

ఇవన్నియు నిట్లుండగా, తులారాశిలో రవి తన పరమ నీచస్థానమునకు అతి సన్నిహితుడుగ నుండుట శోచనీయ విషయము. రవి (గ్రహరాజు) నీచపడినపుడు రాజయోగము లెన్నియుండినా కొరగావని ప్రాచీన మహర్షులు చాటిచెప్పిరి. మరియొక విశేషము. ఈరవి తులలో 7½° లో నుండుట ! ఈభాగ "చావు బ్రతుకులు" అనుపరిస్థితిని తెలుపునని పాశ్చాత్యహోరాతంత్రవేత్తలు చెప్పిరి. మన మహర్షులు దీనికి "షడశీతిముఖ" మనుపేరుపెట్టి దానిలో రవి యున్న దినము అభివృద్ధికార్యముల ఆరంభమునకు తగదనిరి.

"షడశీతిముఖే ప్రాప్తే,
షష్టినాడీ ర్వివర్జయేత్.
అన్యథా చే ద్వినశ్యంతి,
షడశీతిగతే రవౌ."

అని భరద్వాజ సూత్రము. పరిపాలనము, సక్రమముగా నడచునో, పార్టీ 'తుపానుల' పాలగునో, చెప్పుటకష్ట మను స్థితిలోనే కదా ఇప్పడాంధ్రరాష్ట్రముండుట !

విశేష మేమనగా, భారత మహాప్రధాని జన్మదినమందలి బృహస్పతికి నిండుకేంద్ర వేధాస్థానములలోనే ఈరవి యుండవలయునా ? అతని యుపదేశమును ఆంధ్రులు గౌరవించలేదని, అతనికి వీరి ఆదర్శములపై ఆదరము లేదని, అర్థము కాబోలు !

అది యట్లుండె, ఈరవి లాభాధిపతి. ఆదర్శములను తెలుపునది లాభస్థానము. విశాలాంధ్రమును సాధించవలెననెడి ఆదర్శము దుర్బలమై, నిస్సహాయమై, యున్నదని ఈరవిస్థితి సూచించుచున్న దనవచ్చును. ఇప్పటి పరిస్థితులలో విశాలాంధ్రపు గొంతెమ కోరికలు సన్నిహితకాలములో సాగు సూచనలు కానరాకున్నవి కదా ?

1954 ఫిబ్రవరిలోగా మదరాసు నగరములో నిలిచియున్న ఆంధ్రరాష్ట్ర కార్యస్థానములు హైదరాబాదు నగరమునకు తప్పక మార్చబడుననియు 1955 నవంబరులో విశాలాంధ్రరాష్ట్రము హైదరాబాదు నగరములో ఏర్పడుననియు, గొప్ప దైవజ్ఞు డొకడు ఆశాజనకమగు ఫలాదేశమునుచేసినాడట ! కార్యాలయములు హైదరాబాదునకు వచ్చునని చెప్పిన గడువేమో మీరిపోయినది. ఇక, విశాలాంధ్రపు గడువు మాట ఏమో ! ఓపికతో కాచియుందము.

ఇతర విషయము లెట్లుండినా, చతుర్థపంచమాధిపతి శని బుధునితో చేరి లగ్నమందుండగా, తృతీయషష్ఠాధిపతియగు గురువు భాగ్యభావములోనుండి వారిపై పూర్ణశుభదృష్టి పరపుచుండుటచే, విద్యాసంస్థలు, వ్యవసాయపరిశ్రమలు అభివృద్ధికి రాగలవని ఏర్పడుచున్నది. ఈశనికిని, ఆగురువునకు సహా, లాభభావమందలి యముని మిత్రదృష్టికలదు. విద్యావిషయముగా, వ్యవసాయ విషయముగా, అభ్యుదయ సూచకములగు నూతన శాసనములు నిర్మించబడుననుట దీని ఫలము. పోలీసులు బాగుపడగలరు. పారిశ్రామికవిద్య లభివృద్ధి యగును: ఇది ముదావహమగు విషయము.

ముహూర్త స్వభావమునుగూర్చి ఇంత చాలును. 1955 వ సంవత్సరములో చలితశుక్రుడు కుజసంయోగము నందగలడు. చలిత బుధుడు గురువుతో పరిపూర్ణమిత్రదృష్టి నార్జించగలడు. చలిత రవి యముని అర్ధకేంద్రమును అప్పుడే సంపాదించును. చలితచంద్రుడు రవితో అర్ధకోణములో నుండును. గోచారములో ఇంద్రుడు శని పైన, వరుణుడు బుధునికేంద్రములో, గురువు రాజ్యభావములోని చంద్రవరుణులపై నుండగా, శని వీరికి నిండు కోణములో, సంచరించుకాలమది. కార్యనిర్వాహకులు ఘర్షణకులోనగుదురు; మంత్రివర్గములో మార్పులు రావచ్చును; రాజధానీ సమస్య తీవ్రరూపము దాల్చవచ్చును; పార్టీకలహములు ప్రబలవచ్చును; రాజ్యాంగనీతి కఠిన విమర్శకు గురియగును; ఇది క్లిష్టకాలము ! నాయకులలో ఐకమత్యము నశించినా, స్వార్థపరులకు రాజ్యాంగములో హెచ్చు అవకాశము లభించినా, తాత్కాలికమగు ఉద్రేకమునకు లోబడి రాజ్యాంగనీతి దూరదృష్టిని కోలుపోయినా, ఆంధ్రరాష్ట్రనౌక ప్రమాదము పాలుకావచ్చును. కాని, బృహస్పతియనుగ్రహముండు కారణమువలన నాయకులు సమయోచితముగా ప్రవర్తించి, ఆంధ్రతారకష్టములు గట్టెక్కింతురని ఆశ.

1957-58 లో చలిత శుక్ర కుజులు శనితో అర్ధకేంద్ర వేధకు రాగలరు. ఆర్థికస్థితి క్లిష్టముగా నుండగలదు. తగు జాగరూకతతో గండము కడచినచో, తరువాత అంతకష్టముండబోదు.

ఆంధ్రరాష్ట్రమునకు పదునైదు సంవత్సరముల వయస్సువచ్చునప్పటికి, చలిత రవి ఆంధ్రతారకు ఎదురుగా రాగలడు. చలిత చంద్రుడు చతుర్థకేంద్రములో సంచరించు కాలమది. చలిత బృహస్పతి వక్రచార మారంభించి, చలిత శుక్రునికి కేంద్రములో సింహావలోకన మారంభించును. శశి గోచారముతో ఆంధ్రతారను చేరుకోగలడు. ఇంద్రవరుణులు తమ పరస్పరస్పర్థను మానుకొని మిత్రులై, రాష్ట్ర లగ్నమునకు ఆంధ్రతారకు సహా చేరియొకవైపున సమాంతరములో నిలుతురు. గొప్పమార్పులు రానున్న కాలమిది యనుట నిర్వివాదాంశము. కాని, "నందో రాజా భవిష్యతి." అప్పటి మాట అట్లుండనిత్తము. 1958 నుండి రాష్ట్రము అభ్యుదయకరమగు పంథలో ప్రజాదరము బడయగలదనుటకు సంశయముండదు.

పోనిండు నియతి ప్రబలమైనది. దానికి తగిన ముహూర్తమే లభించినది. రెండువారములు తాళి విజయదశమినాడు రాష్ట్రారంభము చేయుట హితమని బెంగుళూరు "అస్ట్రాలాజికల్ మ్యాగజైన్" మొఱపెట్టినది. ఇది గమనించువారెవరు ?

ఈముహూర్తములో 'అటంబాంబు' శక్తివంటి శక్తి ఇమిడియున్నది. ఈశక్తియే ఇప్పుడాంధ్రతారకు ఉత్తేజన మిచ్చినదని కనుగొన్నాము. దాని ఫలమే రాష్ట్రరూపమున వ్యక్తమయినది. ఈశక్తిలో మంచి ఎంతో, చెడ్డ అంతకలదు. అనగా, దానిని ఉపయోగించువారినైపుణ్యమునుబట్టి ఫలము హితముగనో, అహితముగనో, కానవచ్చుననుట. ఆంధ్రనాయకులు దూరదృష్టితో విశాల హృదయముతో ఆంధ్రజాతియొక్క అభ్యుదయమే ప్రధానాదర్శముగానెంచి, ఐకమత్యముతో నడుముకట్టి పనిచేసినచో ఈ ముహూర్త శక్తి సాధించని కార్యమే యుండదు. అట్లు కాదేని,



వేటూరి సుందరశాస్త్రిగారి
సువర్ణసుందరరసము
సర్వసవామేహములకు
సంజీవి
ఆర్య రసాయనశాల
ముక్త్యాల — కృష్ణాజిల్లా
బ్రాంచీలు:
విజయవాడ,
వరంగల్.

యాదవకులమునకు ముసలమువలె స్వయూథ నాశనముననే ఈశక్తి ఉపయోగపడగలదు.

ఆంధ్రరాజధాని యగుటకు అర్హతగల నగరమునుగూర్చి ఎవరి ఇష్టానుసారమువారు నిర్ణయించుటకు మారు, ఆంధ్రతార హృదయమేమనుచున్నదో, గమనించుట యుక్తము. ఆమె ఏనగరమును సూచించునో, దానికొరకై అందరు ప్రయత్నించుట శ్రేయస్కరము కాదా?

1953 లో కదా ఆంధ్రతార రాష్ట్ర నిర్మాణకార్యమునకు పూనుకొన్నది? ఆసంవత్సరమున కామెకు వర్షజాతకమును గుణించి చూతముగాక! 11-4-1953 నాడు సాయంత్రం. 6.1-30 గంటలకు రవి ఆంధ్రతారపై నుండును. అప్పటికి గుణించిన వర్షజాతక చక్ర మీక్రింద నున్నది:—

<table>
<tr><td>బు 24.10<br>చ 18-5</td><td>ఆంధ్రతార<br>21-19-20<br>ర 21-19-20<br>శు 24-15</td><td>కు 16-4<br>గు 23-18</td><td></td></tr>
<tr><td>రా 8.45</td><td colspan="2" rowspan="2">ఆంధ్రతార<br>—<br>వర్షజాతకము<br>1953<br>(సాయనము)</td><td>X 14<br>వ 14.37</td></tr>
<tr><td></td><td>కే 8-45</td></tr>
<tr><td></td><td></td><td>] 15<br>ఇ 22.38<br>శ 24-10</td><td></td></tr>
</table>

ఈవర్షజాతక లగ్నమే రాజ్యారంభపు లగ్నమగుటయు, వర్షజాతక దశమాధిపతియే రాజ్యారంభక్షణమున రాజ్యాధిపతియై రాజ్యభావ మధ్యమందే నిలుచుటయు కాలపురుషుని లీలావిలాసము ?

మనఃకారకుడును రాజ్యాధిపతియునగు చంద్రుడు మీన రాశిలో 18°—55' లో నుండుటచే, అతని పూర్ణదృష్టి కన్యా రాశిలో 18°—55' పైననే పడుచున్నది. అగుటచే, ఆప్రదేశమే ఆరాజ్యాధిపతికి అభిమానపాత్రమనుట నిస్సంశయము కదా ?

భూగోళమండలి ప్రతి స్థానమునకును రేఖాంశాలగ్నము (*Geodetic Ascendant*) అను బిందువును గుణిలచు సంప్రదాయమును పాశ్చాత్యజ్యోతిశ్శాస్త్ర వేత్తలలో ప్రముఖపరిశోధకుడగు సెఫేరియల్ అనునతడు ఏర్పరచినాడు. ఆసంప్రదాయమున ననుసరించి కన్యారాశిలో 18°—55' ఏప్రాంతమును సూచించునో, ఆప్రదేశమునే ఆంధ్రతార అభిలషించుచున్నదని భావించుట సమంజసము, శాస్త్రసమ్మతముకూడ.

ఆంధ్రరాజధాని నెలకొల్పు విషయములో ప్రశంసలోనున్న నగరములకు రేఖాంశాలగ్నములు ఈక్రింద చూపబడినవి:—

| | నగరము | | కన్యారాశిలో లగ్నము. |
|---|---|---|---|
| 1 | అనంతపురము | ... | 17°—40' |
| 2 | కర్నూలు ... | ... | 18°—32' |
| 3 | హైదరాబాదు | ... | 18°—55' |
| 4 | తిరుపతి ... | ... | 19°—33' |
| 5 | మదరాసు ... | ... | 20°—20' |
| 6 | గుంటూరు ... | ... | 20°—40' |
| 7 | విజయవాడ ... | ... | 20°—56' |
| 8 | విశాఖపట్టణము | ... | 23°—37' |

వ్యాఖ్యాన మనవసర మనుకొందును. ఆంధ్రతారకు అభిమాన పాత్రమయిన నగరము హైదరాబాదే అని వ్రేలితో చూపినట్లున్నది కాదా ? తాత్కాలిక రాజకీయ కారణములతో ఆనగరమిపుడు లభించలేదు.

ఒక మనవి. స్వయూథ కలహములు మానుకొని ఆంధ్రనాయకులు తెలంగాణా, మదరాసు, మైసూరు మున్నగు రాష్ట్రములందలి ఆంధ్రులతో ఇతోధికముగా సన్నిహిత సంబంధము సంపాదించుకొని భాషాప్రయుక్త రాష్ట్రమును గూర్చి ఇతర రాష్ట్రముల వారు చేయుచున్న కృషికితోడై త్వరలో విశాలాంధ్రమును సాధించుటకై ఈముహూర్త శక్తిని ఉపయోగించుకొని దీక్షతో పురుషకారము జరిపినచో, తప్పక ఈగ్రహగతి సూచించు దైవశక్తి ఇష్టార్థసిద్ధికి దారిమాపగలదు.

"సిధ్యంతి సర్వ ఆరంభాః
సంయోగా త్కర్మణోర్ద్వయోః,
దైవా త్పురుష కారాచ్చ,
న త్వేకస్మాత్ కథంచన."

(బాదరాయణుడు.)

కథానిక:

# అభిశప్తులు

శ్రీ కాళీపట్నం రామారావు

మిట్ట మధ్యాహ్నం వేళ. చైత్ర మాసమేమో ఎండలు అప్పుడప్పుడే ముదర నారంభించాయి. తాపంలో తీవ్రత లేకపోయినా ఒక్కొక్క గాలిరివట వేడిగా తగులుతున్నది.

మూడుసార్లు తగువు పెట్టి మూడుమాట్లకీ న్యాయం దక్కక—మళ్లా మొదలని నాలుగవసారి తగువు పెట్టింది సోమప్ప తల్లి రాఘవమ్మ. తగువు జరుగుతున్నది మునసబుగారి లోగిట్లో.

మునసబుగారిలోగిలి గ్రామంనడిబొడ్డున రాజవీధి నానుకొని ఉన్నది. నలుగురు చేరే స్థలం కాబట్టి మున్నూటరువది రోజులూ ఆయింటిముందు తాటాకులచలువ పందిరి ఉంటుంది. ముందు రోజునే నేయించటంవల్ల క్రొత్త కమ్మపచ్చివాసనలు వేస్తున్నది.

వరండాపైనా పందిటిక్రిందాకూడా చాలామంది జనం ఉన్నారు. లోనివాళ్లకు గాలి తగలదని సర్దారేమో మెట్లమీద వారు కూర్చుని ఉన్నారు. ఆమూలా యీమూలా గోడవారలను మాత్రం కొందరు నించొని ఉన్నారు.

తగువు ఒక కడకు వచ్చేసరికి చదురు నిశ్శబ్దమై ఊరుకున్నది. మునసబునాయుడూ కరణమూ లోగిలి ప్రధానద్వారా న్నానుకొని వరండాకు తూర్పుకొనను పరిచిన తాటాకులపై కూర్చుని ఉన్నారు. వారి సరసనూ చుట్టూనూ ఊరిపెద్దలనబడే వారూ—పంచాయితీదార్లూ కూర్చున్నారు. తక్కిన జనం పడమటి కొనకూ అక్కడా సర్దుకున్నారు.

జనంకు మధ్యగానూ పెద్దల కెదురుగానూ ఒక స్తంభం వద్ద చతికిలపడి ముసలి రాఘవమ్మ కూర్చుని ఉన్నది. అనతి దూరంలో వేరొక స్తంభానికి అనుకొని—ఆమె ఒక్కగాని ఒక్క కొడుకూ—పోయినవాళ్లు పోగా మిగిలినవాడు—నలభయ్యీ నలభైయైదేండ్లవాడు—నలుగురు బిడ్డల తండ్రి—సోమప్ప కూర్చుని ఉన్నాడు. సోమప్ప భార్య మునసబుగారి వీధిద్వారం తలుపు చాటుచేసుకొని—ప్రత్యక్షంగా బయటకు కనుపించకపోయినా లోనుండే సమస్తం వింటూఉండీ ఉడిగీతన ఉనికిని భర్తకు గుర్తుకు తేవడానికిలా తలుపు కదపడం ద్వారానో గడియ తాకడం ద్వారానో శబ్దంచేస్తు ఉన్నది. ఆమె పేరు నారాయణి.

పక్కా అరఘడియ నిశ్శబ్దంతో అక్కడ తగవు కావలని వచ్చినవారూ తగవరులూ తగవు వినవచ్చినవారూకూడా పూర్తిగా విసిగిపోయారు.

అంతట—మున్సబే ఆనిశ్శబ్దాన్ని భంగంచేస్తూ కడసారి మాటలా అన్నాడు.

"ఏమండి సోమప్పా! ఇంకేటి ఆలోచిస్తారూ? లేచి అమ్మను తీసుకొని ఇంటికెళ్లిపోండీ," అన్నాడు అదే చనువుగా అదే ఆజ్ఞగా.

కాని సోమప్ప అప్పటికికూడా మాటాడలేదు. తలవంచుకొని సగం కాలిన అగ్గిపుల్లయొక్క నల్లని భాగంతో నేలపై వివో అడ్డుగా నిలువుగా గీరలు గీస్తున్నవాడు అలానే ఉండిపోయాడు.

ఈధోరణి చూచాక మాత్రం అంతవఱకూ ఊపిరికూడా గట్టిగా తీస్తే తగవేం చెడిసి పోతుందో అన్న విధంగా ఊరుకున్న సభాసదులందరూ నిస్పృహ ప్రకటింపసాగారు. ఈనిస్పృహ జనంనడుమ మొదట సైగలుద్వారా సూచింపబడుతూ వచ్చి చివఱకు క్రమంగా గొణుగుడులోకి మారింది. ఆగొణుగుడే సణుగుడుగా మారి చివరికొక స్థితిలో ఎవరికితోచిన మాట వారు మాటాడ్డానికి దిగింది. కాని పెద్దలెవ్వరూ కలుగజేసుకోలేదు.

ఈ పెద్దలు అంతవఱకూ సభను అదుపులో ఉంచుతునే వచ్చారు. ఇంక యెట్లాను అసభచేయగలిగిందేమీ లేదని తెలిసాక 'మిరియాలు దంచగకూడా ఎందుకు' అనే ధోరణిలో వారి మట్టున వారూరుకుని ఎక్కడ ఉన్నవారక్కడే అలా గోడలకు చేరబడిపోయారు. ఇంక సభానిర్వహణ భారం పెద్దతనం ప్రకటించాలని సరదా పడే చిన్నచిన్న పెద్దలు తమంతటతాముగా వహించక తప్పిందికాదు. వారు వహించారుకూడా. ఒక ముసలాడు సోమప్పకు హితవుచెప్పాడు.

"నూడు సోమప్ప బాబూ! నేనొక మాట సెపుతాను. ఆ యమ్మకైనా ఇప్పుడు దగ్గర దగ్గర అరవైయైదేళ్లో డెబ్భైయేళ్లో ఉంటాయి. బ్రతికినంతకాలం బ్రతకబోదు. పోనీ తల్లి అనికాకపోతే నీ పంచకి జేరిన పేదముసిలిదనైనా ఇంత గంజిపోయవయ్యా! ముసిలోళ్లబాధలు నీకేం తెలుసు బాబూ—ఆవయస్సులో యింట తన వోళ్లన్నవోళ్లు, చస్తే యీడ్చేస్తారులే అన్న వోళ్లు లేరనంటే అది మనసుకెంతటి కష్టనుని జెప్పను! నామాటను........"
అన్నాడు.

ఇంకొక ఓబయ్య—చెవులు సరిగా వినిపించని రాఘవమ్మతో—చూట్టూ జరుగుతూవున్న ఆగొడవలో తనసలహా వినిపించుకో లేదేమో ననే భయం కొద్దీ ఆమె చెవ్విదగ్గర నోరుపెట్టి మరీ—ఉచ్చస్వరంలో చెప్పసాగాడు.

ఎళ్లవమ్మా! ఎళ్లు! ఎళ్లి నీకొడుకు కాళ్లట్టుకో! 'నాకింక తిట్టరున్నారు నాయనా అని, మళ్లా 'వరే 'వన్నదాకా అకొళ్ల

గట్టిగా పట్టుకొని ఒదలకు...ఏంజేస్తాడో చూద్దాం'—అంటూ అందులో అందుతో తాను జోడించిన హాస్యంకూడా సభ్యులు గమనించారా లేదా అన్నట్టూ అందరివంకా వెర్రి మొహం వేసుకొని చూడసాగాడు.

కాని వారంతా అతడి హాస్యంమాట అటువుంచి మాటాడటమైనా గమనించి ఉన్నట్టులేదు. ఎవరిధోరణిలో వారున్నారు. ఎవరికి వారే తాము చెప్పదలచుకున్నది ఎదుటవారికి వినిపించడానికి బదులు ఎదుటివారి ముందు వెళ్లగ్రక్కడానికే ప్రాధాన్యత ఇవ్వటంతో అక్కడి ఆసభంతా ఒక సంతగా తయారయ్యింది. చివరికి సంత సంతంతా ఒక స్థితిలో ఆకస్మికంగా ఒక్క అదటున నిశ్శబ్దమై ఊరుకున్నది. ఆనిశ్శబ్దంలో సోమప్ప మాటాడుతున్నాడు.

అతడు ఎత్తి ఉంచిన తన జొదలపై నమస్కారహస్తముంచి అపాదమస్తకం వణుకుతూ కంపించే కంఠంతో చెపుతున్నాడు.

'......మీ సభవారి కందరికీ ఇవే నా నమస్కారాలు. మీ చిన్నలకూ పెద్దలకు నావి వేయి వేల దండాలు. మీ మాట సాగించలేనన్నందుకు నన్ను క్షమించండి. అది నాకు తల్లికాదని మీకేనాడో మనవిచేసి ఉన్నాను. పోనీ తల్లికాదంటే బిచ్చకత్తెగానైనా ఆదరించమన్నారు. నిజమే ఉంటే అలాగే ఆదరించి ఉందును. కాని భగవంతుడు నాకా శక్తి ఇవ్వలేదు. నేనేం చేస్తాను ? నాకే నాపిల్లలకే చాలినంత నే సంపాదించలేకపోతున్నాను. నేనందులో ఇంకొకరికేం పెట్టగలనూ !' అంటూ క్షణకాలం వ్యవధితో "కాగా...ఏదారేండ్లైతనంతట తానుగా బ్రతుకుతున్న మనిషి ఆమె—ఇప్పుడైనా ఇంత ఊరిలో ఇన్నివందల మంది జనాభా ఇంతమంది మహాభాగులు హాయిగా జీవిస్తూ ఉండగా ఆమె ఒక్కతె తిండిలేక చచ్చిపోతుందా? అలాగ ఎన్నటికీ జరగదు. అందుచేత అమె మానాన ఆమెను బ్రతకనివ్వండి నామాన నేను బ్రతుకుతాను. ఇంకశలవ్ ! మీ అందరివద్దా శలవ్. అంటూ చుట్టూ ఏదారు నమస్కారాలు వరసగా విసిరి అక్కడనుంచి నిష్క్రమించసాగాడు.

సోమప్పయొక్క ఈసుదీర్ఘ గంభీరోపన్యాసంలో ఏ ఏ భాగాలు ఎక్కడెక్కడ ఎవరెవరికి ఎలాతగిలాయో తెలియదు. సభాస్తారులంతా దిమ్మెరబోయి ఎక్కడ ఉన్నవారు అక్కడ అలా చిత్ర ప్రతిమలలా నిలిచిపోయారు.

సోమప్ప అంతటితో నిష్క్రమిస్తాడనే అనుకున్నారు కాని అతడు నిష్క్రమించలేదు. అల్లంతదూరం పోయిమళ్లా తిరిగివస్తూ ఆరంభించాడు. ఈసారి అతడి ముఖం ఉద్రేకతీవ్రతచే మరీ ఎర్రనై ఉన్నది. అతడి గొంతు ఆనిశ్శబ్దంలో వెనుకటికన్నా ఖంగన మారుమోగుతున్నది. అతడన్నాడు.

"మీరంతా ప్రభువులు. నేనొక్కడిని పేదవాడిని. మీముందు మీమాట కాదని యీ ఒక్కగా నొక్క పేదవాడూ ఒంటరిగా నిగ్రహించలేడు. ఆసంగతి నాకు బాగానే తెలుసు. అయినా నేను మీ అజ్ఞకు బద్ధుణ్ణి కాలేనని చెపుతున్నాను. అలా చెపుతున్నానంటే అది మిమ్మల్ని తిరస్కరించే ఉద్దేశంతో కాదు. నిజంగా అది నాశక్తికి మించినపని. ఈసంగతి మీరు గ్రహిస్తారనే నమ్ముతాను. ఒకవేళ గ్రహించకపోయినా నేను చింతించను" అంటూ తిరిగిపోబోయి మళ్లా అంతలో మనసు మార్చుకు వెనుదిరుగుతూ మరి నాలుగు మాటలు అన్నాడు. ఈసారి అతడి వచోధోరణి సరి శ్రోతృశయ్య ఒకటి ఏర్పరచుకొన్నది.

"మనుష్యులు మనుష్యులకు చేయగల హాని చాలా స్వల్పం. నేను కులం లేనివాణ్ణి. అందుచే నాకు వెలివేస్తారన్న బాధలేదు. పోతే పదిమందీ కలసి వెనుక ఓసారి బెదిరించినట్టు నన్ను తన్నడానికి నాయింటిమీదికి రావచ్చు. కాని నేను దానికికూడా సిద్ధమే. మీరందరూ వచ్చి నాయింటికి నిప్పంటించి నాపీకతీసి ఆ అగ్గిలో ఆహుతిచేసినా సరే నేనైదానిని అమ్మా అనను. కొడకా అని అది వస్తే నాబొందెలో ప్రాణమున్నంత కాలం దానిని మళ్లా నాగుమ్మం త్రొక్కనివ్వను. ఇది ముమ్మాటికీ తథ్యం ! శలవ్ !

—అంటూ ఈసారి పూర్తిగా నిష్క్రమించేశాడు.

జనం చాలా సేపటివఱకూ కిక్కురు కక్కురు మనలేదు. "దిమ్మదిరుగ మొత్తిన వడగళ్లవాన తరువాత ప్రకృతి ఎట్లా ఏవిధంగా ఉంటుందో ఈసంఘటన పిదప అక్కడవున్న ఆసభవారి ప్రకృతి కూడా సరిగా అట్లానే ఉన్నది." తరువాత ఒక్కొక్కరే క్రమంగా తేరుకోసాగారు.

పెద్దలకు సోమప్పయొక్క యీ అవినయం ఏలనో ఈసారి ...అందరూ ఆశించిన విధంగా కోపం తెప్పించలేదు. బహుశా వారీ పర్యవసానానికి ముందుగానే సిద్ధపడి వుండాలి. ఎటువచ్చి రాఘవమ్మకు కండ్ల తుడుపుగా ఉంటుందని యీతతంగమంతా నడిపి వదిలారు.

సోమప్ప అట్లా తనకు తానుగా తగువు పరిష్కరించి నిష్క్రమించే సరికి పెద్దలు తమమీద ఉన్న ఆమహాభారం తనకుతానుగా సడలిపోయినట్టు నిట్టూర్పులు విడుస్తూ సాంకేతికహాసాలతో ఒకరిముఖం ఒకరు చూసుకొని చివరికి ఏకముఖంగా తమలో ఒకరి ద్వారా—తేలిపోయిన విషయం రాఘవమ్మకు తమ ద్వారా అధికార ప్రకటన ధోరణిలో తేటపరిచారు.

"విన్నావుగదటమ్మా ! ఆయనలా చెపితే మేమేంచెప్తాం ! చెప్పగలిగినకాడికి చెప్పేం. చేయగలిగినదేమీ లేదని ముందే తేలిపోయింది ఇంకేంచేస్తాం" అన్నాడు గొంతులో సానుభూతిని ధ్వనింపజేస్తూ.

కాని రాఘవమ్మ ఏమీ మాటాడలేదు. అమె తమోసహజమైన అంధత్వంచే తెల్లనైన నల్లని కనుగ్రుడ్లలోంచి నిశ్చలంగా శూన్యంలోకి దృక్కులు విడుస్తూ అట్లానే కూర్చుని ఉండిపోయింది.

ఆమెకు మాట్లాడటానికి కొంతసేపు ఎడమిచ్చి అమె మాటాడకపోగా ఆ పెద్ద మనిషే మళ్లా అన్నాడు.

"ఇంతకూ నీఖర్మ యిట్లా ఉన్నది. ఉన్నది ఒక్కగాని ఒక్క కొడుకు. ఆకొడుక్కూడా నీమీద ఇంతద్వేషం కల

గాలా! పోనీ భగవంతుడైనా చిన్నగా చూడవద్దా, చిన్నవాళ్లనూ చిటికవాళ్లనూ పెద్దవాళ్లనూ అన్ని వయసులవాళ్లనూ ఎత్తుకపోతున్నాడు. నివ్వొక్కర్తివేనా బరువైపోయావు. ఏం మహాసుఖాలు నువ్వనుభవించేవి తప్పిపోతాయని భయపడుతున్నాడో ఆయన తెలియదు......" అంటూ నీళ్లు నమిలి ఊరుకున్నాడు.

ఆ పెద్ద మనిషి ఈ ఉపశమన వాక్యాలు ఉపశమన వాక్యాలుగానే ఉపదేశించి పలికినా అవి విన్నవాళ్ల హృదయాలనుకూడా ఉర్రూతలూపేవిగా ఉన్నాయి. రాఘవమ్మ మాట వేరేచెప్ప నవసరంలేదు.

ఆమె తడులు దక్కి గాజువారిన ఆపాడి కన్నులను అతి కష్టంపై తడుపుకుంటూ అన్నది. "అవును బాబూ: అంతే; నా ఖర్మమే నన్నిట్లా కట్టి కుడుపుతున్నది. లేకపోతే నేనేంకోరానవి బాబూ!" అంటూ శీర్ణమైన ఆముదుసలి కంఠం ఉద్రేకభారంచే మరీ కంపిస్తూఉండగా అన్నది— "నేనేం మడులు కోరలేదే మాన్యాలుకోరలేదే? పప్పన్నాలూ పాయసాలూ కోరలేదే. కట్టేందికి చుట్టు చెంగాయిచీరలూ అలంకరించుకుందుకి ఆభరణాలూ కోరలేదే. ఏంకోరాను? పిడికెడు మెతుకులు. వాడి కంచందగ్గర వాడి పిల్లలకంచం దగ్గర—వాడి పెళ్లాం కంచందగ్గర—రాలేపాటి పిడికెడు మెతుకులుకోరాను. వాడి పెండ్లా కుడిచేత్తో వేసినా ఎడంచేత్తో పారేసినా-మలకలలోపోసినా మొహాన విసిరినా మహాభాగ్యమనిఅందుకుంటానన్నాను. అది నన్ను లంజ అని తిట్టినా ముండ అనితిట్టినా పడతానన్నాను. తలంత బొప్పెలు కట్టేటట్టు మొట్టి కాయలు మొటినా పెదవికదపనన్నాను." అని ఆకస్మికంగా ఒక్క తెర దుఃఖముముంచుకురాగా హృదయం కరిగించుకొని కన్నులవెంబడి స్రవింపజేస్తూ శోకభారంచే పట్టుకపోయే గొంతుతో "ఎందుకు? ఎందుకు బాబూ? ముసలిదానినయిపోయాను. మరీ జవసత్వాలుడిగిపోయాయి. కళ్లా కానరావు. రాత్రులులేచి బయటకు వస్తే నాలుగైదుసారులు కాలుజారి, రాళ్లు తన్నుకొనిపడిపోతుంటాను. ఇంటి ముందుగోతులు అడ్డమైన తుప్పలు—వాటిల్లో పడితే లేవలేను. కాళ్లే విరుగుతాయో చేతులే విరుగుతాయో తెలియదు. పడితే బాధనికాదు. చచ్చేవఱకూ కాళ్లూచేతులూ లేకపోతే ముద్దనోటికి చేరే ఉపాయం కనుపించదే అని భయం ..." అంటూ శోకం అగ్గలంకాగా మరి మాటాడనేరక ఆగిపోయింది.

జనం వెళ్లిపోవడానికి లేచినవారూ వెళ్లిపోనుద్దేశించిన వారూకూడా అట్లానే తమ ఉద్యోగాలు మఱచి అక్కడే అలా కొయ్యబొమ్మల్లా ఉండిపోయారు. నిలువగళ్లతో జనం వృద్ధురాలూ నిరాశ్రయా ఏకైకపుత్రతిరస్కృతిజనిత మహావమానపరిఖిన్నా అయిన ఆ అభాగ్య వంక తదేక దృష్టితో చూస్తూవుండే ఆమె పరిక్షీణమాంసలములైన ఆబోసినోటి పెదవులు వడవడ కంపిస్తూ ఉండగా మొదటనే ముసలితనంవల్ల ముడుతలు వారి వికృతమైన ముఖం దుఃఖభారంచే సంకుచితమైన ముఖకండరాలతో మరీ వికృతముకాగా ఇంకొక తెరముంచుకువచ్చిన మహోద్వేగంతో పెద్దగా భగవంతుణ్ణి వుద్దేశించి పిలుస్తూ అన్నది. "హే సూర్యనారాయణమూర్తీ! తండ్రీ! భగవంతుడా! యీలోకంలో ఎవరికన్నా నేను నాకోడలిని ఎప్పుడన్నా ఆరళ్లు పెట్టానా నాయనా! ఎందుకు బాబూ దీనికి నామీద ఇంత పగ! దీనికి కొడుకులు లేరా బాబూ. దీనికి ముసలితనంరాదా బాబూ! ఈసంగతి నువ్వు మరిచి పోతావా!..." అంటూ అక్కడకు ఉద్వేగం చరమస్థాయికి చేరగా ఆకస్మికంగా ఆగిపోయి కొంతసేపు పోయాక యీలోగా శాంతించిన చిత్తంతో పశ్చాత్తాపపడుతున్నదానిలా "వద్దు. వద్దు. అలా వద్దు. ఇప్పటికి అనుభవించినదే చాలు. ఏజన్మలో ఎవరి వుసురు పోసుకొన్నానో ఇప్పుడు అనుభవిస్తున్నాను. ఇప్పుడు ఇంకొకరి వుసురుకట్టుకోనా! వద్దు...అలా ఎన్నటికి వద్దు. దాని పిల్లా పాపాతో దాన్నే సుఖంగా వుండనీ..." అంటూ పోయింది.

జనం చిత్రప్రతిమలలా అలానే ఉన్నారు. ఒకళ్లిద్దరు మున్సబుగారి గుమ్మంకేసి చూశారు. కాని అక్కడ వాళ్లకు లోన నారాయణి ఉన్నదీ లేనిదీ ఏమాత్రంకూడా తెలిసింది కాదు. అంతట వారుకూడా తమ కండ్లను రాఘవమ్మ వంకే త్రిప్పుకున్నారు.

రాఘవమ్మ అట్లానే కాస్తసేపు ఉండి ఉండి యింకొక తెర దుఃఖంముంచుకు రాగా మళ్లా ఆరంభించింది. ఈసారి ఆమె కంఠస్వరం పూర్తిగా ఆమె వశంతప్పి ఉన్నది. శోకోద్వేగాలు ఎడనెడ ఆమె హృదయంలో చోటులు మార్చుకుంటుండగా వాటితోపాటుగా తానుకూడా మారే కంఠస్వరంతో ఆమె ఆరంభించింది.

"నేను లంజనట... నేను భటాచోరునట. నానించి వాళ్లకు జరిగిన అపకారం ఇంతా అంతా కాదట. నిజమే. నిజమే. నేను లేచివచ్చిన దానినే. కాని ఎందుకు లేచిరావలసివచ్చింది. లేచి వచ్చినా ఎవ్వరిలానూ గుడిసె వేసుకోలేదే. ఇంతవూరు వుంది ఇంతమంది ఉన్నారు. ఇన్నేళ్లయి నేనిక్కడ వున్నాను. ఆలేచి వచ్చిన బ్రాహ్మడితో తప్ప నానడవడికి ఎక్కడైనా మచ్చ ఉన్నదా. నిజం చెప్పండి. చెప్పండి. జంకకండి ఎవరైనా సరే! ...దేవుడు, ఓదేవుడా ఎక్కడున్నావు నువ్వు! నువ్వు చెప్పు. ఆబ్రాహ్మణ్ణి తప్ప నేనింకెవ్వరినైనా ఎరుగుదునా? ఆ లేచివచ్చే వుద్దేశమైనా మొదట కలిగినది నాకా? నేను వద్దువద్దని ఎంతని మొఱ్ఱపెట్టా నా బ్రాహ్మడితో. ఆ బ్రాహ్మడు వినకుండా నా మెడ లెలా వంచి ఈ పాపంలోకి లాగాడు! ఇప్పుడు నన్నిలా అధ్వానంచేసి ఎందుకు ముందుగా పారిపోయాడు. చెప్పవయ్యా చెప్పు! అంటూ ఆ వివశత్వంలో తన హేయమైన రహస్యగాథ నలుగురినడుమా నగ్నంగా ప్రదర్శింపబడుతోందనైనా గమనించలేక సమస్తం వాగి యింకా వశందప్పిన ఉద్రేకం కడలంటగా తల నేలకువేసి పెఢీ పెఢీమని బాదుకుంటూ "చెప్పు...చెప్పవయ్యా చెప్పుమంటే...చెప్పకపోతే వట్టు! చెప్పు! చెప్పు చెప్పవయ్యా...చెప్పు......" అంటూ పడిపోయింది.

చుట్టూ ఉన్న జనం హాహారవాలతో ఒక్క అదటున ఆమెను వారించేవారుగానో మందలించేవారుగానో పెద్ద పెద్ద కేకలువేస్తూ ఆమెను చుట్టూచుట్టుముట్టి ఒక ముడిగా ఏర్పడిపోయారు. అటు రాఘవమ్మ ఉద్రేక కంఠమైతేనేం ఇటు ఆమెను వారించే వా

కొతరకంతాలైతేనేం చుట్టూ ఫర్లాంగు ఫర్లాంగున్నర మేర ఎక్కడెక్కడ ఇళ్ళల్లో ఉన్నవారికీ స్పష్టంగా వినిపించాయి. జనం పిల్లా మేకా ముసలి ముతగా భేదంలేకుండా ఎలా ఉన్న వారలా ఎక్కడ వున్నపని అక్కడే విడిచి ఏమిటేమిటంటూ పరుగులు నడకలుగా వచ్చి మునసబుగారి యింటిముందు గుమిగూడిపోయారు.

తరువాత ఆ గుంపంతా ఒకరిమాట ఒకరికి తెలియకుండా ఏమేమి ప్రశ్నలు వేసుకున్నారో ఏమేం జవాబు లేధోరణిలో చెప్పుకున్నారో కన్నవాళ్ళూ విన్నవాళ్ళూ ఎట్టిఎట్టి అభిప్రాయాలు వెలిబుచ్చారో అదంతా వర్ణించటం నిజంగా అసంభవం. పోతే చెప్పగలిగినదల్లా ఆ ముసలమ్మ తన యీ ఆకస్మికోద్రేక ప్రేరితమైన అనాలోచిత చర్యవల్లపొందగలిగిన సత్ఫలిత మేమీలేదు. నుదుటిపై చర్మంమాత్రం చాలావఱకూ కమిలిపోయింది. అది కొన్నాళ్ళవఱకూ బాధాకరంగానే ఋజువు అవుతూ వచ్చినా రాఘవమ్మ తాత్కాలికంగా ఆశించినట్టు లేక కొందరు కొందరు అమ్మలక్కలు భయపెట్టినట్టు ఆమె పాలిట మరణ కారకం కాలేకపోయింది.

*　　*　　*　　*

ఇది జరిగి దగ్గర దగ్గర ఇరవై ఏండ్లయ్యింది. యీ యిరవై సంవత్సరాలలోనూ సోమప్పగారి కుటుంబం ఎన్నెన్ని ఝంఝామారుతాల దాడికి గురి అయ్యిందో తడవ తడవకూ ఆ కుటుంబము ఆ దాడులలో ఏమేమి ఎంతెంతగా కోల్పోయిందో వర్ణిస్తే అదే ఒక మహాగ్రంథ మౌతుంది. అందులో ముఖ్యమైన వానిని క్లుప్తంగా చెప్పుకోవలసి వస్తే ఇలా వుంటాయి.

పై సంఘటన జరిగిన ఆరేడు మాసాలనాడు సోమప్ప ఒక తెల్లవారుజామున ఎవరితోనూ చెప్పిపెట్టకుండా ఆ లోకానికు పయనమయ్యాడు. జబ్బేమీ లేదు. ఒక్తి హఠాన్మరణం. మొదటిరోజున వూష్ణంవచ్చింది. సాయంకాలంకు విడిచేసింది. మర్నాడు రాత్రి మళ్లా ఉష్ణం వచ్చిందన్నారు. తెల్లారేసరికి మనిషి మరిలేడు.

ఆ యింటికి సంబంధించిన ఆ ప్రత్యేక పరిస్థితుల్లో పెండ్లికి సిద్ధంగా వుండి పెండ్లికాని ఇద్దరాడపిల్లలనూ ఎందుకూ కొరగాని ఒకానొక పదహారేండ్ల ముద్దుకొడుకునూ ఇంకొక పందేండ్ల ఆడపిల్లనూ ఒక ఆడదాని మెడకి చుట్టిపోవడమంటే అదెంతటి అత్యాచారమో—ఆ దుస్థితికి గురియైన నారాయణికే తెలియాలి.

కాని మానవ ప్రకృతి మనము సాధారణంగా ఊహించని శక్తులను ఎన్నిటినో కలిగిఉన్నది. మనుష్యుడు సాధారణపరిస్థితుల్లో భరించటమన్నది తలపునకూడా సాధ్యం కాదనుకునే భారాలను ఎన్నిటినో ప్రత్యేక పరిస్థితుల్లో అవలీలగా తలపై మోసుక తిరుగగలుగుతాడు.

ఇక్కడకూడా అంతే అయింది. కొద్దిరోజులలోనే భర్తృనష్టశోకాన్ని మరిచిపోయిన నారాయణి నడ్డికట్టి కుటుంబ నిర్వహణకు సంసిద్ధమయ్యింది. అయితే ఆ కుటుంబానికి సంబంధించిన ప్రత్యేక పరిస్థితులు ఆమెను అడుగడుగునా ఆపదపాలే చేస్తూ వచ్చాయి.

సోమప్ప బ్రతికిఉన్నరోజులలో అతడు తన నుద్ధరించబుట్టిన ఆ ముగ్గురు ఆడపిల్లలనూ తలచుకొని ఎప్పుడూ బెంగటిల్లిపోతునే ఉండేవాడు. నారాయణి "ఆ పెళ్లిళ్ళుకాక ఆగిపోతాయా! అలానే అయిపోతాయి. నీకు నేనొహర్తిని దొరుకుతా నని ఎన్నడైనా అనుకోగలిగినానా? కాని దొరకలేదా? అలాగే వాళ్ళకీ దొరుకుతారు మొగుళ్ళు. కల్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆపటం ఎవ్వరికీ తరంకాదు" అనేది.

కాని ఆ ఆగని కల్యాణం రావటమనేది ఎంత అబ్బురమో నారాయణికి తన ఇద్దరు కూతుళ్లకూ పెండ్లిండ్లు చేయవచ్చేసరికి గాని పూర్తిగా తెలియలేదు.

ఆమె భర్తలా కూతుళ్లకు బ్రాహ్మణవరులనే సంపాదించాలని పట్టుపట్టలేదు. అయినప్పటికీ ఆమె వాళ్లకు సరియైన సంబంధాలు తెచ్చిపెట్టలేకపోయింది.

రెండుమూడేళ్ళు శలక్రిందుల తపస్సు చేయాగా చేయగా పెద్దపిల్లకు "యీడూ జోడూ కుదిరిన భర్త" దొరికాడు. తాను జోతిష్కుడననీ ఓఢ్రదేశం వలసపోయిన తెలుగు బ్రాహ్మణుణ్నే ననీ తనది పూరీ జగన్నాథం దగ్గర 'బోయ్ పురఘూడాగాం' నివాసమనీ, అవివాహితుణ్ణనీ పిల్లచేతి భాగ్యరేఖలచూచి చక్కదనం చూచి కులం పోగొట్టుకోడానికైనా సిద్ధపడుతున్నాననీ చెపుతూ వచ్చిన ఆ టక్కరి వేషగాని నిజస్వరూపంవాడు భార్యను తనతో తీసుకపోతూ వెంటవచ్చిన అత్తగారిని జగన్నాథక్షేత్ర దేవాలయగర్భంలో గిరవుపెట్టే మాయమైనప్పుడుగాని ఎవ్వరికీ విదితం కాలేదు. అప్పుడు ఇంకేమనుకున్నా నిష్ప్రయోజన మేఐపోయింది!

ఈపాఠంతో నారాయణి తన రెండవకూతుర్ని ఏండ్లు గడచినవాడైనప్పటికీ తెలిసినవాడని చెప్పి ప్రక్కనే పదిమైళ్ళదూరాన ఉన్న ఇంకొక గ్రామానికి చెందిన సుబ్బయ్యకిచ్చి పెండ్లి చేసింది. అతడికి మొదటి సంబంధంవల్ల ఒక కొడుకుకూడా ఉండెను. అయినా కట్టుమిషను సహాయంతో కూటికీ గుడ్డకూ కరువులేకుండా బ్రతుకుతున్నవాడనీ బిడ్డ ఎదురుగా కళ్ళముందు పడివుంటుందనీ ఆశించింది. ఆ దౌర్భాగ్యుడు కూడా పెండ్లికాకముందు చెప్పిన తీయతీయని కబుర్లన్నీ పెండ్లయాక కట్టిపెడుతూ పిల్లను పుట్టింటికి మళ్ళా పంపేదిలేదనీ అత్తవారివంకవారు గుమ్మం ఎక్కితే కాళ్లు విరగగొడతాననీ కూశాడు. పిల్లను నానాబాధలూ పెడతాడనికూడా తెలిశాక నారాయణ గోడు చెప్పతరంకాదు.

ఆడపిల్లల బ్రతుకులు ఈతీరున ఉన్నవంటే మగపిల్లడు జగన్నాథం ధోరణి ఇంతకన్నా కడుపుకోతగా తేలింది.

జగన్నాథం చిన్నప్పటినుండీ ఆమెను కాల్చుకు తింటూనే వచ్చాడు. మొదటల్లా గారం. తరువాత పగ్గాలులేని మొండిగుజ్జం. తెలివితక్కువ వాడంటే కాదు. తెలివైనవాడంటే అంతకన్నా కాదు. వాడు తండ్రిపోయిన అనంతరం అతడు చేస్తూ వచ్చిన వ్యవ

సాయం చేయడానికి చేతనూ కాక ఒళ్లూ ఒంగక ఉన్న కాస్త భూమీ అమ్మి చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకు చేసిన అప్పు తీర్చి మిగతా దానితో వర్తకం చేదామన్నాడు. నారాయణికి అందలి లోతు పాతులు తెలియవు. సరేనన్నది. ఏదో విధంగా భూమమ్మారు. వర్తకంకూడా కొంతకాలం చేశారు. కాని అది జగన్నాధం చేతి వర్తకం. దానివల్ల లాభించినదేమీ లేదు. ఎప్పుడూ ఇందులో పాలికవట్టం అందులో అరవై 'దెబ్బ' అన్నమాటే. పోకులూ వేషాలు మాత్రం బాగా అబ్బాయి—యీ వర్తకంలో తల్లీ కొడుకూ ఎప్పుడూ పోట్లాడుకుంటునే వుండేవారు. కొస కొక నాడు జగన్నాధం ఉన్నకాడికీ చిక్కినకాడికీ చేతికంకించుకొని దేశాలు పట్టేశాడు. ఎక్కడకు పోయాడో తెలియదు. ఏడాది ఏణ్ణర్థంనాడు తాను మిలటరీలో చేరినట్టు వ్రాశాడు. కొంతకాలంవఱకూ అప్పుడు కొంతా అప్పుడు కొంతా డబ్బు పంపినా తరువాత తరువాత అతడు ఏమయ్యాడో కూడా తెలియరాలేదు.

ఈ విధంగా ఒక్కొక్కరే బిడ్డలు తనకు కాకుండా పోతున్నారని గ్రహించేసరికి నారాయణిని క్రొత్తగా భయంకూడా ఆవరించసాగింది. ఆమె తన భవిష్యత్తును గురించి ఊహించవలసి వచ్చేసరికి అంతరాంతరాలలో వణికిపోయింది. చాలాకాలంవఱకూ మథనపడి మథనపడి చివరి కామె తన ఆఖరు కూతురుకు పెండ్లిచేసే ఉద్దేశం—ఉద్దేశపూర్వకంగా విరమించుకున్నది. ఎవరైనా అడుగుతే సంబంధం దొరకలేదని సాకు చెప్పేది.

నారాయణియొక్క యీ కడసారపు కూతురు వస్తుతః మంచి పిల్లే. కాని ఏండ్లతరబడి జితేంద్రియత సాధించటమంటే మాటలు కాదు. ఎప్పుడు ఎట్లా జారిందో ఒకసారి కాలుజారింది. దానిని మళ్ళా ఆమె ఎన్నటికీ కూడదీసుకోలేకపోయింది. ఇప్పుడామెకు పెండ్లీ మొగుడూ లేకపోయినా ఒక బిడ్డ మాత్ర మున్నది. ఆడపిల్లే. నారాయణి ఆ మనవరాలిని ఎత్తుకోవడానికి గాని ముద్దులాడటానికి గాని లోకంతీరు అమ్మమ్మలలానే ఎవరికైనా చూపించటానికి గాని సిగ్గుపడదు. "ఇదంతా సవ్యంలానే కనిపిస్తుందేమో ఆమె కంటికి" అంటారు లోకులు.

* * * *

చెప్పవచ్చేదేమంటే యీ యిరవై యేండ్లలోనూ సోమప్ప కుటుంబం అనుకోనివీ ఆశించనివీ కష్టాలు అనేకమైనవానికి గురి అయింది. కాని రావలసేదీ కోరుకొన్నదీ అయిన ముప్పువకు మాత్రం ఈనాటికైనా వారు నోచుకొని ఉన్నట్టు లేదు.

రాఘవమ్మ నేటికికూడా బ్రతికే ఉన్నది. నేటికి కూడా ఆమె తన జానెడు పొట్టకై ఊరివారి దయాధర్మభిక్షులపైనే ఆధారపడవలసి ఉన్నది.

ఎవరైనా దయతలచి తమంతట తాముగా ఆమె ఇంటిముంగిలికి వచ్చి ఇంత అన్నమో గంజో పెడితేకద్దు. లేకపోతే లేదు.

ఆ విధంగానే ఆమె రాబోయే విశ్వావసునామసంవత్సర వర్షర్తువు కోసరం (1965 సం॥) ఎదురుచూస్తూ వున్నది!
ఆమె పెద్ద మనవరాలి మొగుడు జ్యోతిష మార్తాండో శ్రీ సూర్యనాయణపండిత్ చెప్పాడు. ఆమెకు మారకయోగం ఆమె 103 వ ఏటనేగాని ఈలోగా లేదట. ఈలోగా 'సాక్షాత్ యమధర్మరాజును ప్రత్యక్షం చేసుకొన్నా అతడుకూడా చేయగలిగింది ఏమీ లేదట!!'

# సంవత్సరము, ఆది—ఆచారములు

శ్రీ వావిలాల సోమయాజులు

"చతుర్వింశతి పర్వ త్వాం షణ్ణాభి ద్వివదశ ప్రధి
త్రిషష్టి శతారం వై చక్రం పాతు సదాగతి"

—మహాభారతమ్

"ఋతువున కొక్కరూపు సవరించి అహర్నిశలన్ తెరల్ యథో
చితముగ లేచి వ్రాలగ కుశీలవులై నటియింప ప్రాణి సం
హతి సుఖదుఃఖరంగముల నాదియు నంతము లేక సాగు నీ
స్తుతిమ దదృష్ట కాల నయచోదన కంజలినిత్తు నర్మిలిన్‖

—శ్రీ రాయప్రోలు

## 1

ఆంధ్రులకు చైత్రశుద్ధ పాడ్యమితో సంవత్సరాది. మన ప్రాచీనులైన ఆంధ్రులూ, భారతీయులూ అనంతమైన కాలాన్ని ఏనాడో భావించారు; అది పరబ్రహ్మ స్వరూపమని సిద్ధాంతీకరించారు. సృష్టి స్థితిలయాలు కాలంవల్ల కలుగుతున్నవనీ బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ తదితర దేవతలైన ఇంద్రాదులు కాలనియంచేత వారివారి పదవులనుంచి చ్యుతులై పరమాత్మలో లీనమాతున్నారని భారతీయుల భావన. కాలము, దేశము, వస్తువు—ఈ మూటిచేతా పరిచ్ఛిన్నమైనది ప్రకృతి. పరమాత్మ ఈ మూటిచేతా అపరిచ్ఛిన్నుడు. ఇది మన తత్వశాస్త్రజ్ఞుల నిర్ణయం.

జగత్కారణుడైన నారాయణమూర్తి హిరణ్మయ స్వరూపిగా సూర్యమండల మధ్యవర్తియై కాలచక్రాన్ని భ్రమింపజేస్తున్నాడని మన జ్యోతిస్సిద్ధాంతుల సిద్ధాంతం. మహత్తర మేధానిధులైన మహర్షులు బహుకాలం తపించి చంద్ర సూర్య నక్షత్ర గ్రహ గమనాలను పరిశీలించి, ఇతర జ్యోతిర్గణాలను దివ్యనేత్రాలతో దర్శించి, అనంతమైన కాలస్వరూపాన్ని నిరూపించారు. కాలాన్ని పరిగణించటానికి మానాలను ఏర్పరిచారు. ఈ భారతీయుల కాలవిజ్ఞానము నేటి శాస్త్రజ్ఞులనుకూడా ముగ్ధులనుజేసి జోహారులు అందుకుంటున్నది.

మన భారతీయ కాలమానానికి విస్పష్టమైన ఆద్యంతాలున్నవి. బ్రహ్మసృష్టితో ప్రారంభము, ప్రళయంతో అంతము. ఈ సృష్టి ప్రళయాలను కలిపి మనం కల్పమని వ్యవహరిస్తున్నాము. విష్ణుపురాణాదులు "రెండుపరార్ధ కాల పరిమితిఉన్న బ్రహ్మపతనము శ్రీ మహావిష్ణువుకు ఒకదినమని పలుకుతున్నవి.[1] సచ్చిదానంద స్వరూపియైనపరమేశ్వరుని లీలావిలాసం చేత త్రిగుణాత్మకమైనసృష్టి కలుగుతున్నదనీ, ఆ పరమేశ్వరుడు అపరిచ్ఛిన్నుడు కనుక బ్రహ్మతో సృష్టి కాలం ఆరంభమాతున్నదనీ గమనించిన మన ప్రాచీనులు కాలాన్ని కొలవటానికి నాలుగుమానాలు ఏర్పరిచారు. (1) మనుష్యమానము (2) పితృమానము (3) దేవమానము (4) బ్రహ్మమానము. మనం మానవలోకంలో నివసిస్తున్నాము. మనకు మానవమానం ప్రమాణం. మనకు మన మానంలో నే చెపితే అర్థమాతుంది కనుక మనవారు మానవేతరమైన మానత్రయాన్ని మానవమానంలో నే లెక్కించి చూపారు.

## 2

వాడియైన సూదిమొనతో తామరసదళాన్ని గుచ్చటానికి పట్టే కాలం ఒక త్రుటి. నూరు త్రుటులు ఒక లవము. ముప్పదిలవాలు ఒక నిమేషము. పదునెన్మిది నిమేషాలు ఒక కాష్ఠ. ముప్పది కాష్ఠలు ఒక కల—దీనికి ప్రాణము నామాంతరము. ఇది ఒక గుర్వక్షరోచ్చారణకు పట్టేకాలం. ముప్పది కలలు ఒక ఘటి. పది గుర్వక్షరోచ్చరణకాలం ఒక ప్రాణం. ఆరు ప్రాణాలు ఒక వినాడి లేక విఘటిక. అరవై విఘటికలు ఒక అహోరాత్రము (దినము). పదిహేను దినాలొక పక్షం. రెండుపక్షాలు ఒక మాసం. రెండు మాసాలు ఒక ఋతువు. మూడు ఋతువులు ఒక అయనము. రెండు అయనాలు ఒక సంవత్సరము లేదా సౌరాబ్దము. ఇది మానవమానం!

మానవ మాసంలో రెండుపక్షా లున్నవి. ఇందులో శుక్ల పక్షం పితరులకు పగలు. కృష్ణపక్షం రాత్రి. అంటే మన మాసం పితరులకు ఒక అహోరాత్ర మన్నమాట. ఇది పితృమానం!!

మానవమానాన్ని అనుసరించి ఆరుమాసాలు ఉత్తరాయణము. ఆరుమాసాలు దక్షిణాయనము. ఇందులో మొదటిది దేవతలకు పగలు; రెండవది రాత్రి. అంటే మానవుల ఒక సంవత్సరము దేవతలకు ఒక అహోరాత్రము. దీనినిబట్టి మూడువందల అరువది మానవ వత్సరాలు దేవతలకు ఒక సంవత్సరము. పన్నెండువేల దేవ సంవత్సరాలు దేవతల కొక యుగం. ఇది మనుష్యమానంలో 4,32,000 సంవత్సరాలు. దీనికి మహాయుగమని నామం. ఈ దేవయుగంలో మన కలి 4,32,000, ద్వాపరం 8,64,000, త్రేత 12,96,000 కృతయుగం 17,28,000 వెరసి 43,20,000 సంవత్సరాలు ఇమిడి ఉన్నా యన్నమాట. ఇది దేవమానం!!!

ఇటువంటి చతుర్యుగాలు లేక దేవయుగం బ్రహ్మకు ఒక దినం (పగలు) రాత్రికూడా అంతే. ఈ కాలానికి 71 రెట్టి మన్వంతరము. అంటే మన డెబ్బదిఒక్క చతుర్యుగ కాలాలు మనువుకు కాలనియతి అన్నమాట. మానవ కాలపు ప్రమాణంలో

---

1. "ద్విపరార్ధాత్మకః కాలః కథితో యో మయా తవ
తదహస్తస్య మైత్రేయ విష్ణో రీశస్య కథ్యతే"
విష్ణుపురాణము ౬ అ. ౧ ౪ అధ్యా. శ్లో ౪౭

ప్రమాణం దేవతలకు ఒక ఋతువు. ఈఅరవై సంవత్సరాలల్లో జయ. ఇది చాంద్రమానాన్ని బట్టి.

సంవత్సరాల సంఖ్యను చెప్పకోటానికి అన్ని దేశాలల్లోను, ఏదో ఒక అబ్దం ఆచారంలో ఉంది. మనదేశంలో ఇటువంటివి షట్శకా లున్నట్లు తెలుస్తున్నది. అవి (1) యుధిష్ఠర శకము. (2) విక్రమార్క శకము (3) శాలివాహనశకము (4) విజయాభినందనశకము (5) నాగార్జున శకము (6) కల్కి శకము. యుధిష్ఠిర విక్రమార్క శకాల మధ్యకాలంలో భారతదేశంలో ఏదో ఒక ప్రాంతంలోనైనా సప్తర్షియుగము, మాహేశ్వరాబ్దము వాడుకలో ఉన్నట్లు తెలుస్తున్నది5. ప్రాచీన భారతదేశంలో స్వర్ణయుగాన్ని కల్పించిన గుప్తులపేర ఒక శకం కన్పిస్తున్నది6 పూర్వపు ఒరిస్సాలోని కళింగ గాంగరాజులపేర ఒక శకం కొంతకాల ముంది. ఈ శకాలల్లో నేను ఉత్తరదేశంలో విక్రమార్క శకము, దక్షిణదేశంలో శాలివాహనశకము వాడుకలో ఉంది. మహమ్మదీయ క్రైస్తవ ప్రభుత్వాలు కారణంగా ఫసలీ, క్రీస్తుశకాలు వచ్చినవి.

ఈ జయనామసంవత్సరము యుధిష్ఠర శకాబ్దము 3059 శాలివాహన శకము 1876. ఫసలీ 1363 - 1364. క్రీ. శ. 1954 - 55 (ఎ డి.) 7 ఆంధ్రదేశంలో వేదార్థనిర్ణయం చేసిన అద్వైత స్థాపనాచార్యులు శ్రీ శంకరభగవత్పాదులవారి జన్మనుంచీ, విద్యారణ్యస్వామివారి జన్మనుంచి సంవత్సరాన్ని లెక్క పెటటం అనూచానంగా వస్తున్నది. జయ ఆచార్యులజన్మనుంచి 2457. విద్యారణ్యావతారాబ్దములో జయ 959.

## 4

ఆంధ్రదేశంలో సంవత్సరము లోకవ్యవహారానికి చాంద్ర—సౌరమానాన్ని (*Luni-Solar measure*) అనుసరిస్తున్నది. సూర్యుడు అశ్వినిలో ప్రవేశించటంతో సౌరసంవత్సరము ప్రారంభిస్తుంది. నేటికి కూడా శేషాచల (తిరుపతి) దక్షిణదేశంలో సూర్యుడు మేషంలో ప్రవేశించిన నాటినుంచే సంవత్సరాది. వింధ్యకు ఉత్తరానఉన్న దేశంలో బార్హస్పత్యమానం ఆచారంగా ఉంది. కార్తీకమాసంలో ఈ అబ్దానికి ఆరంభం. 8 ఈ మానప్రకారము మన జయ వింధ్యోత్తరవాసులకు ప్లవంగ సంవత్సరము.

సంవత్సరాన్ని గురించి అరుణకాఠకములో [3–56] "పంచపంచ స్త్రివర్త సంవత్సరః" అని మంత్రం కనిపిస్తున్నది దీని అర్థం 5 + 50 + 300 = 355. పంచ పంచ స్త పంచదశః (50 × 50) + 105 = 355. పంచ పంచ స్త ఏక వింశః: 5 × (50 + 21) = 355 దీనినిబట్టి సంవత్సరానికి 355 దినాలున్నట్లు ఒక లెక్క ఉన్నదన్నమాట. చంద్రుడు భూమిచుట్టూ తిరిగి రావటానికి పట్టేకాలం ఒక నెల. సూర్యుని చుట్టు ఒకసారి భూమి తిరిగి రావటానికి పట్టేకాలము (*Sidereal year*) సంవత్సరము. పన్నెండు చాంద్రమాసాలు కలిపి $29\frac{1}{2} \times 12$:356. సౌరవత్సరానికి మూడు వందల అరవైఐదుదినాల ఆరుగంటల తొమ్మిది నిమిషాల 9 సెకండ్లు. చాంద్ర సంవత్సరానికీ—అంటే 12 చాంద్రమాసాలు పట్టేకాలానికీ—సౌరసంవత్సరానికి ఉన్న తేడాలను దూరంగా ఉంచితే సగటున సంవత్సరానికి 360 దినాలు.

సంవత్సరానికి 360 దినాలైతే మాసానికి 30 దినాలుగల 12 చాంద్రమాసాలకూ కలిపి కొన్నాళ్లు తగ్గింది. సౌర వత్సరంలో కొన్ని దినాలు పెరిగినవి. రెంటికీ ఉన్న తేడాను మనవారు 10 ది 21 గం 20 ని 30 సెకండ్లని నిర్ణయించారు.

మనవారు ఋతువులతో విస్పష్టంగా కనిపిస్తున్న సౌర సంవత్సరాన్ని ఒదులుకోలేక పోయినారు. మరొకవంక శుక్ల కృష్ణ పక్షాలతో చాంద్రమాసము (*Lunar month*) కనిపిస్తుంటేదాన్ని ఒదులుకోలేక చాంద్ర-సౌరవత్సరాన్ని స్వీకరించారు.

## 5

యజ్ఞప్రియులైన ప్రాచీనార్యులకు తిథి, మాస, ఋతు, అయన పరిజ్ఞానము అత్యవసరమైంది. అందువల్లనే ఒక జిజ్ఞాసువు 'జ్యోతిష శాస్త్రదృష్టితో చూస్తే యజ్ఞము కాలాన్ని కనుక్కోటానికి ఏర్పడ్డ పరిశోధనా గారమని భావించారు. యజ్ఞం సంవత్సరం పొడుగునా జరుగుతూ ఉండటంవల్ల యజ్ఞం, సంవత్సరము అనే రెండుపదాలు ఏకార్థ సూచకాలైనవి 9 'సవన' మనే శబ్దానికి సోమరస సంధానమని అర్థము. ఇది యజ్ఞము. దీనిని బట్టి సావన దినము, మాసము, సంవత్సరము అను వ్యవహారం కల్గింది. కాని— 30 సావన దినాల మాసము చాంద్రమాసానికి ఎక్కువ. చాంద్ర మాసము ది. $29\frac{1}{4}$ తో అయిపోతుంది. దీనిని బటి పన్నెండు నెలలకు 6 దినాలు తేడా వస్తుంది. చాంద్రమాసాలకు ఋతువులకు

---

5. ప్రాచీన ఖగోళము శ్రీ వేలూరి శివరామశాస్త్రి, భారతి - సర్వధారి. పు. 604

6 గుప్తశకం క్రీ. శ. 320 లో ప్రారంభమైదని డాక్టరు ఫ్లీట్ (*I. A. Val X VIII*)

7. క్రీస్తుశకాన్ని క్రీ. శ. 533 లో డయోనిసియస్ ఎక్సిగ్నస్ అనేవాడు ఏసు కాల్పనిక జన్మతిథినుంచి ఒక అబ్దారంభం చేయాలని నిర్దేశించాడు. క్రీ. శ. 6 వ శతాబ్దిలో ఐరోపాలో అన్ని దేశాలవారూ ఈ అబ్దాన్ని అలవంబించారు.

8 కృత్తికలో విషువం ఉన్నప్పుడు ఆశ్లేషతో ఉత్తర గతి ధనిష్ఠతో దక్షిణగతి చెల్లేది. ఈ మానము వేదాంగ జ్యోతిష రచనాకాలము క్రీ. శ 1337 ప్రాంతాన ఆరంభించి ఉంటుందని అభిజ్ఞుల నిర్ణయము. విషువమంటే రాత్రి, పగలు సమానంగా ఉండే కాలము.

9 'సంవత్సరః ప్రజాపతిః, ప్రజాపతిర్యజ్ఞః'—ఐతరేయ బ్రాహ్మణము *II. 17. 'The main idea of Yearly sacrifice appears to be a very old one. The Etymology of Ritvij, (Ritu + Yag) is season—Sacrificer. Note the correspondence between the sacrifice and seasons. In 'Samvatstara' 'Vas' is to dwell. It is a cycle of seasons. The priests were not only sacrificers but time-keepers' - Lewis - Historical Survey of the Astronamy of the Ancients—P. 19.*

ఐక్యాన్ని సరిపెట్టటానికే మనవారు అధిక మాసాన్ని కల్పించారు. ఋతుభేదాన్ని పాటించకుండా చంద్రునితో సరిపెట్టుకుంటూ ముసల్మాన్ సోదరులలాగా పోతే మన వ్యవసాయపు పనులల్లోనూ, దేవపూజ, పితృపూజల్లోనూ చిక్కొకు కలుగుతుంది. 360 తిథులను సిద్ధాంతులు 354 దినాలల్లోకే సర్ది అవసరాన్ని బట్టి అధికమాసాలను చేరుస్తూ పంచాంగాలను సవరణ చేస్తూంటారు.

ఆంధ్రదేశంలో చాంద్రసౌర భేదాలచేత సంవత్సరం రెండు విధాలుగా ఉందని పైన గమనించాము. అమావాస్యనుంచి అమావాస్యకుఉన్న కాలం చాంద్రమాసం. పన్నెండు చాంద్రమాసాలు ఒక చాంద్రవత్సరం. సూర్యుడు మేషాది రాశిచక్రాన్ని తిరిగి రావటానికి పట్టేకాలం సౌరసంవత్సరం. ఈ సౌరవత్సరం సాయన నిరయన భేదాలతో ద్వివిధంగా ఉంది. మేషాయనం (మార్చి 20) నుంచి మేషాయనం వరకు పట్టేకాలం సాయన సంవత్సరం. మేష సంక్రమణంనుంచి మేష సంక్రమణం (ఏప్రియల్ 13) నుంచి మేష సంక్రమణం వరకు అయ్యేకాలం నిరయన సంవత్సరము. ఆంధ్రుల సంవత్సరం చాంద్రమాసాలవల్ల కలగటంచేత ఆంధ్రుల సంవత్సరం నేడు నిరయన సంవత్సరము. పూర్వకాలములో ఆంధ్రదేశంలో సాయన నిరయన వత్సరాలు రెండూ వ్యవహారంలో ఉన్నట్లు తెలుస్తున్నది. కాని సాయన వ్యవహారంమధ్యలో లోపించింది. నేడు నిరయనం వాడుకలో ఉండటంవల్ల మేషారంభమైన అశ్వన్యాది మనకు సంవత్సరాదిగా ఉన్నది. కాని యజ్ఞయాగాది క్రతువులకు సాయనవత్సరమే అవసరము. అందువల్లనే బాలగంగాధర తిలక్ మహాశయుడు ఇలా అభిప్రాయమిచ్చినాడు.

"*At the present day we on the sowthern side of Narmada begin the year at the vernal equinox for all civil purposes, but still all the Religious ceremonies prescribed to be performed in the Uttarayana, are performed in Uttarayana begining with the winter solstice.*" 10 అయన చలనాలవల్ల ఇలా రెండు సంవత్సరారంభాలు ఏర్పడి రెండూ రెండు విధాలైన ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నవన్న మాట!

# 6

"సంవత్సరోవత్సరోఽబ్దో హాయనోఽస్త్రీ శరత్సమాః" సంవత్సరాదిని సూచించేశబ్దాలను అమరుడు ఈవిధంగా పేర్కొన్నాడు. 11 'సమ్యక్ వసంతి ఋతవోఽస్మిన్నితి సంవత్సరః—వత్సరశ్చ. ఋతువులు ఇందు బాగా నివసించటంచేత సంవత్సరము వత్సరమనీ, ఆపః దదాతీతివా అబ్దః—జలము నిచ్చునది కనుక అబ్దమనీ, లేదా ఆప్యతే అధిక మాసేన అబ్దః—అధిక మాసాలచేత విస్తరించేది కనుక అబ్దమనీ, జహాతి ఋతూన్ క్రమేణ వరుసగా ఋతువులను విడిచేది గనుక హాయనమనీ, శీర్యతే జగదనయేతి శరత్—జగత్తు దీనిచేత దుఃఖపెట్టబడుతుంది కనక శరత్తనీ, సహామాంతి వర్తంతే ఋతవోఽత్రసమాః, సమయంతి జనానితి—సమాః—ఋతువులు దీనియందు కూడిఉంటవి కనుకనూ, జనులను విహ్వలత్వము పొందిస్తుంది కనుకనూ సమ అనీ సంవత్సరానికి నామాలు కలిగినట్లు విజ్ఞులు వ్యాఖ్యానించారు. సంవత్సరానికి వర్షమనికూడా మరొక సంజ్ఞ ఉంది.

వీటిని గమనిస్తే, అందులో ముఖ్యంగా అబ్ద, వర్ష, శరత్ శబ్దాలను గమనిస్తే ఒకానొక కాలంలో వర్షంతోనూ, మరొక కాలంలో శరత్తుతోనూ వర్షం ఆరంభించిందా అనిపిస్తుంది.

భారతదేశంలోని ఆర్యుల సంవత్సరారంభ విషయంలో తిలక్ మహాశయుడు సంగ్రహంగా ఇలా పలికాడు.

"*The ancient aryans originally commenced their year, which was Luni-Solar, and sidereal, with the Vernal Exquinox, and that when the beginning was changed to the winter solstice both the reckonings were kept up, the one for the sacrificial and the othe for civil purposes.*"12

తిలక్ మహాశయుడు భావించినరీతిగా ఆర్యులు చాంద్ర—సౌర సంవత్సరాన్ని గ్రహించి వసంత చైత్రశుద్ధ ప్రథమతోనో కృష్ణ ప్రథమతోనో, సంవత్సరాన్ని ఆరంభించటానికి ముందు మరొక విషయాన్ని విద్వాంసు లూహించారు. 13 వీరి యభిప్రాయంలో కొన్ని వేలవేల యేండ్లకు పూర్వం నాక్షత్రమైన సౌరసంవత్సరం ఒకటి ఉండిఉండాలి. సూర్యుడు ఒక నక్షత్రంలో బయలుదేరి తిరిగి ఆ నక్షత్రానికి రావటానికి పట్టేకాలము నాక్షత్ర సంవత్సరము. ఈ సౌరవత్సరానికి ఆరంభం ఎప్పుడో చెప్పలేము.

తరువాతి కాలంలో మహా విషువంనాడు సంవత్సరం ఆరంభించి ఉంటుంది. ఈ విషువము ఏటేటా 50 వికలలు వెనుకకు జరుగుతుంటుంది. 950 సంవత్సరాలకు సుమారు ఒక వెనక పోతుంది. విషువంతో సంవత్సరం ఆరంభించినప్పుడు ఆనాడే ఉత్తరాయణానికి ఋతువుకు, మాసానికి, యజ్ఞానికి ఆరంభము.

భారతీయ సాహిత్యంలో కొంతకాలంనుంచీ కలుగుతూ వస్తున్న మార్పులను సూచించటానికి తగ్గ నిదర్శనాలు కనిపిస్తున్నవి. పునర్వసుకు నక్షత్రదేవత అదితి. ఆమెకు అన్ని యజ్ఞాలూ ఆమెతో ప్రారంభించి అంతమొందేటట్లు వరమున్నది. 14 సంవత్సరారంభంతో యజ్ఞాలు ఆరంభించటం ఆచారం కనుక ఇది ఒక సంవత్సరారంభాన్ని సూచిస్తున్నదనీ, అదితి ఆదిత్యులకు తల్లి అనీ, ఆమె దేవయాన పితృయానాలను ఏర్పరచి ప్రథమ నక్షత్రంగా ఉన్నదనీ తెలియజేసే మంత్రాలు కనిపిస్తూ ఉండటం ఈ అంశాన్ని బలపరుస్తున్నదని తిలక్ మహాశయుని అభిప్రాయం. ఈ

---

10 *B. G. Tilak—ORION—P.* 31

11 'ఏడాది' దేసిపదం. ఏటు+ఆది: ఏటు + ఆది ఏడు+ఆదిగా మారిఉంటుంది. ఇది వర్షాలు కురిసి ఏటులు బాగా వచ్చినవాటి వర్షారంభాన్ని సూచిస్తున్నట్లున్నది.

12 *ORION P. 32.*

13 ప్రాచీన ఖగోళము—కాలము భారతి, సర్వధారి కార్తీకము పుట 469.

14 ఐతరేయ బ్రాహ్మణము 1.7. తైత్తరీయ సంహితి 1.5.1.

కాలానికి 'అదితి కాలము' (క్రీ. పూ 6000—4000) అని నామ కరణంచేసి అప్పుడు సంవత్సరము వాసంత విషువము దగ్గిర పునర్వసుతోగాని దాని దగ్గరగాని ఆరంభించి ఉంటుందని ఆయన నిర్ణయించాడు.

తరువాత కాలము మృగశిర కాలము (క్రీ. పూ 4000-2500) ఈ కాలంలో విషువము ఆర్ద్రలో ఉండేది. మృగశిరకు అగ్రహాయనమనే నామం ఉండటంవల్ల సంవత్సరారంభం ఆ నక్షత్రంతో అయి ఉంటుందని తిలక్ మహాశయుని నిర్ణయము. మూడవకాలము కృత్తికాకాలము (క్రీ. పూ. 2500—1400). ఇది తైత్తరీయ సంహితా బ్రాహ్మణాల కాలము. ఋగ్వేదంలో ఎక్కడా కృత్తికలు నక్షత్రముఖంగా చెప్పలేదు. సంహితా కాలంలో వాసంత విషువము సంవత్సరము కృత్తికతో ఆరంభించింది. క్రీ. శ. 1377 ప్రాంతంలో విషువము ధనిష్ఠలోఉంది. ఇది వేదాంగ జ్యోతిష కాలము. తరువాత ఐతిహాసిక కాలంలో విషువము శ్రవణంతో ఉండేది. మహాభారతములోని విశ్వామిత్ర సృష్టి ఇందుకు నిదర్శనం. 15 "అహః పూర్వం తతో రాత్రి ర్మాసాః శుక్లాదయః స్మృతాః, శ్రవణా దీని నక్షత్రాణి, ఋతవః శిశిరాదయః" దీనినిబట్టి మహాభారతము శ్రవణం నక్షత్ర ముఖంగాఉన్న కాలంలో పుట్టిఉంటుంది. అంటే క్రీ. శ. 4 వ శతాబ్ద ప్రాంతంలో శ్రావణ శుద్ధ ప్రథమ సంవత్సరాది అన్నమాట. కానీ ఈ పరిగణనను అందరూ అంగీకరించి వ్యాప్తికి తెచ్చినట్లు తోచటంలేదు. క్రీ. శ. 18 శతాబ్దివరకూ ఇలాగే ఉంది. తరువాత అశ్వని నక్షత్రాది అయినది. మేషంతో రాశి చక్ర మారంభించింది. చైత్ర శుద్ధ ప్రథమ సంవత్సరాది—అయినది. 16

## 7

మన సంవత్సరానికి రెండు అయనాలు. ఉత్తరాయణము దక్షిణాయనము (*Equinactical Points*), వేదాంగజ్యోతిష కాలంలో (క్రీ. శ. 1377 ప్రాంతము) సూర్యుడు ధనిష్ఠ ప్రథమ పాదంలోప్రవేశించగానేఉత్తరాయణము.ఆశ్లేషార్థగతుడు కాగానే శ్రావణమాసంలో దక్షిణాయనమని తెలుస్తున్నది. 17 వరాహమిహిరాచార్యుడు 'సాంప్రత మయనం సవితుః కర్కాటకాద్యం మృగాదిత శ్చాన్యత్' అని చెప్పినాడు. పునర్వసు చతుర్థపాదంలో దక్షిణాయనమని ఉత్తరాషాఢ ద్వితీయపాదంలో దక్షిణాయనమనీ దీని భావము. ఈనాడు సూర్యుడు కర్కాటకరాశి ప్రవేశించగానే దక్షిణాయనము; మకరరాశిలో ప్రవేశించగానే ఉత్తరాయణము.

## 8

మన సంవత్సరంలో షడ్రుతువు లున్నవి—అవి వరుసగా వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము.

---

15 *ORION—P* 205. మహాభారతము ఆదిపర్వము-61,

16 *C. V. Vidya—Epic India P.* 311 'ద్వా ద్వా మాఘాదిమాసౌ ఋతు రిత్యుతే' అని అమరుడన్నాడు.

17 "ప్రపద్యేతే శ్రవిష్టాదౌ సూర్యా చంద్రమసా పుదక్ సార్పార్ధే దక్షిణార్కస్తు మాఘ శ్రావణ యోస్సదా

దీనినిబట్టి ఋత్వాది వసంతమని మనకు అర్థమౌతున్నది. 'నూరు సంవత్సరాలు నన్ను బ్రతకనీ' అనటానికి 'నూరు హేమంతాల ఆయుషీ' అన్న అర్థాన్నిచ్చే మంత్రాలు కనిపిస్తున్నవి. అంటే ఒకానొక కాలంలో హేమంతము మొదటి ఋతువన్నమాట! వైదిక వాఙ్మయంలో ఋతువులకు సూర్యుడు కారకుడనీ, అవి మూడు, అయిదు, ఆరు, ఏడు, అనీ నిదర్శనాలు కనిపిస్తున్నవి.[18] శతపథ బ్రాహ్మణాన్నిబట్టి ఋతువు లారని తెలుస్తున్నది. వసంత ఋతువున మధుమాధవ మాసములు, గ్రీష్మంలో శుక్ర శుచి మాసాలు. వర్షర్తువులో నభోనభస్య మాసాలు, శరత్తులో ఇషోర్జములు, హేమంతంలో సహస్సహస్య మాసాలు, శిశిరంలో తపస్తపస్య మాసాలు ఉన్నవి. ఈ ఋతుమాసాలు వ్యవహారంలోకి రాక పూర్వం ద్వాదశాదిత్యుల పేర్లు పుట్టిఉంటవి. దీనికి కారణం అయనగతి తిన్నగా తెలియక పోవటమే. ద్వాదశాదిత్యులు వసంతంలో ధాత—అర్యములు. గ్రీష్మంలో మిత్రావరుణులు, వర్ష ఋతువులో ఇంద్ర వివస్వతులు, వర్షర్తువున పర్జన్య—పూషలు. హేమంతంలో అంశ—భగలు, శిశిరంలో త్వష్టృ—విష్ణులు[19] వసంత గ్రీష్మ వర్షాలు మూడు దేవఋతువులనీ, శరద్ధేమంత శిశిరాలు మూడు పితృఋతువులనీ శతపథ బ్రాహ్మణము.

'సంవత్సరము ఒక పిట్ట. వసంతం దాని తల. గీష్మం కుడి రెక్క. శరత్తు ఎడమ రెక్క. వర్షముతోక'. అని ఒక బ్రాహ్మణంలో ఋతువు స్వరూపం నిరూపించిఉంది. దీన్నిబట్టి ఒకానొక కాలంలో వసంతం ఋత్వాదిగా ఉన్నట్లు కనిపిస్తూఉంది. వాసంత విషువము (*Vernal Equinox*—షుమారు మార్చి 21) మొదలు ఆరు నెలలు ఉత్తరాయణము. శారదవిషువము షుమారు సెప్టెంబరు 21 మొదలు ఆరు నెలలు దక్షిణాయనము. తరువాత కాలక్రమాన ఇది మారి ఉత్తరాయణము దక్షిణాయనాంత దినము (*Winter Solstice* డిసెంబరు 21) నుండి ప్రారంభించింది. మరి కొంతకాలానికి తిరిగి వాసంత విషువద్దినంనుంచి సంవత్సరం ఆరంభమైంది. మహాకవి కాళిదాసునాడు చాంద్ర ఆషాఢ శుక్ల ప్రతిపత్తునాడు దక్షిణాయనారంభము. సౌర మాఘంలో ఉత్తరాయణము. పురాణాలల్లో, సాహిత్య గ్రంథాలల్లో చైత్ర వైశాఖాలు వసంత ఋతువని కనిపిస్తున్నది. తరువాత వచ్చిన జ్యోతిష సిద్ధాంతులు ఫాల్గుణ చైత్రాలు వసంతఋతువని నిర్ణయించారు. ఇప్పటికీ ఉత్తరదేశంలో ఫాల్గుణ చైత్రాలే వసంతము. తైత్తరీయ సంహితాకాలంలో వసంతము ఋతుముఖము. అప్పుడు సంవత్సరాది ఫాల్గుణ పూర్ణిమ. శిశిరము ఋతుముఖంగా కొంతకాలం ఉంది. వరాహమిహిరుడు ఫాల్గుణంలో సంవత్సరారంభం చేశాడు. భాస్కరుడు (క్రీ. శ 1150) మరల వసంతము ఋతుముఖంగా పేర్కొన్నాడు.

## 9

మన సంవత్సరానికి పన్నెండు మాసాలు. 'మస్యతే పరిమీయతే నేతి మాసః—మసీ—పరిమాణే' దీని చేత కాలం పరిమాణం చేయబడుతున్నది కనుక ఇది మాసమైంది.[20] పున్నమినాడు చంద్రుడు ఏ నక్షత్రంలో కూడిఉంటాడో దాన్నిబట్టి చైత్రాది మాస నామాలు కలిగినవి. చైత్రమాసంలో పూర్ణిమనాడు 'చిత్ర'లో ఉంటాడు. ఇలాగే వైశాఖంలో విశాఖలో.

రాశిచక్రంలో చంద్రగమనాన్నిబట్టి చైత్రాది మాసాలు ఏర్పడుతున్నవి. చంద్రునిగమనంవల్లనే భారతీయులకు నక్షత్రాలు తోచినవి. నక్షత్రాలను ఆధారంచేసుకొని మొదట చంద్రగమనాన్ని తరువాత సూర్యగ్రహ గమనాలనూ నిర్ణయించారు. నక్షత్రాలు ఆకాశంలో ప్రయాణంచేసే దేవయాత్రీకులకు మైలురాళ్ళవంటివని భారతీయు లేనాడో గుర్తించారు. సూర్యుని గమనంగాని, ఇతర గ్రహాల గమనంగాని చంద్రునిగమనానికి భిన్నం కాకపోవటంవల్ల 27 లక్షత్రాలను 12 రాసులక్రింద విభజించారు[21] నక్షత్రం ఒకటి నాలుగుపాదాల చొప్పున 27 × 4 : 108 పాదాలను పన్నెండు రాసులక్రింద సర్ది సూర్యుడు నెలకు 9 పాదాలు గమిస్తాడని మనవారు నిర్ణయించారు. చైత్రాది మాస నామాలు పుట్టకపూర్వం మధుమాధవాది మాస నామాలు సూర్యునిబట్టి వ్యవహారంలో ఉండేవి. రాశిచక్రంలో సూర్యగమనాన్నిబట్టి మేష, వృషభాది మాసాలు వచ్చినవి. ఇవి చైత్ర వైశాఖాది మాసాలకు తరువాత పర్యాయపదాలైనవి. కవితాస్వభావం గల భారతీయ దైవజ్ఞులు వీటిని (సౌరమాసాలను) చంద్రుని సంతానమని వ్యవహరించారు.[22]

## 10

భారతీయుల రాశి చక్రంలో 27 నక్షత్రా లున్నవి. ప్రతి నక్షత్రంలో ఒకటి, రెండు, మూడు లేక అంతకంటే మించి చుక్కల గుంపులు ఉంటవి. ప్రతి నక్షత్రంలోనూ కాంతివంతమైన చుక్క ఒక్కటి ఉంటుంది. దాన్ని మనవారు 'యోగతార' అని వ్యవహరించారు. ఇవి క్రాంతి వృత్తానికి మధ్యమార్గంలో ఉండటం వల్ల చంద్రునితో కూడడానికి, గ్రహాలతో యోగం పొందడానికి వీలౌతుంది.

వైదిక సాహిత్య కాలంనాడే ఆర్యులకు 27 నక్షత్రాలు తెలుసు. మొదట చంద్రుడు దినానికి ఒక నక్షత్రంతో ఉన్నట్లు [illegible] మాసానికి 28 దినాలు మించి ఉండటంవల్ల 28 వ

---

18 ప్రాచీన ఖగోళము - భారతి సర్వధారి కార్తికము పుట 471.

19. 'వసంతో గ్రీష్మో వర్షా తే దేవా ఋతవః శరద్ధేమంత శిశిరస్తే పితరో' శత. బ్రాహ్మ *II*. 1. 3, 1—3

20. ఆంగ్లభాషలోని మాన్ మంత్ శబ్దాలు కూడా పరిమాణార్థంలోనే వచ్చాయి. *Epic India—C.V. Vidya P. 317.* 'చంద్రమస్' శబ్దంలోనుంచి 'మాస' శబ్దం విడివడ్డది. కొన్ని ఋగ్వేద మంత్రాలలో "సూర్య మాసా" అన్నచోట 'మాస' శబ్దానికి చంద్రుడనే అర్థం.

21. రాసుల స్వరూప విశేషాలకు—శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావు 'రాసుల ప్రశంస' భారతి పార్థివ—మాఘము, పుటలు 149 - 160.

22. తైత్తరీయ సంహిత మాఘ పూర్ణిమనుంచి సంవత్సరాదిని చెప్పింది.

నక్షత్రం కూడా కల్పన చేశారు. దీనిపేరు అభిజిత్తు (*Vega-Alfra Lyra*). దీనిని తైత్తరీయ బ్రాహ్మణ కాలంలోనే గుర్తించారు. మహాభారత వనపర్వంలో (23) రోహిణిమీద అభిజిత్తుకు ఈర్ష్య కలిగి సహించలేక తపోవనాలకు వెళ్ళి పోయినట్లున్న కథ దీనికి సంబంధించిందే. ఈ అభిజిత్తు ఉత్తరాషాఢ శ్రవణాలకు మధ్య ఉండేది. అభిజిత్తు తపోవనానికి వెళ్ళిన తరువాత ఇంద్రుడు కాలాన్ని గుర్తించ లేకపోతే బ్రహ్మస్కంధుడు దాన్ని ధనిష్ఠ నుంచి గుర్తించారట.23 తరువాత కృత్తిక నక్షత్రాదిగ ఉంది. యజుర్వేదంలో వేదాంగ జ్యోతిషంలో నక్షత్రపట్టిక కృత్తికతో ఆరంభిస్తుంది. ఈ పట్టిక క్రీ. శ. 1వ శతాబ్ది వరకూ ఇలానేఉంది. తరువాత నక్షత్రాలు అశ్వినితో ప్రారంభించినవి.

ఉత్తరదిక్కున ఉన్న ధ్రువుని క్రీ. పూ. 2780 లోనే భారతీయులు ఎరుగుదురని జాకోబీ. అటువంటి భారతీయులు రాశి చక్రాన్ని గ్రీకుల దగ్గరనుంచీ గ్రహించారనటం అసమంజసము. సర్ విలియం జోన్సు వేదకాలంనాడే భారతీయులకు రాసులు తెలుసునని చెబుతున్నాడు. ప్రాచీన పంచాంగాలనూ, రాసులను పరిశోధించిన ప్లంకెట్ ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాడు. 24

## 11

మన మాసానికి రెండుపక్షాలున్నవి. ఒకటి శుక్లపక్షము; రెండు కృష్ణపక్షము. మాసానికి 15 దినాలు. కృష్ణపక్షము అమావాస్యతో అంతంపొందుతుంది. 'అమా సహాత్రిష్ఠతః రవి చంద్రావస్యా మిత్యమావాస్య.' అమా : కూడ, వాస్యా : వసించుట— సూర్య చంద్రులు కూడిఉండేది కనుక అమావాస్యనాడు సూర్య చంద్రుల మధ్య అంతరం శూన్యం. ఆనాటినుంచీ సూర్య చంద్రులిద్దరూ ఎవరి దారిని వారు వెళ్లుతుంటారు. వారికి పన్నెండు డిగ్రీల ఎడము ఉన్నపుడు పాడ్యమి పూర్తౌతుంది. విదియకు 24° ఎడము. పున్నమనాటికి 160° ఎడము. 360° డిగ్రీల ఎడముంటే అమావాస్య.

పూర్వ పక్షాలు కృష్ణపక్షంతో కొంతకాలం మొదలుపెట్టినట్లు నిదర్శనాలు కనిపిస్తున్నవి. మహాభారతము వనపర్వంలో [161 అధ్యాయము] కుబేర యుధిష్ఠిర సంవాదంలో "మొదటిదైన కృష్ణపక్షంలో నీవు భయదుఃఖరహితంగా ఉండు." అన్న వాక్యం కనిపిస్తున్నది. 'పూర్ణమాసి' శబ్దంవల్ల ఒకానొక కాలంలో శుక్లపక్షంనుంచి మాసారంభం కనిపిస్తున్నది. దీనినిబట్టి ఒక కాలంలో శుక్లపక్షంనుంచి మాసారంభం అయ్యేదనీ ఋతువులలో అయన చలనాలవల్ల కలిగిన మార్పులు కారణంగా అమావాస్య నుంచీ మాసం ఆరంభించిందనీ తిరిగీ శుక్లపక్షమే పక్షద్వయారంభమైందనీ మనం నిర్ణయించవచ్చు. ఈ విషయాన్నిగురించి సి.వి. వైద్య ఇలా అన్నాడు.

*"The fact is clear that at the begin ing of the Epic Period the practice of counting the month from the dark fortnight has prevailed as in other Aryan countries. But to-wards the end of the Epic period the country practice was certainly in Vogue. The other practice again came into use after this, perhaps being copied from the Greeks, to suit the shifting back in seasons as measured by the old months which had happened by the time, a reform perhaps introduced by King Vikramaditya like similar reforms in calenders introduced by many Kings in the West."*

[*Ep. India P. 317*]

సిద్ధాంత గ్రంథాలు శుక్లపక్షాన్నే ప్రథమపక్షంగా చెబుతున్నప్పటికీ ఉత్తర భారతంలో ఈనాడుకూడా మాసం కృష్ణపక్షంతో ఆరంభిస్తున్నది.

## 12

సూర్య చంద్రులమధ్య ఎడమున్న పన్నెండు అమావాస్యలు కల పన్నెండు చాంద్రమాసాలు ఒక చాంద్ర సంవత్సరము. దీనికి దినాలు 354 మాత్రము. తిథులు 360. రవి చంద్రుల గమనం వేసవిలో వడిగా ఉంటుంది. శీతాకాలంలో మెల్లగా ఉంటుంది. దీర్ఘాహము ఘ 65-16 హ్రస్వాహము 53-56. ఇందువల్ల 360 తిథులను సరిపెట్టుకోవలసి వచ్చింది. 25 చాంద్రమాసాల్లో 7 వృద్ధతిథులు 13 క్షీణ తిథులు వస్తున్నవి.

చాంద్ర సౌరమాసాలను సరిపెట్టటానికి అధికమాసాన్ని చేర్చటం ఋగ్వేదకాలంనుంచీ కనిపిస్తున్నది. అప్పుడు ఎలా సరిపెట్టేవారో చెప్పలేము. రెంటికీ మధ్య ఉన్న తేడా సవరించటానికి మనవారు మూడుసంవత్సరాలల్లో ఒక అధికమాసంగాని, లేదా అయిదు సంవత్సరాలల్లో ఒక అధికమాసంగాని చేరుస్తారు. పంథొమ్మిదిసంవత్సరాలల్లో ఏడు అధికమాసాలు వస్తవి. దిద్దుబాట్లు విశేషంగా వచ్చినప్పుడు ఒక మాసాన్ని తగ్గించవలసి వస్తుంది. క్రీ. శ. 1823 లో ఇలా తగ్గించిన ఒక లుప్తమాసం వచ్చింది. క్రీ. శ. 1963, 1964 లోగా మరొక లుప్తమాసం వస్తుంది.

## 13

నేడు ఆంధ్రదేశంలో ఆదిత్య సోమాది వారాలు వ్యవహారంలో ఉన్నవి. ఇవి నేటి రూపంలో ఇతిహాసకాలంలో లేవని ఒక అభిప్రాయం ఉంది. 26 ఇవి అవైజ్ఞానికాలనీ, వీనివల్ల జ్యోతిష శాస్త్రంలో తప్ప ప్రయోజనం లేదనీ, మరిచిపోతే వీటిని ఉద్ధరించటానికి మార్గంలేదనీ మరొక అభిప్రాయం. 27 కారం

23. మహాభారతము అనుశాసనిక పర్వం అధ్యా 64.

24. రాసుల విషయంలో భారతీయులు గ్రీకులకు ఋణపడి లేరనటానికి చూడుడు—కవితా సమితివారి వైశాఖ సంచికలో శ్రీ కొబ్బూరి వారి 'నక్షత్రాలు' అనే వ్యాసం; *Astrological Magazine Vol 38—NO 1.* భారతి పార్థివ—మాఘము.

25. *Lokmanya B. G. Tilak - Orion P. 15.*

26. *Epic India P. 117.* 27. ప్రాచీన ఖగోళము—భారతి సర్వధారి కార్తీకము పు. 475.

లోని దినాలకు 'శక' మనీ తత్సంబంధమైన జ్ఞానాన్ని మనవారు శకజ్ఞాన మన్నారనీ ఋగ్వేదంలోని మం 1 అను 22 సూక్తం 80 మంత్రం 48వారాన్ని గురించి చెబుతున్నదనీ దీనిని భారతీయులు గ్రీకుల దగ్గిరనుంచి గ్రహించ లేదనీ మరొకమతం. 28 తైత్తరీ యారణ్యకంలోని ప్రశ్న 1 అనువాకం3 పంచతి 1 ఏడుదినాలుగల వారాన్ని సూచిస్తున్నదని రెండవమతం. ఋగ్వేద సంహితలోనూ, తైత్తరీ యారణ్యకంలోనూ పేర్కొబడ్డ వారాలనే తరువాత కాలంలో సిద్ధాంతులు విపులీకరించి ఉంటారు. వారం ఇంచుమించు పక్షములో సగభాగము. సూర్యుడు ఉదయం ఏ గ్రహపరిధిలో ఉదయిస్తాడో ఆ దినానికి ఆగ్రహనామాన్ని బట్టి పేరు వచ్చింది. సోమవారం నాడు సూర్యుడు చంద్రుని పరిధిలో ఉదయిస్తాడన్న మాట. ఇదేరీతిగా మంగళవారం నాడు కుజపరిధిలో. కౌటిల్యుని అర్థశాస్త్రంలో సప్తవార విభాగం లేదు. పంచవార విభాగం ఉంది. అమరసింహుడు వారనామాలను పేర్కొలేదు. సప్త సంఖ్యతో మాసంగాని, సంవత్సరంగాని సమానంగా విభజితం కావడం లేదు. అయితే పంచాంగాల్లో వారం ఒకటి. నిత్యోపయోగంలో ఉంది.

## 14

నెలకు ముప్పది దినాలని మనం వ్యవహరిస్తున్నాము. అనేక విధాలైన దినాలు నేడు కనిపిస్తున్నవి. ఒక నక్షత్రం ధ్రువం చుట్టూ ఒకసారి తిరగటానికి పట్టే కాలము 23 గం. 56 ని 40.9 సెకండ్లు. దీనికి నాక్షత్ర దినమని పేరు. ప్రాచీనులు నక్షత్ర దినానికి అరవై నాడు లున్నవన్నారు. ప్రతి నాడికి అరవైవినాడులు. ప్రతి వినాడికీ ఆరు ప్రాణాలు. ప్రతి ప్రాణికీ పది గుర్వక్షరాలు. గుర్వక్షరం ప్రతిదానికీ నాలుగక్షరాలు. ఈ దిన విభాగం అతి ప్రాచీనమైంది. "గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేక పదీ ద్విపదీ సాచతుష్పదీ అష్టాపదీ నవపదీ బభూవుషి సహస్రాక్షరా పరమే వ్యోమన్29 ఈ మంత్రంలో పైన పేర్కొన్న దిన ప్రమాణం నిబద్ధమై ఉందట. $1 \times 2 \times 4 \times 8 \times 9 \times 1000 : 864000$ అక్షరాలు. మన పూర్వులు దిన ప్రమాణాన్ని కొలవటానికి అక్షరాన్ని (శబ్దాన్ని) ఆధారం చేసుకున్నారు. ఋగ్వేదంలో ఉన్న మొత్తం అక్షరాలు ఒక సౌరసంవత్సరానికి ఎన్ని అక్షరాలు ఉన్నవో అన్నేనట. అంటే 864000. ఈ విషయాన్ని గురించి ఒక అభిజ్ఞుడు 'అగు—గడియారము' వలె మన పూర్వులు ఋగ్వేదాన్ని ఉపయోగించారు. పై గడియారము ఒక సెకండు కాలాన్ని, అంటే సౌరదినంలోని 864000 భాగాన్ని మాత్రం కొలవ గలుగుతుంది. దీనినిబట్టి ప్రాచీనులకు నిష్కర్షగల ఒక కాలమాలపక మున్నదని అర్థమౌతుంది' అని వ్రాసినాడు.30

## 15

భాస్కరాచార్యులు (క్రీ. శ 1150) దినాన్ని త్రుటుల లెక్కలో చెప్పి దినానికి 2,91,60,00,000 త్రుటులున్నవన్నాడు. అంటే $27 \times 25 \times 43{,}20{,}000$ చతుర్యుగాలను సంవత్సరాలుగా మారిస్తే ఎన్ని భాగాలు వస్తవో దినాన్ని భాగాలుగా మారిస్తే అన్ని త్రుటులు వస్తవన్నమాట.

ఒక మధ్యాహ్నంనుంచి మరొక మధ్యాహ్నానికి సూర్యుడు రావటానికి పట్టే కాలాన్ని సౌరదినమని వ్యవహరిస్తున్నాము. ఈ సౌరదిన పరిమాణం ఋతువులతోబాటు మారుతూ ఉంటుంది. దీర్ఘమైన ప్రొద్దున్న దినానికీ పొట్టి ప్రొద్దున్న దినానికీ మధ్య తేడా 51 సెకండ్లు. దినానికి ఆరంభం లంకలో ఉదయమని ఆర్యభటుడు. వరాహ మిహిరుడు అర్థరాత్రంనుంచి అర్థరాత్రానికి దినమని చెప్పాడు. 'ఉదయా దుదయం వారః' అన్న ప్రమాణాన్ని అనుసరించి మనం నిత్య వ్యవహారంలో ఉదయంతోనే దినం ఆరంభించినట్లు లెక్కిస్తున్నాము.

దినంలో (పగటిలో) ప్రాహ్ణము, మధ్యాహ్నము, అపరాహ్నము, సాయాహ్నము' అని నాలుగురీతుల ఒకచోట. ఉష, మధ్యాహ్నము, అపరాహ్నము, సాయాహ్నము, సంగవము (పాలు పితుకు కాలము) అని ఒకచోట అయిదు రీతుల కన్పిస్తున్నది. బౌద్ధుల పద్ధతినిబట్టి రాత్రి త్రియామ, యామానికి నాలుగు గంటలు. బౌద్ధేతరులు రాత్రిని పగలునుకూడా నాల్గు యామాలక్రింద విభజించి వ్యవహరించినట్లు యువాన్ చ్వాంగ్ చెప్పినాడు [యువాన్ చ్వాంగ్ పుట 143.]

## 16

ప్రాచీన కాలంలో దినప్రమాణాన్ని సహజమైన విశేషాలనూ క్రమంగా నిరూపించుకొని వ్యవహరించుకోటానికి కొన్ని యంత్రా లుపయోగించారు. ఋగ్వేదంలో తురీయమనే యంత్రం కనిపిస్తున్నది.

దీనిని భాస్కరాచార్యులవారు 'వళీకృతంచక్రమథశంతిచాపం కోదండ ఖండం ఖలు తుర్యగోళం' [సిద్ధాంతశిరోమణి - 10 - 15] అని వర్ణించారు. ఒక గ్రహాన్నిగాని, నక్షత్రాన్నిగాని, సూర్య చంద్ర బింబాన్నిగాని మనం చూస్తున్నప్పుడు అది దిక్చక్రంమీద ఎన్నో భాగ (డిగ్రీ) ఎత్తున ఉన్నదీ దాని సహాయంతో మనవారు చూచేవారు.31 వృత్తాంశపరిమాణాన్ని, కాలపరిమాణాన్నీ కనుక్కోటానికి పూర్వులు రెండు యంత్రాలను ఉపయోగించారు. శంకువు పగటి వేళ పనిచేస్తుంది. రాత్రికి కపాలయంత్రాన్ని కనిపెట్టారు. రాశిచక్రం వచ్చినతరువాత సూర్య ఘటికా యంత్రం వచ్చింది. దీనికి 12 ముల్లు ఉంటవి. పగటిని తెలియజేస్తుంది. తరువాత కాలంలో జలఘటికా యంత్రాలు వచ్చినవి.

---

28. *Astrological Magazine 1949* (Vol 38. No 2) *Indian Year*—

29. ఋగ్వేదము 1. 164. 41; తైత్త. అర. 1. 9. 4

30 *"The Rig - Veda repetion served the purpose of a stop - watch" - Astrological Magazine Vol. 38 No. 1—P. 79.*

31. తురీయాన్ని గురించిన వివరాలకు—వేద ఋషుల గణిత యంత్రము భారతి - వ్యయ ఫాల్గుణము పుటలు 283 - 285.

పూర్వం మఠాలల్లో, సంఘారామాలల్లో ఇవి ఉండేవి. మౌఖరీ మైత్రకులకాలంతో క్రీ. శ. 5 వ శతాబ్ది మొదలు ఏడవ శతాబ్దంవరకూ ఉత్తరదేశంలోనూ, తరువాత బహుకాలంవరకూ దక్షిణదేశంలోనూ ఇవి ఉన్నవి.32 వీటిని సంఘారామాలల్లో కుర్రవాళ్ళచేత పట్టించి వాళ్ళువచ్చి కాలాన్ని చెప్పుతుంటే ఘటికాస్థానంలో గంటలు కొట్టేవారు. మన పిల్లలమర్రి పినవీరన పీఠికలలో "చిడిముడి జాహ్నవీతటిని శీకరపోతముజూచి యొవ్వరీ కోడిములుగట్టి పెండ్లికొడుకున్ గడియారము మోవజేసి రంచడుగ"లో సూచించింది యీ విషయమే. 33

మధ్యాహ్నాన్ని కుతపకాలాన్నీ తెలుసుకోటానికి షష్ఠియంత్రాన్ని ఉపయోగించేవారు. పెద్దన్నగారు ప్రవరాఖ్యుని ఇంటికి యోగిని కుతపకాలంలో తీసుకొనివచ్చారు. బహుశః రాయలకాలంలో (క్రీ. శ. 15 శతాబ్ది పూర్వభాగం) ఆంధ్రదేశంలో ఇవి ఉపయోగంలో ఉండిఉండాలి. గణితశాస్త్ర సహాయంతోనూ యంత్రసహాయంతోనూ మన పూర్వులు పరిపూర్ణ కాలవిజ్ఞానం కలిగి వ్యవహరించారనటం నిస్సంశయము. వారి అనంత కాల విజ్ఞానం వేదకాలంనుంచీ అవ్యవచ్ఛిన్నంగా వస్తున్నది. ఇటువంటి వారు ఇతరుల దగ్గరనుంచి జ్యోతిష విజ్ఞానాన్ని గ్రహించారని పాశ్చాత్యులు కొందఱు వ్రాస్తే వ్రాసిఉండవచ్చుగాని దానిని మనవారుకూడా కొందఱు నమ్మటం శోచనీయం. పాశ్చాత్యులలో బుద్ధిమంతులు కొందరు సత్యప్రియులై ఈనాడు నూతనంగా కనిపెట్టబడ్డవని చెప్పుకునే యురేనస్, నెప్ట్యూన్ గ్రహాలుకూడా మన భారతీయులకు తెలుసునని అంగీకరిస్తున్నారు.34

# 17

ప్రాచీన శాసనాలనుచూస్తే క్రింది విశేషాంశాలు సంవత్సరానికి సంబంధించి కన్పిస్తున్నవి. ఒక కుషాణరాజు తక్షశిల శాసనంలో (క్రీ.శ.79) 'ఆషాఢస్య మాసస్య దివసే పంచదశే'అని మాసనామం కనిపిస్తున్నది. *Ep. hd XIV-P125*] మహారాజస్య కనిష్ఠస్య రాజ్యతృతీయే హేమంతమాసే తృతీయేపూర్ణిమాంతమాఘే' [37-39 *Selective Inscriptions—D. C. Circar*]. శాతవాహన రాజుల కాలంలోగాని, ఇక్ష్వాకు రాజుల కాలంలోగాని శాసనాలల్లో మాసనామం కన్పించటంలేదు. కృష్ణపక్షంతో నాలుగు మాసాలుగల మూడు ఋతువులు ఆరంభిస్తున్నట్లు నిదర్శనాలున్నవి. వాశిష్ఠీ పుత్ర పులోమావి కార్లే శాసనాలల్లో గ్రీష్మపక్షే పంచమే దివసే ప్రథమే: జ్యేష్ఠ కృష్ణ ప్రథమ (క్రీ. శ. 187) అనీ,35 హేమంత పక్షే తృతీయే దివసే ద్వితీయే: పుష్య బహుళ ద్వితీయ (క్రీ. శ 154) అనీ, 36 వీరపురుషదత్తుని (ఇక్ష్వాకువంశపు రాజు) నాగార్జునకొండ శాసనంలో హేమంతః పక్షః షష్ఠః దివసః త్రయోదశః : మాఘ శుద్ధ త్రయోదశీ అనీ37 కనిపిస్తున్నవి. పల్లవులలో తరువాతి రాజుల కాలంలో మాస నామాలు కన్పిస్తున్నవి. శకవర్ష ప్రశంస కన్పిస్తున్నది. కుమారవిష్ణు చందలూరు, ఉరవపల్లి శాసనాలు ఇందుకు నిదర్శనము. 38, 39 రాజరాజ నరేంద్రుని వంశస్థుల శాసనాల్లో సింహమాసము,40 తులామాసము41 అనే వ్యవహారం ఉంది. ఇలాగే ఉత్తర దక్షిణ భారతదేశంలోని శాసనాలను పరిశీలిస్తే సంవత్సరానికి సంబంధించిన విశేషాలెన్నో బయల్పడతవి. 42

# 18

'అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్
వస్త్రైరాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః
విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞ మభిపూజ్యచ,
సంవత్సర ఫలం సమ్య క్ఛ్రుత్వా విప్రాన్ సమర్చయేత్,

అనాదినుంచి సంవత్సరాది ఒకే నియతమైన ఋతువులలోగాని, మాసంలోగాని, పక్షంలోగాని రావటం జరగలేదు. అనేక రీతులు మారుతూ వచ్చిందని మనం గమనించాము. అందువల్ల పూర్వకాలంలో సంవత్సరాది ఆచారాలు విస్పష్టంగా ఇలా ఉన్నవని చెప్పటం కష్టం. అయితే మొట్టమొదట సంవత్సరాదినాడే యజ్ఞం ప్రారంభమయ్యేది. సంవత్సరకాలం అది జరుగుతూఉండేది. నేడు మనం ఉత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలాలల్లోనూ, నక్షత్ర దర్శన సమయాలల్లోనూ చేసే కార్యకలాపాలన్నీ ఆయా కాలాలతో సంవత్సరం ఆరంభించినప్పుడు సంవత్సరాది కృత్యాలుగా ఉన్నవని ఊహించవచ్చు.

నేడు సంవత్సరాది చైత్రశుద్ధ ప్రథమ. ఇప్పుడు నింబకుసుమ భక్షణం, పంచాగ శ్రవణం తప్ప విశేషంగా పాటిస్తున్న ఆచారాలు ఆంధ్రదేశంలో ఏమీలేవు. సంవత్సరాదినాడు సదాచార సంపన్నుడు అంగుళీ స్ఫోటంలో నిద్రలేచి శ్రీ మచ్ఛంకర భగవత్పాదులవారు చెప్పిన

"ప్రాతస్స్మరామి హృది సంస్ఫురదాత్మ తత్వం
సచ్చిత్సుఖం పరమహంస గతిం తురీయమ్
యత్స్వ ప్నజాగరసుషుప్త మవైతి నిత్యం

---

32. *Life in the Gupta Age—R. N. Salatore PP. 106—107.*

33. దీన్ని ఉపయోగించే విధానానికి *Itsing P 144-145*

34. *'Uranus and Neptune have only been rediscovered. They have been moving through the heavens and were known to Hindu astrologers ages ago'—Alan Leo—Astrology Explained.*

35: *Ep. Ind. Vol. VII,* 36. *Ep. Ind. Vol. VIII'*
37. *Ep. Ind. Vol. XX.* 38. *Hultzch E-I-l PP,*
39. *I. A Vol. VIII,* 397-398

40. విమలాదిత్యుని రణస్థపూడి శాసనము *Ep. Ind Vol VI*

41. శక్తివర్మ సాహిత్య పరిషత్తు శాసనము (*A. S. P. P.*)

42. శాతవాహన రాజులకాలంలో మూడే ఋతువులు. పూర్ణిమతో మాసారంభము. గ్రీష్మము: చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢాలు; వర్షము : శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ కార్తికాలు; హేమంతము : మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణాలు.

[*Foot Note No. 2—Page 119 Selective inscriptions bearing on Indian History and civilization—D. C. Circar.*]

తద్బ్రహ్మ నిష్కళమహం నచ భూత సంఘః.
ప్రాతర్భజామి మనసా వచసా మగమ్యమ్
వాచో విభాంతి నిఖిలా యదనుగ్రహేణ
య న్నేతి నేతి వచనై ర్నిగమా అవోచమ్
తం దేవ దేవ మజ మచ్యుత మాహురగ్ర్యమ్.
ప్రాతర్నమామి తమసః పరమర్క వర్ణం
పూర్ణం సనాతన పదం పురుషో త్తమాఖ్యమ్
యస్మిన్నిదం జగదశేషమ శేషమూర్తౌ
రజ్వాం భుజంగ ఇవ ప్రతిభాసితం వై"

అన్న ప్రాత స్స్మరణ శ్లోకాలను పఠిస్తాడు. పైన చెప్పిన శ్లోకాలలోని అర్థాన్నీ "కాలః కలయతే లోకం కాలః కలయతే జగత్, కాలః కలయతే విశ్వం తేన కాలోభిధీయతే; కాలస్య వశగా స్సర్వే దేవర్షి సిద్ధ కిన్నరాః, కాలోహి భగవాన్ దేవ స్స సాక్షాత్పరమేశ్వరః"

అన్న కాలస్వరూపాన్ని నిరూపించి కాలం పరమాత్మఅనీ, సర్వం కాలాధీనమనీ ఊహించి మననం చేసుకుంటాడు. కాల్య కృత్యాలను తీర్చుకొన్న తరువాత మంగళస్నానం చేసినా సంకల్ప పూర్వకమైన కూపోదక స్నానాన్ని గానీ, నదీ జలోదక స్నానం గానీ చేసి సంధ్యావందనం పితృతర్పణాదులు పూర్తిచేసి దేవతలకు పులికాపుచేసి ఆసాదించి శర్కరాన్న ఘృతాదులతో కూడిన నింబ కుసుమ ప్రసాదాన్ని నివేదన చేసి సకుటుంబంగా తానూ స్వీక రిస్తాడు. మృష్టాన్న భోజనం చేస్తాడు. సాయంత్రం పంచాంగ శ్రవణం చేస్తాడు.

ధనికులు కొందరు దైవజ్ఞులను, పండితులను, గురువులనూ, ఆహ్వానించి వాళ్ళ ఇళ్ళల్లోనే సాయంత్రం పంచాంగ శ్రవణం చేస్తారు. వీరికీ గ్రామవాసులకూ ఉదయమే ఇంటి పురోహితులూ గ్రామ పురోహితులూ వచ్చి నింబకుసుమ ప్రసాదాన్ని ఇచ్చి వెళ్లుతారు.

ధనికులు నూతనవస్త్రాభరణాలంకరణం చేసుకొని-పంచాంగ శ్రవణ సమయంలో రాబొయ్యేది వేసవి గనుక పాత్రులకు ఛత్రము, తాళవృంతము, పాదుకలు వస్త్రాభరణాదులు దానం చేస్తారు. కొందరు సరస్వతీ పూజా సమయంలోనూ, మంట పారాధన సమయంలోనూ 'పంచాంగాలు' పంచిపెట్టుతారు; పేద విద్యార్థులకు ఇతర పుస్తకదానం కూడా చేయటం కద్దు.

గ్రామాలల్లో జనం ఉదయం మంగళ స్నానాలుచేసి ఆమ్ర తోరణాలతో గృహద్వారాలను అలంకరించి నూతన వస్త్రాభర ణాలతో అలంకరించుకుంటారు. పురోహితుడు వచ్చి యింటిం టికీ తిరిగి ప్రసాద మిచ్చి వాయనలు పుచ్చుకొని వెళుతాడు. సామాన్య ప్రజలు 'సంపులమ్మ' మొదలైన గ్రామ దేవతల దగ్గరకు 'చిందు నృత్యం' చేసుకుంటూ మంగళవాద్యాలతో వెళ్లి వచ్చి తృప్తిగా భోజనం చేసి సాయంకాలం దేవాలయంలోని మండపం దగ్గిరికి పంచాంగ శ్రవణం కోసం చేరుతారు.

మంటపం దగ్గిర సభ ఉత్తరముఖంగాగాని తూర్పు ముఖంగా గాని ఏర్పాటై ఉంటుంది. పంచాంగ శ్రవణం గణపతి పూజతో ఆరంభిస్తుంది. "గణానాం త్వాం గణపతిగ్ం హవామహే, కవిం కవీనాముప మశ్రవ స్తమం, జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణ స్పత, ఆనః శృణ్వ న్నూతిభిః సీదసాదనమ్ [ఋగ్వే II. 28]" అన్న ఋగ్వేద మంత్రంతో గణపతి పూజ ప్రారంభించినప్పుడు వేదార్థం తెలిసినవారు ఈ మంత్రంలోని 'ఈ సమస్త దేవతాగణా లకూ అధిపతివి నీవు, నాయకుడవు, బుద్ధిమంతులలో బుద్ధిమంతు డవు, ప్రఖ్యాతుల్లో అగ్రగణ్యుడవు, ప్రార్థనలు పూజలు యజ్ఞాలు మొదలైన సమస్త కర్మలకు నీవే రాజువు; ఓ బ్రహ్మణ స్పతీ! యజ్ఞస్థానాన్ని అలంకరించు' అన్న అర్థాన్ని మననం చేసుకొని గణపతిని పరబ్రహ్మగా భావిస్తారు. తరువాత సరస్వతీ పూజ. సరస్వతి వాగధిదేవత. సృష్టికి ఆది శబ్దం. కాలానికి సంబంధించిన సంవత్సరాదినాడు సరస్వతీ పూజ ఎంతో సముచితమైంది. ఈ సరస్వతీ పూజకు ముందే మంటపారాధన జరుగుతుంది. 'మంట పము' కేవలం ఖగోళము. వివిధ నక్షత్రాలనూ గ్రహాలను ఇంద్రాది లోకపాలకులనూ తదితర దేవతలనూ ఇందులో ఆహ్వానించి పూజిం చటం ఉంటుంది. ఈ పూజా సందర్భాలల్లో కాలాన్ని కను క్కోటానికి మన పూర్వులు ఉపయోగించిన తురీయ, కపాల, షష్టి, జలఘటికాది యంత్రాలను కూడా పూజించేవారు.

పైన చెప్పిన మంటపారాధన, సరస్వతీ పూజలు అయిపోయిన తరువాత పురోహితుడు తప్పుకుంటాడు. దైవజ్ఞుడు గ్రామపెద్ద ఆహ్వానాన్ని అందుకొని వేదికనుఅలంకరిస్తాడు. ఆయనకు చందన చర్చ వస్త్రాలంకరణం ఇత్యాదులు జరుగుతవి. ఇతడు ద్వేషరహి తుడు, నిత్యసంతోషి, గణితశాస్త్రవేత్త, ముహూర్త గుణ దోష జ్ఞుడు, వాగ్మి, సూక్ష్మబుద్ధి, నిత్యకర్మలతో ఆసక్తి కలవాడు, అయి ఉండాలెనని శాస్త్రం చెప్పుతున్నది. దైవజ్ఞుడు పూజలను పొందిన తరువాత ఇష్టదేవతా గురు ప్రార్థనతో 'పంచాంగ శ్రవణం' ప్రారంభిస్తాడు.

తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలతో కూడింది పంచాం గము. సంవత్సరాదిని పంచాంగం విన్న వాళ్లకు 'క్రతుఫలం' చెప్పి ఉంది. నిత్య నైమిత్తిక కామ్య కర్మల్లో వేటికైనా భారతీ యులకు కాలజ్ఞానం అవసరం. అంతేకాక వర్షాలు, కొరతలు, ధనధాన్య సమృద్ధి మొదలైన వాటిలో జ్యోతిష్కులు చెప్పినట్లే జరుగుతూ ఉండటంవల్ల ప్రజలు అత్యాదరంతో ఈ పంచాంగ శ్రవణం చేస్తారు.

దైవజ్ఞుడు పంచాంగ శ్రావణానికి (వినిపించటానికి) ముందు అనంతమైన కాలస్వరూపాన్ని విశదం చేస్తాడు. ఇది పంచాం గాలకు పీఠికా భాగంలో ఉంటుంది. సంవత్సరాధి పతులను గురించీ, వారిచ్చే ఫలితాలను గురించీచెప్పి తరువాత ఆదాయకందా యాలనూ, రాజపూజావమానాదులను నిరూపిస్తాడు. పుష్క రాలుగాని, అర్ధోదయ మహోదయాలుగాని ఉంటే వాటి విశే షాలను నిరూపిస్తాడు. గ్రహణ విశేషాలను పేర్కొంటాడు. పండితులు వేసే ప్రశ్నలకు సమాధానా లిచ్చిన తరువాత దైవజ్ఞుడు తన ప్రసంగాన్ని క్రింది పంచాంగ శ్రవణ ఫలశ్రుతితో పూర్తి చేస్తాడు. ప్రజలు వడపప్పు పానకాలు పుచ్చుకొని సంవత్సర విశే షాలను గురించి ముచ్చటించుకుంటూ ఇళ్ళకు చేరుకుంటారు.

"శ్రీ కల్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం
గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదాన తుల్యం నృణామ్
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం
నానా కర్మసుసాధనం సముచితం పంచాంగమాకర్ణ్యతామ్"

# అల్లసాని సుకవి

శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి

అద్దమరేల వెన్నెలలయందము; కాచినపాలమీఁది బల్
నిద్దపుదేట సోయగము; నీరజమందలి సొంపు; నొక్కచో,
ముద్దగఁజేసి, పద్దెములు, ముద్దుగఁ, దేనియ, లొల్కవ్రాసితో
పెద్దన! నీకు సాటికవి పెద్దగలండె? యొకండు సత్కవీ!

కనలిన కాంత నీరొలుకు కన్నులలో తెలిచూపు; గద్గద
ధ్వనిగల మాటతీపు; వలవంతకనంబడఁ జేయురూప; హా
వనిత తనంతఁ దా వలచి వచ్చినయప్పటి సన్నివేశముఁ
గనుఁగొనఁ జేయు నీకవితఁ, గాదనువాఁడు, గలండె, సత్కవీ.

చెలువుఁ, డనిష్టముం, బలుకఁ, జేడియపాటును; దానిగొంతులోఁ
గలిగిన మాట లోటును; మొగంబునఁ గల్గిన విన్నబాటు; నీ
వలె గ్రహియించి పల్కఁ గవివల్లభుఁ డెవ్వఁడు; నీవు వ్రాయుచోఁ
గల మొనరించినట్టి యుపకార మదెంతయొగాని, సత్కవీ!

తాతవెగాని, నీదు కవితం, దొలి దా రసముబ్బి, వింతగా
శ్రోతలమెచ్చఁ జేయ, నొకశుంఠ, గ్రహియింపక యున్నలోటా! నీ
పూఁతమెఱుంగులుం, బసరుఁ జూపబెడంగు లెఱుంగఁ జాలఁడో?
తాతలుగారె? భవ్య కవితానుభవంబుగలారు, సత్కవీ.

పొతుకను, విన్నకోట కవిపెద్ద యలంకృతులన్, ఘటించినం
తనె, నిజనామసామ్యమునఁ, దానెటులీడగు? నీకు; భూపతిన్
గని యవి పొందె; నీదు కుడికాలికి బంగరుటందె నందఁ జే
సిన కవిరాజె నీకవితఁ జెందిన నేర్పు తెఱుంగు సత్కవీ!

చిదిమినచోట నద్రసము చిప్పిలు కావ్యఫలమ్మునిచ్చి; వే
రొదవిన కృష్ణరాయని మహోన్నతగౌరవమంది, దంతిన
క్కడెసల సత్కవుల్వొగడఁ; గీర్తిగడించితివౌర! పాత్రకున్
మదికలభావముల్ దెలుపు మాదిరి, నీకగుఁ గాదె? సత్కవీ!

పొరుసమించు నాయికను జక్కనినాయకు భావరీతులన్
జేరనివారి, నొక్కయెడఁ జేరిచి, యొక్కవిధాన, శాంత శృం
గారరసమ్ములన్ నడుపఁగల్గితి; వభ్రనదీకళింద జా
సార సితాసితాంబువుల చక్కటిఁ జూపితిగాదె? సత్కవీ!

కాంతుఁడులేని యా త్రిదశకాంతకు నొక్కనిఁ జూఁపినాఁడ, వా
శాంతుఁడు, దానిమాట విరసంబుగఁ జేసిన, నోర్వలేని నీ
స్వాంతముచూపె వేఱొకని వల్లభు, దానికి నామెవంతవో
సంతసమందె; సజ్జనుల సన్నిధి, శ్రేయము నీదె? సత్కవీ!

కుతుకముమీర, నీవు, శఠకోపయతీంద్రున, కగ్రహార, మి
చ్చితి వనువార్త, నీ మతము చెప్పక చెప్పుచునుండెఁ? గాని, నీ
కితరమతప్రకోప, మొకయించుక లేమి నెఱింగెదన్, భవ
త్కృతమగు కావ్యమందరయ, నెందునుగానఁగరాదు; సత్కవీ!

మనుచరించి రాయలయమాన బహూకృతిగాంచనున్న నిన్
గినుకనుజూచు ముక్కవుల కేరడముల్విని, తాతగారి యీ
మనుపెటు సాగునన్న యనుమానము కొందఱకయ్యెఁగాని, వి
ప్పినరసమొల్కు నీకవిత, పెన్పెమె మెమ్మెమెగాదు సత్కవీ!”

మనుచరితమ్మొనంగుమని, మన్ననమున్నుగ, దేవరాయ లి
చ్చినకపురంపువీడియము చేర్చినపుక్కిటఁ బల్కినావొ; కా
దన నగునేని, నీరచనకారయ, నెండిన తాటియాకులం
దినుపసలాకగీఁతల, కదెట్టులు తద్రుచిగల్గు? సత్కవీ!

కపురపుఁడాపులం గులుకు కావ్యకళావతిఁ, గన్యఁ, గాంచి, గో
త్రపతికిఁ, గూర్పుటం, దెనుఁగుఁదల్లి, నిరుం, దొలిబిడ్డగాఁ, దలం
చి, పెరిమ, నీదునాలుకను, జేర్చినతేనియలొల్కుచుండెఁ; గా
క పరకవి ప్రబంధములఁ గల్గునె? యింతటితీపి, సత్కవీ!



# లక్షణ గ్రంథములు

# వాఙ్మయ పరిశోధన

శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఆదిపురాణము—సర్వదేవుడు.1

పాత్రపు వేంకటరమణ కవి లక్షణశిరోమణి యను లక్షణ గ్రంథములో పై గ్రంథమునుండి యీ క్రింది పద్యము నుదాహరించియున్నాఁడు.

"సర్వదేవుని ఆదిపురాణము—చంపకం—తెమ్మెర లనుటకు అఖండప్రయోగం లక్ష్యం.

మురువము పొంది పొంది, విరిమల్లియ పూవుల జెందిచెంది, కే
సరములు గ్రోలిగ్రోలి, జలజాత పరాగము గ్రోలిగ్రోలి, క
ప్పురములు నించినించి సురపొన్నలతావుల నందియంది తె
మ్మెరలు నిరంతరంబును భ్రమించుచునుండు వనాంతరంబులన్.

పై పద్యము శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు ప్రకటించిన ప్రబంధమణి భూషణమున 253 పద్యముగా నుదాహృతమైనది. ఈ పద్యముయొక్క యాకరము గ్రంథమున తెలుపఁబడలేదు— అందలి పాఠ మిట్లున్నది.

"మరువముఁ బొంది పొంది, విరిమల్లియపూవుల జెందిచెంది, కే
సరముల గ్రోలిగ్రోలి, జలజాత పరాగము తూలితూలి క
ప్పురమున నేచి యేచి సురపొన్నల వాసన మోచి మోచి, తె
మ్మెరలు నిరంతరంబును భ్రమించుచునుండు నిరంతరంబుగన్."

తెమ్మెరలను పదము తెన్ + ఎరల్ అని పదచ్ఛేద మగుట వలన దేశీయవళియను నుభయవళులలో చేరినది. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో ఉభయవళులలో తెమ్మెరలు అను పదము నిచ్చియున్నాఁడు— (చూడుఁడు సప్తమోల్లాసము 69 పద్యము).

"కఱకరి కల్లడంబు కడుకట్టిడి తెమ్మెరలోలమాన గ్ర
చ్చుఱ గొనసలారు లుల్లులుకు లాడెడి వీఱిఁడి రజ్జులాఁడు గ్రి
క్కిఱియుట నా తెనుంగునను నీ యుభయంబు వళిప్రకారమై
మెఱయుఁ గవి ప్రయోగమున మేల యొఱంగి రచింపనేర్చినన్"

ఆదిపురాణములోని పద్యమున 'తెమ్మెరలు' అను శబ్దములో హల్లునకే యతికలదు. నన్నయాది ప్రాచీనకవుల గ్రంథములలో నా చుగాగమ యతులకు హల్లుతోడనే యతి—పెద్దన లక్షణము నకు లక్ష్యముగా నుండుటచేత నాదిపురాణ మానాటికి ప్రచారములో నుండెనని చెప్పవగును.

2. స్మరతత్త్వసారము. పై లక్షణ శిరోమణిలోనే 4 వ యాశ్వాసమున నిట్లుగలదు.

వ. మఱియు మకారమునకు బరతత్త్వ రసాయనమున చంపకం 1 వ పాదంలో రెండవ చరణమున 4 వ యడుగునను యీ మూడంఘ్రులకు మకార యొక్కటి యతిప్రయోగం లక్ష్యం.

"ముదుసలి గద్దె యక్షర ముముక్షుమ వేల్పులలావు మేనిలో
మొదలి వెలుంగునెత్తి తుదిమోవఁగఁజేయుట చేర్పుమంత్రమ
భ్యుదిత తనూ సరోరుహము నూనిన గాడ్పుల యూటపట్టు స
మ్మదములరారఁగాఁ బ్రణవమంత్రము మాకుఁ బ్రసన్నమయ్యెడిన్"

చాటుపద్య మణిమంజరి ద్వితీయభాగము ఇష్టదేవతా స్తుతి స్తబకము (పుట 3) లో పై పద్య మిట్లున్నది.

"మొదలిటిగద్దె యక్షరము ముప్పూరివేల్పులలావు, మేనిలో
మొదలి వెలెంగునెత్తి తుదిమోవగజేయుటకేర్పు జంత్రమ
భ్యుదిత తనూసరోజముల నూనినగాడ్పుల యూటపట్టు, స
మ్మదములరారగా బ్రణవమంత్రము మాకు బ్రసన్నమయ్యెడిన్."

ఇందును పద్యముయొక్క యక్షరము తెలుపబడలేదు కాని యిది స్మరతత్త్వసారమునందలిది యని పై లక్షణగ్రంథము తెలుపుచున్నది. సంకలనచ్ఛందోగ్రంథములయందు స్మరతత్త్వసారము నుండి యీ క్రిందిపద్య ముదాహృతమైనది.

"మలయసమీరు వేడియును, మావుల వేడియు, రాజకీరకో
కిలముల వేడియున్ మకరకేతను వేడియు మాన్ప వేడియున్
మలయసమీరు వేడియును, మావుల వేడియు, రాజకీరకో
కిలముల వేడియున్ మకరకేతను వేడియు మ్రొక్కి రంగనల్.

శివతత్త్వసారమునకు బ్రతిగా స్మరతత్త్వసారము ప్రాచీనాంధ్రవాఙ్మయమున నుండుట విశేషము. స్మరతత్త్వసారము కవిసంజీవని యను లక్షణగ్రంథమున నుదాహృతమైనట్లుగా కుమారసంభవ ప్రథమ ముద్రణ పీఠిక 4 పుటలో కవిగారిట్లు వ్రాసినారు.

---

1 చూడుఁడు. తెనుగుకవుల చరిత్ర—ప్రథమఖండము 91 పుట

"కవి సంజీవనిలో నెక్కటి వరుసల క్రింద స్మరతత్త్వసారము, కాశీ శతకము, ముద్రారాక్షసము భారతానుశాసనికము వీనిలోని పద్యముల నుదాహరించి నన్నెచోడుని కుమారసంభవములోని...పద్యముల నిచ్చియున్నాడు." దీనినిబట్టి ప్రాచీనాంధ్ర వాఙ్మయమున స్మరతత్త్వసారము అను గ్రంథ మున్నట్లు నిశ్చయింపవచ్చును.

3. నీతిభూషణము—మడికి సింగన సకలనీతి సమ్మతమున నుదాహరించిన యీ ప్రశస్త గ్రంథమునుండి యీ క్రింది పద్యము సంకలన లక్షణ గ్రంథములలో గలదు.

నీతిభూషణము.

"వలవదు చూడ దుర్జను నవశ్యము చూచిన వానిముందటన్
నిలువక యుండఁగావలయు నేరుపుగల్గిన వానితోడుతన్
బలుకక యుండఁగావలయు ప్రాజ్ఞుఁడు తత్సమయోచితంబుగా
పలికిన.........పల్కిన యట్టులఁ బల్కఁగాఁదగున్."

మఱియు నిందుండి.

"సకల స్థాణుశిరః ప్రవర్తి నురుపక్షద్వంద్వపక్షాభిరం
జకుఁడన్ సర్వదిగంత గామి నసకృత్సంసేవ్యమానుండ నై
షికుఁడం గావున మత్సమానుఁడను నే శీతాంశుఁడం చెప్పడుం
బక మిందుం బ్రహసించునట్లు సుజనుం బల్కుం దురాత్ముండి
లన్."

అను పద్యము బాలబోధచ్ఛందస్సులో నుదాహృతమైనట్లుగా సకల నీతిసమ్మతి పీఠికలో శ్రీరామకృష్ణకవిగా రుదహరించినారు (పుట 4) ఈ పద్యమే చాటుపద్య మణిమంజరి ప్రథమ భాగములో సంకీర్ణపద్యములను శీర్షికలో (18 వ పుటలో) నుదాహృతమై యున్నది. కాని లాక్షణికోదాహృతులనుబట్టి యిది యును నీతిభూషణమునందలిదే యని నిశ్చయింప వచ్చును.

4. రామ చంద్రాభ్యుదయము. } బడబాగ్ని భట్టు.
5. అనిరుద్ధ విజయము.

ఆంధ్ర కౌముదిలో పై రెండు గ్రంథములనుండి పద్యము లిట్లుదహరింపఁబడియున్నవి.

"బడబాగ్ని భట్టారక కృతే రామచంద్రాభ్యుదయే.

"ఇనవంశ రాజపుడు సౌం
పున విశ్వామిత్ర మౌనిపొం టె......య,
జ్ఞనుని యింట హరశరా
సనము విఱిచి పెండ్లియాడె జగతీకన్యన్."

"బడబాగ్ని భట్టారక విరచిత రామచంద్రా భ్యుదయే.
రాముని మహిమలోన మిగులఁ బ్రబలెకీర్తి"

బడబాగ్ని భట్టారక కృతే అనిరుద్ధవిజయే

"కడువడి మేరువుకంటెన్
బొడవగు రథమెక్కి దివియుఁ బుడమి యదరెడుం
గడిమిఁ గలిగి పూవిలుతుని
కొడుకడు వలి వెడలెననుచుఁ గుతుకముతోడన్."

బడబాగ్ని భట్టునుగూర్చి యప్పకవీయమునం దిట్లు గలదు.

బడబానలభట్టు ఏడవచోటను టకారంబు నిల్పి త్రిపురాంతకమునుండి శ్రీశైలమునకుం బోవునపుడు తెలుగురాయఁడు కట్టించిన చెఱువునీళ్ళన్నియు నాలుగు గడియలకు నింకిపోను దిట్టిన చాటుధార.

"బడబానల భట్టారకు
నుడిచే యుంగరము రవికిఁ గొబ్బున నర్ఘ్యం
బిడు వేళ నూడి నీలోఁ
బడియెఁ దటాకంబ నీటిఁ బాయుము వేగన్." (2.374)

ఈ విషయము ముందుగ నప్పకవి యిట్లు చెప్పియున్నాడు.
'అరజామునకుఁ జెఱువంతయు నింకంగఁ దిట్టెను బడబాగ్ని భట్టసుకవి.' (2.370.)

పై చాటుధారతోపాటు 'రామచంద్రాభ్యుదయము, అనిరుద్ధచరిత్రము' అను పద్యకృతులు కూడ రచించినట్లుగా నాంధ్ర కౌముదినుండి తెలియుచున్నది. గాని యీ పద్యకృతులు లభ్యము కాలేదు. బడబాగ్ని రామచంద్రుఁడను పేరు మాతిపురాణమున[1] గాన్పించుచున్నది.

ఆకథావృత్తాంత మది యెట్టిదనిన
చేకొని బడబాగ్ని? రామచంద్రుండు
చెప్పంగదొడగెను శాశ్వతంబుగను.

మఱియు నింకను నిమ్మల లక్ష్మణకవి కంచి యేకామ్రలింగ శతకమున నీ బడబాగ్నిభట్టు పేరు కాన్పించుచున్నది.

పై యుదాహృతులనుబట్టి బడబాగ్ని భట్టు ప్రసిద్ధకవి యని తెలియుచున్నది. ఈతడు క్రీ. శ. 1656 నాటి యప్పకవీయమున నుదాహృతుడగుటచే నంతకుముందువాడనుట నిశ్చయమే. ఏకామ్రలింగ శతకకర్త లక్ష్మణకవి క్రీ. శ. 1600 ప్రాంతమువాడగుటచే బడబాగ్ని భట్టంతకు ముందువాడు. ఇక "శ్రీశైలమునకుం బోవునప్పుడు తెలుగురాయడు గట్టించిన చెఱువు నీళ్లన్నియు" అని చెప్పుటచేత నీతడు[2] తెలుగురాయని కాలమునకు ననగా క్రీ. శ. 1428 కి వెనుకటివాడు. కాని యీతడు తెలుగురాయని సమకాలికుడే యని చెప్పుటకు నీ క్రింది విషయము ప్రోద్బలకము కాగలదు.

పద్మనాయక చరిత్రము తెలుగు గ్రంథము పద్యకావ్య మొకటి గలదు. అది యీ నడుమనే ముద్రితమైనది. ఆ పద్యకావ్యము బడబాగ్ని భట్టు రచించెననియు, భీమన యనువాడు దానిని సంస్కృతమున భాషాంతరీకరించెననియు శ్రీ రాళ్లబండి సుబ్బారావు పంతులుగారిట్లు వ్రాసియున్నారు.

*"Originally a Certain Badabagni Bhatta wrote this work and Bhimana prepared a Sanskrit version of it. (History of Padma Naiks. R. Subba Rac, M.A. L.T. Journal of the Andhra Historical Research Society Vol. V Part 1 Page 53")*

1. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. నివేదిక 1919 22 సం. 4. 3 వ భాగము. సంఖ్య R 693.
2. శృంగార శ్రీనాథము పుట 153.

శ్రీ సుబ్బారావుగారు పద్మనాయక చరిత్రమున తెలుగున నెట్లున్నదో తెలుపలేదు. నేను ప్రభుత్వమువారు ప్రకటించిన పద్మనాయక చరిత్రమున నీ వృత్తాంతము తెలుగు భాగములేదు.1 కాని క్రీ. శ. 1899 లో గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు వ్రాసిన రావు వంశచరిత్రలో నీ క్రిందిపద్యము గలదు.

"ఆది బడబాగ్ని భట్టను నమితయశుఁడు
శేశి భీమన దీని సంస్కృత మొనర్చె,
నంచిత సుధారసోక్తుల నలర నది తె
నుంగు నొనరించె కస్తూరి రంగసుకవి."

కాగా పద్మనాయక చరిత్ర తెనుగున రచియించిన కవి కస్తూరిరంగ కవి యనియు, నది సంస్కృతమున రచియించిన కవి బడబాగ్ని భట్టనియు, నాతనికి భీమనయని కూడ పేరుండెడిదనియు తెలియుచున్నది. మఱియు నా గ్రంథములో పద్మనాయకులలో సింగభూపతియొక్కయు నంతకుముందున్న వారియొక్కయు వృత్తాంతము చెప్పుటచేత బడబాగ్నిభట్టును నాతని సమకాలికు డనియు, తెలుగు రాయలుకూడ నా కాలమునాటివాఁడే యగుట చేత, బడబాగ్నిభట్టు క్రీ. శ. 1430 ప్రాంతపు కవి యనియు శ్రీనాథ మహాకవి సమకాలీనుడనియు తెలియనగును.

## ద్విపదలు.

ఆంధ్ర కౌముదిలో రెండు ద్విపద కావ్యము లుదాహరింప బడినవి.

1. భల్లాణరాయచరిత్ర—మేధాతిథి భట్టు. క్రీ. శ. 1456 ప్రాంతము.

"కవి మేధాతిథి భట్టార్యకృతే భల్లాణరాయ చరిత్రే
ద్విపద ప్రబంధే—మోహినీ సౌందర్య వర్ణనే
కాముమామను రాహు కబళించు మాడ్కి
కోమలి మొగము ముంగురు లాక్రమించె."

ఈ మేధాతిథి భట్టు చాటుపద్యమును నప్పకవి యుదాహ రించియున్నాడు.

మేధావిభట్టు ఆఱువత్తోట తకారము నిలిపి గ్రుడ్డునుఁ దాటి చెట్టు విలుగఁదిట్టిన చాటుధార

"సాళువ పెదతిమ్మమహీ
పాలవరుడు వీఁడెవచ్చెఁ బద్యము వ్రాయన్
శేలను లేదా కాకటియుఁ
దాళము! మత్తునియలగుచు ధరపైఁబడుమా."

ఈ సాళువ పెదతిమ్మరాజు క్రీ. శ. 1456 లో నున్నట్లు మెకంజీ 136 సంపుటమునందలి యొక శాసనమువలనఁ దెలియు చున్నది. కావున మేధావిభట్టును నా కాలము వాఁడే—గ్రంథము లభ్యము కాలేదు.

2. జాంబవతీ కల్యాణము—కళాధర కవి. క్రీ. శ. 1600 ప్రాంతము.

కళాధర కవికృతే జాంబవతీ కల్యాణే ద్విపద ప్రబంధే.
"వసుదేవ తనయుఁడు వాసుదేవునకు
విసకుసుమేక్షణ ప్రీతిమై మ్రొక్కె."

కళాధరుఁ డనునది బిరుదు నామమై యుండదగును. బాల సరస్వతీయ చంద్రికా పరిణయాది బహు గ్రంథకర్తయగు ఎల కూచి వేంకట కృష్ణరాయడు, తాను బహుకళా ధరుడనని చెప్పు కొనినాడు. (చూడుఁడు బాలసరస్వతీయ పీఠిక...పద్యములు).

మఱియు పెమ్మసాని తిమ్మనాయని కాలమున (క్రీ. శ. 1580-1610) ముడియము వేంకట రమణకవి 'కళాధరోపాఖ్యా నము' అను ప్రబంధమును వ్రాసి యున్నాడు. అతడు నా గ్రంథ రచనచే కళాధరు డని ప్రఖ్యాతి జెందెనేమో యను నూహ కవ కాశము గలదు. కాగా బాలకవి బిరుదప్రసిద్ధు డగు బాలసరస్వతి కన్న నీ వేంకటరమణ కవియే యీ గ్రంథకర్తయై యుండునని యూహించుట సమంజసము. ఈ జాంబవతీ కల్యాణము కృష్ణదేవ రాయ రచితమగు సంస్కృత జాంబవతీ కల్యాణము ననుసరించి రచితము కావచ్చును.

## శతకములు

1. చంద్రాభరణ శతకము. రంగనాథుడు. (చక్రపాణి రంగ నాథుడు) క్రీ. శ. 1270 ప్రాంతము.

క. ఫాలతల భస్మరేఖల
మేలెవ్వ డెఱుంగ నేర్చు మృగమద పంక
వ్యాలేపనాది రుచులకు
జాలింపడు గాక బాల చంద్రాభరణా! 1.

క. జడలల్లి భూతిపూయని
పాడవుల బోడగాన మాది పురుషులలోనన్
నడుమంత్రపు సమయంబులు
జడమతు లలరించుకొనిరి చంద్రాభరణా! 2.

ఇందు మొదటి పద్యములోని తొలిపాదము 'ఫాలతల భస్మ రేఖల' అనునది మాత్రము కీ. శే. ప్రభాకర శాస్త్రిలవారు 'రంగ నాథుని శివకవిత్వము' అను వ్యాసమున నుదాహరించినారు. పూర్తిపద్యము పై నీయబడినది. 'జడలల్లి' అను రెండవ పద్యము వారే ముద్రిత శివతత్త్వసారములో లేని పద్యముగా 'శివతత్త్వ సారము, అను వ్యాసమున మల్లికార్జున పండితారాధ్య రచనముగా నుదాహరించి యున్నారు. కాని తంజావూరి పుస్తకశాలలో గల సంకలనచ్ఛందో గ్రంథములలో స్పష్టముగా నీపద్యము రంగ నాథునిదిగా నుదాహృతమై యున్నది.

2. గోదావరీశతకము - వెగ్గడపల్లి పోతయ్య - క్రీ. శ. 1387.

"2స్థిరపుణ్యోదయ మేదినీందువదనా సీమంతవీథీలస
ద్ధురుముక్తా ఫలసూత్రమో, సురుచిర క్షోణీపురంధ్రీ సమా

1. *Bulletin of the Government Oriental Man. scripts Library Madras. Vol. III No. 2 and Vol. IV Nc, 1.*

2. ఈ పద్యమును శ్రీ రామకృష్ణ కవిగారు కుమారసంభవము ప్రథమభాగము పుట 119 లో నిచ్చియున్నారు.

వరధమిల్లలతాంతమాలికయొ, భూతన్వీరుచక్రీమనో
హారసంవ్యానమొ కాగ నీదగు ప్రవాహంబొప్పు గోదావరీ!"

ఈ క్రింది పద్యమయశాసన కృతికర్తయే పైనుదాహరించిన పోతన యని నా యభిప్రాయము.

రాజమహేంద్రవరము జిల్లా యిలాకా
దాక్షారామంలో శ్రీ భీమేశ్వరస్వామి
దేవాలయంమీది శాసనము. దక్షిణదావాలో.

పాలకొలని నాగిసెట్టి

"శ్రీ శకవత్సర శ్రేణినందాంబర
విశ్వసంఖ్యగమాఘ విమలచారు
హరివాసరంబున నబ్జవారంబునఁ
దనరారు మృగశిర తారకమున
పెనుగొండ శాసన ఘనుఁడని సెట్టి సు
పుత్రుండు హరితుల గోత్రజలధి
పూర్ణచంద్రుఁడు ధర్మబుద్ధిని నెంతెయుఁ
గొమరారుచుం బాలకొలనినాగి
సెట్టి దాక్షారామ శివు భీమలింగంబు
నగ్రంబునంద సొంపారుచుండఁ
గాంస్యపు బురుష మృగము కరమునఁ బాత్రి
క నఖండ దీపంబుఁ దనర నిలిపి
తతి ఘృతమునకు గోపసంతతిని భక్తి
కలిమిఁ బెట్టించె నేంబది కదుపుఁ జేసి
యా సుధాకర తారకంబై యఖండ
దీపమే ప్రొద్దు మిక్కిలి తెలివివెలుఁగ.
పోతన మంత్రి కావ్యం—లిఖితం పెద్దనాచార్య.

ఈ శాసనము ముద్రితమైన దాక్షారామ శాసనములలో లేదు. ఇది యటు శాసనసంపుటములనుండి గ్రహింపబడినది. (రెండవ సంపుటము పుట 186).

ఇందు పేర్కొనబడిన పోతన మంత్రియే పై పోతయకవి. 'పెగడపల్లి' యనునది, తూర్పుగోదావరీ మండలములో, చోడవరము, నూగూరు, పోలవరము తాలూకాలలో గలదు. ఇందేది యైన కవినివాసము కావచ్చును. కవికాలము శాసనమువలన నే స్పష్టము. (నంద. 9. అంబరం. విశ్వసంఖ్య. 13. అంకానాం వామతో గతిః అను న్యాయమున 1309—శా. శ. 1387. (క్రీ. శ.)

8. విశ్వేశ్వర శతకము—విశ్వేశ్వర కవి. క్రీ. శ 1400 ప్రాంతము.

"లీలాలాలిత సంపదల్ పయి పయిన్ లేకున్న లేకుండ నీ
గ్రాలుం గన్నుల కామినుల్ వరిగతిం గాకున్న గాకుండ నీ
జాలిం బొందఁగ నేల సెల్ల రుచులన్ జాలించి నిన్నాత్మలో
నాలోకించు తలంపు నా కొసగు నిత్యానంద విశ్వేశ్వరా!"

ఈ మకుటము 'లీలానంద సర్వేశ్వరా' యను మకుటమును స్మరణకుఁ దెచ్చుచున్నది—విశ్వేశ్వరచ్ఛందమును పేర నొక

ఛందోలక్షణము, లక్షణ గ్రంథములలో గలదు. అందుండి పద్యము లుదాహృతములైనవి. అది లక్షణసారమను పేరుగలది - విశ్వేశ్వర చ్ఛందమును రచించిన విశ్వేశ్వరుడను కవియే పై శతకమును రచియించి యుండునని యూహింతును - మఱియు సర్వజ్ఞసింగ భూపాల సన్మానితుఁడును, చమత్కార చంద్రికా కారుఁడును తెలుగు కవియగు పశుపతి నాగనాథుని గురువును నగు విశ్వేశ్వర కవి యను ప్రసిద్ధ సంస్కృతాలంకారికుఁ డీ వఱకే విద్వల్లోకము నకుఁ బరిచితుఁడు. ఆతడును తెలుగున కవియై యుండుట యసంభావ్యము కాదు. ఆ విశ్వేశ్వర కవియే యీతఁడగుచో నీతడు పై కాలమువాడు కాదగును.

4. కొట్టియ శంకరేశ్వర శతకము-కస్తూరి భట్టరాజు. క్రీ. శ. 1500 ప్రాంతము.

"పేర్చిన భక్తి సొమ్ముల నపేత కళంకుఁడు కొటకోటఁ డ
భ్యర్చనసేయ వానికడఁ బాపితి నన్ను...కండవా
నేర్చిన మేలుఁ గీడరయ నేరని వేల్పులనెల్లఁ బట్టి ప
ల్లార్చునె వాఁడు దుర్భవగజాంకుశ కొట్టియ శంకరేశ్వరా!"

కొట్టియ యనునది 'కొట్టియదొన' లేక 'కొట్యదొన' అను దాని సంగ్రహరూపము - ఇచ్చట శంకరేశ లింగము ప్రసిద్ధమైనదే. ఇదియే నేడు 'కొణిదెన' అని వ్యవహారములో నున్నది. గుంటూరి మండలమున నరసారావుపేట తాలూకాలో నున్నది. ఇచ్చటనే మహా ప్రసిద్ధుడగు కొమ్మన మంత్రి విష్ణుప్రతిష్ఠ చేసెనని కేయూర బాహుచరిత్రమున (1-26) నిట్లు చెప్పబడినది. "త్రిపురాంతకమున జేర్చిన కొట్యదొన బొగ్గరమున కళింగరాష్ట్రంబులోని, నెలమంచిలాదిగా నెలమి ముప్పదిరెండు విష్ణుప్రతిష్ఠలు వెలయజేసి" ముద్రితపాఠమిట్లున్నను వ్రాతప్రతిలో

'త్రిపురాంతకమున కొద్దియదొన (నుం) బొగ్గ
రమున గళింగరాష్ట్రంబులోని'

అని 'కొద్దియదొన' అను రూపమే కలదు. కొట్టియదొన కొత్తియదొన, దొద్దియదొన, కొణిదెన అని క్రమముగా మాఱి యుండవచ్చును.

ఈ శతకము వీరశైవ సంప్రదాయికము. ఇందుండి వేఱొక పద్యమును క్రీ. శ. 1912 లో శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు త్రిపురాంతకోదాహరణలఘుటీకలో నిచ్చియున్నారు. ఆపద్యమిది.

"గుండయ యుత్తమోత్తముని గూటికి కప్పెరయైకడంగి యొం
డొండుగ నాటి యంగడికి నూరక తెచ్చితి వంత య త్తటిన్
నిండినవారిలోన నతనిం గడు బిన్నతనంబు జేర్చితే
మండుము నీదు పెద్దతనమా యిది కొట్టియశంకరేశ్వరా."

నేనుమాపిన పై పద్యము యాదవామాత్యఛందస్సునకు వెను వెంటనే చివరిపత్రమున వ్రాయబడి యున్నది. ఈ కవి 'గౌరీ కల్యాణము' అను వేఱొక ప్రబంధము రచించెనట శ్రీ రామకృష్ణ కవిగారందుండి యీ క్రింది పద్యము నుదాహరించి యున్నారు.

"లలితసరోజ సౌరభములం గలయం జనిచూచి యెందు మె
చ్చోలయమి నా పురాంగనల యొప్పిదు వక్త్రసరోజగంధముల్
పలుమరుగ్గోల సౌధములపై కవివర్గములేఁగుదాన సం
కలిత గజేంద్రగండ ఫలకంబుల కుప్పయనంబు సేయుచున్.

(కుమారసంభవము - ప్రథమభాగము - అనుబంధము పుట 9. ముద్రణము 1909)

5. మరున్నందన శతకము. చిత్రకవి పెద్దన. క్రీ. శ. 1550.

అప్పకవీయమున తృతీయాశ్వాసమున లుప్తవిసర్గ స్వరవళుల క్రింద యీ క్రింది పద్య మీయబడినది.

మరున్నందన శతకమునందు

"కోపాటోపము కుప్పిగంతులు నిజా కుంభీభవ చ్ఛౌర్య రే
ఖా పాండిత్యమయారె నీకును నమస్కారంబు లంకాపురీ
పాపగ్రంథి కులాంగనా కుచతటీ పైశాపటగ్రావహా బా
హాపాటచ్చర రామదాస తవదాసోహమ్మరున్నందనా!"

ఈ శతకము నుండియే వేఱొక పద్యమును కాచిరాజు బసవన తన ప్రయోగసారములో నిచ్చియున్నాడు.

స్వగయతి లక్ష్యము. హనుమచ్ఛతకము.

"నీ బంటెవ్వఁడు వానిబంటను సుమీ నిర్నిద్రశౌర్యాదిక
ప్రాబల్యోజ్జ్వల కింకరీ కరణ సౌభాగ్య......
శాబాసక్షకుమార సంహరణ ముష్టాముష్టి సంగ్రామ బా
హాపాటచ్చర రామదాస తవదా సోమ్మరునందనా.

(పై పద్యమును 'ముష్టాముష్టి' శబ్దమునకు నిర్ధారకముగా 'నా భాషాపరిశోధన ప్రయోగ విశేషములు' అను గ్రంథమున నుదాహరించితిని).

చిత్రకవి పెద్దన హనుమద్భక్తుఁడు. అప్పకవి చిత్రకవి పెద్దన గ్రంథమును పేర్కొని లక్ష్యముల నుదాహరించుటయే గాక యుదాహరణమున పూర్తిగా ననుసరించి యున్నాడు.

(ఆ విషయము నా యుదాహరణవాఙ్మయమునఁ జూడ నగును) హనుమచ్ఛతక మొకటి పెద్దన తాను రచించినట్లు లక్షణ సార సంగ్రహములో నిట్లు చెప్పియున్నాడు.

హనుమంతుఁడు కలలో కనపడి

"మున్నొక శతకము మా కుం
చిన్నపుడే సమర్పణంబు చేసితివి కనుకన్
సన్నుత లక్షణకృతి య
స్మన్నామాంకితము సేయుమా యిపుడనిపన్." (1-9)

ఈ శతకమే పై మరున్నందన శతకము. పెద్దన లక్షణసార సంగ్రహములో కృతిపతియగు హనుమంతునికి రామదాస శబ్దమును తెలుచు వాడియున్నాడు.

## చాటువులు

1. ఏలూరి శేషమంత్రి

అప్పకవీయము ద్వితీయాశ్వాసములో నీ క్రింది చాటు ధార యుదాహృతమైయున్నది.

శ్రీకార ప్రభావము—కృతిముఖ ప్రశస్తంబులు—తిత్తిత్ స్థాన ప్రయోగ నిషిద్ధాక్షరంబులు—

నేలూరి శేషమంత్రి యొకచోట కకారము నిలిపి శ్రీశైలముం దోచిన తుక్కరసును మూఁడు దినములకుం జావదిట్టిన చాటుధార.

"మునుపాక కేల రావణుఁడు మోదమునన్ రజతాద్రి యెత్తవం
తసె హరుఁ డప్పుడే తన పదంబునఁ ద్రొక్కి మడంబడం చేఁగా
వనమయ గారి తుక్క సచివాగ్రణి శ్రీగిరి గడ్డపాఱలన్
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొన నీకిపు డాతఁడోపునే."
(2-375)

ఈ తుక్కరసు క్రీ. శ. 1590 ప్రాంతమున నున్నవాడని యీ క్రింది శాసనమునుబట్టి తెలియుచున్నది.

"శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1512 అగునేంటి ప్రజోత్పత్తినామ సంవత్సర మాఖ బహుళ చతుర్దశిని భువనాధీశ్వరుడైన, అష్టాదశ పీఠాధివాసమైన, దక్షిణ కాశ్యాఖ్య ప్రసిద్ధమైన శ్రీశైల మహా పుణ్యస్థళమందు శ్రీ శ్రీ భ్రమరాంబా పూజాతత్పర జ్ఞానేశ్వర ప్రభృతులు మల్లికార్జున పూజాకరణి వీర మాహేశ్వరాదులు సకలలోకప్రసిద్ధ రామరాజు ప్రభృతులు, సకల దేశాధినాయకులు ఏభైయారు దేశముల రెడ్డి కరణాలకు నిరూపించిన అజ్ఞాపత్రము. యిక్కడ మహా పాపాత్ముండైన తుక్కరసు అనేవాడు వచ్చి యీ శ్రీశైల స్థలం గడ్డపాఱలతో త్రొవ్వి యిక్కడి పదార్థ రత్నములు తీసుకో వేటందుకు త్రొవ్వె గనుక అపుడు మృకండు సంతతివాడైన, భావనారుషి శ్రీ ప్రభావుడైన భూతాల మల్లెడ దేవాడు తన మంత్రసిద్ధికి యీ ప్రభావంచేతను ఆ తుక్కరసు అనేవాణ్ణి సంహరించి శ్రీ రుద్రుని భూమిని నిలిచి విజయధ్వజం బెత్తి శ్రీశైల స్థళం వుద్ధరించిరి గనుక యిందుకు యీ భూతాల మల్లెడ దేవానికి నిర్ధారంచేసి యిచ్చిన క్రమము. ఏభైయారు దేశములయందు ఉండబడినటువంటి గ్రామముల రా గ్రామమునకి పేటపూరికి అయిదు రూపాయలు పెద్దపల్లెకు రెండు రూపాయలు సన్నపల్లెకు రూపాయి సహాయజానాకు పదిరూపాయిల భత్యం. ఈ ప్రకారం నియమంచేసి వ్రాయించినాము గనుక మీ పుత్రపవుత్రపారంపరియ ఆచంద్రార్కస్థాయిగాను సహా నడిపించేది. యిందుకు తప్పితే కాశిలో గోబ్రాహ్మణుల వధియించినపాపాన పోదురూ. యిది తెలిసి నడిపించేది."

ఈ యాజ్ఞాపత్రశాసనమును కీర్తిశేషులు పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రులుగారు 'సారస్వత సర్వస్వము' అను మాస పత్రికయందు 1 సంపుటము, 11, 12 సంచికలు గల సంచికయందు ప్రకటించినారు. (పుట 23, 24) వారందు ప్రకటించినది. 'నా కర్నూలుమండల సంచారము' అనునది. వారు దీని నొక సాలెవాని వద్దనుండగా చూచితిమనియు, నది రాగిరేకుపై నున్నదనియు దానినుండియే తాము కాపీవ్రాసి ప్రకటించితిమనియు నది కల్పితమై యుండవచ్చుననియు సందేహ్రాసియున్నారు. అజ్ఞాపత్రము ప్రాతదానికి కల్పితము కావచ్చును, అందలి విషయములుమాత్రము మనకు మఱియొకవిధముగా తెలియుచుండుటచేత నిది యాధారముగా గొనవచ్చును. మఱియు పై పద్య ముదాహరించిన యప్పకవి క్రీ. శ. 1656 ప్రాంతమువాడు. అత డుదాహరించిన కవి యంతకు ముందువాడు కావలెనుగదా, పై దానిమూలమున క్రీ. శ. 1590 ప్రాంతమున నేలూరి శేషమంత్రి యున్నట్లు స్పష్టమగుచున్నది. ముప్పదేండ్లక్రింద ప్రకటితమైన యీ విషయము చారిత్రక పరిశోధకుల కుపయుక్తమగునని ప్రకటించితిని. వేఱొక యాధారము దొరకునంతకును శేషమంత్రి యీకాలమువాడని నిశ్చయింపవచ్చును.

1. ఈ పత్రిక, బ్రహ్మశ్రీ వేలూరిపాటి రామభద్ర చయనులు గారిచే ప్రకటితమై తణుకునుండి వెలువడుచుండెడిది. ఈ ప్రశస్త పత్రిక 1923, 1924 లో పదమూడు సంచికలను వెలువరించినది. వీనిలో భారతము లక్ష్మీపతి సోమయాజి సభాపర్వటీక, ఆచంట సాంఖ్యాయన శర్మగారి, ఆంధ్రసాహిత్య పరిషదన్యత్రోప న్యాసము (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రకటితముకాలేదు) పాల్కురికి సోమనాథుని కాలనిర్ణయము మున్నగు నపూర్వ వ్యాసములు గలవు.



# ఋతువుల రాణి

శ్రీ సి. నారాయణరెడ్డి

బృందగీతి :

మధుమాసం మధుమాసం
మృదుసుమాల పెదవులపై
నిదుర లేచు దరహాసం
మధుమాసం మధుమాసం
శిశిరనగ్న లతావళికి
ఘుసృణాంబర విన్యాసం
చివికిన రసహృదయాలకు
నవయౌవన సందేశం
మధుమాసం మధుమాసం
యుగయుగాలు తీరినా
జగతి యెంత మారినా
సర్వఋతువులల్లో వా
సంత కాలమె విశేషం
మధుమాసం మధుమాసం

మాధవుడు :

ఓహోహో! ఓహోహో!
సుందర వాసంత రాణి
శోభల నభివర్ణించే
బృందగీతి నాలో మక
రందరసము నందించెను.
ఓ వసంతభామినీ !
ఓ విలాసగామినీ !
రావే నా నీలనిశా
జీవిత సౌదామినీ !
ఓహోహో! ఓహోహో!

బృందగీతి :

మధుమాసం మధుమాసం

మాధవుడు :

ఇమ్మను రాగమ్ముల విర
జిమ్మ వేల తుమ్మెదలు ?
పంచదారగొంతుల పలి
కించవేల కోకిలలు ?
మావిమోవి క్రొందేనియ
మాట మీటదేలా ?
ఏది నా వసంతరాణి
ఇంతవరకు రాదేలా ?

* * *

ఋతువులరాణి :

ఆకుపచ్చ్నియ జిలుగు
కోకనవరించి,
కొప్పులో మందార
కుసుమాలు ముడిచి,
పండుమోదుగుపూల
దండలల్లేవరకు
ఇంత వేళాయె ప్రియు
డెంతగా వేచెనో
ఎదురుతెన్నులు జూచి
ఎంతగా వగచెనో
ఓ నా ప్రియసఖా !
ఓ చైత్రరథికా !
నీ కనుల వర్తింప
నీ ప్రాణాల నర్తింప
నీలో ప్రణయ కింకి
ణీ నాదములు నింప
కానలను కోనలను
గడచి వస్తున్నాను
కరిపోని తారుణ్య
భరము మోస్తున్నాను
ఓ నా ప్రియసఖా !
ఓ చైత్ర రథికా !

శిశిరుడు:
(గబగబ ప్రవేశించి)
కొలనులోని అం
చలా
మొయిలులోని మిం
చులా
అయారె! ఓయార
మవర్ణనీయం
వసంతలతాంగి
వరాలప్రాయం
(ఋతురాణి కెదురుగా నిలుస్తాడు)

ఋతువులరాణి:
ఆకురాలిన వృక్ష
మటులున్న తనువుతో
ఊడలవిధాన పా
రాడేటి జడలతో
ఎవరవయ్యా నీవు
ఎదురుగా నిలిచేవు
చేదు చూపులతో కొ
గాదిగా చూచేవు

శిశిరుడు:
ఎవరని నను ప్రశ్నించేవా ?
ఎన్నడు శిశిరుని కనలేదా ?
ఇన్నాళ్లుగ హేమంత వయస్విని
కన్నులెదుట నర్తించి
వలిపమ్ములు దిగలాగి ఋతుకాం
తలను నగ్నమొనరించి
నీయధరాంచల పీయూషముకై
నిలిచానో కలవాణీ !
నీ నులివెచ్చని కౌగిలిలో బం
ధీ నౌదును అలివేణీ !

ఋతువులరాణి:
అన్నన్నా ! ఎంతమాట
లాడినావు శిశిరా !
వినలేకున్నాను నీవు
విషవాక్కులు వినర
మాధవుడే నాజీవిత
మార్గాంతర సహగామి
ఋతురాజే నాయెదలో
అతికిన భాగస్వామి
అన్యుల కీ ప్రేమ పాత్ర
అందించగలేను
తొలగి పొమ్ము నిమిషమ్మిట
నిలువజాలలేను

శిశిరుడు:
(వికటంగా నవ్వి)
జడిసెదేలబేలా ! వా
ల్జడ పువ్వులు జారె
కోపంతో నీవదనం
గులాబీగ మారె
దాటలేవు నాఘన హ
స్తాల పంజరాల
ఈ నిశిథి నాతో నే
ఊగుము సుఖడోల

ఋతువులరాణి:
(నిస్సహాయస్థితిలో)
ఓ సమీరణా! నీవై
నా సహాయపడవయ్యా!
ఋతురాజుకు నావిషాద
గతిని చెప్పి రావయ్యా!
(గాలివీస్తుంది)

మాధవుడు:
(దూరంనుంచి)
ఓ వసంతభామినీ!
ఓ దిగంతకామినీ!
ఎందున్నావే మరాళ
మందమంద గామినీ!

ఋతువులరాణి:
శిశిరహస్తాలలో
చిక్కుపడి యున్నాను
అసహాయురాలనై
అలమటిస్తున్నాను
గడియలో బ్రతుకు పం
కమ్ములో దిగునయ్యా
తడవు సేయక వచ్చి
విడిపించి పోవయ్యా

మాధవుడు :

నీకొరకు పత్రాల
పై కదలి వస్తాను
శిరరవాస్త్రాలు ఛే
దించి విడిపిస్తాను

(సమీపిస్తాడు)

ఇదె రానె వచ్చాను
బెదురేల ప్రేయసీ!
అనలవృష్టికి శిశిరు
డవుతాడు నుసినుసి
శిశిరుడా! నీయాట
చెల్ల బోదిక పైన
అగ్ని బాణాలు సం
ధించాను హాస్త్రావ

(శిశిరుడు పారిపోతుంటాడు)

ఋతువులరాణి :

మాధవా! శిశిరుండి
దేదూరమయ్యాడు
భయసంభ్రమాలతో
పారిపోతున్నాడు
వెన్ను జూపిన వాని
వెంటాడబోకండి!
అగ్ని బాణాల సుమ
హాసమందించండి

మాధవుడు :

(ఋతురాణిని సమీపిస్తూ)

ప్రతిపదాన రసవీణల
పలికించే మధుబాలా!
ప్రతిదృగంచలాన వలపు
ప్రసరించే జవరాలా!
పూలచేల మొకసారిగ
కేలనంటుదును రావే
నీలికళ్లలోని రహ
స్యాలు చూచెదను రావే

ఋతువులరాణి :

(మాధవుని కౌగిలిస్తూ)

నీతో చిరకాలము రా
ణింతు ననలతేజా!
నీయెదలో నా యెద నం
దింతును ఋతురాజా!

మాధవుడు :

ఓ వసంతభామినీ!
ఓ విలాసగామినీ!
నీవేనా! నీలనిశా
జీవిత సౌదామినీ!

బృందగీతి :

మధుమాసం మధుమాసం
యుగయుగాలు తీరినా
జగతి యెంత మారినా
సర్వఋతువులల్లో వా
సంతకాలమె విశేషం
మధుమాసం!
మధుమాసం!



# శ్రేయోరాజ్యము: ప్రాతిపదిక - లక్ష్యము

శ్రీ బారు గోవిందరావు

శ్రేయోరాజ్యార్థిక సూత్రాలకు, పోటాపోటీ వ్యవస్థలో నడిచే ఆర్థిక సూత్రాలకు, లక్ష్యాలలో నేగాక—లక్ష్యసాధనలో కూడా చాలా తేడా కనిపిస్తున్నది.

భారతదేశమువంటి ప్రజాస్వామిక రాజ్యాల్లో ఈ శ్రేయోరాజ్య సిద్ధాంతాలు, సూత్రాలు సమన్వయంచెయ్యడ మెలాగా అన్నది ఒక ముఖ్య సమస్య. అర్థ శాస్త్రవేత్తలు, మానవశ్రేయస్సు నిర్వచించి,సాంఘికార్థిక ప్రణాళికలు తయారుచేసే సందర్భంలో-వస్తూత్పత్తి ప్రణాళికలు వాటి అభివృద్ధులేకాక—వాటితోబాటు రాజకీయార్థిక సాహిత్య మూల్యాలుకూడా, లెఖ్ఖలోకి వస్తాయి. ఆర్థికవేత్తలు భూతవర్తమానార్థిక సమస్యలనుగురించి వ్యాఖ్యానించడమేకాక, భవిష్యదార్థిక విధానాలు, ప్రణాళికలు కూడా నిర్దేశించాలనీ, అది వారి విధి అనీ 19 శతాబ్ది చివరిభాగందాకా అందరు భావిస్తూండేవారు. ఉత్పత్తిచేసేవా రెంతెంత పెట్టుబడి పెట్టవలసి ఉంటుందో ముందుగానే నిర్ణయించుకోవాలి. అల్లాగే కొనుగోలుదారుకూడా తా నెంతెంత ఖర్చు చెయ్యవలిసిందీ మున్ముందుగానే నిశ్చయించుకుంటాడు. కొనుగోలుదారు తాను పెట్టే ఖర్చుతో సాధ్యమైనంత ఎక్కువగా లబ్ధి పొందాలని అంచనాలు వేస్తూంటాడు. అయితే ఈ లబ్ధి ఇంత అని అంచనాలు వెయ్యడం కష్టం. అల్లాగే ఉత్పత్తిచేసేవారుకూడా తమకు సాధ్యమైనంత ఎక్కువ రాబడి రావాలని చూస్తూంటారు. దీనికిన్నీ ఒక అంచనావేసి హద్దు నిర్ణయించడం కష్టమే. అయితే సాంఘికశాస్త్రం న్యాయప్రకారం ఎవరి కెంతెంత సాంఘికశ్రేయస్సు సంక్రమించాలో సరిసమానంగా నిర్ణయిస్తూంటుంది. శ్రేయోరాజ్య సంబంధమైన ఆర్థిక సూత్రాలన్నీ ఆర్థికశాస్త్ర సూత్రాలలో అంతర్గర్భితమైనవే. కనుకనే ఆర్థిక సూత్రాలద్వారా సాంఘిక శ్రేయస్సు పెంపొందించే లక్ష్యసాధనంకోసం ప్రయత్నించవలసిన ఆవశ్యకత ఏర్పడుతున్నది. ఈ సందర్భంలోనే వస్తూత్పత్తి లక్ష్యాలకూ, సాంఘిక శ్రేయస్సుకూ వైరుద్ధ్యం ఏర్పడుతున్నది. ఈ వైరుద్ధ్యంలో సాంఘికశ్రేయస్సే ప్రధానమైనది. వస్తూత్పత్తి కేవలం దానికొక ఉపాంగం మాత్రమే.

సుప్రసిద్ధార్థశాస్త్రవేత్త కీన్సు సర్వులకు పనికల్పించడం ద్వారా సంఘార్థికజీవితం సముజ్జ్వలమై భాసించగలదని సిద్ధాంతీకరించాడు. కారల్ మార్క్సు ఇది కేంద్ర నియంత్రితాధికారం ద్వారా సుసాధ్యం కాగలదని అన్నాడు. ఈవిధంగా నియమితార్థిక వ్యవస్థ ద్వారా సంఘంలో అన్ని దృక్పథాలకు, అనుకూలమైన వస్తూత్పత్తి పరిమితి (*Aggregate optimum*) నిర్ణయించుకో వచ్చుననే అభిప్రాయం ఒకటి స్థిరపడింది.

దోపిడీ పద్ధతి, గుత్తదారీ విధానము, దుబారా మొదలైనవి లేకుండా,అందరికీ పని కల్పిస్తూ—దారిద్ర్యము, సంఘంలో ఉండే తారతమ్యాలు తొలగించి, సంఘ సంపత్తి అంతా సరియైనదారిలో వినియోగించడానికే నియమితార్థిక విధానమనే నామధేయం ఏర్పడింది. సంఘశ్రేయస్సే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న ఆర్థిక వ్యవస్థలో ఒక ప్రాంతంలో నివసిస్తున్న జనాభాకు తగినంత వస్తూత్పత్తి జరుగుతూండాలి. కనకనే సాంఘికశ్రేయస్సంపాదనకోసం ధనసంపత్తి అంతా తిరిగి విభజించాలనే విషయంలో క్రమంగా దృఢవిశ్వాసం ఏర్పడుతున్నది. అయితే ధనస్వామివర్గానికి తగినంత ప్రతిఫలం ఇవ్వాలనే దృష్టితో యీ ధనసంపత్తి పునర్విభజన జరిగితే మొదటికే మోసం వస్తుంది. సాంఘిక శ్రేయో లక్ష్యాల సాధనలో సంపత్తి యావత్తూ పునర్విభజన చేసేముందు, సాంఘిక నైతికార్థిక సమస్యలన్నీ చక్కగా మన దృక్పథంలో ఉంచుకోవాలి. సంపత్తి పునర్విభజన అనేసరికి ప్రభుత్వానికి విస్తృతాధికారాలు సంక్రమిస్తాయి. అల్లాగే వ్యక్తుల స్వాతంత్ర్యం కూడా చాలావరకు సంకుచితమైపోతుంది. "కళలు, సంస్కృతి మొదలైనవి పెంపొందాలంటే ఒక సుసంఘటితమైన సాంఘిక వ్యవస్థలో వ్యక్తి స్వాతంత్ర్యము ఎంతవరకు తగ్గించవచ్చును?" అనేది ఇంకా వాదోపవాదాలు నిర్ణయించలేని ఒక సమస్యగానే నిలిచిపోయింది. సంపత్తి పునర్విభజన జరగాలని వాదించేవారు ఆదాయం అనేది కొనుగోలుదారుల సంతృప్తికోసమే అని ఒత్తి చెబుతున్నారు. ఈవాదం ప్రతిఘటించేవారు, ఆదాయం అనేది వస్తూత్పత్తికోసం వినియోగించిన శ్రమకు ప్రతిఫలంగా మాత్రమే ఉండాలని అంటున్నారు. అయితే ఒక విషయం ఈ సందర్భంలో ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి. ఆదాయాలన్నీ వట్టి బల్లపరుపుగా ఒకే స్థాయిలో ఉంచడంవల్ల ఉత్తమస్థాయికి చెందిన కొన్ని వృత్తులవారిలో కార్యోత్సాహం తగ్గిపోయి చేసేపనిలో పనివాడితనం తగ్గిపోతున్నది. సోవియట్ రష్యాలో ఆదాయాల సమత్వం కొద్దికాలంపాటే అమలులో ఉన్నది. ఆ తరవాత దీనివల్ల పని జరగకపోవడంవల్ల ఇది ఎత్తివేసి మళ్ళీ వెనకటి పంథాలో వచ్చారు. ఇండియావంటి వెనకబడిన దేశంలో ఉత్పత్తిశక్తులు

అత్యున్నతస్థాయిలో నిలబెట్టేటట్టు చెయ్యాలంటే - ప్రోత్సాహం కోసమని ఆదాయంలో హెచ్చుతగ్గులు తప్పనిసరిగా ఉంచాలి.

ఇంగ్లండులో ట్యూడరురాజులు పరిపాలించే కాలంలో ప్రభుత్వమే ఆర్థికవ్యవస్థ సరియైనదారిలో నడిపిస్తూండేది. ఆ విధంగా ఇతర దేశాలనించి బంగారం రాబట్టడానికీ తద్ద్వారా జాతీయైశ్వర్యం వృద్ధిపొందించడానికీ వీలు కలిగేది. పద్దెనిమిదవ శతాబ్దంలో రాజకీయ శాస్త్రవేత్తలు ప్రపంచంలో నియతమైన ప్రకృతిసూత్రాలున్నట్లే సంఘంలో ప్రజకుకూడా సహజమైన స్వత్వాలున్నాయని భావించేవారు. ఉదాహరణకు ఫిజియోక్రాట్స్ అనే ఒక తెగఆర్థిక సిద్ధాంతవేత్తలు, ఆర్థికరంగంలో ప్రకృతి సిద్ధమైన ఒక వ్యవస్థ ఉన్నదని సిద్ధాంతీకరించారు. నేటి ఆర్థిక శాస్త్రానికి పితామహుడైన ఆడమ్‌స్మిత్ ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థపై పెత్తనం వహించవలసిన అవసరం లేదనీ, పోటాపోటీల వల్ల ఆర్థిక సమత్వం (*Equilibrium*) ఏర్పడుతున్నదనీ, తద్ద్వారా ప్రజకు సంతృప్తికరమైన వ్యవస్థ ఉద్భవించగలదనీ ప్రతిపాదించాడు. అయితే ఆ తరవాత బయలుదేరిన అర్థశాస్త్రవేత్తలందరు సంఘంలో ఆదాయాల వ్యత్యాసాలుండడం వల్ల, పోటాపోటీలవల్ల ఇలాంటి సాంఘిక సమత్వం కలగదనే నిశ్చయానికి వచ్చివేశారు. కనుకనే వీరు అర్థశాస్త్రం కేవలం శాస్త్రీయ దృక్పథంతో కాక, మానవ దృక్పథంతో పరిశీలించడం ప్రారంభించారు. అసలు ఆర్థిక వ్యవస్థలోనే సహజంగా పోటీలు, వైరుధ్యాలు ఉన్నాయి. అలాగే ఆర్థికవ్యవస్థలో వచ్చే ప్రతిమార్పు ఎవరో కొందరికి అనుకూలంగాను, మరికొందరికి ప్రతికూలంగాను ఉండడం సహజం. ఔపయోగిక సిద్ధాంతివాదులైన తత్త్వజ్ఞులు కొందరు, ప్రభుత్వాలు సమాజంలో అత్యధిక సంఖ్యాకుల శ్రేయస్సు, సుఖము లక్ష్యంగా ఉంచుకుని తమ విధానాలు నడిపించాలని అన్నారు. ప్రభుత్వాలీనాడు వస్తువినియమంలోను, సంపత్తి విభాగంలోను మార్పులు తీసుకురావడం కోసం కొన్ని వినూతన శ్రేయోవ్యవస్థావిధానాలాచరణలోకి తీసుకువస్తున్నాయి. అయితే శ్రేయోవిధానాభివృద్ధిని గురించి ఆలోచించేటప్పుడు సమానత్వము, పని బాగా జరగడము అనేవి రెండు మనస్సులో ఉంచుకోవాలి. డాక్టరు ఆల్‌ఫ్రెడ్ మార్షల్ అనే అర్థశాస్త్రవేత్త ఒక దృష్టితో చూస్తే అర్థశాస్త్రం సంపత్తిని గురించిన శాస్త్రమని అనవచ్చునుగాని, అంతకంటె ముఖ్యమైన దృష్టితో పరిశీలిస్తే అది మానవునికి సంబంధించిన శాస్త్రమే అన్నాడు. ప్రొఫెసరు పిగూ తన "ఎకనమిక్స్ ఆఫ్ వెల్ఫేర్" అనే గ్రంథంలో సంపత్తి విషయం ఆలోచించేటప్పుడు సాంఘిక దృక్పథం చాలా అవసరమనీ, సంఘం కష్టనష్టాలుకూడా ముఖ్యంగా గుర్తుంచుకోవాలనీ అన్నాడు. సంఘంలో ఉండే వ్యక్తుల సంతృప్తి సమాహారమే సంఘ శ్రేయస్సనీ, వ్యక్తిసంతృప్తిసమాహారమే (*Sum total*) వ్యక్తి శ్రేయస్సనీ అతని అభిప్రాయము. కనకనే, ఆర్థిక శ్రేయస్సే సంపూర్ణ సమాజ శ్రేయస్సన్నమాట. అంటే ఈ శ్రేయస్సు ప్రత్యక్షంగా ధనంతో కొలవవచ్చునని తేలిపోయింది. అందుచేత, సాంఘిక శ్రేయస్సంటే చాలా విస్తృతమైన అర్థం కల పదమని తేలింది. వస్తూత్పత్తికి సంబంధించిన ఆర్థిక శ్రేయోవిధానం సంఘంలో వస్తూత్పత్తి ఎంతవరకు పెరగడానికి వీలుంటుందో నిర్ణయిస్తుంది. అలాగే వస్తువుల పంపిణీకి సంబంధించిన ఆర్థిక శ్రేయోవిధానం ఆయా వస్తువులకు సంఘంలో ఎలాగ పంపిణీ జరగాలో నిర్ణయిస్తుంది. ప్రత్యేక పరిమితిగల ఒక సంఘానికి సంబంధించిన ఆర్థిక శ్రేయః పరిమితి - బహుశః జాతీయాదాయం అభివృద్ధిచెందినకొద్దీ దానికంటె ఎక్కువే కావచ్చును. అలాగే బీదజనానికి సంబంధించిన జాతీయాదాయభాగంకూడా అభివృద్ధి కావచ్చును. ధనవంతుల ఆదాయంలోనించి వచ్చిన ధనం బీదవారికి పంపిణీచేసేటప్పుడది వారి అవసరాలింకా ఎక్కువగా తీర్చగలిగినదై ఉండాలి. వ్యక్తుల అవసరాలన్నీ సాంఘికాభివృద్ధికి అనుకూలంగా సమన్వయపరచడమే ఇక్కడ ప్రధాన సమస్య. సాంఘిక శ్రేయస్సు హెచ్చుతగ్గులు లేకుండా విభజించడానికి వీలైనంతవరకు ఆర్థికంగా ఏ మార్పైనా చెయ్యవచ్చును. భారతదేశంలో జమీందారీరద్దు విధానం ఇక్కడ ఉదాహరణగా తీసుకుందాము. దీనివల్ల సాంఘిక శ్రేయస్సింతకుపూర్వం కంటె ఉత్తమమార్గంలో విభజించడం జరిగింది. ఈ సందర్భంలో జమీందారులకు కొంత నష్టం వచ్చిఉండవచ్చును. అయితే వీరికి నష్టపరిహారం ఇవ్వడంతో ఇంతకు పూర్వంనించీ ఉన్న అధ్వాన్నస్థితి తొలగిపోయింది. ఈనూతన విధానంవల్ల పూర్వంకంటె ఎక్కువగానే మేలు కలిగింది. నైతికశాస్త్రంగాని ఆర్థిక శ్రేయోవిధానంగాని ఒకదానినించి ఒకదానిని విడదీయడానికి వీలులేనివి. ఆర్థికవిధానం సరియైన దారిలో నడిపించాలంటే ఆర్థిక శ్రేయోవిధానం జాగ్రత్తగా పరిశీలించి తగిన దారు లేర్పరుచుకోవాలి.

డబ్బే దైవమని నమ్మి వ్యవహరించేసంఘంలో సామ్యవాదం ఒక విప్లవంలా బయలుదేరుతున్నది. సామ్యవాద సామాజిక వ్యవస్థలో ప్రభుత్వమే క్రింది తరగతులవారికి పనీ, దానికి ఫలితము కల్పిస్తూంటుంది. ప్రజాస్వామిక వ్యవస్థలో సర్వులకు సమానమైన రాజకీయ స్వత్వాలున్నాయి. అందుచేత పేదవారికి ఉచితంగా నిత్యావసరాలు కల్పించడం కోసం కలవారిమీద పన్నుల భారం పడవెయ్యడం న్యాయంగా కనిపించకపోవచ్చును. నిజానికి సాంఘిక భద్రతకోసమై అయ్యే ఖర్చులో పేదవారి నెత్తిమీదనే ఎక్కువ బరువు పడుతున్నది. పైకిది విరుద్ధంగా కనిపించవచ్చును గాని యథార్థస్థితి ఇదే. అత్యంత నియంత్రితమైన ఆర్థిక విధానంలోకంటె, కొంచెం మంచిచెడ్డలు పరిగణించే ధనస్వామ్య విధానంలోని ప్రజాస్వామికం ద్వారానే ఎక్కువ మేలు కలుగుతున్నది.

పెట్టుబడిదారీ విధానం ప్రాతిపదికగాగల ప్రజాస్వామ్యంలో సాంఘిక శ్రేయస్సు ప్రభుత్వంద్వారాను, ఉదారులు చేసే దానధర్మాలవల్లను జరుగుతూంటుంది. మరి సామ్యవాద రాజ్యంలో ప్రభుత్వమే ఈ ఖర్చులన్నీ భరించి సాంఘికోపయోగ కార్యాలన్నీ అమలు జరుపుతూంటుంది.

శ్రేయోరాజ్యం పౌరులందరికీ అత్యధికమైన జీవనపరిమాణం కల్పించడంకోసం నిరంతరంగా పరిశ్రమిస్తూ [illegible]

బాట్లు, సమాజార్థిక వ్యవస్థ శక్తిసామర్థ్యాలతో పనిచేసేటట్లు చూసుకుంటూ, వ్యక్తుల స్వాతంత్ర్యానికి కూడా లోటురాకుండా సంరక్షించుకోవాలి.

ప్రస్తుతం మనదేశంలో ప్రణాళికలద్వారా (*Planning*) సాంఘికార్థిక వ్యవస్థ పునర్నిర్మించే ప్రయత్నం జరుగుతున్నది. భారత దేశ రాజ్యాంగంలోని ఆ దేశసూత్రాలలో మన రాజ్యాంగ విధానం నిర్దిష్టమై ఉన్నది. ఇది ఆ సూత్రాలలో 36 మొదలు 51 వరకు గల పేరాలలో సుస్పష్టంగా భాసిస్తున్నది. ఈ ఆ దేశసూత్రాల కనుగుణంగా భారత ప్రభుత్వం, ప్రజల జీవన ప్రమాణము, పుష్టికరాహార సమృద్ధి, జీవనోపాధులు, తగినన్ని పనిపాటలు, పనిపాటల విషయంలో హక్కులు, వార్థక్యంలో ఉపకార వేతనాలు, మొదలైనవి ఇతోధికంగా పెంపొందించవలె నని ప్రయత్నిస్తున్నది. ఇవన్నీ సమృద్ధిగా సమకూరాలంటే దేశంలో ఉన్న ధనధాన్య సంపత్తి, పారిశ్రామికపరికరాలు మొద లైనవన్నీ జనానికి అందుబాటులో ఉండేటట్లు తిరిగి యథోచితంగా పంపకం చెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. రాజ్యాంగచట్టంలోని ఆ దేశసూత్రాలీ విషయాలన్నీ స్పష్టంగా నిర్దేశిస్తున్నవి. ఈ విధమయిన ఆ దేశసూత్రాచరణంవల్ల ధనసాధన సంపత్తి అంతా ఎవరో కొందరు గుత్తదారుల చేతుల్లో కేంద్రీకరింప బడకుండా, అందరికీ అందుబాటులో ఉండగలదు. మరిన్నీ భారత ప్రభుత్వం పనివారి కందరికీ సుఖజీవితాని కనుకూలమైన ఉద్యోగాలు,విశ్రాంతి,సాంస్కృతిక సంపత్తీ కల్పించవలెనని కూడా ఉద్దేశిస్తున్నది. భారతరాజ్యాంగ చట్టంలోని ఆదేశసూత్రానుగుణంగా రచించిన ప్రణాళికలన్నీ సాంఘిక ధర్మము, సమత్వము, సర్వులకు తగిన సాంఘిక భద్రత మొదలైన ప్రాథమిక సూత్రాల మీద ఆధారపడి ఉన్నవి. భారతప్రభుత్వం తయారుచేసిన ప్రథమ పంచవర్ష ప్రణాళిక, యుద్ధాత్పూర్వం అమలులోఉన్న వస్తుసమృద్ధి అందరికీ అందించవలెనే లక్ష్యసాధనతోనే తయారుచేశారు. ఆ తర వాత క్రమంగా అమలులోపెట్టే ప్రణాళికలన్నీ ప్రజల జీవన ప్రమాణం పూర్వంకంటె ఇంకా ఎక్కువగా వృద్ధిపొందించేవిగా ఉండాలి. ఇది వ్యయం తగ్గించడంవల్లను, మూల ధన సేకరణం వల్లను మాత్రమే సాధ్యపడుతుంది. భారతదేశంలో శ్రేయోరాజ్యం ఆవిర్భవింప జెయ్యాలంటే అవలంబించ వలసిన దీర్ఘకాల ప్రణాళిక ఇదే. అలాకాక తాత్కాలికోప యోగకరమైన ప్రణాళికల దృష్ట్యా చూస్తే మున్ముందు ఉత్పత్తిలో వికేంద్రీకరణం ప్రారంభించి, కుటీర పరిశ్రమలద్వారా కార్మికులకు పని కల్పించి తద్వారా వస్తూత్పత్తి పెరిగేటట్లు చూడాలి. మన ప్రధానలక్ష్యం ముఖ్యంగా శ్రేయో రాజ్యస్థాపనమే కనక, ఇది మున్ముందు జరగ వలసిన పని. జీవన ప్రమాణాభివృద్ధి క్రమక్రమంగా అటుపిమ్మట సిద్ధిస్తుంది. పురోగామి దేశాలన్నీ అందరికీ పని కల్పించడం తమ లక్ష్యంగా పెట్టుకుని ప్రపంచంలో అగ్రతాంబూలం అందుకున్నాయి. అయితే భారత దేశంవంటి వెనకబడిన దేశాలలో తత్క్షణమే ఈ విధానం అవలంబించడానికి వీలులేదు. మన దేశంలో ప్రజాస్వామ్యం బ్రతికి బట్టకట్టాలంటే మున్ముందుగా ఐశ్వర్యంలోను, ఆదాయంలోను, ఉన్న పెద్ద పెద్ద

తారతమ్యాలన్నీ తొలగించాలి. దీనికోసం జమీందారీ విధానం రద్దుచేసి, రైతులకు అనుకూలంగా శిస్తులు తగ్గించాలి. ధన వంతుల వడ్డీవ్యాపార సరళి అరికటి, సహకార సంఘాలద్వారా సులభంగా అప్పులిచ్చే పద్ధతి అమలులో పెట్టాలి. అత్యధికంగా వచ్చే లాభాలమీద పన్నులు విధించాలి. నేటి ప్రభుత్వ ద్రవ్యవిధానాలు, మరణసుంకాలు, మొదలైనవాటిలో క్రమక్రమంగా శ్రేయోవిధానాని కనుకూలమైన మార్పులు కనిపిస్తున్నాయి. ఆదాయాల్లో ఈ తారతమ్యాలు తగ్గించడం కంటే ధనస్వామ్యంలో ఉన్న తారతమ్యాలు తగ్గించడమే నేడొక ప్రధాన సమస్యగా పరిణమించింది. ఏ ఆర్థికవిధానంలోనైనా వ్యక్తులకు, వర్గాలకు మధ్యనపంపకం జరిగేసాంఘిక శ్రేయస్సులో తారతమ్యాలు తప్పవు. అందుచేత సాంఘిక శ్రేయస్సును గురించిన ప్రణాళికలలోను, సలహాలలోను ముఖ్యంగా అందరికీ న్యాయము జరిగేటట్లు చూడడం చాలా ముఖ్యం. వ్యక్తుల ప్రత్యేక క్షేమమే సంఘానికి పరమాదర్శంగా ఉండాలి. మానవలక్ష్యము, కార్యాచరణము మొదలైన వాటినిగురించి చర్చించే అర్థశాస్త్రము, శ్రేయావిధానాలను గురించీ, ప్రత్యేక పరిస్థితులను గురించీ పరిశీలించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఏదైనా ఒక ప్రభుత్వము ఆర్థిక శ్రేయస్సే పరమలక్ష్యంగా ఏర్పరచుకొని పని చెయ్యవచ్చును. కాని అంతమాత్రం చాలునని అనుకోకూడదు. ప్రజలలోకూడా లక్ష్యశుద్ధి, సాంఘిక సహకారము, ఉత్సాహము, మానవ జీవితంపై గౌరవభావము ఏర్పడాలి. అలాంటి పరిస్థితులలోనే, సాంఘికార్థికాభివృద్ధి సులభసాధ్యమై సాంఘి శ్రేయస్సు పెంపొందగలదు.

---




Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
**No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.**

శ్రీరస్తు—శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ జయనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్య సిద్ధాన్తిన స్తృతీయపుత్రేణకృష్ణమూర్తిశాస్త్రిణాప్రణీతం

విఘ్నేశ విధిమార్తండచంద్రేంద్రోపేంద్రవందిత । నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణ స్పతే ॥
వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్యదిందుమయీం,
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥

## గమనిక

ఈ సంవత్సరమున రాజు సూర్యుడు. మంత్రి కుజుడు. ౨ కుంచములు. వర్షము సర్వసస్యసముదాయమగు ౧౬ వీసములలో ౮ వీసములు పంట ఫలించును.

జ్యేష్ఠ బ ౩౦ బుధవారమునగలుగు సూర్యగ్రహణము, చెన్నపురి విజయవాడ రాజమహేంద్రవరము, విశాఖపట్టణము మొదలగు సముద్ర ప్రాంత మండలి ఆగ్నేయ తూర్పు దేశములకును దక్షిణదేశములకును ఈ గ్రహణము సంభవింపదు. కర్నూలు వరంగల్లు సింగరేణి మొదలగు పశ్చిమ వాయవ్య దేశములకు గ్రస్తాస్తమగును. ఆషాఢ శు ౧౫ గు న గ్రస్తాస్తమయ



చంద్రగ్రహణము గలుగును. చైత్ర బ ౨ మం. నుండి సరస్వతీనదీ పుష్కర ప్రారంభమగును. మన్మథ సంవత్సరమున భాద్రపదమాస మధికమాసమగును.

### మౌఢ్యములు

జ్యేష్ఠ బ ౨ శు. ప్ర॥ ఆషాఢ శు ౧౩ మంగ. ప॥ గురుమౌఢ్యము. కార్తిక శు ౧౩ సో. ప్ర॥ కార్తిక బ ౯ శు. ప॥ శుక్రమౌఢ్యము.

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః | ౫౦౫౫ |
| శాలివాహనశకః | ౧౮౭౬ |
| ఫసలీసన్ | ౧౩౬౩-౪ |
| హిజరీసన్ | ౧౩౭౩-౪ |
| క్రీస్తుశం. | 1954-55 |

శ్రీః శ్రీః శ్రీః

## ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

## పంచాంగపద్ధతి ప్రశంస

పంచాంగ విషయములగు గ్రహసంచారాదులు పంచాంగములందు వ్రాసినప్రకారము ఆకాశమున గనుపింపవలయును. అట్లు గనుపించునట్లు చేయు గణితము దృగ్గణితము. పూర్వపుసిద్ధాంతములన్నియును ఆయా కాలములందు అట్లు కనుపించునట్లే చేయబడినవి. కాని కొంతకాలమునకు గ్రహగతులందు భేదముగలిగి ఆయా సిద్ధాంతములందున్న రీతిని చేయబడిన గ్రహములు సరిపడుట సంభవింపలేదు. అందులకై కొన్ని కొన్ని సంస్కారములు గల్పింపబడుచుండినవి. ప్రకృతము వైదేశికులచే నూతనయంత్ర సహాయముచే పరిశీలించి చేయబడిన పద్ధతులు దృగ్గణితములగుచున్నవి. కాని ఆ దృగ్గణితపద్ధతిలో నిరయన గ్రహసాధనమునకు మేషాది నిర్ణయమావశ్యకము. అది ప్రమాణైక వేద్యము. పలువిధములుగ మేషాది యుపలబ్ధమగునపుడు ప్రమాణ బలము, సమన్వయము, మొదలగు శాస్త్రీయమార్గముచే నిర్ణయింపవలెను. అట్లు నిర్ణయింప నిరయన మేషాది (అశ్విన్యాది) చిత్రాపక్షస్థితమని సిద్ధాంతీకరింపబడినది. మరియు జాతకాది ఫలవిషయములు దృగ్గణితపద్ధతిగ్రహసంచారము చేతనే రుజువగుచున్నవి. కాలభేదముచే ఋతుపరిణామము గలుగుచున్నది. అది సాయనపద్ధతిచే గ్రహింపదగినది. అట్టి ఋతుపరిణామమున్ను సూచింపబడినది. ఇందు అట్టిసాయన నిరయన మార్గములు రెండునుగలవు. పూర్వపద్ధతిచే సాధింపబడిన తిథి నక్షత్ర వర్జ్యములును పూర్వాచారాభిలాషులకై ఇందు వేరుగ చూపబడినవి.

తిథి నక్షత్రము వర్జ్యము మొదలగు ఆవశ్యక విషయములు గంటలలో చూపబడినవి. గంటలు పగలు 12 గంటలు దాటిన పిమ్మట 13, 14 మొదలగు సంఖ్యలచే 1, 2 గంటలకాలము చూపబడినది. గావున 12 కంటె నెక్కువ సంఖ్యగలిగిన గంటలలో 12 ను తీసివేయగా మిగిలిన గంటలు మధ్యాహ్నానంతర మనియు 12 కు తక్కువయగు గంటలు మధ్యాహ్నమునకు పూర్వమందనియు గ్రహింపవలెను. రాత్రి 12 గంటలకాలము 24 చే చూపబడును. రాత్రి 12 గంటలు దాటినప్పటినుండియు కాలమానము 1, 2 మొదలగు గంటలచేతనే చూపబడినది. కావున ఉదయగంటలకు తక్కువగ గంటలు నిమిషములు గలిగినచో రాత్రి 12 గంటలు దాటిన కాలమనియు ఉదయగంటలకు మించియున్నచో ఉదయానంతర కాలమనియు గ్రహింపవలయును. అరోజు సూర్యోదయమునుండి మరునాటి సూర్యోదయమువరకు నున్నచో (పూర్తి) అని వ్రాయబడుచున్నది.

పీఠికలో ముహూర్తముల పట్టికలో (2) ఈ నెంబరు మొదటగల ముహూర్తము కొంచెము దోషముతో గూడినది యని గ్రహింపవలయును. ధరలు, వర్షములు, దేశక్షేమాదికము మొదలగు విషయములు వర్తకులకు కర్షకులకు సామాన్య ప్రజలకు ఉపయోగించునట్లు విపులముగ వ్రాయబడినవి. ఇందుగల ప్రతివిషయమున్ను శాస్త్రప్రమాణ సిద్ధమగునదియే వ్రాయబడినది. ఉపయోగ విషయము లిందు చాలగలవు. శ్రీః శ్రీః శ్రీః

## దే శా ౦ త ర చ క్ర ము

| పట్టణములు | మేష తులా | వృష కన్యా | మిథున సింహ | కర్కాటక | వృశ్చిక మీన | ధనుః కుంభ | మకర |
|---|---|---|---|---|---|---|---|
| శృంగేరి | ౬౫ | ౮౩ | ౮౯ | ౭౧ | ౫౮ | ౫౧ | ౪౯ |
| మైసూరు | ౫౦ | ౬౦ | ౬౭ | ౮౨ | ౪౦ | ౩౨ | ౨౭ |
| బెంగుళూరు | ౪౨ | ౫౧ | ౫౭ | ౬౧ | ౩౩ | ౨౬ | ౨౩ |
| అనంతపురం | ౪౨ | ౪౮ | ౫౧ | ౫౩ | ౩౮ | ౩౩ | ౩౧ |
| కర్నూలు | ౩౮ | ౪౦ | ౪౨ | ౪౩ | ౩౪ | ౩౨ | ౩౧ |
| నెల్లూరు | ౧౮ | ౨౩ | ౨౮ | ౨౯ | ౧౦ | ౮ | ౫ |
| హైదరాబాదు | ౩౨ | ౩౧ | ౩౧ | ౩౦ | ౩౩ | ౩౩ | ౩౪ |
| తంజావూరు | ౨౮ | ౪౦ | ౫౧ | ౫౪ | ౧౪ | ౪ | ౦ |
| కంచి (కామకోటి) | ౨౦ | ౨౯ | ౩౮ | ౩౯ | ౧౧ | ౩ | ౧ |
| వరంగల్లు | ౨౪ | ౨౩ | ౨౩ | ౨౨ | ౨౫ | ౨౫ | ౨౬ |
| బెజవాడ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౦ | ౧౦ |
| చెన్నపురి | ౧౫ | ౨౪ | ౩౦ | ౩౩ | ౬ | ౦ | ౩ |
| కుంభకోణం | ౨౩ | ౩౮ | ౪౮ | ౫౧ | ౯ | ౨ | ౫ |
| విజయనగరం | ౧౬ | ౧౭ | ౨౦ | ౨౨ | ౧౪ | ౧౨ | ౧౦ |
| బరంపురం | ౩౦ | ౩౪ | ౩౭ | ౪౦ | ౨౬ | ౨౨ | ౨౦ |
| రంగూన్ | ౧౪౫ | ౧౪౫ | ౧౪౪ | ౧౪౪ | ౧౪౫ | ౧౪౬ | ౧౪౬ |

## రాజమండ్రినుండి స్వగ్రామమునకు మార్చుట

రాజమండ్రినుండి ఆయాపట్టణములకు మేషాదిసాయనమాసములందుగలుగు దేశాంతరవిఘటికలు పైచక్రమునందు గలవు. ఆయా రాశ్యయనప్రవేశము మొదలు ఆయా రాశి సాయనమాసము లగుచుండును. పై దేశాంతరవిఘటికలు సాయనమాసారంభమునందగును. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్టసాయనమాసమందగు దేశాంతర విఘటికలను పంచాంగతిథ్యాదులందు నల్లని రేఖకు పైనున్నవాటిని తీసివేయవలెను. క్రిందనున్నవాటిని కలుపవలయును. అట్లుచేయగా స్వగ్రామములకు తిథ్యాదు లగుచున్నవి.

## మేషాది నిరయనరాశి ప్రమాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౨ | సింహము | ౫-౧౮ | ధనుస్సు | ౫-౧౭ |
| వృషభము | ౫-౧ | కన్య | ౫-౧౩ | మకరము | ౪-౩౯ |
| మిథునము | ౫-౩౧ | తుల | ౫-౨౪ | కుంభము | ౪-౭ |
| కర్కాటకము | ౫-౩౧ | వృశ్చికము | ౫-౩౫ | మీనము | ౪-౧ |

## మేషాదిసాయనరాశిప్రమాణములు

(నిరక్షర దేశమునకు)

| | | | |
|---|---|---|---|
| మీనమేషములు | ౪-౩౯ | కర్కాట ధనుస్సులు | ౫-౨౨ |
| వృషభకుంభములు | ౪-౫౯ | సింహవృశ్చికములు | ౪-౫౯ |
| మిథునమకరములు | ౫-౨౨ | కన్యాతులలు | ౪-౩౯ |

## ఇవి దశమ లగ్నాయనమున కావశ్యకములు

| | ° | ' | " |
|---|---|---|---|
| అయనాంశములు | భా ౨౩. | లి ౧౨ | విలి ౭ |
| అయనాంశగతి | | | విలి ౫౦-౨ |

## స ం వ త్స ర ఫ ల ము

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| కే, యు | గు | శు | ర, చం |
| ప్లూ | జగల్లగ్నము | | బు |
| | | | |
| ల | శ- నె | , | కు, రా |

| మి | వృ | మే | మీ |
|---|---|---|---|
| కే, యు | గు | ర శు | బు |
| ప్లూ | వర్షలగ్నము | | |
| చం | | | |
| | శ, నె | ల | కు, రా |

జగల్లగ్నాధిపతి బుధునకు షష్ఠస్థితి ఇది ప్రపంచమునకు విశ్రాన్తిలేని కలహకారణము. ఒక్కొకచో యుద్ధము లుత్పన్నమగుట సంభవించును. గాని లగ్నమును గురుడు చూచుట ప్రపంచమునకు క్షేమంకరము. చతుర్థమున కుజరాహువులుండుటచే సుఖములేదు. ధనములో శని, నెప్ట్యూనుతో గలసి యుండెను. ధనాధిపతికి అష్టమస్థితి. లాభవ్యయాధిపతులు గలసి సప్తమమందుండి లగ్నమును చూచుచుండిరి. వీటివలన ఆదాయమును మించిన వ్యయము ఋణములు చేయుటయుగలుగును. వర్షలగ్నమునుబట్టి లగ్నాధిపతియగు కుజునకు రాహుసంబంధము పాపగ్రహయుక్తస్థితి. వీటిచే దేశమునకు ఉపద్రవములు హెచ్చును. గాని గురువీక్షణము. భాగ్యాధిపతికి రాజ్యస్థితి. వీటిచే శమించుచుండును. రాజ్యాధిపతియగు సూర్యునకు వ్యయాధిపసంబంధము షష్ఠస్థితియు గలుగుటచే దేశము విగ్రహభూయిష్ఠమై విశ్రాంతి హీనమైయుండును. రెండులగ్నములబట్టియు రాజ్యాధిపతికి షష్ఠస్థితియే. ధనస్థానమునకు పాపసంబంధమున్ను ఒకచో క్షేత్రాధిపతికి వ్యయస్థితి, మరియొకలగ్నమున క్షేత్రమున పాపులు, వీటింబట్టి ముఖ్యముగ ధనవ్యయము, ప్రపంచమున రాజకీయకలహములు గృహక్షేత్రాది సంబంధములగు వివాదములు హెచ్చగును. రెండులగ్నములబట్టియు భాగ్య (ధర్మ) స్థానమున ఒకచో శుభసంబంధము మరియొకచో ధర్మస్థానాధిపతికి రాజ్యస్థితి. ఇత్యాదికారణములచే వైదికధర్మము తిరుగ తలయెత్తు సూచనలు గానవచ్చెడిని.

సంవత్సర సముదాయముచే పప్పువస్తువులు మినుములు పెసలు ఉలవలు మొదలగునవి ధరగలిగి యుండును. కాయగూరలున్ను కొంచెము ధరగలిగియే యుండును. ఆయామాసములందైన గ్రహస్థితిని బట్టి సర్వపదార్థములకును ప్రతిమాసమందును ధరలు వేరువేరుగా ముందు వ్రాయబడియున్నవి. సంవత్సరాదినుండి వైశాఖ పూర్ణిమ వరకు నచటచట సాధారణ వర్షములు గలిగి వైశాఖపూర్ణిమనుండి తొలకరివానలు బాగుగ కురియును. ఆశ్వయుజ కార్తికములలోనున్ను వత్సరాంతమందున్ను మంచివానలు గలుగునట్లు తోచెడిని. ఆశ్వ శు ౧౩ ఆ. ప॥ ధనుస్సులో కుజుడుండుటచే కుజస్తంభదోషముగావున నచటచట అనావృష్టి, రోగములు, యుద్ధములు, సంభవించి దేశమునందు శాంతిభద్రతలు తగ్గును.

సర్వేషాం సమస్తశుభానిభవస్తు. శ్రీః శ్రీః శ్రీః

## సూర్యగ్రహణము

ది 30 జూన్ 1954 సం

జయసంవత్సర జ్యేష్ఠ బ ౩౦. బు. రేగ్రస్తాస్తమయ సూర్యగ్రహణం. కేతుగ్రస్తః, త్రిపాదాధికగ్రాసః

కర్నూలుకు.

సూర్యోదయాది స్పర్శకాలః ౩౨-౧౨ స్టాండర్డు గం సా 6-44

దినమానం ౩౨-౨౯ అస్తకాలః గం 6-51

